# భాష

# సమాజం

# సంస్కృతి

## భద్రిరాజు కృష్ణమూర్తి




నీల్‌కమల్ పబ్లికేషన్స్ ప్రైవేట్ లిమిటెడ్

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ (ఎక్స్‌పోర్టర్స్ & ఇంపోర్టర్స్)

సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 001. (అ



ఫోన్స్ : 4611674, 4614855

*Bhāṣa, Samājam, Samskṛti*
Bh Krishnamurti





Book Released on 19.7.99

First Ed t on - 2000 A.D

Price Rs 120-00




D... ...utors
**NEELKAMAL BOOK DISTRIBUTORS**
First Floor, Opp Clock Tower,
Su tan Bazaar, Hyderabad-500 095
© 4741665, 4611674

...ed at
Kalanja Graph cs
...rabad

# విషయసూచిక

## మూడో భాగం : సంస్కృతి



## అనుబంధం

# ముందుమాట

నేను అమెరికాలో భాషాశాస్త్రంలో పిఎచ్.డి. చేసి 1956లో ఇండియాకు తిరిగి వచ్చాను. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో ఉపన్యాసకపదవిలో పనిచేస్తూ రెండేళ్ళు సెలవులో వెళ్ళి అక్కడే తిరిగి చేరాను. అప్పటికి నా వయస్సు ఇరవైఎనిమిదేళ్ళు. ఆధునికభాషాశాస్త్రం గురించి తెలుగులో వ్యాసాలు రాయాలనే సంకల్పం కలిగింది. మొదటిభాగంలో ఉన్న తొమ్మిది వ్యాసాల్లోనూ ఆరువ్యాసాలు వాల్తేరులో ఉన్నప్పుడు రాసినవే. 4, 6, 7 వ్యాసాలు హైదరాబాదు వచ్చింతర్వాత రాసినవి. భాషాశాస్త్ర సిద్ధాంతాలు మారినా ఈవ్యాసాల్లో రాసిన ఏభాగానికీ కాలదోషం పట్టలేదని చెప్పవచ్చు. తెలుగుభాషను ఎం.ఏ. స్థాయిలో చదివే విద్యార్థులకు ఈ వ్యాసాలు ఉపయోగిస్తాయి.

రెండోభాగంలో ఉన్న ఎనిమిదివ్యాసాలు, మూడోభాగంలో ఉన్న అయిదు వ్యాసాలు అడపాతడపా 1962-82 మధ్యకాలంలో రాసినవి. సమాజం శీర్షిక కింద రాసినవి ముఖ్యంగా సామాజికభాషాశాస్త్రానికి, మాండలికపరిశోధనకు చెందినవి. సమకాలీన భాషాసమస్యల చర్చ గూడా వీటిల్లో ఉంది. సాహిత్య సంస్కృతి పరమైన వ్యాసాలు మూడో భాగంలో ఉన్నాయి. ఈవ్యాసాలు అన్నీ విద్యార్థులనే గాక సామాన్య పఠితలను గూడా ఆలోచింపజేసేవని నా నమ్మకం.

వీటి సంకలనం మొదలు పుస్తకంగా తయారయ్యేదాకా అన్ని దశల్లోనూ శ్రద్ధ తీసుకొని ఇవి ఈరూపంలో రావటానికి ముఖ్యహేతువైనవాడు నా మిత్రుడు, శిష్యుడు ఆచార్య రంగనాథం. అతనికి నా కృతజ్ఞత ఎంతచెప్పినా చాలదు. డా. రామనరసింహం దీని అచ్చుప్రతి తయారు కావటంలో ఎంతో కాలం వినియోగించి సొంతపనిలాగా చేశాడు. 'ఊహ తెలియంగల పాఠకు' డంటే అతనిలాంటివాడుగా ఉండాలి అని నాకు తెలిసింది. అతనికి చాలా థేంక్స్. ఈ వ్యాసాల మొదటిప్రతి లేజర్ టైపులో కూర్చి ఇచ్చిన ఉమామహేశ్వరరావుకు వాత్సల్య పూర్వక అభినందనలు. ముఖ్యపదసూచి తయారుచేసిన పి. పవనకుమార్‌కు, దాని శుద్ధప్రతి తయారుచేసిన పి. మల్లికార్జున్‌కు నా ఆశీస్సులు.

ఈ సంకలాన్ని నా శ్రీమతి (శ్యామల)కి, మా నల్గురు పిల్లలకు అంకితం చేస్తున్నాను. నా పరిశోధనవ్యాసంగంలో నేను మునిగితేలుతున్న రోజుల్లో పిల్లల

బాధ్యత ఎక్కువ పాళ్ళు మోసింది మా ఆవిడ. నేను వాళ్ళతో ఎక్కువ కాలం వినియోగించే అవసరం లేకుండా, మా పిల్లలు (మీనాక్షి, ఇందుశేఖర్, నటరాజా, సుబ్రహ్మణ్యం) స్వతంత్రంగా వాళ్ళంతట వాళ్ళే చదువుకొని పైకి వచ్చారు. ఈ చిన్న కానుక నా అభినందనకు, ప్రేమకు ప్రతీక.

ఈ గ్రంథాన్ని ప్రచురించటానికి తనంతటతానే ముందుకు వచ్చిన నీల్‌కమల్ ప్రచురణాలయం అధిపతి శ్రీ సురేశ్ చంద్ర శర్మ గారికి నా కృతజ్ఞత.

– భద్రిరాజ కృష్ణమూర్తి

# అవతారిక

తెలుగులో భాషాధ్యయనానికి, భాషాపరిశోధనకు విశిష్టమైన చరిత్ర ఉంది. ఆధునికయుగం ప్రారంభదశలో భాషాగతమైన అధ్యయనాలు, పరిశోధనలే ప్రముఖంగా జరిగాయి. వలసపాలన క్రమంలోనే అయినా సాంస్కృతికరంగంలో భాషకు సంబంధించిన నవీకరణ ఆధునికతపరిణామంలో ప్రధానాశం అయింది. క్రీ. శ. 1857కు ముందు ఇంగ్లీషువాళ్ళ పరిపాలనలో కూడా అర్జీలు, ఉత్తర ప్రత్యుత్తరాలు మొదలైనవి తెలుగులోనే నడిచేవి. 1812లో మద్రాసులో సెయింట్ ఫోర్ట్ జార్జ్ కళాశాల స్థాపన తరువాత ఎ. డి. క్యాంప్‌బెల్ మొదలు సి. పి. బ్రౌన్ దాకా తెలుగుభాషకు వ్యాకరణాలు రాశారు. ఆధునికపద్ధతిలో నిఘంటువులను నిర్మించారు. ఈ కాలంలోనే పఠనపాఠనాలకు వచనగ్రంథాలు తయారయ్యాయి. దేశీయపండితులూ ఈ కృషిలో పాలు పంచుకున్నారు. తెలుగునాట సామాజిక భావవిప్లవానికి ఆద్యుడని చెప్పుకోవలసిన సామినేని ముద్దునరసింహనాయుడు 1850లలోనే తెలుగు ఆధునికభాషాస్వరూపాన్ని గురించి చర్చించాడు. 1816లో ప్రచురితమైన క్యాంప్‌బెల్ తెలుగు వ్యాకరణంతో, ఆ సందర్భంలోనే విలియమ్ వైట్ ఎల్లిస్ తెలుగుపైన రాసిన పరిశీలన వ్యాసంతో ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనానికి బీజం పడింది. 1856లో బిషప్ కాల్డ్వెల్ ద్రావిడభాషల తులనాత్మక వ్యాకరణంతో దానికో రూపం ఏర్పడింది.

తెలుగు శాసనాల పరిశీలన చరిత్ర రచనకే కాదు, భాషాధ్యయనానికి కూడా దోహదం చేసింది. 1924లోనే ప్రఖ్యాత పరిశోధకుడు మల్లంపల్లి సోమశేఖర శర్మ తన చరిత్రపరిశోధనలో భాగంగా 'ప్రాచీనాంధ్రభాషాస్వరూపము' అన్న వ్యాసాన్ని ప్రకటించాడు. కాల్డ్వెల్ మార్గంలో ద్రావిడభాషల ప్రత్యేకకుటుంబవాదాన్ని అంగీకరించిన కోరాడ రామకృష్ణయ్య 1929లో శాసనాలు ఆధారంగా 'నన్నయకు పూర్వము ఆంధ్రభాషాస్థితి' అన్న వ్యాసం రాశాడు. సంధి, దేశి, భాషోత్పత్తి క్రమము మొదలైన గ్రంథాలు కోరాడకు ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనం మీద ఉన్న అధికారాన్ని సూచిస్తాయి. నన్నయకు చాలా కాలానికి ముందే తెలుగు కావ్యభాషాస్వరూపం స్థిరపడిందని ఆయన మొదటి సారిగా గుర్తించాడు. తెలుగులో చరిత్రపరిశోధనకు మూలపురుషుడైన కొమర్రాజు లక్ష్మణరావుకు

సమకాలంలో వస్తున్న ద్రావిడభాషల పరిశోధనతో పరిచయం ఉన్నట్టు ఆయన రచనలు స్పష్టం చేస్తున్నాయి. తొలినాటి సాహిత్యాధ్యయనాలన్నీ ప్రధానంగా భాష మీదనే కేంద్రీకృతం అయి ఉండేవి.

విశ్వవిద్యాలయాలలో తెలుగులో తొలి పిఎచ్. డి. పట్టం పొందిన సిద్ధాంత వ్యాసం భాషకు సంబంధించిందే. నన్నయ భారతభాషను, సమకాలీన శాసన భాషను తులనాత్మకంగా పరిశీలించిన చిలుకూరి నారాయణరావు సిద్ధాంతవ్యాసానికి 1927-29లో పిఎచ్. డి. లభించింది. 1937లో చిలుకూరి ఆంధ్రభాషాచరిత్ర రెండు భాగాలుగా వచ్చింది. ప్రాకృతభాషలలాగే ద్రావిడభాషలు కూడా ప్రాచీన ఆర్యభాషలనుంచే వచ్చాయని ఆయన సిద్ధాంతం చేశాడు. ఈ సిద్ధాంతాన్ని పక్కన పెడితే ఆంధ్రభాషాచరిత్ర ఒక సమగ్రమైన రచన. 1947లో కాల్డ్వెల్ తులనాత్మకవ్యాకరణం భూమికగా గంటి జోగిసోమయాజి ఆంధ్రభాషావికాసము వెలువడింది. ఇటీవలి కాలంవరకు ఈ గ్రంథమే విశ్వవిద్యాలయాలలోని తెలుగు శాఖలలో భాషాచరిత్రకు ప్రధానపాఠ్యగ్రంథంగా ఉంది. విశ్వవిద్యాలయాలలో భాషాపరిశోధనకు సోమయాజిగారు చాలా దోహదం చేశారు. 1940ల నాటికే బ్రిటన్‌కి చెందిన టి. బరో, అమెరికాకి చెందిన ఎమ్. బి. ఎమెనో ద్రావిడభాషా రంగంలో ప్రవేశించి అలిఖిత ద్రావిడభాషల పైన ప్రామాణికమైన పరిశోధనలు చేశారు.

పంధొమ్మిదవ శతాబ్దం చివరి కాలంనుంచే ఆధునికచైతన్యంలో భాగంగా తెలుగుభాషావినియోగసమస్యలు మేధావుల దృష్టిని ఆకర్షించాయి. చర్చలు, వాద వివాదాలు, అధ్యయనాలు సాగాయి. ఈ కాలంలో తెలుగు భాషాకృషికి దోహదం చేసిన అంశాలు రెండు. ఒకటి సామాజికదృష్టి, రెండవది ఆధునికభాషాశాస్త్ర పరిచయం. ప్రజాస్వామ్య చైతన్యంతో వచ్చిన వ్యావహారికభాషోద్యమానికి భాషా విషయపరిశోధన అవసరం అయింది. సామాజిక నిబద్ధత, ఆధునికవిద్యావసరాలు గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావులను భాషాకృషి వైపు మళ్ళించాయి. తన వ్యావహారికభాషావాదానికి ప్రోద్బలంగా ప్రాచీనకవుల ప్రయోగాలను, ఆ కవుల సమకాలీనవ్యావహారిక భాషారూపాలను నిరంతరకృషితో రామమూర్తి సేకరించాడు. వీటి ఆధారంగా తరువాత ఎన్నో వ్యాకరణాలు వచ్చాయి. మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు వచనరచన స్వరూపనిర్ణయంకోసం వేసిన కమిటీలో సభ్యుడుగా గ్రాంథికభాషావాదానికి సమాధానంగా గురజాడ రాసిన అసమ్మతిపత్రం

భాషకు, భాషాపరిణామానికి, భాషావినియోగానికి సంబంధించి ఆయన సునిశిత దృష్టికి తార్కాణం. శాసనాలలో, కావ్యాలలో కొన్ని వందల సంవత్సరాలుగా ప్రయోగంలో ఉన్న వ్యావహారిక భాషారూపాలను విశ్లేషిస్తూ సంధి, వ్యాకరణ రూపాలు, వాక్యనిర్మాణం మొదలైన అంశాలతో సమగ్రపరిశోధనపత్రంగా అసమ్మతిపత్రాన్ని తయారు చేశాడు గురజాడ. గిడుగు రామమూర్తికి అప్పటికే ఆధునికభాషాశాస్త్రసిద్ధాంతాలతో మౌలికపరిచయం ఉంది. ఇదీ తెలుగు భాషాధ్యయనానికి సంబంధించిన పూర్వచరిత్ర.

1950 తరువాత తెలుగు భాషాకృషి ముఖ్యమైన మలుపు తిరిగింది. ఆధునిక భాషాశాస్త్రాధ్యయనం దీనికి ఒక ప్రధాన కారణం. భారతదేశం మొత్తం మీద తొలిసారిగా విదేశాలలో భాషాశాస్త్రాధ్యయనం చేసి, పరిశోధన చేసినవారు భద్రిరాజు కృష్ణమూర్తిగారు. తెలుగులో ఆధునిక భాషాశాస్త్రసిద్ధాంతాల అనువర్తన కృషి ఆయనతోనే మొదలయిందని చెప్పాలి. తెలుగుభాషలో జరిగినంత భాషా శాస్త్రసిద్ధాంతాల అనువర్తనం గాని, వివిధకోణాలలో భాషాధ్యయనం గాని భారతీయభాషలలో మరే భాషలలోనూ జరగలేదనడం అతిశయోక్తి కాదు. ఇందులో ప్రధానపాత్ర కృష్ణమూర్తిగారిదే. 1953లో భాషాశాస్త్రాధ్యయనానికి అమెరికా వెళ్ళక ముందే తెలుగు ధాతువులపైన పరిశోధన కోసం ఆయన సామగ్రి సేకరణ చేశారు. 195[illegible]లో *Telugu Verbal Bases - A Comparative and Descriptive Study* అన్న సిద్ధాంతవ్యాసానికి పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్. డి. పొందారు. 1961లో కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం ఈ సిద్ధాంతవ్యాసాన్ని అచ్చువేసింది. ముద్రణలో తెలుగు ధాతువులకు సంబంధించిన విశేషాలే కాకుండా ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనానికి సంబంధించిన అంశాలు ఎన్నో ఇందులో చేరాయి. కృష్ణమూర్తిగారి పరిశోధన వ్యాసంగాన్ని ముఖ్యంగా రెండు రకాలుగా వింగడించవచ్చు. ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనం మొదటిది. తెలుగుభాష, భాషాసామాజికపరిశీలన, భాషావిధానం, భాష నవీకరణ మొదలైనవి రెండవ విభాగంలోకి వస్తాయి. సమకాలంలో ద్రావిడభాషారంగంలో బరో, ఎమెనోల తరువాత చెప్పుకొనే పేరు కృష్ణమూర్తి గారిదే. *Telugu Verbal Bases* ద్రావిడ భాషాధ్యయన రంగంలో ఒక మైలు రాయిగా భాషాశాస్త్రవేత్తలు భావిస్తారు. ద్రావిడభాషలకు సంబంధించి చాలా కాలంగా చర్చలో ఉన్న ధ్వనివిపరిణామసూత్రాలకు నిర్దిష్టరూపం ఇచ్చారు

కృష్ణమూర్తిగారు. కొన్ని ధ్వని సూత్రాలకు రూప కల్పన చేశారు. వీటిలో చాలా వరకు *Telugu Verbal Bases* వెలువడక ముందే వ్యాసాల రూపంలో వచ్చాయి. తెలుగు క్రియాప్రాతిపదికలలో హ్రస్వదీర్ఘాలు, ద్రావిడభాషలలో ఇ/ఎ, ఉ/ఒ ల పర్యాయత, తెలుగు-కువి ఉపకుటుంబంలో వర్ణవ్యత్యయం-అచ్చంకోచం, ద్రావిడభాషలలో పదాదినాదస్పర్శాలు ఆయన సూత్రీకరించిన ధ్వనివిపరిణామాలలో కొన్ని మాత్రమే. ద్రావిడభాషలలో పురుషబోధక సర్వనామాలు, ద్రావిడభాషలలో లింగ-వచన విభాగం, ద్రావిడభాషలలో ఱ వర్ణపరిణామం, ద్రావిడభాషల ఉపకుటుంబవిభజన మొదలైనవి ద్రావిడ భాషలకు సంబంధించి కృష్ణమూర్తిగారు చర్చించి నిగ్గు తేల్చిన ముఖ్య విషయాలు. ద్రావిడభాషారంగంలో మొదటినుంచీ ఇటీవలివరకు జరిగిన కృషిని గురించి ఆయన సమగ్రమైన వ్యాసాలు రాశారు. ఇప్పటివరకు జరిగిన పరిశోధనల నన్నిటినీ దృష్టిలో పెట్టుకొని సమగ్రమైన ద్రావిడభాషల తులనాత్మకవ్యాకరణాన్ని ప్రస్తుతం తయారుచేస్తున్నారు. ప్రత్యేకంగా తెలుగుభాషకు సంబంధించి అనేకవ్యాసాలు రాశారు. భాషావిధానం, భాషాయోజన, భాష నవీకరణ మొదలైనవాటికి సంబంధించి అధ్యయనవ్యాసాలు వచ్చాయి. భాషాసామాజిక పరిశీలనపరమైన రచనలూ వచ్చాయి.

ఇంతవరకూ చెప్పిన కృష్ణమూర్తిగారి కృషి అంతా ఇంగ్లీషులోనే ఉంది. సుమారుగా ఈ రచనలన్నీ గ్రంథరూపంలోనో, సంకలనాల రూపంలోనో వచ్చాయి. అప్పుడప్పుడు ఆయన తెలుగులో కూడా అనేక విషయాలపైన వ్యాసాలు రాశారు. అవి పత్రికల్లోను, వివిధ సంకలనాల్లోను, గ్రంథ పీఠికల రూపంలోను వెలువడ్డాయి. వాటిని ఒక చోట చేర్చడమే ప్రస్తుతసంకలనం లక్ష్యం. ఇందులోని వ్యాసాలు ఒక ప్రత్యేక విషయానికో, ప్రత్యేక అధ్యయనానికో మాత్రమే సంబంధించినవి కావు. తెలుగులో ఉండడమే వీటిని ఒక చోట చేర్చడానికి ప్రధానకారణం. 1950ల తొలి దశలోనే ఆనాడు విశాఖపట్టణం నుంచి వెలువడిన సంస్కృతి అనే పత్రికలో ద్రావిడభాషలలో ఱ కార పరిణామం పైన తెలుగులో చాలా విస్తృతమైన వ్యాసం వచ్చింది. అది కృష్ణమూర్తిగారి పరిశోధన నైశిత్యానికి తార్కాణం. గ్రంథవిస్తరణ భీతివల్ల ఆ వ్యాసాన్ని ఇందులో చేర్చలేదు. రెండు వృత్తిపదకోశాలకు తెలుగులో విస్తృత పీఠికలు రాశారు. వాటిని కూడా గ్రంథవిస్తరణభీతివల్లే ఈసంకలనంలో

చేర్చలేదు. ఈమూడు తప్ప తెలుగులో కృష్ణమూర్తి గారు రాసిన వ్యాసాలన్నీ ఇందులో ఉన్నాయి.

ఈ సంకలనంలోని 'భాష - వ్యాకరణం', 'ధ్వని - వర్ణం', 'సంధి', 'పదం - పదాంశం', 'సన్నిహిత సంబంధులు' అన్న వ్యాసాలు భాషకు సంబంధించిన మౌలికాంశాలను వివరిస్తాయి. శాస్త్రవిషయాల తెలుగు శైలికి ఈ వ్యాసాలు నమూనాలుగా నిలుస్తాయి. కాస్త భాషావిషయక పరిచయం ఉన్నవారి కెవరికైనా సుబోధకంగా ఉండే పద్ధతిలో ఈ వ్యాసాలు ఉన్నాయి. ఈ వ్యాసాలలో ఉపయోగించిన పారిభాషికపదాలు తెలుగుభాషాధ్యయనంలో స్థిరపడి వాడుకలో నిలిచాయి. 'నేటి తెలుగు : వర్ణసమామ్నాయం' 'ధ్వని - వర్ణం' లో వివరించిన సిద్ధాంతాన్ని సమన్వయిస్తూ ఆధునిక తెలుగులోని వర్ణ సమామ్నాయాన్ని శాస్త్రీయంగాను, సమగ్రంగాను వివేచించి నిర్ణయిస్తుంది. ఇతర భారతీయభాషలలో కూడా వర్ణసమామ్నాయనిర్ణయానికి నమూనాగా నిలిచే వ్యాసం ఇది. ఆధునిక తెలుగుభాషకు వ్యాకరణ రచన చేసిన చాలామంది విద్వాంసులు వర్ణ విభాగానికి దీన్నే ప్రధానమైన ఆధారంగా తీసుకుంటారు. 'నేటి తెలుగులో హల్సంధి' ప్రత్యేకంగా పేర్కొనవలసిన వ్యాసం. కావ్యభాషలో అచ్సంధులు ఎక్కువ. సంప్రదాయవ్యాకరణాలూ వాటినే వివేచించాయి. భాషా స్వరూపంలో వచ్చిన మార్పుల ప్రభావం సంధులపైన కూడా ఉంటుంది. అచ్చుకి అచ్చు పరమైనప్పుడు పూర్వాచ్చు లోపించడం కావ్యభాషలోనూ, ఆధునిక భాషలోనూ ఉంది. హల్లు పరమైనప్పుడు కూడా అచ్చు లోపించడం, అంటే రెండు హల్లుల మధ్య అచ్చు లోపించడం, ఆధునిక వ్యవహారంలో కనిపిస్తుంది. అచ్చు లోపించిన తరువాత రకరకాల మార్పులు వస్తాయి. ఇటువంటి సంధి రెండు పదాల మధ్యా, పదం మధ్యలో - ప్రాతిపదిక ప్రత్యయాల సంయోజనలో - కూడా జరగవచ్చు. దీనికి ఆధునిక వ్యవహారం నుంచి ఉదాహరణ లనేకం ఈ వ్యాసంలో ఉన్నాయి.

'షష్ఠీవిభక్తి 'యొక్క' విచారణ' చాలా తొలి దశలో రాసిన వ్యాసం. సంప్రదాయ వ్యాకరణాలన్నీ షష్ఠీవిభక్తిలో 'యొక్క' ను చేర్చినా కావ్యప్రయోగా లెక్కడా లేవు. దీనికి సంబంధించిన చరిత్రను గురించి చాలామంది పండితులు భిన్నమైన ఊహలు చేశారు; చేస్తూనే ఉన్నారు. 'యొక్క'కు సంబంధించిన చారిత్రక, తులనాత్మక చర్చ తర్కబద్ధంగా ఈ వ్యాసంలో కనిపిస్తుంది. ఆ

రోజులలోనే వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి వంటి పండితులు తమ వ్యాకరణ వ్యాఖ్యానాలలో ఈ వ్యాసాన్ని ఉటంకించారు. కొండభాషను గురించి చేసిన పరిశోధనలో భాగంగా రాసిన వ్యాసం 'అరకులోయ భాష : ఆంధ్రంతో సంబంధం'. దక్షిణ-మధ్య ద్రావిడ భాషలలో ఒకటైన కొండ (కూబి) కూయి, కువిలకు సన్నిహితమైన భాష. అరకులోయలోను, ఒరిస్సా సరిహద్దులలోను కొండభాషను మాట్లాడేవాళ్ళున్నారు. అరకులోయ కొండభాషకు సంగ్రహ వ్యాకరణమే ఈ వ్యాసం. తులనాత్మక పరిశీలన కూడా ఇందులో ఉంది. కృష్ణమూర్తిగారు *Koṇḍa or Kūbi : A Dravidian Language* పేరుతో కొండభాషకు సమగ్ర వ్యాకరణాన్ని ఇంగ్లీషులో రాశారు. కొండభాషకు సంబంధించిన పాఠ్యాలను కూడా ఇందులో చేర్చారు. లేఖనం లేని ద్రావిడ భాషలకు వచ్చిన వ్యాకరణాలలో దీనికి ప్రత్యేకస్థానం ఉంది. ద్రావిడభాషల తులనాత్మక అధ్యయనంలో లేఖనం లేని భాషల ప్రాధాన్యాన్ని గురించి కృష్ణమూర్తి గారు పై తెలుగువ్యాసంలో వివరించారు.

'తెలుగు మాండలికాలు : ప్రమాణభాష', 'తెలుగు మాండలికాలు : కరీంనగర్ వాడుక', 'ఆధునికప్రమాణభాష' వ్యాసాలలో తెలుగుమాండలికాలను గురించి, ఆధునికప్రమాణభాషగా తెలుగు రూపొందుతున్న విధానాన్ని గురించి విస్తృతమూ, శాస్త్రీయమూ అయిన చర్చ ఉంది. తెలుగుభాష నవీకరణను గురించి కూడా ప్రామాణికమైన సూచనలెన్నో వీటిలో ఉన్నాయి. తెలుగు భాషాధ్యయనరంగంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో వచ్చిన *మాండలిక వృత్తిపద కోశాలు* మైలు రాళ్ళుగా చెప్పవచ్చు. అప్పటికి ఏ భారతీయ భాషలలోను రానటువంటి విశిష్టమైన ప్రయోగం ఇది. మాండలిక వృత్తిపద కోశాల నిర్మాణానికి రూపకల్పన చేసినవారు కృష్ణమూర్తిగారే. క్షేత్రపరిశీలన, పదసేకరణ, ఆరోపనిర్ణయం, విధానం మొదలైన అంశాలకు సంబంధించి కృష్ణమూర్తిగారు నిర్దిష్టమైన, శాస్త్రీయమైన ప్రణాళికను రూపొందించారు. స్వయంగా వ్యవసాయం, చేనేత వృత్తిపదకోశాలకు సంపాదకత్వం వహించారు. వాటికి విస్తృతమైన పీఠికలు రచించారు. తరువాత మరి కొన్ని వృత్తిపదకోశాలు వచ్చాయి. తెలుగు అకాడమీ ఆంధ్రప్రదేశ్‌లోని జిల్లాల వారీగా వాడుక భాషను సేకరించి వర్ణనాత్మక వ్యాకరణాలను రాసే పథకాన్ని చేపట్టింది. కరీంనగర్, కడప, అనంతపూర్, విశాఖపట్నం జిల్లాలకు సంబంధించిన Dialect Bulletinsని

అకాడమీ ప్రకటించింది. దీనికీ కృష్ణమూర్తిగారే ప్రేరణ. మాండలిక వృత్తిపద కోశాలు, ఈ బులెటిన్లు తెలుగులో భాషాసామాజిక పరిశీలనకు ఆధార భూమికగా నిలిచాయి. వృత్తిపద కోశాలు, ఆ సందర్భంగా సేకరించిన భాషా రూపాల ఆధారంగా తెలుగునాడును నాలుగు ప్రధాన భాషామండలాలుగా కృష్ణమూర్తిగారు విభజించారు. పదాల వాడుక, ఉచ్చారణ భేదాలు, వ్యాకరణ రూపాలకు సంబంధించిన భేదాలు భాషామండలాల నిర్ణయానికి ఆధారాలు. ఈ భాషాభేదాలే ప్రాంతీయ మాండలికాలు. ప్రతి ఇరవై సంవత్సరాలకి ఒకసారి ఈ భాషాభేదాల పరిశీలన జరిగితే భాషామండలాల ఎల్లల (వ్యవహారభేదక రేఖల) లో మార్పులు కనిపించవచ్చు. మొత్తంగా తెలుగునాట గాని, ప్రత్యేక ప్రాంతంలో గాని వర్గాలు ఆధారంగా కనిపించే భాషాభేదాలు వర్గమాండలికాలు. కుల మాండలికాలనే ప్రత్యయాన్ని కృష్ణమూర్తిగారు నిరాకరించారు. భాషా పరిశీలనకు చదువుకున్నవారు, చదువుకోనివారు అనే రెండు వర్గాలనే ఆయన గుర్తించారు. ఏ కులానికి, ఏ వృత్తికి చెందినవారైనా విద్యావంతులైనప్పుడు చదువుకున్నవారి వాడుకే అలవడుతుందని ఆయన అంటారు. స్థూలంగా చదువుకున్నవారు శిష్టులు, చదువుకోనివారు శిష్టేతరులు. శిష్ట, శిష్టేతరులలో ఉండే ఉచ్చారణ భేదాలను కృష్ణమూర్తిగారు స్పష్టంగా వింగడించారు. ఈ వింగడింపే ఈ రోజుకీ ప్రమాణంగా నిలిచి ఉంది. వర్గ మాండలికభాషా భేదాలను కూడా కొంత కాలం తరువాత పునః పరిశీలన చేస్తే ఈ లక్షణాలలో కూడా కొన్ని మార్పులు, చేర్పులు వచ్చే అవకాశం లేకపోలేదు.

కృష్ణమూర్తిగారు చాలా విస్తృతంగా చర్చించిన మరో అంశం ప్రమాణభాష. ఆధునిక సమాజంలో పాలనభాషగా, వివిధశాస్త్రగ్రంథాల రచనకు వాహికగా, బోధనమాధ్యమంగా, సృజనాత్మక సాహిత్యానికి వాహికగా, పత్రికలు, రేడియో, టి.వి. మొదలైన ప్రసారసాధనాల మాధ్యమంగా విస్తృతరంగాలలో తెలుగు భాష వినియోగం పెరుగుతున్నది. దీనికి ప్రాంతీయ, వర్గమాండలికాలకు అతీతంగానూ, దగ్గరగానూ చదువుకున్నవాళ్ళందరికీ అంగీకారయోగ్యమై, చదువుకుంటున్నవాళ్ళకి అనుకరణీయమైన ప్రమాణభాష ఆవశ్యకమన్న విషయాన్ని కృష్ణమూర్తిగారు నిరూపించారు. ఒక భాషాభేదం ప్రమాణభాష కావడానికి కారణాలు భాషాగతమైనవి కావని, ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాల వల్లే ఒక భాషాభేదం స్థూలంగా విద్యావంతులు అనుసరించే ప్రమాణ

భాష అవుతుందని ఆయన ప్రతిపాదించారు. ప్రమాణభాషకు ఏకరూపత స్థూలమైన లక్షణమే కాని అనుశాసనం కాదని, కాలక్రమంలో మాండలికాల్ని కూడా కలుపుకుంటూ ప్రమాణభాష ప్రబలమూ, ఇతోధికంగా జనాంగీకార యోగ్యమూ అవుతుందని కూడా ఆయన చెప్పారు. స్థూలంగా చెప్పాలంటే గిడుగు చెప్పిన శిష్టవ్యావహారిక భాషే మరో రకంగా ప్రమాణభాష. 'ఆధునిక ప్రమాణ భాష' అన్న వ్యాసంలో ప్రమాణభాషకు సంబంధించిన అనేక ప్రత్యామ్నాయ భావాలను వివరంగా చర్చించి ఎటువంటి భాష ప్రమాణభాష కాగలుగుతుందో ఆయన నిరూపించారు.

'తెలుగుభాష: నాడు, నేడు, రేపు', 'తెలుగుభాషావికాసం' తెలుగు పరిణామాన్ని స్వరూపదృష్టితోను, ప్రయోగదృష్టితోను పరిశీలించిన వ్యాసాలు. తెలుగుభాషా చారిత్రక పరిశోధనలు చాలావాటికి కృష్ణమూర్తిగారు పర్యవేక్షకత్వం వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగుభాషా చరిత్రకు ఆయనే సంపాదకులు. చాలా కాలంవరకు పండితులు తెలుగుసాహిత్యచరిత్రను, తెలుగుభాషాచరిత్రను ఒకే విధంగా పరిగణించేవారు. వాటికి సంబంధించిన యుగవిభజన కూడా ఒకే రకంగా ఉండేది. తెలుగుభాషాచారిత్రకపరిశోధనల ఫలితాలను దృష్టిలో ఉంచుకొని ప్రత్యేకకాలాలలో భాషలో వచ్చిన ప్రధానమైన మార్పుల ఆధారంగా తెలుగుభాషాచరిత్ర యుగవిభజన చేశారు కృష్ణమూర్తి గారు. తెలుగుభాషావినియోగం ఏయే కాలాల్లో ఏయే రంగాల్లో ప్రధానంగా జరిగిందో కూడా వివరించారు. తెలుగుభాష నవీకరణకు సంబంధించిన అనేకమైన సూచనలను కూడా చేశారు

''శ్వేతపత్రం'పై శాస్త్రీయవిమర్శ' పేరుకి స్పందనరూపవ్యాసంలా కనిపించినా భాషావిధానాన్ని గురించిన శాస్త్రీయమైన అవగాహనకు దర్పణం. అధికారభాషగా తెలుగును అమలు చేయడానికి ప్రభుత్వకార్యకలాపాలకు సంబంధించిన ఉత్తర్వులు, చట్టాలు, ఉత్తరప్రత్యుత్తరాలు అనువాదం చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1964లో ఒక సంఘాన్ని నియమించింది. అనువాదాల విషయంలో ఈ సంఘం ఎదుర్కొన్న సమస్యలను వివరిస్తూ ప్రకటించిన 'శ్వేత పత్రం'పై ఇది విమర్శ. పరిపాలన రంగంలో తెలుగుభాషా వినియోగానికి సంబంధించిన పద్ధతులను గురించి ఈ వ్యాసంలో చర్చ ఉంది. ఏకరూపత పేరుతో కేంద్రప్రభుత్వంవారు అచ్చువేసిన సమేకిత్ ప్రశాశన్ శబ్దావలీ లో

ప్రకటించిన అనువాదాలను, పరిభాషలను తెలుగులో యథాతథంగా వాడడం వల్ల అభిప్రాయ నివేదనలో జరిగే ఇబ్బందులను ఈ వ్యాసంలో వివరించారు కృష్ణమూర్తిగారు. ప్రతిభాషకి కొన్ని ప్రత్యేకతలుంటాయని, మరో భాషలోని పద్ధతుల్ని యథాతథంగా అనుసరించడంవల్ల భాష కృత్రిమం కావడమే కాకుండా, భాష పెరుగుదల ఆగిపోతుందని ఆయన స్పష్టంగా చెప్పారు. అనువాదాల విషయంలో, పరిభాష కల్పన విషయంలో, అధికారభాషగా తెలుగు అమలు విషయంలో అమూల్యమైన సూచనలు ఇందులో ఉన్నాయి. 'ఆధునిక భాషగా తెలుగు' లో తెలుగుభాష నవీకరణ విషయంలో పత్రికల పాత్రను, పత్రికలు సృష్టించిన పారిభాషిక పదాల ఆధారంగా సోదాహరణంగా వివరించారు కృష్ణమూర్తిగారు.

'విద్యావిధానంలో త్రిభాషాసూత్రం' విద్యావిధానానికి, భాషావిధానానికి సంబంధించిన వ్యాసం. చాలా రాష్ట్రాలు, ముఖ్యంగా హిందీ రాష్ట్రాలు త్రిభాషా సూత్రాన్ని అనుసరించడంలేదన్న విషయాన్ని దృష్టిలో పెట్టుకొని విద్యా విధానంలో త్రిభాషాసూత్రాన్నిగురించి చర్చించారు కృష్ణమూర్తిగారు. మాతృ భాష, ఇంగ్లీషు, హిందీ - ఈ మూడు భాషలను విద్యార్థులు ఏయే ప్రయోజనాల కోసం నేర్చుకోవాలో క్రియాశీలంగా వివరించారు. హిందీ రాష్ట్రాలలో త్రిభాషా సూత్రాన్ని అమలుపరచవలసిన పద్ధతుల్ని, హిందీ అందరికీ అంగీకారయోగ్యం కావాలంటే ఇతరభారతీయభాషలనుంచి పదజాలాన్ని కలుపుకుంటూ అభివృద్ధి చెందవలసి ఉంటుందన్న విషయాన్ని ఇందులో వివరించారు.

తెలుగులో దేశ్యపదజాలం ఆధారంగా మూడువేలయేళ్ళ క్రితం తెలుగు వాళ్ళ సంస్కృతిని పునర్నిర్మించిన వ్యాసం 'మూడువేల సంవత్సరాల కిందటి తెలుగుసంస్కృతి ఎలా ఉండేది?'. దేశ్యపదజాలం అంటే మూలద్రావిడ పదాలకు ప్రతిరూపాలైన పదజాలం. ఈ పదాల ఆధారంగా పునర్నిర్మించిన సంస్కృతి ద్రావిడసంస్కృతి కూడా అయ్యే అవకాశం ఉంది. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొనే తెలుగువాళ్ళదిగా పునర్నిర్మించిన సంస్కృతి తమిళులది, కన్నడిగులదీ గూడా కావచ్చని చెప్పారు.

మౌలికంగా కృష్ణమూర్తిగారు సాహిత్య విద్యార్థి. 13-14 ఏళ్ళప్పటినించే పద్యకవిత్వం రాశారు ఆయన రాసిన పద్యాలన్నీ చిన్ననాటి పద్యాలు పేరుతో ఇటీవలే అచ్చయ్యాయి ఆయన అవధానాలు కూడా చేశారని వినికిడి.

భాషాశాస్త్ర రంగంలో ప్రవేశించిన తరువాత కవిత్వం రాయడం మానుకున్నట్టు ఆయనే చెప్పుకున్నారు. ప్రాచీనకవులలో తిక్కన ఆయన అభిమాన కవి. ఈ సంకలనంలో ఉన్న సాహిత్య వ్యాసాలు నాలిగింటిలో రెండు తిక్కన గురించినవే. ఆధునికులలో దువ్వూరి రామిరెడ్డి, జాషువాల కవిత్వం కృష్ణమూర్తిగారికి ఇష్టం. వచనరచయితలలో రావిశాస్త్రి అంటే అభిమానం. తిక్కనను గురించిన వ్యాసాలు రెండూ భాషకు సంబంధించినవే. కవుల పదప్రయోగ కోశాలు కృష్ణమూర్తిగారు కృషిచేసిన మరో ప్రధానరంగం. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ప్రచురించిన తిక్కన పదప్రయోగ కోశం సంపాదకవర్గంలో కృష్ణమూర్తిగారు ఒకరు. తిక్కన పదప్రయోగ కోశం రెండవ భాగంలో ఆయన రాసిన పీఠికే 'తిక్కన పద ప్రయోగ కోశం' అనే వ్యాసం. ఇందులో పదప్రయోగ కోశ నిర్మాణ పద్ధతులతోపాటు, తిక్కన భాషావిశేషాలను కూడా ఆయన పొందుపరిచారు. 'తిక్కన పదసంపద' లో తిక్కన భాషాప్రయోగాలను, నుడికారాన్ని సోదాహరణంగా వివరించారు. తెలుగు వచనరచనలో భాషా పరిణామాన్ని వివరించే వ్యాసం 'తెలుగు రచనాభాషా పరిణామం'. ఈ సంకలనంలోని సాహిత్యపరమైన వ్యాసాలలో ముఖ్యంగా చెప్పుకోదగ్గది 'రాచకొండ రచనల్లో సిమిలీ'. రాచకొండ విశ్వనాథశాస్త్రి బుక్కులు పేరుతో రాసిన తొమ్మిది కథలను మాత్రమే సామగ్రిగా తీసుకొని కృష్ణమూర్తిగారు ఈ వ్యాసాన్ని రాశారు. రావిశాస్త్రి ఉపమానాలను వివిధ విభాగాలుగా వింగడించి వాటిలోని సౌందర్యాన్ని ఆయన ఈ వ్యాసంలో వివరించారు.

అక్కడక్కడా పత్రికల్లో, దినపత్రికల్లో, సంకలనాల్లో విడివిడిగా పడి ఉన్న కృష్ణమూర్తిగారి తెలుగు వ్యాసాలు ఇప్పటికైనా సంకలనంగా రావడం హర్షణీయం. విద్యార్థులకు, విద్వాంసులకే కాక తెలుగుభాషనుగురించి అనేకవిషయాలను తెలుసుకోవాలనే అభిలాష గల సామాన్యపాఠకులకు కూడా ఈ సంకలనం ఉపయోగకరం అవుతుందని ఆశిస్తాను.

-కె. కె. రంగనాథాచార్యులు

# సంకేతాల వివరణ

| | |
|---|---|
| * | (a) వ్యాకరణసిద్ధం కాని కృతకవాక్యానికి గుర్తు.<br>(b) చారిత్రకంగా కొన్ని సూత్రాలు ఆధారంగా నిరూపించిన పునర్నిర్మితరూపానికి గుర్తు. |
| → | ఈగుర్తుకు ఎడమవైపున ఉన్న రూపం కుడివైపున ఉన్న రూపంగా మారుతుంది. |
| ← | ఈగుర్తుకు ఎడమవైపున ఉన్న రూపం కుడివైపున ఉన్న రూపం నించి ఏర్పడింది. |
| > | దీనికి ఎడమవైపున ఉన్న రూపం కుడివైపున ఉన్న రూపం కంటె చారిత్రకంగా ప్రాచీనమైనది; అది కాలక్రమేణ కుడి వైపున ఉన్న రూఫంగా పరిణామం చెందింది. |
| < | దీనికి కుడివైపున ఉన్న రూపం ఎడమవైపున ఉన్న రూపం కంటె చారిత్రకంగా ప్రాచీనమైనది; అది కాలక్రమేణ ఎడమ వైపున ఉన్న రూపంగా పరిణామం చెందింది. |
| / / | వర్ణవిధేయలిపిని ఈగుర్తులమధ్య రాస్తారు. |
| [ ] | ధ్వనివిధేయలిపిని ఈగుర్తులమధ్య రాస్తారు. |
| / | (a) ఈగుర్తుకు ఇరువైపులా ఉన్న రూపాలు రెండూ సాధ్యం.<br>(b) ఈగుర్తు సంధిసూత్రంలో సంధి జరిగేందుకు అవసరమైన పరిసరాలను సూచిస్తుంది. |
| — | ఈగుర్తు సంధిసూత్రంలో ఆదేశంగా వచ్చే రూపం ఉండే చోటును సూచిస్తుంది. |
| ø | ఈగుర్తు సంధిసూత్రంలో వర్ణలోపాన్ని సూచిస్తుంది. |
| # | ఈగుర్తు సంధిసూత్రంలో ఒక పదంముందు ఆ పద ప్రారంభాన్ని కాని, ఒక పదం చివర ఆ పద అవసానాన్ని కాని సూచిస్తుంది. |

ఏ bank, rat, cat మొదలైన ఇంగ్లీషు పదాలలోని అచ్చుకు తుల్యమైన ఉచ్చారణ గల ఆ అనే వర్ణం.

ఫ఼ ఇంగ్లీషులోని f.

ఱ 12వ శతాబ్దివరకూ గల శాసనాలలో కనిపించే ప్రాచీన తెలుగువర్ణం. ఇది మూర్ధన్యఅంతస్థం. ప్రాత, క్రొత్త వంటి కొన్ని పదాలలోని రేఫకూ, కోడి, ఏడు వంటి కొన్ని పదాలలోని డకారానికీ ఇది మూలం. తమిళ, మలయాళాలలో నేటికీ ఇది కనిపిస్తుంది.

క్రి. క్రియ

వి. విశేష్యం

విశ. విశేషణం

ఏక. ఏకవచనం

బహు. బహువచనం

మాం. వృ. కో.
మాండలికవృత్తిపదకోశం

బాలవ్యా. బాలవ్యాకరణం

# 1

# భాష : వ్యాకరణం

భావప్రకటనసాధనాల్లో భాష ప్రధానమైంది. "అతి పరిచయాదవజ్ఞా" అన్నట్లు అతిపరిచితమైంది కావటంవల్ల వ్యక్తుల జీవితంలోను, నాగరికతా నిర్మాణంలోను భాషకున్న ప్రాధాన్యాన్ని మనం గుర్తించలేం. దాన్నిగురించి సాధారణంగా ఆలోచించం కూడా. కంటికి అన్నింటికంటె దగ్గరిది కన్రెప్ప. దాన్నే కన్ను చూడలేదు. అయినా కంటిని రక్షించటంలో అది తన పనిని తాను నిర్వర్తించుకుంటూనే ఉంటుంది. అటువంటిదే భాష కూడా. మనోనేత్రానికి బాహ్యప్రపంచాన్ని చూపించేదీ, బాహ్యప్రపంచాన్నించి దాన్ని రక్షించేది భాష. నాగరికతతో పాటు భాష పెరుగుతూ, తనతో నాగరికతను వృద్ధి పొందింపు కుంటూపోతుంది. ఈ శక్తి భాషకు ఎలా వచ్చింది? భాషే లేకపోతే మానవ సమాజం, మానవవిజ్ఞాన సంస్కృతులు ఏ స్థితిలో ఉండేవి? అసలు భాషంటే ఏమిటి? భాషకు ఆలోచనాశక్తికి గల పరస్పరసంబంధం ఏమిటి? ప్రపంచంలో మానవులందరి అంతఃకరణప్రవృత్తులు ఒకే రకంగా ఉన్నా, ఇన్ని రకాల భాషలు ఏర్పట్టానికి కారణం ఏమిటి? భాష ఒక కాలంలో ఉన్నట్టు ఇంకొక కాలంలో ఎందుకుండదు? భాషలు ఎందుకు ఎలా మారతాయి? మొదలైన ప్రశ్నలు విజ్ఞానవంతులయిన వ్యక్తులను అన్ని దేశాల్లోనూ చిరకాలంగా బాధిస్తూనే ఉన్నాయి. ఈవిధమైన చర్చలకూ, భాషాశాస్త్రానికీ పుట్టినిల్లు భారతదేశమే. వీటిల్లో కొన్ని ప్రశ్నలకు జవాబులు మనకు స్పష్టిమర్మాల్లాగే తెలియవు. అవి

యధార్థాలని మాత్రమే గుర్తించగలం. మరి కొన్ని పరిశీలనవల్ల తెలుసుకోవచ్చు. అవి శాస్త్ర విషయాలు. తాత్వికులకు, తార్కికులకు మాత్రమే జొరబడ్డానికి వీలైన ఊహా మార్గాలు విడిచిపెట్టి కేవలపరిశీలనగమ్యాలైన శాస్త్రవిషయాలను ఈ వ్యాసావళిలో క్రమంగా తీసుకుందాం.

అసలు భాషంటే ఏమిటి? అనేది మొదటి ప్రశ్న. ఒక వస్తుతత్వాన్ని పూర్తిగా తెలుసుకున్నవాళ్ళకి ఆవస్తువును గూర్చి టూకీగా నిర్వచించటం కష్టం. అతివ్యాప్తి-అవ్యాప్తులు లేని నిర్వచనాలు సాధారణంగా దుర్ఘటం. భాషను గురించి మాట్లాట్టానికి మళ్ళీ భాషనే సాధనంగా ఉపయోగించాలి. మాటలకు స్వతస్సిద్ధంగా లేని నిర్వచనసామర్థ్యాన్ని ఎలా తెచ్చిపెట్టగలం? 'గౌః' అంటే పొయ్యేది కాబట్టి ఆపేరు వచ్చిందన్నారు ( గచ్ఛతీతి గౌః). కాని దీనికి అతివ్యాప్తి దోషం పడుతుంది. నడిచే జంతువు ప్రతిదానికి 'గౌః' శబ్దం వర్తించదు. పోతే, గోవు 'గడ్డి మేస్తుంది, దానికి నాలుగు కాళ్ళుంటాయి, గంగడోలుంటుంది' మొదలైన గోలక్షణాలన్నీ (సామాన్యాలు విశిష్టాలు గూడా) 'గౌః' శబ్దార్థంలో లేవు. ఇది అవ్యాప్తి దోషం. అయితే 'గౌః' అనగానే గోవు అని ఎలా తెలుస్తుంది? ఇది కేవలం మనోగతమైన శబ్దార్థసంబంధచ్ఛాయ. ఆజంతువును చెప్పటానికి 'గ్-ఔ-స్' అనే మూడు వర్ణాల సమూహాన్ని ప్రయోగించారు. ఈమూడు వర్ణాలు ఆక్రమంలో కలిసి వినబడ్డప్పుడు—పూర్వం ఏర్పడి సంస్కార రూపంగా ఉన్న నిబంధజ్ఞానంవల్ల—ఆజంతువే కళ్ళకు కడుతుంది. దీన్నిబట్టి ఏభాషలోనూ సహజంగా శబ్దాలకు నిర్వచనశక్తి—సమగ్రంగా వస్తుతత్వాన్ని చెప్పే శక్తి—లేదని తెలుస్తుంది. ఈశక్తి మనస్సులో ఏర్పడ్డ సాంకేతిక సంబంధమే. ఈసంబంధం ఎంత స్ఫుటంగా ఉంటే అర్థస్ఫూర్తి అంత ఝటితిగా కలుగుతుంది. ఇక ప్రకృత విషయానికి వద్దాం.

భాష నియతమైన వాగ్వ్యవహారం. 'వ్యవహారం' అంటే వ్యక్తులు సంఘ జీవులుగా అన్యోన్యప్రయోజనానికి నడుపుకొనే వ్యాపారం (social behaviour) అనుకోవచ్చు. వాక్కు అంటే ఉచ్చరిత ధ్వనుల సమూహం—అచ్చులు, హల్లులు, ఊనిక, స్వరం, మొదలైనవి. ఈధ్వనులను ఇష్టం వచ్చినట్లు కలిపితే మాటలు ఏర్పడవు. మాటల కలయికవల్ల వాక్యాలేర్పట్టానికి, భాషలో ఏవో కొన్ని నియతపద్ధతులుండాలి. పైనచెప్పింది అన్ని భాషలకు సరిపడే వివరణ- ఇక ప్రత్యేకంగా తీసుకుంటే ప్రతిభాషకూ వ్యక్తిత్వం ఉంటుంది. ఇది రెండు రకాలు.

ఒకటి బాహిరం - ఇది దేశకాల పరిమితత్వం. ప్రతిభాషను ప్రపంచంలో ఏ కాలంలో ఏప్రాంతంలో ఎంతమంది వ్యవహరిస్తున్నదీ చెప్పవచ్చు. రెండోది ఆంతరం - ఇది భాషా నిర్మాణానికి చెందిన వ్యక్తిత్వం. ధ్వనులదగ్గర్నించి వాక్యందాకా ఉన్న అన్ని అంతరువుల్లోను గల అన్యోన్యసంబంధం ప్రతి భాషకు విలక్షణంగా ఉంటుంది. ఉదా. తెలుగు దేశ్యభాగంలో పదాదిసంయుక్తాక్షరాలు స్న-, స్ప-, స్ట-, స్క-, క్ల- లాంటివి ఏర్పడవు. ఆంగ్లంలో ఇవి చాల సాధారణ మైనవి. *snake, spin, stand, school, club,* మొదలైనవి. సంస్కృతంలోనూ పదాదిని సకార టకారాల కలయిక 'స్ట-' లేదు. ఇదే విధంగా ప్రతి భాషలోని మాటల నిర్మాణం తీసుకుంటే - పదాల ఆది మధ్యాంతాలలో ఏయే ధ్వనులు కలుస్తాయో ఏవి కలవ్వో నిరూపించవచ్చు. ప్రాచీనాంధ్రంలో పదాంతదీర్ఘాలు లేవు. ప్రబంధకాలంలో వచ్చిన 'నవలా, జగా' లాంటివి, ఎరువు తెచ్చుకొన్నవిగా చూపెట్టవచ్చు. అదే విధంగా కొన్ని భాషల్లో రెండు వచనాలు, మరి కొన్నింట్లో మూడు వచనాలు (ఉదా. సంస్కృతం) ఉంటాయి. తెలుగులో క్రియలో కర్త గతార్థం అవుతుంది. 'వచ్చాడు' అని అన్నప్పుడు కర్త 'వాడు' అని చెప్పనక్కర్లేదు. ఆంగ్లంలో కర్తృపదాన్ని తప్పక వాక్యభాగంగా చెప్పాలి. ఈవిధమైన నిర్మాణ వైలక్షణ్యం ప్రతిభాషలోనూ ఉంటుంది. మనకు అర్థంకాని ఏ చైనీస్ భాషనో, ఆఫ్రికాలోని స్వహీలి భాషనో వింటున్నప్పుడు ఆభాషాధ్వనులూ, భాషేతర ధ్వనులూ (అంటే మామూలు చప్పుళ్ళు) మనకు ఒకే విధంగా ఉంటాయి. అంటే అవి రెండూ అర్థరహితాలుగానే ఉంటాయి. కారణం ఆభాషలోనూ మన భాషలో లాగా అచ్చులు, హల్లులు మొదలైనవి ఉపయోగిస్తారు గాని - అవి ఏవిధంగా కలిసి మాట లేర్పడతాయో, ఎలా కలిసినప్పుడు ఏఅర్థాన్ని తెలియ జేస్తాయో - మనకు తెలియదు. కొద్దిలో చెబితే - ఆయా భాషల నిర్మాణం మనకు తెలియదన్నమాట.

అయితే మరో ప్రశ్న. నవ్వు, ఏడుపు మొదలైనవి ఉచ్చారణావయవాలతో చేసే అర్థవంతాలైన ధ్వనులే కాబట్టి ఇవీ భాషలో చేరుతాయా? అని. చేరవు. ఎందుకంటే ఇవి భావప్రకటనసాధనాలైనా - వీటిలో నియతనిర్మాణం లేదు. ధ్వనులవల్ల మాటలేర్పడి - వాటివల్ల వాక్యాలేర్పడ్డట్టు - నవ్వు, ఏడుపులవల్ల ఏర్పడ్డ ధ్వనిసర్వస్వాన్ని కొన్ని ముక్కలుగా విడగొట్టి-పదాలను అచ్చులు హల్లులుగా విడగొట్టినట్టు -వాటి మధ్య కొన్ని మరికొన్నిటితో కొన్ని పద్ధతుల్లో

కలవటంవల్ల నవ్వు మొదలయినవి ఇన్ని రకాలుగా ఏర్పడ్డాయని నిరూపించ లేం. అంతకంటే బలీయమైన ఉపపత్తి – నవ్వు, ఏడుపులు ఆకలి దప్పుల్లాగా మానవులకు జన్మసిద్ధాలు. భాష పరిసరాలనుబట్టి శైశవంలో అలవడుతుంది. ఏడుపు, నవ్వులకు భాషాధ్వనులకు లాగా వ్యక్తిత్వం లేదు. అన్ని కాలాల్లోనూ, అన్ని భాషల్లోనూ, ఈరెండూ అందరికీ అర్థమౌతాయి. బిడ్డ పుట్టగానే ఏడుస్తుంది. అది సృష్టిసిద్ధం. మరి కొన్నాళ్ళకు నవ్వుతుంది. కాని తన మాతృ భాషాధ్వనులను, శబ్దాలను తల్లి దగ్గర చాలా నెల్లు పోయింతర్వాత కాని క్రమంగా నేర్చుకోలేదు. అందుకని ఆరెండూ భాషలో చేర్చటానికి వీల్లేదు.

వాగ్వ్యవహారంలో వాస్తవికంగా వ్యక్తులు గుర్తించి ప్రయోగించేవి వాక్యాలు మాత్రమే. వాక్యభాగాలైన ధ్వనులు, వర్ణాలు, పదాలు, పదబంధాలు (phrases), ఉపవాక్యాలు (clauses), వ్యాకర్తవిభాగంవల్ల ఏర్పడ్డవి. అయినా వ్యవహర్తల భాషాజ్ఞానాన్ని చాలావరకు ప్రతిబింబిస్తాయి అని నిరూపించవచ్చు.

ఇప్పుడీ నాలుగు వాక్యాలూ కలిపి పరిశీలిద్దాం.

1. ఇల్లు–పెద్ద–ది.
2. ఇంటి–కి–వెళ్ళ్–అ–ను.
3. ఇంట్–లో–లేదు.
4. ఇళ్ళ్–ఎంత–దూరం?

పై వాక్యాలన్నిట్లోనూ ఇల్లు అని అర్థం వచ్చే శబ్దం వేరువేరు పరిసరాల్లో నాలుగు రూపాల్తో వ్యవహరిస్తున్నాం. ఏయే పరిసరాల్లో ఈ నాలుగు రూపాలూ వస్తాయో పరిశీలించి చెప్పవచ్చు. విశేషణవిశేష్యసంబంధం లేని చోట పరపదం హల్లుతో మొదలైతే 'ఇల్లు' అనీ, అచ్చుతో మొదలైతే 'ఇళ్ళ్' అనీ, లకారేతరమైన హలాదినామవిభక్తి పరమైతే 'ఇంటి' అనీ, మిగిలిన చోట్ల 'ఇంట్–' అనీ, ఉంటుందని చెప్పవచ్చు. ఈ విధంగా ఒకే అర్థం కలిగిన శబ్దం భిన్నపరిసరాల్లో పొందే రూపభేదాలు నియతంగా ఉంటాయి.

అలాగే మిగిలిన వాక్యావయవాల్లో ప్రతి అర్థవంతమైన భాగానికీ ఉన్న రూప భేదాల గరిష్ఠసంఖ్య తేల్చి వాటి అన్యోన్యసంబంధం నిరూపించవచ్చు. రెండోవాక్యం లోని 'కి' అన్నదానికి వేరువేరు పరిసరాల్లో వచ్చే రూపభేదాలు మొత్తం – కి, – కు, – క్ అని మూడు మాత్రమే ఉదా. నా–కు–చెప్ప్–అండి. నాక్–ఏం–సంబంధం?

ఇలాగే మిగిలినవాటికూ్కడా భిన్నవాక్యాల్లో వేరువేరు పరిసరాల్లో వచ్చే రూప భేదాలూ, వాటిమధ్య ఉండే సంబంధమూ, నియతంగా కనిపిస్తుంది. ఏ ఒక్క వాక్యం తీసుకున్నా దాన్లో ఉండే అర్థవంతమైన భాగాలు కలిసేక్రమంకూడా కొంత వరకు నియతంగానే ఉంటుంది. 'ఇంటి-కి-వెళ్ల్-అ-ను' అనే వాక్యంలో ఉన్న క్రమాన్ని విపరీతం చెయ్యటానికి వీల్లేదు. అంటే 'ఇంటి-కి' అనే బదులు 'కి-ఇంటి' అని, 'వెళ్ళ్-అ-ను' అనే బదులు 'ను-వెళ్ళ్-అ' అనీ తారుమారు చెయ్యటానికి వీల్లేదు. ఈక్రమంకూడా అర్థవంతమే. నామవిభక్తులు విశేష్యానికి పరంగానే వస్తాయి. అలాగే క్రియానిర్మాణంలో మొదట ధాతువు, దానికి పరంగా కాలాద్యర్థకరూపం, దాన్ని అనుసరించి పురుషార్థకరూపం నియత క్రమంలో వస్తాయి.

ఇప్పుడు పై చర్చకంతటికీ సారాంశం – భాషావ్యవహారంలో వాస్తవికంగా ఉన్న వాక్యాల్ని అవిభాజ్యాలూ, అర్థవంతాలూ అయిన భాగాలుగా విడగొట్టి ప్రతి భాగానికీ, మిగిలిన వాక్యాల్లో భిన్నపరిసరాల్లో వచ్చేదాని రూపభేదాలకూ ఉన్న అన్యోన్యసంబంధాన్ని, ఒక్కొక్క భాగానికి ఆయా వాక్యాల్లో గల మిగిలిన భాగాల్తో గల సంబంధాన్ని నియతంగా—అంటే సూత్రప్రాయంగా—నిరూపించ వచ్చు. దేశకాలపరిమితమైన వాగ్వ్యవహారంలో ఈ విధంగా నిరూపించిన నియతి సర్వస్వాన్ని వ్యాకరణం అంటారు. అంటే వ్యాకరణం భాషావ్యవహారానికి ద్వైమానికవర్ణనం (two dimensional description) అన్నమాట. అందులో ఒకటి వాక్యనిర్మాణక్రమం, రెండోది రూపనిర్మాణక్రమం.

దీన్ని ఈ కింది పట్టికలో సూచించవచ్చు.

| | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| 1ఎ. | ఇంటి- | కి | వెళ్ళ్- | అ- | ను |
| 1బి. | ఇంట్- | లో | లే- | | డు |
| 1సి. | ఇల్లు- | | | | |
| 1డి. | ఇళ్ల్- | | | | |

అడ్డంగా ఉన్న వరస వాక్యావయవాలమధ్య ఉన్న సంబంధక్రమాన్ని తెలియ జేస్తుంది. 1–2 మధ్య, 3–4–5ల మధ్య ఉన్న సంబంధం నియతం. కాని ఈరెండు పదబంధాల (phrases) క్రమం శైలీభేదాన్నిబట్టి మారవచ్చు. 'వెళ్ళన్-ఇంటికి'

అన్నప్పుడు అర్థభేదం ఉంటుంది. నిలువువరస ఒక్కొక్క అర్థవంతమైన ప్రతి వాక్యావయవానికున్న రూపభేదాల మొత్తాన్ని, వాటి భేదకపరిసరాల్ని సూచిస్తుంది.

ప్రతి భాషలోనూ ఉన్న ఈనియతి శాస్త్రవిషయం. ఇది భాషకూ భాషకూ విలక్షణంగా ఉంటుంది. ఇది వ్యవహారంలో ఉండటంవల్లనే ఆయా వ్యవహర్తలు ఒకరినొకరు అర్థంచేసుకోగలుగుతున్నారు. అర్థంచేసుకోటం అనే ప్రయోజనానికి భంగం రాకుండా ఉండటం కోసమే ప్రతి వ్యక్తి తన ఇష్టం వచ్చినట్టుగా ఈ నిర్మాణక్రమాన్ని మార్చడు; మార్చలేడు. వీలైనంత వరకూ దాన్ని సమగ్రంగా సంపాదించుకోటానికే ప్రయత్నిస్తాడు. కాని కొన్ని భౌతిక రాజకీయాటంకాలవల్ల ఒకే భాష వ్యవహరించే భిన్నప్రాంతాల మధ్య ధ్వనుల దగ్గర్నుంచీ, వాక్యందాకా ఉన్న ఈనిర్మాణంలోని అంతరువుల్లో ఈషద్వైషమ్యాలు ఏర్పడుతుంటాయి. వీటినే మాండలికభేదాలంటాం. దేశకాలమానాల్లో ఒకే భాషకు చెందిన వ్యవహార మండలాలు ఎంతదూరమైతే ఈ వైషమ్యాలు అంత విరివిగా పెరుగుతాయి. ఇవి ఒక అవధి దాటింతర్వాత వీటి మధ్యనుండే అవగాహనక్షమత్వం (intelligibility) చాలా దూరమైపోయి ప్రతి మాండలికమూ ప్రత్యేకభాషగా మారిపోతుంది. ఈ విషయం మరో ప్రకరణంలో తీసుకుందాం. తెలుగుభాషకు 15 శతాబ్దుల చరిత్ర ఉంది. ఆరోశతాబ్దినించీ తెలుగు శాసనాలు దొరుకుతున్నాయి. కాని అంతకు పూర్వమే తెలుగుభాష ప్రత్యేకభాషగా కొన్ని శతాబ్దులుగా వ్యవహారంలో ఉండి తీరాలి. కాని చారిత్రక కాలం తీసుకున్నా, తెలుగు ఆరో శతాబ్దంనించీ ఇప్పటి దాకా ఎన్నో గుర్తించ గలిగిన మార్పులు పొందుతూ వచ్చింది. స్థూలంగా ఈ పరిణామదశలు గోచరించే కాలాలకు కొన్నిహద్దు లేర్పరుచుకొని ఒక్కొక్క కాలంలో ఉన్న వ్యవహారానికి ఒక వర్ణనాత్మకవ్యాకరణం రాసుకుంటూ వచ్చి అలాంటి వ్యాకరణ విషయాల అన్యోన్యసంబంధాన్ని నిరూపిస్తే అది చారిత్రక వ్యాకరణం (historical grammar) అవుతుంది. అంటే ఒక భాషాచరిత్రలో వర్తిల్లే కాలమానాన్ని అనుసరించిన పరిణామదశల నిర్మాణక్రమాల్లో— వర్ణనాత్మక వ్యాకరణాల్లో—గల పరస్పరసంబంధనిరూపణమే చారిత్రకవ్యాకరణం.

ఒకే కుటుంబానికి చెందిన భిన్నభాషలసంబంధం ఒక్కొక్కప్పుడు చరిత్రకందదు. చరిత్రకందినంతవరకు సోదరభాషల్లో గల నిర్మాణాన్ని సమగ్రంగా

నిరూపించి, అప్పుడు వాటిమధ్య గల సాదృశ్యాల ఆధారంతో వాటి పూర్వ చరిత్రనూ (pre-history), మాతృకనూ కొన్ని సూత్రాలద్వారా నిర్మించవచ్చు. సామ్యవైషమ్యాలు ఆధారంగా చేసిన ఈ భాషామాతృక నిర్మాణాన్నీ, దానికీ జన్యభాషలకూ గల పరస్పరసంబంధాన్నీ గురించి చెప్పేది తులనాత్మకవ్యాకరణం (comparative grammar) అంటారు. ఉదాహరణకు: ఈనాడు మనం వ్యవహరించే 'పెద్దవాడు' అనే పదబంధానికి పూర్వరూపాలు చరిత్రలో పరిశీలించుకుంటూపోతే 'పెద్దవాడు', 'పెర్దవాణ్డు', 'పెర్దవాన్డ్రు' అని శాసనాల్ని బట్టి నిరూపించవచ్చు. ఎనిమిదో శతాబ్దానికి పూర్వం 'పెర్ద' అని శాసనాల్లో కనిపిస్తుంది. (చూ. 'పెర్దళె' అహదనకర శాసనం, పంక్తి 27, ఇండియన్ ఏంటిక్వరీ, సంపుటి 18, పేజీ 187.) తొమ్మిదీ, పది శతాబ్దుల నాటికే 'ర్ద' అనే సంయుక్తాక్షరంలో సమీకరణం వచ్చి 'ద్ద' గా మారిపోయింది. (చూ. 'పెద్ద త్రోవ', ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటి 5, పేజీ 140, నెం. 16, పంక్తి 27.) 'వాన్డ్రు' శబ్దంకూడా తొమ్మిది, పది శతాబ్దులకే 'వాణ్డు/ వాండు' అని శాసనాల్లో రాస్తూవచ్చారు. తరువాతి కాలంలో 'ణ్డ' లోని అనునాసికం పూర్వాచ్చుమీద అనునాసిక్యంగా మారిపోయిఉంటుంది. ఆతరువాతి కాలంలో అనునాసిక్యం కూడా పోయి ఇప్పటి 'వాడు' అనే రూపం ఏర్పడ్డది. ఈపరిణామ దశల మేరలు కాలవిభాగంలో నిరూపించటానికి ఇతోధికమైనపరిశ్రమ జరగాలి. కాని స్థూలంగా చారిత్రకంగా పూర్వరూపమేదో పరరూపమేదో క్రమపద్ధతిలో ప్రదర్శించవచ్చు. చరిత్రకందినంతవరకు 'పెద్ద' అనే నేటి రూపానికి మొదటి రూపం 'పెర్ద' అనీ, 'వాడు' అన్నదానికి మొదటిరూపం 'వాన్డ్రు' అని మాత్రమే మనం చారిత్రక వ్యాకరణాన్ని బట్టి చెప్పగలమన్నమాట. కాని ఈరెండు ప్రాచీనరూపాలూ అంతకుముందు చరిత్రకందని కాలంలో ఏమార్పులు చెందాయో, అసలు వీటి ప్రాథమిక రూపాలేవో మనకు చారిత్రకవ్యాకరణం చెప్పదు. వాటిని నిర్మించాలంటే ఈరూపాల్తో తుల్యమైన రూపాలు మిగిలిన సోదరభాషల ప్రాచీనతాస్థితిలో ఎలా ఉండేవో పోల్చి చూసుకోవాలి. ఇప్పటి చర్చకు 'వాన్డ్రు' శబ్దం మాత్రం తీసుకుందాం. దీనికి సరియైన సోదరరూపాలు:

| | |
|---|---|
| తమిళం | అవన్ |
| మలయాళం | అవన్ |
| కన్నడం | అవమ్, అవను, అవ |

| | |
|---|---|
| కూయి | అఅన్-జు |
| కోలామి | అమ్-ద్ |
| నాయకి | అవ్-ఌ్ |
| పర్జి | ఓద్, ఓడ్ |
| ఒల్లారి | ఓణ్డ్ |
| గదబ (కొణ్డెకోర్) | ఓండ్ |

ఈ పైరూపాలన్నిటినీ పోల్చి చూస్తే తమిళమలయాళకన్నడాలు మినహా మిగిలినవాటన్నిటి చివరివర్ణాలు 'న్ట' అనేదాని పరిణతరూపాలుగా కనబడతాయి. తమిళమలయాళకన్నడాలకు '*అవన్' అనే రూపమాతృకను (proto-form), మిగిలిన భాషలన్నిటికీ '*అవన్టు' అనే రూపమాతృకనూ నిర్మించ వచ్చు. (చుక్కగుర్తు కొన్ని ధ్వని సూత్రాలనుబట్టి నిర్మించిన మూలభాషా రూపాలను సూచిస్తుంది.) ఈ '*అవన్టు' అనే రూపంనించి తెలుగులోనూ, మిగిలిన మధ్యభారతద్రావిడభాషల్లోనూ ఈనాడు ఏర్పడ్డ శబ్దాలు ఏయే పరిణామాలకు లోనై వచ్చింది కొన్ని ధ్వనిసూత్రాల (phonological rules) ద్వారా నిరూపించ వచ్చు. ధ్వనిసూత్రా లంటే ఏమిటి? వాటి ఆధారంతో సోదర భాషల పూర్వ రూపాల్ని ఎలా నిర్మించాలి? ధ్వనిసూత్రాలకపవాదాలేమన్నా ఉంటాయా? ఉంటే ఏకారణాలవల్ల? అనే ప్రశ్నలు ఈ వ్యాసావళిలో వేరొక చోట ప్రత్యేకంగా తీసుకుందాం.

ఇంతవరకూ ఉపోద్ఘాతరూపంగా చూపించదల్చుకున్నది భాషకూ వ్యాకరణానికీ ఉన్న సంబంధం, వ్యాకరణాల్లో ఉన్న తరగతులూ, వాటి అన్యోన్య సమన్వయం మాత్రమే. ఈప్రకరణాన్నిబట్టి తేలిన సారాంశం: ప్రతి భాషా వ్యవహారంలోనూ పరిశీలనగమ్యమైన ద్వైమానికనియతి ఉంటుంది. ఈ నియతిని నిరూపించటమే వర్ణనాత్మకవ్యాకరణ ప్రయోజనం. దేశకాలమానాల్ని అనుసరించి చేసిన అనేకవర్ణనాత్మకవ్యాకరణాల సమన్వయరూపంగా ఏర్పడ్డవే చారిత్రక, తులనాత్మకవ్యాకరణాలు. అంటే అన్ని రకాల వ్యాకరణాలకూ మూలం వర్ణనాత్మకవ్యాకరణమన్నమాట. దీని లక్ష్యం దేశకాలపరిమితమైన భాషా వ్యవహారంలో ఉండే నియతిని ప్రదర్శించటం. ఈనియతి ధ్వనుల మొదలు వాక్యందాకా అన్ని అంతరువుల్లోనూ అనుస్యూతంగా ఉన్న నిర్మాణక్రమం. దాన్ని గుర్తించి, క్రోడీకరించి ప్రదర్శించటమే వ్యాకర్త పని.

# 2

# ధ్వని – వర్ణం

ఒక వ్యక్తి మాట్లాడేటప్పుడు అతనుద్దేశించింది 'ఇది', 'అది కాదు' అని ఆ భాషావ్యవహర్తల కెలా తెలుస్తుంది? ఈ ప్రశ్నను గురించి నిశితంగా ఆలోచిస్తే వ్యవహర్తల జ్ఞానంలో భాషాధ్వనులకు ఒక విలక్షణమైన కట్టుబాటున్నట్టు కనిపిస్తుంది. ఉదాహరణకు 'ఉన్నావ్ఁ', 'ఉన్నావ్' అనే రెండు చిన్న వాక్యాలు తీసుకుందాం. ఈ రెండింటి మధ్య ఉన్న అర్థభేదం తెలుగువాళ్ళు ఎలా గుర్తిస్తున్నారు? రెండు వాక్యాల్లోనూ 'ఉన్నా' వరకు సమానంగానే ఉంది. అంటే ఈ భాగంవల్ల ఆ రెండిటి మధ్య ఉన్న భేదం స్ఫురించటంలేదన్నమాట. ఒక వాక్యం చివర 'వ్ఁ' అనటంవల్ల రెండో వాక్యం చివర 'వ్' అనటంవల్లనే ఈ రెండూ ప్రత్యేకవాక్యాలని శ్రోత గుర్తిస్తాడు. ఇంకా వివరిస్తే, 'ఉన్నావ్ఁ' 'ఉన్నావ్' అనే వాక్యాల మధ్య అర్థభేదం 'వఁ–వ'ల ఉచ్చారణభేదాన్ని గుర్తించటంవల్ల ఏర్పడ్డదని చెప్పవచ్చు. కాని, 'ఉన్నావ్ఁ' అనే బదులు రాయలసీమ వ్యవహర్తలు చాలామంది సర్కారుల్లో 'వఁ' అనే చోట 'మ' అనే ఉచ్చరిస్తారు. ఇక్కడ 'వఁ' బదులు 'మ' ఉంచటంవల్ల అర్థభేదం రావటంలేదు. అంటే, 'వఁ–వ'ల భేదం లాగా 'వఁ–మ'ల భేదం తెలుగులో ఏమాండలికంలోనూ అర్థభేదకం కాదన్నమాట. మరి కొన్ని ఉదాహరణలు తీసుకుందాం. కాలం–గాలం, చూలు–జూలు, టోకు–డోకు, తగ్గు–దగ్గు,

పాట–బాట: వీలైనంత తక్కువ ఉచ్చారణభేదంతోనే అర్థభేదాన్ని కలిగించే ఇలాటి మాటల జంటల్ని పరిశీలిస్తే, ఆయా ఉచ్చారణభేదాలు తెలుగు వ్యవహారంలో అర్థభేదనసమర్థాలని తెలుస్తుంది. అంటే క–గ, చ–జ, ట–డ, త–ద, ప–బ ల మధ్య ఉన్న ఉచ్చారణభేదమే (పరుష–సరళ భేదం) పై మాటల్లో భిన్నార్థస్ఫూర్తిని కలిగిస్తుంది. తెలుగు మాతృభాషగా మాట్లాడేవాళ్ళందరికి ఈ ధ్వనుల మధ్య ఉన్న భేదం గుర్తించే శక్తి వ్యవహారశిక్షణలో చిన్నప్పటి నించి సహజంగానే ప్రవర్తిస్తుంది. అలా ప్రవర్తించకపోతే ఒక అర్థం ఉద్దేశించినప్పుడు మరొకటి రాకుండా నివారించటం వీలుకాక వ్యవహారం కష్టమౌతుంది.

భాషలో ఉచ్చరించే ధ్వనులు నియతసంఖ్యంగానే ఉంటాయి. కాని అన్నిటి మధ్యా పైన చెప్పినటువంటి భేదమే - అంటే భిన్నార్థస్ఫోరకమైన భేదం - ఉండితీరాలన్న నియమమేమీ లేదు. ఇంతకుముందు చెప్పినట్లు 'వఁ–మ'ల భేదం ఇలాంటిది కాదు. ఈ తరగతికి చెందిన మరికొన్ని ఉదాహరణలు తీసుకుందాం. కాళీ–ఖాళీ, కారం–ఖారం, జాజి–ఝాజి: ఈ జంటల్లోని మాటలమధ్య కూడా ఉచ్చారణభేదం (ధ్వనిభేదం) ఉంది. భౌతికంగా 'క–గ', 'చ–జ'ల మధ్య ఉన్నది ఎలా భేదమనిపించుకుంటుందో, అదే విధంగా 'క–ఖ', 'జ–ఝ'ల మధ్యది కూడా ఉచ్చారణభేదమే అని చెప్పాలి. కాని ఈభేదం భిన్నార్థస్ఫూర్తిని కలిగించటంలేదు. అంటే 'క–ఖ', 'జ–ఝ'ల భేదం 'క–గ', 'చ–జ'ల భేదం లాగా మన వ్యవహారంలో ప్రవర్తించటంలేదు. కాని సంస్కృతంలో కళ–గళ, కర–ఖర మొదలైన చోట్ల 'క–గ'ల భేదం లాగానే, 'క–ఖ'ల భేదం కూడా అవశ్యకమైంది. ప్రాచీన తమిళంలో 'క–గ'ల భేదం తెలుగులోలాగా భిన్నార్థస్ఫోరకం కాదు. నేటి తెలుగులో చాలమంది వ్యవహారంలో పదాది గకారానికీ, పదంమధ్య అద్విరుక్తంగా వచ్చే గకారానికీ ఉచ్చారణలో తేడా ఉంది. ఉదా. <u>గా</u>లి, <u>గు</u>ర్రం, పగ̇లు, మొగు̇డు. పదాది గకారాన్ని బరువుగాను, పదమధ్యంలో వచ్చే గకారాన్ని తేలిగ్గాను ఉచ్చరిస్తాం. ధ్వనిశాస్త్రపరిభాషలో మొదటి రకం 'గ'ను కంఠ్యస్పర్శం అనీ, రెండో రకం 'గ̇'ను కంఠ్యోష్మం అనీ అంటారు. (ఈ విధంగా ఉదాహరించిన చోట్ల ధ్వనులు కేవల హల్మాత్రాలుగానే గ్రహించాలి. 'మ' అంటే కేవల వ్యంజనం 'మ్' అనే గ్రాహ్యం. అకార సంయోజనం ఉచ్చారణకోసం మాత్రమే. చూ. అనుబంధం.) ఎవరన్నా

పై పదాల్లో ఉచ్చారణను తారుమారుచేసి 'గ' బదులు 'గ' కారం ఉచ్చరించినా అర్థసందిగ్ధత గాని, భేదం గాని ఏర్పడదు. అంటే 'గ-గ'ల భేదం గూడా 'వఁ-మ', 'క-ఖ'ల భేదం వంటిదే గాని 'క-గ'ల భేదం వంటిది గాదని తెలుస్తుంది. పై చర్చ సారాశం: ప్రతి భాషా వ్యవహారంలోని ధ్వనులన్నిటి మధ్యా ఉచ్చారణ భేదాలుంటాయి. ఈ భేదాల్లో కొన్ని అర్థభేదనసమర్థాలు, కొన్ని అర్థభేదన అసమర్థాలు. భాషలో మొదటి రకం భేదాలు ప్రధానమైనవి. రెండో రకం అప్రధానమైనవి. ప్రధాన భేదాలనే వ్యవహర్తలు గుర్తిస్తారు. అప్రధాన భేదాలు సామాన్యంగా ఉన్నట్టు గూడా వక్తలు, శ్రోతలు గుర్తించరు.

అప్రధానభేదం గల ధ్వనులమధ్య సంబంధం భాషలో నియతంగా ఉంటుంది. ఇక్కడ 'నియతం' అంటే ఆయా ధ్వనుల మధ్య ఉన్న ఉచ్చారణభేదం ఏయే పరిస్థితుల్లో ప్రవర్తిస్తుందో సూత్రరూపంలో చెప్పవచ్చు. ఇంతకుముందు చెప్పిన ఉదాహరణల్లో 'వఁ-మ', 'క-ఖ', 'గ-గ' మొదలైనవాటి మధ్య ఉన్నది అప్రధానభేదం అని చెప్పేం. ఈ అప్రధానభేదం రెండు విధాలుగా ఉంటుంది. ఒకటి: స్థానభేదాన్నిబట్టి నిర్ణయింపదగినది. నేటి తెలుగులో ముఖ్యంగా సర్కారు వ్యవహారంలో వినబడే 'మ-వఁ', 'గ-గ'ల భేదం ఇలాటిది. పదాదిని, ద్విత్వమైనపుడు, ఓష్ఠ్యస్పర్శాల ముందు 'మ్-' అనే ఉచ్చారణ వినబడుతుంది. ఉదా. మాట, అమ్-మ, గమ్-వ, అమ్-బలి; పదమధ్యంలో (అచ్చులమధ్య) అద్విరుక్తంగా వచ్చినప్పుడు, పదాంతంలోను, సంయోగంలో 'వ, స, హ'లు పరంగా ఉన్నప్పుడు, 'వ్ఁ' అనే ఉచ్చారణ వినబడుతున్నది. ఉదా. మావఁ (మామ), పుస్తకవ్ఁ (పుస్తకం), సవ్ఁవచ్చరవ్ఁ (సంవత్సరం), సివ్ఁహవ్ఁ (సింహం). అలానే 'గ-గ'ల భేదం గూడా స్థానాన్ని బట్టి నిర్ణయించవచ్చు. పదాదిని, ద్విరుక్తమైనప్పుడు గకారోచ్చారణం, ఉదా. గాలి, దగ్గు, మొ.; అపదాదిని అద్విరుక్తంగా వచ్చినప్పుడల్లా 'గ' కారోచ్చారణం, ఉదా. తగాదా, పగలు, మొగుడు, మొ. నియతంగా వినిపిస్తుంది. తెలుగులో 'చ-చే', 'జ-జే'ల భేదం గూడా ఇటువంటిదే. తాలవ్యాచ్చులైన 'ఇ, ఈ, ఎ, ఏ, ఎ, ఏ' లకు ముందు 'చ-జ'లుగాను, కంఠ్యాచ్చులైన 'అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ' లకు ముందు 'చే-జే'లుగాను పలుకుతుంటాం. ఉదా. చిలువ, చీము, చెంబు, చేదు, కుంచె, చేప, చేదువు, చేవ, చేక్క, చేూపు, చేొప్పు, చేోటు.

పైన ఉదాహరించిన 'మ-వఁ'ల జంటలో 'మ' వచ్చే చోట 'వఁ' గాని, 'వఁ'

వచ్చే చోట 'మ' గాని ఉచ్చరించం. అలాగే 'గ-గ్'లు, 'చ-చే'లు, 'జ-జే'లు పరస్పరభిన్నపరిసరాల్లోనే ఉచ్చరిస్తాం. ఆ పరిసరాలను నియమితంగా నిరూపించవచ్చు. కాని ప్రధానభేదం కల 'క-గ', 'చ-జ', మొదలయిన ధ్వనుల జంటలు పరిశీలిస్తే వాటిమధ్య ఇలాటి నియతసంబంధం కనిపించదు. పదం మొదట, మధ్య, ద్విరుక్తమైనప్పుడు, అద్విరుక్తమైనప్పుడు గూడా 'క-గ'లు వ్యవహారంలో ఉన్నాయి. ఉదా. కాలం-గాలం, నకలు- నగలు, దక్కు-దగ్గు. 'మ-వఁ' మొదలైనవాటిలాగా పరస్పరభిన్నపరిసరాల్లో గాక 'క-గ'లు సమాన పరిసరాల్లోనే రావటంవల్ల వాటి సంబంధం నియతం అని చెప్పటానికి వీల్లేదు.

రెండో రకమయిన అప్రధానభేదం: పదంలో ఒకే స్థానంలో (పరిసరంలో) రెండు ధ్వనుల్లో ఏ ఒక్క ధ్వని ఉచ్చరించినా అర్థభేదం లేకపోతే, ఆ రెండింటి మధ్య సంబంధం కూడా అప్రధానమైందే. ఉదా. కాళీ-ఖాళీ, కారం-ఖారం, మొదలైన చోట్ల 'క' కారం ఉచ్చరించినా 'ఖ' కారం ఉచ్చరించినా అర్థబోధకతలో సందిగ్ధత గాని, మార్పు గాని లేదు. ఈవిధమైన అప్రధానభేదంలో 'క-ఖ'లు, 'మ-వఁ'ల లాగా పరస్పరభిన్నస్థానికాలు గాక, ఏకస్థానికాలుగానే ఉన్నాయి. 'కాలం-గాలం'లో గూడా 'క-గ'లు ఒకే స్థానంలో మారుతున్న ధ్వనులైనా ఆ మార్పువల్ల అర్థభేదం ఏర్పడుతున్నది గాబట్టి ఆభేదం ప్రధానమైనది. ఆ భేదంవల్ల 'కాలం-గాలం' రెండు భిన్నపదాలుగా గుర్తిస్తున్నాం. 'క-ఖ'ల భేదంవల్ల అర్థభేదం రావటంలేదు. కాబట్టి, 'కాళీ- ఖాళీ' ఏకపదంగానే గుర్తిస్తాం.

ఇకముందు ప్రధానభేదాన్నే 'భేదం' అని వ్యవహరిద్దాం. ఇప్పుడు వర్ణస్వరూపాన్ని రెండు మూడు పద్ధతుల్లో నిర్వచించవచ్చు. వాగ్వ్యవహారంలో అర్థభేదనసమర్థమైన కనిష్ఠాంశాన్ని 'వర్ణం' అనవచ్చు. 'క, గ, చ, జ' మొదలైనవి వర్ణాలు. ఇవి ఎలా అర్థభేదనసమర్థాలో ఇదివరకు చూపించేం. కనిష్ఠాంశం అనటంవల్ల 'క' అన్నదానిలో ఏకదేశానికి భాషలో అర్థభేదాన్ని కలిగించే శక్తి లేదు. అంటే దాన్లో ఏకదేశం ఎలా ఉంటుందనవచ్చు. 'క' అన్న ఉచ్చారణ జిహ్వామూలం, మృదుతాలువును తాకి లోపలినించి వచ్చే శ్వాసను క్షణకాలం నిరోధించి విడవటంవల్ల ఏర్పడుతున్నది. ధ్వనిశాస్త్ర పరిభాషలో స్థాన కరణాలను బట్టి దీన్ని 'కంఠ్యం' లేక 'హనుమూలీయం' అనీ, ప్రయత్నభేదాన్ని బట్టి 'అఘోష(పరుష) స్పర్శ'మనీ అంటారు. పైన నిరూపించిన ఆస్యప్రయత్న

సర్వస్వంవల్ల 'క' కారోచ్చారణం ఏర్పడుతున్నా ఆ ప్రయత్నభాగాలకు (ఏకదేశ మాత్రాలకు) వ్యష్టిగా భాషలో అస్తిత్వం లేదు. అందుకనే 'క' కారం భాషలో కనిష్ఠభేదకాంశం అన్నాం. తార్కికభాషలో ప్రతి భేదకాంశమూ తానొక భేద మవుతుంది. కాబట్టి, వర్ణం భాషలో 'కనిష్ఠభేదం' అని ఇంకా సంగ్రహించి చెప్పవచ్చు. మిగిలినవాటన్నిటి కంటే భిన్నమైంది భేదం. భాషలోని ప్రతివర్ణమూ, మిగిలిన వర్ణాలన్నిటినించి గుర్తించటానికి వీలైందిగా ఉండాలని తాత్పర్యం. అయితే అప్రధానమైన భేదం కల ధ్వనులను ఈ నిర్వచనంలోకి ఎలా సరిపెట్టటం అనే ప్రశ్న వస్తుంది. అన్యోన్యప్రధానభేదం లేని ధ్వనులన్నీ కలిసి ఏకైక భేదంగానే భాషలో ప్రవర్తిస్తాయి. పైన నిరూపించిన 'మ-వఁ', 'గ-గ', 'చ-చే', మొదలైన జంటల్లో ఒక్కొక్క జంట ఒక్కొక్క వర్ణం. దీన్ని బట్టి వర్ణం అంటే ఉచ్చరితధ్వని మాత్రమే కాదని విశదమౌతుంది. అందుకనే కనిష్ఠభేదం అన్నాం. ఉచ్చరించిన ధ్వని ప్రతిదీ ఏదో ఒకవర్ణానికి చెందుతుంది గాని, ప్రతివర్ణమూ ఒక్కొక్క ధ్వని మాత్రానికి గ్రాహకం కాదు. ఇప్పుడు 'వర్ణం' అన్న పదానికి నిర్వచనం మరికొంత ప్రవచించవచ్చు. అప్రధానభేదం కలిగి, అర్థబోధలో ఏకైక కనిష్ఠభేదంగా వర్తించే ధ్వనుల సమూహం వర్ణం అనవచ్చు. ఒకే వర్ణానికి చెందిన ధ్వనులను కొంతవరకు ప్రాచీనుల పరిభాషను బట్టి 'సవర్ణా' లని చెప్పవచ్చు. నేటి తెలుగులో 'మ-వఁ', 'గ-గ', 'చ-చే', మొదలైనవి సవర్ణాలు. సవర్ణాల మధ్య ఉచ్చారణ సాదృశ్యం ఉండాలి. అవి భిన్నపరిసరాల్లో వచ్చేవిగానైనా ఉండాలి, లేక ఒకే పరిసరంలో పర్యాయవృత్తిగా వచ్చినా అర్థభేదకాలు గాకుండా (స్వతంత్ర పరివర్తనీయాలుగా) నైనా ఉండాలి.

రెండు వర్ణాలమధ్య మనం గుర్తించే భేదం – అంటే రెండు సవర్ణ సమూహాలమధ్య ఉండే భేదం – ఉచ్చారణధర్మాల్లోని భేదంవల్ల ఏర్పడుతున్నది. ఉదా. సవర్ణాలైన 'చ-చే' లు ఒక వర్ణం. 'జ-జే' లు మరొక వర్ణం (చూ. వెనుక పేరా). 'చ-చే' లమధ్య ఉచ్చారణలో కొన్ని పోలికలున్నాయి: రెండూ స్పృష్టోష్మాలు, రెండూ శ్వాసవద్ధ్వనులు, స్థానకరణాల్లో మాత్రం చిన్న తేడా ఉంది. 'చే' కు స్థానం దంతమూలం, కరణం నాలుక కొస; 'చ' కు స్థానం కఠిన తాలువు, కరణం జిహ్వామధ్యం. అలాగనే 'జ-జే' లు కూడా స్పృష్టోష్మాలు, కాని ఈరెండూ నాదవద్ధ్వనులు. 'చ' కు లాగానే 'జ' కు, 'చే' కు లాగానే 'జే' కు స్థానకరణాలుంటాయి. 'చ-చే' లకు 'జ-జే' లకు సాదృశ్యం స్థానకరణాల్లో ఉంది.

భేదం— మొదటి జంట శ్వాసవంతం, రెండో జంట నాదవంతం; ఈ రెండు జంటల్ని రెండు భిన్నవర్ణాలుగా గుర్తింపజేసే ధర్మం — శ్వాసనాద భేదం. 'చ–చే' ల మధ్యనూ స్థానకరణాల్లో భేదం ఉన్నా అవి భిన్నవర్ణాలు కావటం లేదు; 'చ–జ' ల మధ్య స్థానకరణాల్లో సమానత్వం ఉన్నా అవి ఒకే వర్ణంలో భాగాలు కావటంలేదు. అంటే రెండు జంటలకూ భిన్నవర్ణత్వం ఆరోపించే ఉచ్చారణ ధర్మం శ్వాసనాదభేదం కాని, దంతమూలీయతాలవ్యభేదం కాదు. 'చేల్లు–జేల్లు' అన్నప్పుడు ఇవి రెండూ భిన్న శబ్దాలు కావటం 'చే–జే' ల భేదాన్ని బట్టే. అలాగే 'చీడ–జీడి' అన్నప్పుడూ. 'చ–చే' ల మధ్య ఉన్న స్థానకరణభేదం అప్రధానం కాబట్టే ఎవరన్నా 'చే' అనవలసిన చోట పొరపాటువల్లనో, బుద్ధిపూర్వకంగానో 'చ' అన్నా అర్థసందిగ్ధత ఏర్పడదు. 'చేూడు' అన్నది 'చూడు' అంటే ఏదో వింతగా అనిపించవచ్చుగాని అర్థభేదం కలుగదు. అందువల్ల వర్ణాలకు భిన్నత్వం చేకూర్చే ఉచ్చారణ ధర్మాలు రెండు వర్ణాలమధ్య కనీసం ఒకటైనా ఉంటుంది. సవర్ణాలమధ్య నుండే ఉచ్చారణభేదాలు భాషలో అప్రధానాలు. భిన్నవర్ణాల (సవర్ణసమూహాల) మధ్య ఉండే ఉచ్చారణభేదాలు ప్రధానాలు. తెలుగులో శ్వాసనాదభేదం ప్రధానమైంది. అందువల్లనే, క–గ, చ–జ, ట–డ, త–ద, ప–బ, మొదలైనవి భిన్నవర్ణాలుగా గుర్తిస్తున్నాం. కాని స్పర్శోష్మభేదం, 'మ–వఁ', 'గ–గ఼' ల మధ్య ఉన్నది అప్రధానం. 'క–గ' లు రెండూ కంఠ్యాలు. రెండూ స్పర్శాలు. కాని ఒకటి శ్వాసవంతం (అఘోషం), రెండోది నాదవంతం (ఘోషం లేక సరళం). శ్వాసనాదభేదం ఈ రెంటి మధ్యా కనిష్ఠం. 'క–హ' లు కూడా భిన్నవర్ణాలు. ఇవి రెండూ స్పర్శాలు, పరుషాలు. కాని ఒకటి కంఠ్యం, మరొకటి ఓష్ఠ్యం. ఇక్కడ వర్ణభేదకత ఉచ్చారణ స్థాన కరణాల్లోని భేదాన్ని బట్టి వచ్చింది. ఓష్ఠ్యత్వం, కంఠ్యత్వం వర్ణభేదకధర్మాలన్నమాట. 'క–ర' లు కూడా భిన్న వర్ణాలే. రెండిటి మధ్య ఉన్న ఉచ్చారణభేదం ఇక్కడ గరిష్ఠం. 'క' స్పర్శం, కంఠ్యం, శ్వాసవంతం. 'ర' దంతమూలీయం, రేఫ (కంపితం), నాదవంతం. ఈ విధంగా వర్ణాలను పృథక్కరించి గుర్తింపజేసే ఉచ్చారణ విశేషాలను (వర్ణ) భేదకలక్షణాలని చెప్పవచ్చు. వీటినే ఆంగ్లంలో distinctive features అంటారు. ప్రతి వర్ణాన్నీ మిగిలిన వర్ణాలనించి వేరుచేసే భేదకలక్షణం ఒకటి గాని, అంతకంటె ఎక్కువ గాని ఉండవచ్చు. అటువంటివి స్థానకరణ ప్రయత్నాలను బట్టి ప్రతిభాషలోను నియతసంఖ్యాకంగా నిరూపించవచ్చు. ఈవిభజన ప్రకారం కొన్ని భేదకలక్షణాల సమూహం వర్ణం అని నిర్వచించవచ్చు.

వర్ణాలను వేరుచేసే భేదకలక్షణాలు కాని సవర్ణాల మధ్య ఉచ్చారణభేదాలు భేదకలక్షణాలనిపించుకోవు. నేటి తెలుగులో శ్వాసవత్త్వం, నాదవత్త్వం, అనునాసిక్యం, స్పర్శత్వం, రేఫత్వం, మొదలైనవి కొన్ని ప్రయత్నాల్లో భేదక లక్షణాలు. స్థాన కరణాల్లో ఓష్ఠ్యత్వం, దంత్యత్వం, మూర్ధన్యత్వం, కంఠ్యత్వం, మొదలైనవి కొన్ని భేదకలక్షణాలు. అచ్చుల్లో సంవారవివారాలు, కంఠ, తాలు స్థానాలు కొన్ని భేదకలక్షణాలు. కాని తెలుగులో అచ్చుల్లో 'అనునాసిక్యం' భేదకలక్షణం కాదు. ఫ్రెంచి భాషలో సానునాసిక, నిరనునాసిక స్వరభేదం అర్థభేదనసమర్థమౌతుంది. తెలుగులో అలా లేదు. సంస్కృతంలో అల్పప్రాణ మహాప్రాణాలు భేదకలక్షణాలు. అందుకనే క, ఖ, ప, ఫ, మొదలైనవి భిన్న వర్ణాలు. ఆంగ్లంలో అల్పప్రాణ మహాప్రాణ ధ్వనులు సవర్ణాలు. పదాదిన p, t, k వర్ణాలు pin, tin, kin, మొదలైన చోట్ల ph, th, kh, గాను, 's' వర్ణానికి పరంగా వచ్చినప్పుడు spin, sting, skin మొదలైనచోట్ల అల్పప్రాణంగాను ఉచ్చరిస్తారు. ఈ భేదం పరిసరభేదాన్ని బట్టి నిర్ణయించదగినది కాబట్టి అప్రధానమైనది.

ఒక భాషలోని వర్ణసమామ్నాయం ఆభాషలోని కనిష్ఠభేదాల మొత్తం. భాషావ్యవహారంలో వైవిధ్యం ఈభేదాల వివిధసంయోజనపద్ధతులవల్లనే ఏర్పడు తున్నది. రెండు అభిప్రాయాల భేదం ఏకైకభేదంవల్ల గాని, అనేకవర్ణ భేదంవల్ల గాని ఏర్పడవచ్చు. ఈవర్ణభేదాలు 'కాలం–గాలం', మొదలైన వాటిల్లో లాగా పదాదినే గాక భిన్నస్థానాల్లో కూడా ఉండవచ్చు. ఉదా. కాడి–గాడి, కాడి–కడి, కాడి–కాని, కాడి–కాడ – ఈ నాలుగు జతల్లోనూ వర్ణభేదాలస్థానం క్రమంగా మార్చటంవల్ల భిన్నశబ్దా లేర్పడ్డాయి. మొదటి జతలో 'క–గ'ల భేదంవల్ల, రెండో జతలో 'అ–ఆ'ల భేదంవల్ల, మూడో జతలో 'డ–న'ల భేదంవల్ల, నాల్గో జతలో 'ఇ–అ'ల భేదంవల్ల ఆయా శబ్దాలమధ్య భిన్నార్థ స్ఫోరకత ఏర్పడు తున్నది. పై ఉదాహరణ లన్నిటిలోనూ ఏకైకవర్ణభేదంవల్లనే అర్థభేదం ఏర్పడ్డది. కాని రెండు శబ్దాలమధ్య భేదం, అనేకవర్ణకల్పితంగా కూడా ఉండ వచ్చు. ఉదా. కాడి–మేడి, కాడి–జోలి, కాడి–మేకు. ఈజంటల్లో రెండు, మూడు, నాలుగు వర్ణాలు క్రమంగా భేదించటంవల్ల భిన్నశబ్దాలు ఏర్పడుతున్నాయి.

వర్ణాలను స్వరాలు (అచ్చులు), వ్యంజనాలు (హల్లులు) అని ప్రాచీనులు విభజించారు. కాని పై చర్చను బట్టి భాషలో ప్రతి కనిష్ఠభేదకాంశమూ వర్ణం ఔతుంది. కాబట్టి, మరి కొన్ని రకాల భేదాలను గూడా వర్ణసమామ్నాయంలో

చేర్చాలి. అవి కాలపరిమితి (దీర్ఘత), ఊనిక, స్వరం, విరామం, మొదలైనవి. తెనుగులో హ్రస్వాచ్చుల ఉచ్చారణకు, దీర్ఘాచ్చుల ఉచ్చారణకు కాలపరిమితిలోనే భేదం. స్థాన కరణాలు సమానాలే. 'పడు–పాడు' అన్నచోట 'దీర్ఘత' అర్థభేదకం గాబట్టి దాన్ని గూడా వర్ణమనే వ్యవహరించాలి. ఒడియా, బెంగాలీ మొదలైన ఔత్తరాహభాషల్లో హ్రస్వదీర్ఘభేదం అప్రధానం. పరిసరభేదాన్ని బట్టి హ్రస్వ దీర్ఘాలు సవర్ణాలు. ఊనిక భేదం వల్ల అర్థభేదం కలిగే భాషల తెగకు చెందినది ఆంగ్లం. 'permit' అన్న మాటలో pérmit అని మొదటి అచ్చుపై ఊనిక నిలిస్తే విశేష్యం గాను, permít అని రెండవ అచ్చుపై ఊనిక నిలిస్తే క్రియగాను ఆంగ్ల భాషావ్యవహారంలో ఉంది. 'bláckbird' అంటే ఒక పక్షివిశేషం. 'blàck bírd' అన్నప్పుడు నల్లని పక్షి అని అర్థం. ఇట్టి చోట్ల స్వరవ్యంజన భేదం లేకపోయినా ఊనికల భేదంవల్ల అర్థభేదం ఏర్పడుతున్నది. కాబట్టి ఊనికలు గూడా ఆంగ్లంలో వర్ణాలే. వైదిక సంస్కృతంలో ఉచ్చ, నీచ, స్వరితాలు (high, low, mid) అని మూడు రకాల స్వరాశ్రయవర్ణాలు (pitch phonemes) ఉన్నాయి. తెలుగులోను స్వరవర్ణా లున్నాయనే చెప్పాలి. కాని ఇవి వాక్యస్థితిలో ప్రవర్తిస్తాయి గాని, పదస్థితిలో లేవు. అంటే రెండు పదాల భేదం స్వరాశ్రయం కాదు. రెండు వాక్యాలమధ్య భేదం స్వరభేదాన్ని బట్టి నిర్ణయించవచ్చు. ఉదా. 'అది?', 'అదిగాదు ఇది.'. 'అది?' అన్న వాక్యంలో చివరిస్వరం క్రమంగా తక్కువస్థాయినించి ఉచ్చస్థాయికి మారుతుంది. రెండవ వాక్యాంతస్వరం ఉచ్చ స్థాయినించి నీచకు దిగుతుంది. ప్రశ్నార్థకవాక్యాలను సూచించే స్వరం ∧ అని, నిర్దేశార్థక వాక్యాంతాన వచ్చే స్వరం ∨ అని గుర్తుపెట్టుకోవచ్చు. స్వరభేదాల స్థాయిని 1, 2, 3 అంకెలతో నీచస్వరితోచ్చాలని ఉత్తరోత్తర ప్రకర్షగా నిరూపించవచ్చు. పైన చెప్పిన రెండు వాక్యాల స్వరభేదాలు నిరూపించటానికి వినియోగించే కనిష్ఠస్థాయి భేదాలను గూడా వర్ణాలని పిలవ్వచ్చు. వ్యవధానాలూ, విరామాలు గూడా భాషలో అర్థ భేదకాలే. ఉదాహరణకు ఈకింది రెండు వాక్యాలు చూడండి. 'వాడు తెలిసీ తెలేనట్టు మాట్లాడ్తేడు', 'వాడు తెలిసీ, తెలేనట్టు మాట్లాడ్తేడు.' ఈ రెండు వాక్యాల మధ్య ఉన్న అర్థభేదం, మొదటి వాక్యం 'తెలిసీతెలేనట్టు' అని అవ్యవహితంగా ఉచ్చరించటంవల్లను, రెండో వాక్యంలో 'తెలిసీ, తెలేనట్టు' అని వ్యవహితోచ్చారణ వల్లను ఏర్పడ్డది. అందువల్ల వ్యవధానాలు కొన్నిచోట్ల నిలవటం, కొన్నిచోట్ల నిలవకపోవటం భేదకలక్షణంగా అన్ని భాషల్లోనూ ఉంటుంది.

## వర్ణం - లిపి

భాషలో వర్ణాలకే లిపిచిహ్నాలుండాలి గాని సవర్ణాలకు గుర్తులు అక్కరలేదు. సవర్ణాలన్నీ ఏకైకభేదంగా వర్తిస్తాయి కాబట్టి వాటన్నిటికీ ఒకే లేఖనచిహ్నం చాలు. ప్రతివర్ణభాగాలయిన ధ్వనుల (సవర్ణాల) ఉచ్చారణ స్థానభేదాన్ని బట్టి నిర్ణయించటానికి సాధ్యమౌతుంది గదా! వర్ణానికి పెట్టుకొనే గుర్తు కేవలం సంకేతం మాత్రమే కాబట్టి అందులో సౌలభ్యానికే ప్రాధాన్యం గాని, ఉచ్చారణతో సంబంధం లేదు. సంప్రదాయాన్ని బట్టి మనం ఈనాటి తెలుగులో సవర్ణాలయిన 'మ-వఀ'లకు /మ/ అనీ 'చ-చే'లకు /చ/ అనీ 'జ-జే'లకు /జ/ అనీ, 'గ-గ'లకు /గ/ అనీ గుర్తులు పెట్టుకోవచ్చు.[1] కాని /మ/ ధ్వనిమాత్రం కాదనీ, కొన్ని భేదకలక్షణాల సమూహానికీ, కొన్ని సవర్ణాలకు సంకేతం మాత్రమే అనీ గ్రహించాలి. ప్రస్తుతం తెలుగులిపిలో /ప్ర f/ వర్ణాలకు గుర్తుల్లేవు. ఉదా. 'ఆప్రేడు', 'కాఫీ'. ఈనాడు శిష్టుల వ్యవహారంలోను 'ధ-థ' లను వేరుచేసే భేదక లక్షణం ఉచ్చారణలో లేదు. రెంటినీ 'ధ' గానే ఉచ్చరిస్తాం. రెండూ ఒక వర్ణంగానే ప్రవర్తిస్తున్నాయి. అర్థభేదం సందర్భాన్ని బట్టి మాత్రమే తెలుసుకుంటాం. ఉదా. 'ఈపద్యానికి అర్థమేమిటి?' 'ఆవగింజలో అర్ధభాగం కాలేదు.' సంస్కృతంలో వేరైన 'అర్థ', 'అర్ధ' శబ్దాలకు తెలుగులో భేదం పోయింది. ఇలాటి చోట్ల ఒకే సంకేతం చాలు. ప్రాచీనాంధ్రంలో 'ర-ఱ'లు ప్రత్యేకవర్ణాలు. నేటి తెలుగులో ఇవి సవర్ణాలు. ద్విరుక్తమైనప్పుడు 'ఱ' కారోచ్చారణం, అన్యత్ర 'ర' కారోచ్చారణం వినిపిస్తుంది. 'గొఱ్ఱె', 'మారటం'. అందువల్ల ఈరెండు సవర్ణాలను /ర/ గుర్తుతోనే సూచించవచ్చు. /గొర్రె/, /మారటం/ అని రాయవచ్చు. భాష మారుతున్నప్పుడు ముందున్న వర్ణాలు కొన్ని జారిపో తుంటాయి. కొత్త వర్ణాలు అన్యభాషాసంపర్కంవల్ల వచ్చి చేరుతుంటాయి. సమాజంలో వచ్చే మార్పులతో పాటు వ్యక్తులు మారుతున్నట్లే, చరిత్రలో వచ్చే మార్పులతోపాటు ప్రతిభాషలోని వర్ణసమామ్నాయం కూడా మారుతుంటుంది. ఈమార్పులు లేఖనచిహ్నాల్లో చూపకపోవటంవల్ల, చదువుకొనేటప్పుడు కొన్ని అర్థసందిగ్ధతలు ఏర్పడుతుంటాయి.

## ప్రాచీనుల మతం

పాణిన్యాదులు భాషాశాస్త్రవేత్తలు. ఆధునికభాషాశాస్త్రానికి పునాదులు వీరి రచనలే. ఇంతదాకా చేసిన ఈవాదం వీరి రచనల్లో లేకపోయినా, దానికి కావలసిన

భావబీజాలు మాత్రం అక్కడ ఉన్నాయి. సంస్కృతభాషా వ్యాకర్తలు వర్ణ శబ్దాన్ని కేవలలేఖనచిహ్నం అనే అర్థంలో ఉపయోగించలేదు. వారు విధించిన వర్ణాగమాదేశలోపాదికార్యాలు ఉచ్చారణభేదాలకు చెందినవి గాని లిఖిత చిహ్నాలకు గాదు. అప్రధానోచ్చారణభేదాలున్నచోట వాటిని ప్రత్యేకవర్ణాలని వారు వ్యవహరించలేదు. ఉదా. 'య-వ'లకు భిన్న పరిసరాల్లో వచ్చే లఘ్వలఘూచ్చారణభేదం అలాటిది. పాణిని ప్రధానంగా అచ్చులకే 'వర్ణం' శబ్దం ఉపయోగించాడని, అందులోను స్థానకరణతుల్యత ఉన్న అచ్చులన్నీ ఏక వర్ణగ్రాహ్యాలుగానే పరిగణించాడని విమర్శకుల అభిప్రాయం. 'ఇ' వర్ణం అంటే హ్రస్వ, దీర్ఘ, ప్లుత భేదాలు కల 'ఇ, ఈ, ఈ౩'లకు గ్రాహకం. కాని పాణిని ప్రతికనిష్ఠభేదానికి 'కార' ప్రత్యయం చేర్చి వ్యవహరించాడు. ఇకారం, ఈకారం, చకారం, కకారం, ఇత్యాది. కాని ఈవర్ణం చవర్ణం మొదలైన వ్యవహృతి అష్టాధ్యాయిలో లేదని పండితుల నిర్ణయం. ఆతర్వాత వ్యాకరణ సంప్రదాయంలో 'వర్ణ-కార' శబ్దాలు పర్యాయాలుగానే ప్రయోగించారు. కాని వర్ణసమామ్నాయంలో ఉపదిష్టమైనవి చాలవరకు కనిష్ఠభేదాలేగాని ఉచ్చరిత ధ్వనిసర్వస్వం కాదు. ఇక సవర్ణాలంటే తుల్యాస్యప్రయత్నాలు కలవి అని ప్రాచీనుల మతం. ఈ వ్యాసంలో అప్రధానభేదం కల వర్ణధ్వనులను 'సవర్ణా' లని పిలవటానికి ఆధారం చిన్నయసూరిగారి సూత్రం ''దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు'' (బాలవ్యా. సంజ్ఞా 7) మాత్రమే. కాని సూరిగారి అభిప్రాయం అటు ప్రాచీనుల మతానికీ చెందదు; ఇటు నవీనుల మతానికీ చెందదు. తుల్యాస్య ప్రయత్నం 'చ-చే', 'జ-జే'ల మధ్యనే కాదు. 'చ-జ', 'చే-జే'ల మధ్య గూడా ఉంది గదా! పోతే, 'చ-చే'లు ఒకవర్ణం, 'జ-జే'లు ఒకవర్ణం అని వారి అభిప్రాయం. అయితే, వర్ణసమామ్నాయంలో ''తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు'' అన్న సూత్రంలో 'చ-చే', 'జ-జే'లు నాలుగు భిన్న వర్ణాలుగా పరిగణించారు. ప్రౌఢవ్యాకరణకర్త గూడా వీటిని నాలుగు వర్ణాలుగానే చెప్పారు (సంజ్ఞా. సూ. 1).

ఈవ్యాసంలో 'ధ్వని' అంటే ఉచ్చరితమైన భాషాధ్వని. 'వర్ణం' అంటే భాషానిర్మాణక్రమంలో కనిష్ఠభేదం, లేక భేదకాంశం. 'సవర్ణం' అంటే వర్ణ గతధ్వని. ఆంగ్లంలో వీటిని క్రమంగా phone, phoneme, allophone అంటారు.

# అనుబంధం

భాషాధ్వనుల ఉత్పత్తిక్రమాన్ని గురించి చెప్పే శాస్త్రాన్ని ధ్వనిశాస్త్రం లేక 'శిక్ష' అంటారు. సంస్కృతధ్వనినిరూపణం చాలా శాస్త్రీయంగా శిక్షల్లోనూ, ప్రాతిశాఖ్యల్లోనూ కనిపిస్తుంది. పారిభాషికపదాలు చాలవరకు మన ప్రాచీనులవే ఉపయోగించుకున్నా వాటి అన్వయవివరణాల్లో ఆధునికధ్వనిశాస్త్రానుగుణంగా కొన్ని మార్పులు చేసుకోవాలి. పెదవులు మొదలు కాకలకం దాకా ఉన్న ప్రదేశాన్ని ఆస్యం లేక వక్త్రం అంటారు. ఉచ్చారణావయవాలన్నీ ఈ భాగంలోనే ఉన్నాయి. ఓష్ఠాలు (కిందిది, పైది), జిహ్వ (అగ్రం, మధ్యం, మూలం), దంతాలు, దంతమూలం (పైపండ్ల చిగురు), తాలువు (పూర్వభాగం, మూర్ధం), అంగిలి (మృదుతాలువు), సప్తపథ, కాకలకం లేక స్వరపేటిక (నాదతంత్రులు vocal chords) – ఇవన్నీ ధ్వనుల ఉత్పత్తికి కారణాలైన వక్త్రాంగాలు. వీటిలో కొన్ని స్థానాలు, కొన్ని కరణాలు. కదలిక గల అవయవాన్ని కరణం అనీ, లేనిదాన్ని స్థానం అనీ చెప్పుకోవచ్చు. సాధారణంగా కిందిపెదవి, నాలుక (కొస, మధ్య, మొదలు) కరణాలు. పైపెదవి, పైదంతాలు, దంతమూలం, తాలువు, అంగిలి – ఇవి స్థానాలు. ఊపిరితిత్తులనుంచి నిర్గమించే గాలి కంఠబిలం మొదలు పెదవులదాకా ఉన్న ప్రాంతంలో పొందే మార్పును ప్రయత్నం అంటారు. స్థానకరణప్రయత్న భేదాల్నిబట్టి ధ్వనులను విభజించవచ్చు.

స్థానకరణాలను బట్టి చేసే విభజన

| | | |
|---|---|---|
| ఓష్ఠ్యాలు | : | స్థానం: పైపెదవి; కరణం: కిందిపెదవి. |
| దంతోష్ఠ్యాలు | : | స్థానం: పైదంతాల వెనకభాగం; కరణం: కిందిపెదవి. |
| దంత్యాలు | : | స్థానం: పైదంతాల వెనకభాగం; నాలుక కొసగాని, అంచు గానీ. |
| దంతమూలీయాలు | : | స్థానం: దంతమూలం; కరణం: నాలుక కొసగాని, అంచు గానీ. |
| తాలవ్యాలు | : | స్థానం: కఠినతాలువు; కరణం: నాలుక ముందు లేక మధ్యభాగం. |



మూర్ధన్యాలు : స్థానం: కఠినతాలువు చివరిభాగం – దీన్నే 'మూర్ధం' అంటారు; కరణం: మడత వేసిన నాలుకకొస.

కంఠ్యాలు : స్థానం: అంగిలి లేక మృదుతాలువు; కరణం: జిహ్వామూలం.

కంఠమూలీయాలు : స్థానకరణాలు: నాదతంత్రులు.

ప్రయత్నాలు కొన్ని సామాన్యాలు, కొన్ని విశిష్టాలు. విస్తృత ప్రయోజనం కల ప్రయత్నాలు సామాన్యాలు. అవి శ్వాస, నాద, అల్పప్రాణ, మహాప్రాణాలని నాలుగు విధాలు. నాదతంత్రులను కంపింప జెయ్యకుండా నిర్గమించే ఊపిరి 'శ్వాసం'. నాదతంత్రులను కంపింపజేస్తూ వెలువడే ఊపిరి 'నాదం'. శ్వాసం వినబడదు. నాదనిర్గమనం జరిగేటప్పుడు రెండు చెవులూ మూసుకుంటే 'గుఁయ్ఁ' మనే ధ్వనికంపన వినవచ్చు. శ్వాసనిర్గతిలో అది వినిపించదు. నిర్దిష్టకాలంలో స్వాభావికోచ్చారణలో వెలువడే గాలి 'అల్పప్రాణం'. అంతకంటే ఎక్కువ ఒత్తిడితో వెలువర్చిన ఊపిరి 'మహాప్రాణం'. అచ్చుల్లో వచ్చే ఒక ప్రయత్నభేదం అనునాసిక్యం. ఇది నాసికారంధ్రాల ద్వారా నాదవంతంగా గాలిని నిర్గమింపజేయటం.

ఇక విశిష్టప్రయత్నాలవల్ల ఏర్పడే ధ్వనిభేదాలు: గాలిని క్షణకాలం స్థానకరణాలు నిరోధించి విడవటంవల్ల ఏర్పడే ధ్వనులు స్పర్శాలు; స్థాన కరణభేదాలనుబట్టి ఓష్ఠ్యస్పర్శాలు, దంత్యస్పర్శాలు, ఇత్యాది భేదాలు. వీటిల్లో శ్వాస, నాద, అల్పప్రాణ, మహాప్రాణ భేదాలనుబట్టి సూక్ష్మతర విభజన చెయ్య వచ్చు. స్థానికనిరోధం లేకుండా గాలి స్థానకరణాల సంకుచితావకాశంగుండా ఒరుసుకొని రావటంవల్ల ఏర్పడే ధ్వనులు ఊష్మాలు – 'శ, ష, స, హ' ల వంటివి. గాలి నాసికారంధ్రాల ద్వారా వెలువడే ప్రయత్నంలో ఉచ్చరించే ధ్వనులు అనునాసికాలు – 'ఙ, ఞ, ణ, న, మ' మొదలైనవి. నాలుక ఇరువైపులగుండా గాలి వెలువర్చటంవల్ల ఏర్పడే ధ్వనులు పార్శ్వికాలు – 'ల, ళ' మొదలైనవి. కరణం అవ్యవహితంగా కంపించటంవల్ల ఏర్పడే ధ్వనులు కంపితాలు లేక రేఫలు – 'ర, ఱ' మొదలైనవి. ఈషత్స్పర్శవల్ల ఏర్పడే ధ్వనులు శిథిలస్పర్శాలు. హిందీలో ఉచ్చరించే 'ఢ఼' (ఉదా. లఢ఼కా) ఇటువంటిది. ఊష్మాలకున్నంత ఒరపిడి లేకుండా గాలి జారిపోయే ప్రయత్నంవల్ల ఏర్పడే ధ్వనులు అంతస్థాలు –

'య, వ' మొదలైనవి. భాషల్లో ఇవి కొన్నిచోట్ల అచ్చులుగాను, కొన్నిచోట్ల హల్లులుగాను ప్రవర్తిస్తాయి. ఈరెండు వరుసలకు మధ్యస్థంగా ఉంటాయి కాబట్టి అంతస్థాలన్నారు. 'చ-చే, జ-జే'ల ఉచ్చారణలో మొదట స్పర్శప్రయత్నం, చివర ఊష్మప్రయత్నం ఉండటంవల్ల వీటిని స్పృష్టోష్మాలని గాని, స్పర్శోష్మాలని గాని పిలవవచ్చు. తాళపత్ర గ్రంథాల్లో 'చే' కారాన్ని 'త్స'గా రాయటానికి హేతువు ఈ ప్రయత్నవిలక్షణతే కావచ్చు.

అచ్చుల ఉచ్చారణ స్థానభేదాన్నిబట్టి తాలవ్యాలు, కంఠ్యాలు అని ద్వివిధం. నాలుక మధ్యభాగం కఠినతాలువును సమీపించేటప్పుడు క్రమంగా ఏర్పడే అచ్చులు 'ఎ, ఎ, ఇ'లు. నాలుక వెనకభాగం మృదుతాలువును సమీపించేటప్పుడు క్రమంగా ఏర్పడే అచ్చులు 'అ, ఒ, ఉ'లు. 'ఇ, ఉ'లను ఉచ్చరించేటప్పుడు వక్త్రంలో అవకాశం తక్కువగా ఉంటుంది. 'ఎ, అ'లను ఉచ్చరించేటప్పుడు ఈ అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఈ ప్రమాణాన్నిబట్టి 'ఇ, ఉ'లను సంవృతాచ్చులనీ, 'ఎ, అ'లను వివృతాచ్చులనీ వ్యవహరించవచ్చు. 'ఎ, ఒ'లను అర్ధ సంవృతాలని అనవచ్చు. తాలవ్యాచ్చులు తెలుగులో నిరోష్ఠ్యాలు. కంఠ్యాచ్చులు (అకారం తప్ప) ఓష్ఠ్యాలు.

జ్ఞాపిక

1. వర్ణాలను ధ్వనులనుంచి వేరుగా సూచించటానికి ఇకముందు / / గుర్తులు ఇరువైపులా ఉపయోగించబడతాయి.

# 3

# నేటి తెలుగు : వర్ణసమామ్నాయం

'ధ్వని : వర్ణం' అన్న వ్యాసంలో భాషలో ధ్వనికీ, వర్ణానికీ గల పరస్పర సంబంధం నిరూపించబడ్డది. అర్థభేదకాలు కాని తుల్యోచ్చారణ కలిగిన ధ్వనుల సమూహం వర్ణమనీ, ఒక్కొక్క వర్ణానికి చెందిన ధ్వనులను పరిసర భేదాన్నిబట్టి నిర్ణయించటం సాధ్యమనీ, భాషలో వర్ణానికే లిపిచిహ్నాలు అవశ్యకంగాని ఉచ్చరించే ధ్వనులన్నిటికీ గుర్తులు పెట్టనక్కర్లేదనీ ఆవ్యాసంలో ప్రతిపాదించాను. ఈ సిద్ధాంతానికి లక్ష్యంగా నేటి తెలుగులోని వర్ణసమామ్నాయం విపులంగా చూపించటమే ఈ వ్యాసం ఉద్దేశం.

నేటి తెలుగులో ప్రాంతాల్నిబట్టి, కులాల్నిబట్టి, వృత్తుల్నిబట్టి ఉచ్చారణ లోనూ, పదజాలంలోనూ ఎంతో వైవిధ్యం ఉంది. ఆయా భేదాలన్నిటినీ ఒక్క చోట కుదించి వర్ణించటం అసాధ్యం కాకపోయినా సామగ్రి లోపాన్నిబట్టి ప్రస్తుతం దుస్సాధం. ఈ కింద చూపించబోయే వర్ణసమామ్నాయం స్థూలంగా కోస్తా జిల్లాల్లోని శిష్టుల (నడిమి తరగతి నాగరికుల) వ్యవహారంలోది. చాలా వరకు రాయలసీమ, తెలంగాణావారి వ్యవహారానికి కూడా ఈవర్ణసమామ్నాయం సరిపోవచ్చు. ఎందుకంటే భిన్నమాండలికాలమధ్య పదగతవర్ణాల్లో ఈషద్ భేదాలుండవచ్చును గాని వర్ణాల మొత్తం సంఖ్యలో ఎక్కువతక్కువలు సామాన్యంగా ఉండవు. ఇలాటి భేదాలు నాలుగు రకాలుగా ఉంటాయి.

1. రెండుమండలాల్లో, కొన్ని పదాల్లో ఒకేవర్ణం ప్రయోగిస్తున్నా, ఆ వర్ణోచ్చారణల్లో (సవర్ణోచ్చారణల్లో) కొద్ది తేడా లుండవచ్చు. ఉదాహరణకు కోస్తాజిల్లాల శిష్టుల వ్యవహారంలోనూ, రాయలసీమవారి వ్యవహారంలోనూ 'మ' వర్ణం ఉంది. కాని కోస్తా వ్యవహారంలో 'మ' వర్ణానికి భిన్నస్థానాల్లో 'మ-వఁ' అని రెండురకాల ఉచ్చారణ ఉంది. రాయలసీమ వ్యవహారంలో అన్ని పద పరిసరాల్లోనూ ఒక్క మకారోచ్చారణే ఉంది. ఇక్కడ సామాన్య లక్షణం రెండు ప్రాంతాల్లోనూ 'మ' వర్ణం ఉండటం. సవర్ణాల (వర్ణధ్వనుల) భేదం అవగాహనకు ఆటంకం కాదు కాబట్టి అది అంత లెక్కలోది కాదు. కాని కోస్తా జిల్లల్లో 'మ' వర్ణం ఉపయోగించే చోట రాయలసీమ మరోవర్ణం, ఏ 'వ' వర్ణమో, 'గ' వర్ణమో ఉపయోగించేట్టయితే కొంతవరకు అర్థబోధ కష్టమౌతుంది. మాండలిక వ్యాకరణాలు రాసేటప్పుడిలాటి వర్ణభేదాలు ముఖ్యంగా గుర్తించాలి.

2. సమానపదాల్లో ఒకమండలంలో ఒకవర్ణం ఉంటే రెండో మండలంలో మరొకవర్ణం ఉండటం. ఉదా. శ్రీకాకుళం, విశాఖపట్నం ప్రాంతాల్లో 'గిన్ని, దొన్ని' అన్న మాటలను మిగిలిన దిగువ కోస్తా జిల్లాల వారు 'గిన్నె, దొన్నె' అంటారు. అంటే ద్విత్వహల్లుమీద పదాంతంలో ఒక ప్రాంతంలో 'ఎ' వర్ణం, మరొక ప్రాంతంలో 'ఇ' వర్ణం నియతంగా వినిపిస్తాయి. కాని మిగిలిన పరిసరాల్లో 'ఇ, ఎ' లు రెండు మండలాల్లోను ప్రత్యేకవర్ణాలుగా ఉన్నాయి కాబట్టి వర్ణాల మొత్తం అక్కడా ఇక్కడా ఒకటిగానే ఉంటుంది.

3. రెండు వ్యవహారమండలాలమధ్య, కొన్ని పదాల్లో, ఒక మండలంలో లేని వర్ణం మరొక మండలంలో అదనంగా ఉండటంగాని, ఉన్న వర్ణం లేకపోవటం గాని జరగవచ్చు. ఉదా. గుంటూరు ప్రాంతంలో 'అట్లా, ఇట్లా' అనే మాటలకు తెలంగాణాలో చాలమంది (శిష్టులుకూడా) 'గట్లా, గిట్లా' అంటారు. అలానే 'వాన, వచ్చింది' అనే మాటలకు సరిగా 'అన, అచ్చింది' అంటారు. ఈ ఉదాహరణల్లో ఒక ప్రాంతంలో లేని 'గ' వర్ణం మరొక ప్రాంతంలో ఉండటం, ఉన్న 'వ' వర్ణం లేకపోవటం అర్థబోధకు బాధక మవుతుంది. కాని మొత్తంమీద ఇంత మాత్రంవల్ల 'గ' వర్ణం ఒక ప్రాంతంలో అంతటా లేకపోవటం, మరొక ప్రాంతంలో 'వ' వర్ణం అంతటా లేకపోవటం గాని సంభవించదు గాబట్టి, పదజాలమంతా పరిశీలిస్తే వర్ణాల మొత్తం అక్కడా ఇక్కడా ఒకటే.

4. శిష్టుల వ్యవహారంలో ఉన్న కొన్ని వర్ణాలు శిష్టులు కానివారి

వ్యవహారంలో సర్వత్రా లేకపోవచ్చు. నేటి తెలుగులో శిష్టుల వ్యవహారంలో క-ఖ, గ-ఘ, ద-ధ, మొదలైన అల్పప్రాణ, మహాప్రాణాలు ప్రత్యేకవర్ణాలు. వారు 'సుఖం, ఘనత, ధర్మం, ఫలం, భర్త' అని వాడే మాటలకు సరిగా శిష్టేతరులు 'సుకం, గనత, దర్మం, పలం, బర్త' అని వ్యవహరించటం కద్దు. అంటే శిష్టుల భాషలో ఉన్న రెండేసి వర్ణాలకు (అల్పప్రాణ-మహాప్రాణ వర్ణాలకు) సమానంగా తదితరుల్లో ఒక్క వర్ణమే (అల్పప్రాణవర్ణమే) ఉంటుంది. ఇటువంటి చోట ఈ రెండు తెగలవారి వ్యవహారానికి సరిపడే వర్ణాల మొత్తంలో తేడా వస్తుంది. కాని ఈవ్యాసంలో శిష్టుల భాషనే గ్రహిస్తున్నాం గాబట్టి ముందిచ్చే వర్ణసమామ్నాయం భాష అంతటికీ సరిపడవచ్చు. మాండలికపరిశోధన ఇతోధికంగా జరిగితేగాని ఈవిషయం నిష్కర్షగా చెప్పలేం. ప్రతివర్ణానికి చెందిన ఉచ్చారణలోని భేదక ధర్మాల ఆధారంగా నేటి తెలుగులోని వర్ణాలను ఈకింది పద్ధతిలో చూపించవచ్చు. ముందు ఉపయోగించే పారిభాషికపదాల అవగాహనకు 'ధ్వని - వర్ణం' వ్యాసం చివరి అనుబంధం పాఠకులు చదవటం అవసరం.

హల్లులు

| ప్రయత్నం | | స్థానకరణాలు | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఓష్ఠ్యం | | దంత్యం | | దంత మూలీయం | | తాలవ్యం | | మూర్ధన్యం | | కంఠ్యం | | కంఠ మూలీయం | |
| | | శ్వా | నా | శ్వా | నా | శ్వా | నా | శ్వా | నా | శ్వా | నా | శ్వా | నా | శ్వా | నా |
| స్పర్శం | అ | ప | బ | త | ద | | | | | ట | డ | క | గ | | |
| | మ | ఫ | భ | (థ) | ధ | | | | | ఠ | ఢ | ఖ | ఘ | | |
| ఊష్మం | | ఫ | | | | స | | శ | | ష | | | | హ | |
| స్పృష్టోష్మం | అ | | | | | | | చ | జ | | | | | | |
| | మ | | | | | | | ఛ | ఝ | | | | | | |
| అనునాసికం | | | మ | | | | న | | | | ణ | | | | |
| పార్శ్వికం | | | | | | | ల | | | | ళ | | | | |
| రేఫం | | | | | | | ర | | | | | | | | |
| అంతస్థం | | | వ | | | | | | య | | | | | | |

శ్వా = శ్వాసవంతం (పరుషం లేక అఘోషం); నా = నాదవంతం (సరళం లేక ఘోషం);
అ = అల్పప్రాణం (ఒత్తు లేనిది); మ = మహాప్రాణం (ఒత్తి ఉచ్చరించేది)

అచ్చులు

| | తాలవ్యం | కంఠ్యం | |
|---|---|---|---|
| | (నిరోష్ఠ్యం) | (నిరోష్ఠ్యం) | (ఓష్ఠ్యం) |
| సంవృతం | ఇ ఈ | | ఉ ఊ |
| అర్ధసంవృతం | ఎ ఏ | | ఒ ఓ |
| అర్ధవివృతం | ఏ̲ | | |
| వివృతం | | అ ఆ | |

పైన నిరూపించిన వర్ణాల్లో ఒక్కొక్క దానికి భిన్నపరిసరాల్లో ఏర్పడే ఉచ్చారణభేదాలు అంటే ధ్వనులు లేక సవర్ణాలు:

హల్లులు

స్పర్శాలు

స్పర్శవర్ణాలన్నిటినీ పదం మొదట, ద్విరుక్తిలోను బరువు (tense) గాను అచ్చులమధ్య అద్విరుక్తంగా వచ్చినప్పుడు తేలిక (lax) గాను ఉచ్చరిస్తాం. అంటే ప్రతి స్పర్శవర్ణానికి భిన్నపరిసరాల్లో రెండేసి సవర్ణాలు ఉన్నాయన్నమాట. బరువుగా ఉచ్చరించినవాటిలో స్థానకరణాల మధ్య స్పర్శ ఎక్కువగా ఉంటుంది. తేలిగ్గా ఉచ్చరించినవాటిల్లో తక్కువగా ఉంటుంది. ఈ భేదం పరుషాల్లో కంటె సరళాల్లో (నాదవద్ధ్వనుల్లో) మరింత స్పష్టంగా వినవచ్చు. తేలిక ఉచ్చారణను సూచించే ధ్వనికి కింద ఒక చుక్క గుర్తుగా పెట్టుకుందాం.

| | బరువు | తేలిక |
|---|---|---|
| గ | గాలి, దగ్గు | నగ̣లు, తగ̣ాదా |
| డ | డబ్బు, అడ్డం | గడ̣వ, పడ̣క |
| ద | దారి, గద్ద | మొద̣లు, చద̣ువు |
| బ | బావ, డబ్బు | తబ̣లా, జలుబ̣ు |

పై మాటలను తెలుగు మాట్లాడేవారు ఎవరికి వారు జాగ్రత్తగా ఉచ్చరించి స్థానకరణస్పర్శ పరిశీలిస్తే, వాటిలో ఉన్న సవర్ణాల ఉచ్చారణభేదాలు చాలా స్పష్టంగా తెలుస్తాయి. ఈ విధంగానే పరుషాల్లోనూ, మహాప్రాణాల్లోనూ పైన చెప్పిన పరిసరాలనుబట్టి వచ్చే ఉచ్చారణ భేదాలు వినిపిస్తాయి.

శిష్టభాషలోనూ మహాప్రాణాలు ప్రత్యేక వర్ణాలుగా వచ్చేపదాలు సామాన్యంగా తక్కువ. చాలవరకు అన్యదేశ్యాల్లో వచ్చే మహాప్రాణ ధ్వనులు, అల్పప్రాణ ధ్వనులతో సవర్ణాలుగానే ఉంటాయి. ఉదా. ఖాళీ–కాళీ, ఖర్చు–కర్చు, ఖరీదు–కరీదు, తనిఖీ–తనికీ, ఠావు–టావు.

వ్యవహారంలో ఉన్న పదాలన్నిటిలోనూ అల్పప్రాణ, మహాప్రాణాలు ఈ విధంగా అన్ని పరిసరాల్లోనూ అర్థభేదాన్ని కలిగించకుండా వినిమయం పొంద గలిగితే అప్పుడు క–ఖ మొదలైనవి సవర్ణాలవుతాయి గాని పృథగ్వర్ణాలు కావు. కాని శిష్టుల భాషలో ఇవి అలా లేవు. సుఖం, దుక్–ఖం (లేక దుహ్–ఖం), సంఘం, ఠీవి, కంఠం, ఢంకా, గాఢం, ధర్మం, కథ, ఫలం, భార్య, స్తంభం– ఈశబ్దాల ఉచ్చారణలో శిష్టులు మహాప్రాణాల బదులు అల్పప్రాణాలు ఉపయోగించటం అరుదు. సుకం, దుక్కం, గనత, సంగం మొదలైన ఉచ్చారణలు ఉండవు. కొన్ని చోట్ల ఈరకంగా ఉచ్చరిస్తే అర్థభేదం కలుగుతుంది కూడా. ఉదా॥ఫలం (పండు), పలం (తూనికలో) మొదలైనవి. ఈకారణంవల్ల కోస్తాజిల్లా శిష్టుల భాషలో అల్పప్రాణాలు ప్రత్యేకవర్ణాలుగానే గుర్తించాలి.

నేటి వ్యవహారంలో 'థ' ప్రత్యేక వర్ణం కాదు. 'కథ', 'అర్థం' మొదలైన శబ్దాలన్నిటిలోనూ 'థ' వర్ణాన్ని శిష్టులు అంతటా 'ధ' వర్ణంగానే ఉచ్చరిస్తారు. విశిష్టులు 'థ' గానే ఉచ్చరించవచ్చు. కాని రోతను సూచించే ధ్వన్యనుకరణ శబ్దమైన 'థూథూ' లో మాత్రం 'థ' వర్ణోచ్చారణ వినిపిస్తున్నది. కాని ఇటువంటి అనుకరణశబ్దాలు (clicks) భాషలో చేరవని కొందరు శాస్త్రజ్ఞుల మతం.

ఊష్మాలు

స్థానిక నిరోధం లేకుండా ఒరవడితో వెలువడే ధ్వనులు ఊష్మాలు. స, శ, ష వర్ణాలన్నీ శ్వాసప్రయత్నం కలవి. హవర్ణం నాదప్రయత్నంతో ఏర్పడుతుంది. వీటి సవర్ణాల ఉచ్చారణ, స్థానకరణాలు:

/ఫ/: ఫ – స్థానం పైదంతాల అంచు; కరణం కింది పెదవి. అన్యదేశ్యాల్లో,

ఆంగ్లంనించి వచ్చి చేరిన శబ్దాల్లో ఈ వర్ణాన్ని ప, ఫ వర్ణాలకంటే భిన్నంగా శిష్టులుచ్చరిస్తారు. ఉదా: కాఫీ, ఆఫీసు, ఫస్టు మొదలైనవి.

/స/: స – స్థానం దంతమూలం; కరణం నాలుకఅంచు. సంస్కృతంలో లాగా ఇది దంత్యం కాదు. తకారం ఉచ్చరించిన వెంటనే సకారాన్ని ఉచ్చరించి చూసుకుంటే స్థానంలోని భేదం తెలుస్తుంది.

/శ/: శ – దీనికి స్థానం కఠిన తాలువు ముందుభాగం; కరణం పరవుగా ఉన్న నాలుక ముందుభాగం.

/ష/: ష – దీనికి స్థానం కఠినతాలువే. నాలుక ఇరువైపులా మడతబడి కఠినతాలువును తాకి గుండ్రంగా ఏర్పడ్డ అవకాశంగుండా ఈ ధ్వని వెలువడుతుంది. సంస్కృతంలోని ష కారం కేవల మూర్ధన్యం. ట, ర, డ, ఢ ల ఉచ్చారణ స్థానమే దీనికీ. నేటి తెలుగులో టకారం మూర్ధన్యమేగాని షకారం అదేచోట ఏర్పడదు. టకారోచ్చారణలో లాగ షకారోచ్చారణలో నాలుకను వెనక్కు మడతవేసి ఉచ్చరించం.

/హ/: హ – శ్వాసం. 'అంతః–పురం, దుః–ఖం' మొదలైనచోట్ల. అంటే సంయోగంలో పరుష స్పర్శవర్ణాల ముందు.

హ – నాదప్రయత్నం కలిగిన హకారం – పదాదిన, అచ్చులమధ్య. ఉదా. హల్లు, సహం, మొహం, మొదలైనవి.

మొదటిరకం హకారాన్ని సాంప్రదాయికంగా విసర్గతో రాస్తుంటాం. కాని ఉచ్చారణనుబట్టి దీన్ని హవర్ణధ్వనిగా నిరూపించటమే సుకరం. చాలామంది వ్యవహారంలో స, శ లు సవర్ణాలుగా వినిపిస్తాయి. అంటే చాలాచోట్ల స, శలు స్వతంత్రంగా ఒకదాని బదులు ఇంకొకటి వ్యవహారంలో మారటం కద్దు. ఉదాహరణకు: సగం, సాము, సున్నం, సూర్యుడు, సొంపు, సోకు, సిగ్గు, సీమ, సెగ, సేమ్యా – వీటిల్లో సకారమే వినపడుతున్నది. కాని శివుడు, శీతాకాలం, శుభం, శూలం, శోభనం మొదలైన శబ్దాల్లో మనం సంస్కృతసంప్రదాయాన్ని బట్టి 'శ' వర్ణం రాస్తున్నా, ఉచ్చారణలో మాత్రం ఇది అంతటా 'స' వర్ణం కంటే భిన్నమైందని చెప్పటానికి వీల్లేదు. అంటే – సివుడు, సీతాకాలం, సుభం, సూలం, సోభనం – అనే చాలామంది శిష్టులు ఉచ్చరిస్తున్నట్టు పరిశీలిస్తే తెలుస్తుంది. 'స' స్థానంలో 'శ' రాకపోయినా శకారం ఉచ్చరించవలసిన చోటల్లా

సకారం కూడా ఉచ్చరించటం అంతటా ఉంటే అప్పుడు స, శలు సవర్ణాలనే చెప్పవచ్చు. కాని కొందరు అధికసంస్కారవంతులు, భాషాపాండిత్యం కలవారు ఈరెండు ధ్వనుల ఉచ్చారణను వేరువేరుగానే ఉంచుతారు. కాబట్టి శిష్ట వ్యావహారికంలో వీటిని ప్రత్యేక వర్ణాలుగా గ్రహించటమే వాంఛనీయం. సంయోగంలో 'య' కారానికి ముందుకూడా స, శలను చాలామంది ఒకేరకంగా ఉచ్చరిస్తారు. సస్యం, హాస్యం, దృశ్యం మొదలైన చోట్ల స, శల భేదం శిష్టజన సామాన్యంలో లేదేమో. విశిష్టుల ఉచ్చారణలో ఉండవచ్చు.

స్పృష్టోష్మాలు

చ ఛ జ ఝ వర్ణాలు మొదట స్పర్శప్రయత్నం, చివర ఊష్మప్రయత్నం కలవి కాబట్టి స్పృష్టోష్మాలు (affricates) అనవచ్చు. ఒక్కొక్క దాని సవర్ణాలు:

/చ/: చ – తాలవ్యం. ఇ ఎ ఐ (హ్రస్వదీర్ఘా)ల ముందు వస్తుంది. చిలుక, చెక్కు, కుంచె, చేప.

చే – దంతమూలీయం. అ ఉ ఒ (హ్రస్వదీర్ఘా)ల ముందు. చేదువు, చేుక్క, చేొప్ప.

/జ/: జ – తాలవ్యం. తాలవ్యాచ్చుల ముందు (చూ. పైన). జిలుగు, జెల్ల, గజ్జె.

జే – దంతమూలీయం. కంఠ్యాచ్చులముందు (చూ. పైన). జేడ్డిగం జేట్టు, జేొన్న, /ఉ, ఊ/ల ముందుమాత్రం సామాన్యంగా 'జ' బదులు ఆంగ్లంలో వినిపించే 'z' లాంటి ధ్వనిగూడా తరచు వినిపిస్తుంది. ఉదా: రోజే, గాజే నాజేొకు,

/చ ఝ/ లు వచ్చే శబ్దాల సంఖ్య శిష్టుల భాషలో కూడా తక్కువ. గుంటూరు, నెల్లూరు మండలాలవారు మాత్రం 'పజ్ఝొనిమిది, మజ్ఝొన్నం' అనే చోట్ల ఉన్నది 'జ్ఝ' గాని 'ఝ్య' వర్ణసంయోగం గాదని గుర్తించాలి.

'ఆచారం, సమాచారం, చారు' మొదలైనచోట్ల 'చ' కు పరంగా 'ఆ' మనం రాస్తున్నా ఉచ్చారణను బట్టి అది తాలవ్య 'ఏ' వర్ణమే. 'చారు', 'వచ్చేరు' ఈరెంటి ఉచ్చారణను పోల్చి చూస్తే తెలుస్తుంది. అందుకని పైన చెప్పినట్టు తాలవ్యాచ్చుల ముందే చకారోచ్చారణం ఉంటుందన్న సూత్రానికి అవి అపవాదాలు కావు.

అనునాసికాలు

నేటి తెలుగులో 'ఙ, ఞ' లు ప్రత్యేకవర్ణాలు కావు. ఎందుకంటే ఎప్పుడూ సంయోగంలోనే కవర్గస్పర్శాలముందు ఙకారోచ్చారణ, కొన్ని 'చ' వర్గసవర్ణాల ముందు ఞకారోచ్చారణ నియతంగా వస్తుంది. ఈ స్థానాల్లో మరి ఏ అనునాసికాలూ ఉచ్చరించబడవు. అంటే –న్క, –ణ్క, –మ్క, –న్చ, –ణ్చ, –మ్చ, మొదలైన ఉచ్చారణలు కోస్తా వ్యవహారంలో లేవు. అందువల్ల 'ఙ, ఞ లు /న/ వర్ణానికి గాని, /మ/ వర్ణానికిగాని చెందిన ధ్వనులన్నప్పుడు 'ఇంక, సంగతి' అని మనం సాంప్రదాయికంగా రాస్తున్నవి, వర్ణవిధేయంగా రాస్తే /ఇన్క/, /సన్గతి/ అని రాయాలి. అప్పుడు /న/ వర్ణానికి క, గ ల ముందు ఙకారోచ్చారణ తప్ప నకారోచ్చారణ లేదని సూచించటంవల్ల ఈ మాటలను /ఇఙ్క, సఙ్గతి/ అనే ఉచ్చరించాలని తెలుస్తుంది.

తెలుగులోని అనునాసిక వర్ణాలకు భిన్న పరిసరాల్లో వచ్చే ఉచ్చారణలు (సవర్ణాలు):

/మ/: మ – ఓష్ఠ్యం, అనునాసికం, స్పర్శప్రయత్నం. పదాదిని, ద్విత్వం లోను, ఓష్ఠ్యస్పర్శాల ముందు. ఉదా. మాట, అమ్–ము, గమ్–ప.

వఁ – ఓష్ఠ్యం, అనునాసికం, ఊష్మప్రయత్నం. అద్విరుక్తంగా అచ్చుల మధ్య వచ్చినపుడు. పదాంత, వాక్యాంతాల్లోనూ, సయోగంలో వ, స, హ ల ముందు. ఉదా. మావఁ, ఉన్నావ్ఁ, సవ్ఁవత్సరవ్ఁ, సివ్ఁహవ్ఁ.

/న/: న̱ – దంత్యం. దంత్యస్పర్శాలముందు. ఉదా. అన్̱త. అన్̱దం.

ఞ – తాలవ్యం. తాలవ్య చ జ లముందు (చూ. స్పృష్టోష్మాలు). ఉదా. మఞ్చి, గఞ్జి.

ఙ – కంఠ్యం. సంయోగంలో కవర్గ స్పర్శాలముందు. ఉదా. సుఙ్–కం, శఙ్ఖం, సఙ్గతి, సఙ్ఘం.

న – దంతమూలీయం. దంతమూలీయ చే జే లముందు. పైన చెప్పినవిగాక మిగిలిన పరిసరాలన్నిటిలోను. ఉదా. మన్–చే, గున్–జా, నాన్న, పన్లేదు (పనిలేదు), సన్యాసి, అవున్రా.

పైన నిర్దేశించిన ధ్వనులన్నీ పరస్పర భిన్నస్థానాల్లోనే వస్తాయి కాబట్టి /న/ వర్ణానికి చెందిన సవర్ణాలుగా గ్రహించవచ్చు.

/ణ/ ణ – మూర్ధన్యం. అపదాదిని ద్విరుక్తంగాను, అద్విరుక్తంగాను, మూర్ధన్య స్పర్శాలముందు. ఉదా. అణా, దణ్ణం, గణ్ట, కణ్ఠం, కాణ్డ.

నేటి మన రచనా సంప్రదాయంలో ఉపయోగించే అనుస్వారం [ం] ప్రత్యేక వర్ణంకాదు. అనునాసికవర్ణాలైన /న, ణ, మ/ల బదులు కొన్ని పరిసరాల్లో ఉపయోగిందుకొనే లేఖనచిహ్నం మాత్రమే. సాధారణంగా పదాంత, వాక్యాంతాల్లోనూ, సంయుక్తాక్షరాల్లోనూ దీన్ని ఉపయోగిస్తుంటాం. పై ఉదాహరణలు చూస్తే మనం అనుస్వారాన్ని ఏవిధంగా భిన్నవర్ణాల స్థానంలో ఉపయోగిస్తున్నామో తెలుస్తుంది.

పార్శ్వికాలు

నాలుక ముందుభాగం తాలువువైపు పైకెత్తి రెండు వైపులగుండా గాలిని వెలువరించటంవల్ల ఈ వర్ణాలకి చెందిన ధ్వనులేర్పడుతున్నాయి.

/ల/: ల – దంతమూలీయం, పార్శ్వికం, నాదం, ఉదా. లాగు, కల, మల్లె.

/ళ/: ళ – మూర్ధన్యం, పార్శ్వికం, నాదం; కళ, కళ్ళెం.

వీటిలో /ళ/ వర్ణం, /ణ/ వర్ణంలాగానే పదాదిని ఉండదు. సాంప్రదాయిక వ్యాకర్తలు లఘ్వలఘు ప్రయత్నభేదాన్ని క్రమంగా ల ళ లకు ఆరోపించారు. కాని దీన్ని ప్రయత్నభేదం అనటంకంటె స్థానకరణాల్లోని భేదం అనటం సమంజసం.

రేఫ (కంపితం): దీనికి నేటి తెలుగులో భిన్నస్థానాల్లో రెండురకాల ఉచ్చారణ ఉంది.

/ర/: ర – దంతమూలీయం, శిథిలస్పర్శం లేక ఈషత్కంపితం, నాదం. పదాదిన, పదమధ్యంలో అద్విరుక్తంగానూ వచ్చినప్పుడు, సంయోగంలోనూ. ఉదా. రాజు, సరాసరి, క్రమం, తర్కం.

ఱ – దంతమూలీయం, అధికకంపితం, నాదం. ద్విరుక్తంగా వచ్చినప్పుడు. ఉదా. కఱ్ఱ, గొఱ్ఱె.

అంతస్థాలు

య, వ, లు: సంస్కృతంలో యకారోచ్చారణ అధికోష్మప్రయత్నంలో ఉండటంవల్ల ప్రాకృతాల్లో 'జ' కారంగా మారింది. కాని తెలుగులో యకారాన్ని తేలిగ్గా ఉచ్చరిస్తాం.

/య/: య – తాలవ్యం, శిథిలోష్మ ప్రయత్నం, నాదం. పదాదిని /అ ఆ ఉ ఊ ఒ ఓ/ ల ముందు, పదమధ్యంలో అద్విరుక్తంగాను, ద్విరుక్తంగాను. ఉదా. యముడు, యాతన, యుగం, యూరప్, యొక్క, యోగం, కాయ, అయ్య.

/వ/ [w]: వ – ఉభయోష్ఠ్యం, శిథిలోష్మ ప్రయత్నం, నాదం. అద్విరుక్తంగా ఉండి /అ ఆ/ లు పరంగా ఉన్నప్పుడు. ఉదా. వంట, వాడు.

[v]: వ఼ – దంతోష్ఠ్యం, శిథిలోష్మప్రయత్నం, నాదం. ద్విరుక్తిలోనూ, తాలవ్యాచ్చులు – ఇ, ఈ, ఎ, ఏ, లు పరంగా ఉన్నప్పుడు. ఉదా. వీడు, వేడి, వేళ, కవ్వం.

అచ్చులు

నేటి తెలుగులో స్వరవర్ణాలు ఆరు మాత్రమే; అ, ఇ, ఉ, ఎ, ఒ, <u>ఏ</u> లు; స్వరదీర్ఘతను '/:/' ప్రత్యేకవర్ణంగా గ్రహిస్తే దీర్ఘాచ్చులన్నీ రెండేసి వర్ణాలుగా వ్యాఖ్యానించుకోవాలి. అంటే ఆ = అ:(అకారం + దీర్ఘత) అని, అలానే ఈ ఊ లకు గూడా. అలా గ్రహించకపోతే హ్రస్వాచ్చులను, దీర్ఘాచ్చులను వేర్వేరు వర్ణాలుగా పరిగణించాలి. /<u>ఏ</u>/ వర్ణం [<u>ఏ</u>] ఎప్పుడూ దీర్ఘంగానే ఉంటుంది. ఉదా. <u>మే</u>డ, కొట్<u>టే</u>డు. మరొక పక్షంలో దీర్ఘాచ్చులను ఒక్కొక్కటి ఒక్కొక్క వర్ణంగానే గ్రహిస్తే వర్ణాల సంఖ్య పెరుగుతుంది. కాని ఈరకమైన విభజనలోనూ శాస్త్రవైరుధ్యం లేదు. ఈవ్యాసంలో హ్రస్వదీర్ఘాలు ప్రత్యేకవర్ణాలుగానే గ్రహించబడ్డాయి. వీటిలో ఇ, ఈ, ఎ, ఏ, <u>ఏ</u> లు తాలవ్యాచ్చులు, నిరోష్ఠ్యాలు. ఉ, ఊ, ఒ, ఓ లు కంఠ్యాచ్చులు, ఓష్ఠ్యాలు. అ, ఆ లు కంఠ్యాలు, నిరోష్ఠ్యాలు. ఓష్ఠ్యాచ్చుల ఉచ్చారణలో పెదవులు రెండూ వృత్తాకృతిలో ఉంటాయి. నిరోష్ఠ్యాచ్చుల ఉచ్చారణలో ఈప్రయత్నం ఉండదు. ఇ, ఉ లు సంవృతాచ్చులు. అ వివృతాచ్చు. ఎ, ఒ లు అర్ధసంవృతాలు. <u>ఏ</u> అర్ధవివృతం. పదాది స్వరవర్ణాలన్నీ, 'అ' వర్ణం పరాన వచ్చినప్పుడు

వివృతోచ్చారణను కలిగిఉంటాయి. ఉదా. గూడు-గూడ. మొదటి మాటలోని 'ఊ'కారం కంటే రెండోమాటలోని 'ఊ'కారం మరింత వివృతోచ్చారణతో ఉంటుంది. అలానే 'గోడు-గోడ, చిలుకు-చిలక, పెట్టు-పెట్ట': ఈజంటల్లో రెండోపదాల ఆద్యచ్చులు మొదటి పదాల ఆద్యచ్చులకంటె భిన్నంగా వినపడటం పరహల్లు మీద వచ్చిన వివృత 'అ' కారం వల్లనే. సంవృతాచ్చులైన ఇ, ఉ లు పరంగా ఉన్నప్పుడు పూర్వాచ్చుల్లో సంవృతోచ్చారణమే ఉండటం గమనించగలం.

/ఎ/: పదాంతస్థానంలో దీనికి కొన్ని మండలాల్లో అర్ధవివృతోచ్చారణ ఉంటుంది. (స్థానవివరాలకు చూ. పటం) ఉదా. గిన్నె, గరిటె, గొర్రె మొదలైనవి. పదాదిన అర్ధసంవృతంగానే ఉంటుంది. మెట్టు, పెట్టు మొదలైనవి. కాని రెండో అక్షరంలో 'అ' వర్ణం ఉన్నప్పుడు పైన చెప్పిన సూత్రాన్ని బట్టి అర్ధవివృతంగానే, అంటే 'ఎ' లాగానే వినిపిస్తుంది. చూ. మెట్ట-మెట్టు. ఇలా 'ఎ-ఎ' లు పరస్పర భిన్నపరిసరాల్లోనే వస్తాయి. కాబట్టి /ఎ/ వర్ణానికి సవర్ణాలుగా భావించవచ్చు.

నేటి తెలుగులో /ఏ/ ప్రత్యేకవర్ణం. ఉదా. 'కొట్టేవ్ సుమా', 'నిన్న కొట్టేవ్'. ఈరెండు వాక్యాల్లోను 'ఏ-ఏ'ల కనిష్ఠభేదంవల్లనే అర్థభేదం తెలుస్తున్నది. అందువల్ల వీటిని ప్రత్యేక వర్ణాలుగా లిపిలోగూడా చూపెట్టటం అవశ్యకం.

విరామం తర్వాతగాని, వ్యవధానం తర్వాత గాని వచ్చిన ఇ, ఈ, ఎ, ఏలకు ఉ, ఊ, ఒ, ఓ లకు క్రమంగా య, వ లు ముందు చేరతాయి. అంటే /ఇ/ వర్ణానికి 'యి-ఇ'లు సవర్ణాలు. సంధిలో 'ఇ' అనే సవర్ణం, సంధి లేని చోట 'యి' అనే సవర్ణం వినిపిస్తుంది. ఉదా. నీక్-ఇచ్చాడు, నీకే యిచ్చాడు. విరామం తర్వాత యిల్లు, యిక్కడ, యిప్పుడు మొదలైనవి. మిగిలిన అచ్చులకుగూడా ఈ విధంగానే అన్వయించుకోవాలి. ఈవిధంగా పరిసరభేదాన్నిబట్టి 'ఇ-యి' మొదలైనవాటిని /ఇ/ మొదలైన వర్ణాలకు సవర్ణాలుగా నిరూపించవచ్చు. కాబట్టి వర్ణవిధేయంగా రాసే రాతలో ఈ రెండింటికీ ఒకేగుర్తు - ఇక్కడ /ఇ/ అని - పెట్టుకుంటే సరిపోతుంది.

సాంప్రదాయికవర్ణ సమామ్నాయంలో ప్రత్యేక లిపి సంకేతాలతో చూపించే 'ఐ ఔ'లు (వక్రతమాలు) నేటి తెలుగులో 'అయ్, అవ్' లుగా, అంటే రెండేసి వర్ణాలుగా స్వీకరించటం లాఘవం దృష్ట్యా సమంజసం. ఉచ్చారణలో

'అయ్-ఐ'లకు 'అవ్-ఔ'లకు తెలుగులో భేదంలేదు. ఉదా. 'అయ్ను-ఐన', 'అవ్ను-ఔను'. కాకపోతే ఛందస్సులో యతిప్రాసల సందర్భంలో ఐ, ఔలు అచ్చు + హల్లుల లాగా గాక, దీర్ఘాచ్చుల (ఉదా. ఆ-ఓల) లాగా ప్రవర్తించటం వల్ల వాటిని ప్రత్యేకవర్ణాలుగా గుర్తించినా శాస్త్రవైరుధ్యం లేదు. అందుకనే లాఘవం, ఉచ్చారణ, ప్రమాణాలుగా తీసుకొన్నప్పుడు 'అయ్-అవ్'లుగానే గ్రహించటం సమంజసమన్నాను. అనుస్వార, విసర్గలు తెలుగువర్ణసమామ్నాయంలో చేర్చటం, సంస్కృతవ్యాకరణాల అనుసరణవల్లనే. వీటికి ఈవ్యాసంలో అన్యత్ర గతి కల్పించబడ్డది.

## వ్యవధానభేదాలు

సహజంగా మాట్లాడేటప్పుడు సన్నిహితవర్ణాల్లో ఒకదాన్నించి ఇంకొక దానికి ఉచ్చారణ ఉపక్రమించే పద్ధతి (transition)లో వచ్చే తేడాలనుబట్టి అర్థాలు మారుతుంటాయి. ఉదాహరణకు ఈ కింది వాక్యాల జంట చూడండి. 1. ఆ అమ్మాయి పాట్నాకు రాదు. 2. ఆ అమ్మాయి-పాట్నాకు రాదు. మొదటి వాక్యంలో 'ఆ అమ్మాయి పాట-నాకు రాదు' అని 'పాట' తర్వాత వ్యవధానం నిలపవచ్చు. కాని 'అమ్మాయి' శబ్దం తరువాత నిలపటానికి వీల్లేదు. రెండో వాక్యంలో 'ఆ అమ్మాయి-పాట్నాకు రాదు', అన్నప్పుడు 'పాట్నా' ఒక పట్టణం. మొదటివాక్యంలో లాగ కాక 'అమ్మాయి' పదం తర్వాత వ్యవధానం ఉండవచ్చు. 'పాట్నాకు' అన్నది ఏకపదం కాబట్టి దాన్లో ఉన్న వర్ణాలమధ్య ఉచ్చారణలో వ్యవధానం ఉండదు. అలాంటిదే ఇంకొక వాక్యాలజంట. 1. రెండ్-ఎడ్ల బండ్లు-తీసుకురా; 2. రెండెడ్ల బండ్లు-తీసుకురా. ఈరెండు వాక్యాలమధ్య ఉన్న అర్థభేదం తెలుగువాళ్ళందరికి విదితమే. నిదానంగా ఉచ్చరించే మొదటి వాక్యంలో సంధి చెయ్యకుండా 'రెండు-ఎడ్లబండ్లు' అనవచ్చు. కాని రెండో వాక్యంలో అలా నిలపటానికి వీల్లేదు. 'రెండెడ్లబండ్లు' అనే అనాలి. సహజోచ్చారణలో మనకు వ్యవధానాలు స్పష్టం కాకపోయినా, వాటి ఉనికి మరోవిధంగా అనుమేయమవుతుంది. అంటే, 'పాట్-నాకు' అన్నప్పుడు భిన్నపదాలైన 'పాట, నాకు' అనే రెండిటి మొదటి అక్షరాలమీద గట్టి ఊనిక (stress) ఉంటుంది. 'పాట్నాకు' అన్నది ఏకపదం కాబట్టి 'పా' మీదనే ఊనిక ఉంటుంది. అలానే 'రెండ్-ఎడ్లబండ్లు' అన్నప్పుడు '-' గుర్తుతో వేరుచేసిన రెండుపదాల మొదటి అక్షరాలమీద ఊనిక నిలుస్తుంది. 'రెండెడ్లబండ్లు'

ఏకపదంగా, లేక పదబంధంగా ఉచ్చరించినప్పుడు 'రెం' అన్నదాని మీదనే ఊనిక ఉంటుంది. అంటే, వాక్యంలో ఊనికలు నిలిచే పదాలన్నీ ముందుపదాల నించి తెగిపోతాయనీ, అటువంటిచోట్ల వ్యవధానం నిలుస్తుందనీ గుర్తించవచ్చు. ఇక రెండోరకమైన వ్యవధానం ఉపవాక్యాలచివర వచ్చేది. దీనికి గుర్తుగా /+/ గాని, కామా /,/ గాని పెట్టుకోవచ్చు. ఉదా. వాడూ–మావాడే + వీడూ– మావాడే. నోరు–మంచిద్–అయితే, ఊరు–మంచిద్–అవ్–తుంది. ఇల్లు–చిన్నద్–అయ్–నా, అద్దె–తక్కువేన్–గాదు.

ఇకమూడో రకమైన వ్యవధానం వాక్యాంతాన వచ్చేది. దీన్ని విరామం అనవచ్చు. వాక్యంమధ్య వచ్చే /,/ గుర్తుతో సూచించే వ్యవధానానికి దీనికి భేదం కాలపరిమితిలోను, కొన్ని స్వరస్థాయి భేదాల్లోను తెలుస్తుంది. వాక్యాంతాన ఎంతసేపు ఆపినా ఆపవచ్చును గాని వాక్యంమధ్య /,/ తర్వాత వ్యవధానం కొద్దిసేపే ఉంటుంది. పైపేరాలోని ఉదాహరణలు చర్చించి చూస్తే ఈ విషయం బోధపడుతుంది. వాక్యాంత విరామానికి ఇప్పుడు మనం పెట్టుకొంటున్న గుర్తే (చుక్క) /./ పెట్టుకోవచ్చు. ఇంతవరకు నేటి తెలుగులో మూడురకాలైన వ్యవధానభేదాలు అర్థభేదకాలుగా నిరూపించాను. సహజోచ్చారణలో వ్యవధానం లేకుండా వర్ణాలు రావటం నాలుగోరకం. అంటే ఇది పైజెప్పిన మూడుభేదాలకు చెందని వర్ణోపక్రమణ పద్ధతి కాబట్టి నాల్గోభేదంగా స్వీకరించాలి. దీన్నే సంస్కృత వ్యాకరణ సంప్రదాయంలో 'సంహిత' అన్నారు. ''వర్ణాల అతిశయితమైన సన్నిధి సంహిత'' అని వారి నిర్వచనం. ఉదా. అదెక్కడుంది? అన్నప్పుడు అన్ని వర్ణాలు వీలైనంత సన్నిహితస్థితిలో ఉన్నాయి. 'అది యెక్కడుంది?' అన్నప్పుడు 'ది–ఎ' వర్ణాలు మధ్య సంహిత లేదు. అందుకనే సంధి జరగక యడాగమం వచ్చింది. పై వాక్యంలో కలిపిచదివే మిగిలిన పదాల వర్ణాలన్నీ మామూలుగా సంహితాస్థితిలోనే ఉన్నాయి.

## స్వరాశ్రయభేదాలు

వాక్యస్వర (intonation) భాగాలుగా వచ్చే ఉచ్చ, నీచ, సమాహారాలు అనే స్థాయి భేదాలనుబట్టే మనకు వాక్యార్థం పూర్తిగా తెలుస్తున్నది. ఉదా: 'ఊళ్లో లేడు', 'ఊళ్ళో లేడు?'. ఈ రెండువాక్యాల్లో అచ్చులూ హల్లులూ సమానమే అయినా ఒక వాక్యం నిర్ధారణను, రెండోది ప్రశ్నను సూచించటం వాక్యస్వర భేదాన్నిబట్టే. పైన చెప్పిన మూడురకాల స్వరస్థాయి భేదాలకు 3 (ఉచ్చ),

1 (నీచ), 2 (సమాహరం) అనే అంకెలు గుర్తులుగా తీసుకుంటే, మొదటి వాక్యం చివర /2-2/, రెండో వాక్యం చివర /1-3/ ఉంటాయి. అంటే మొదటి వాక్యం సమస్వరంతో ముగుస్తుంది, రెండోవాక్యం ఉచ్చస్వరంతో ముగుస్తుంది. ఇంకో వాక్యం చూడండి. 'పోతే, పో'. ఈ వాక్యం చివరి స్వరం /3-1/ అని సూచించవచ్చు. అంటే వాక్యాంత స్వరం 3వ స్థాయినించి అధోముఖ మవుతుంది. నేటి తెలుగులో ఉపవాక్యాలు (clauses) అసమాపకాలుగా సూచించేవి చాలా వరకు ఈ స్వర స్థాయి భేదాలే. ఉదా. 'వాడు తెలిసినా, చెప్పడు'. 'వెళ్తే వెళ్ళేవ్ గాని, నాతో యెందుకు చెప్పలేదు?' ఇలాటి వాక్యాల్లో /,/ కు ముందు వినబడే స్వరసంయోజనాలను బట్టి వాక్యం పూర్తికాలేదని తెలుస్తుంది. అంటే వాక్యవిరామంతో అలాటి స్వరసంయోగాలు రావు. చెప్పదలుచుకొన్న వాక్యం పూర్తి అయిందా, లేక ఇంకా ఉందా అన్న సంగతి వాక్యస్వర భేదాలను బట్టే తెలుసుకుంటాం. ఏ భాషకన్నా వాక్యప్రకరణం (syntax) రాసేటప్పుడు వీటి ప్రవర్తనను సమగ్రంగా వర్ణిస్తేగాని వాక్య స్వరూపనిరూపణం సాధ్యంకాదు.

ముగింపు

భారతదేశం భాషారాష్ట్రాలుగా విభక్తమయింతర్వాత ఒక ప్రాంతంవారి భాషను మరొకప్రాంతం వారు నేర్చుకోవటంవల్లనే దేశైక్యం నిలుస్తుంది. ఈ ఉద్దేశంతోనే భారత ప్రభుత్వంవారు తెలుగు, తమిళ, కన్నడాలు బోధించటానికి కాశీ, అలహాబాద్, ఢిల్లీ, ఆగ్రా, మొదలైన విశ్వవిద్యాలయాల్లో ప్రత్యేకభాషా శాఖలు స్థాపించారు. భాషలను శాస్త్రీయ పద్ధతిలో బోధించటానికి అధునిక భాషాశాస్త్రజ్ఞానం అవశ్యకం.

ఈ వ్యాసంలో సూచించిన విషయాలు తెలుగువారికి సుపరిచితాలైనా, వాటి శాస్త్రీయ ప్రతిపాదన నూతనంగా తోచవచ్చు. మన భాషా నిర్మాణాన్ని అర్థం చేసుకోవాలన్నా, అన్యభాషా వ్యవహర్తలకు బోధించాలన్నా ధ్వనులను గురించి, వర్ణాలనుగురించి యిలాటి సమగ్రవర్ణనలు ఎంతైనా ఆవశ్యకం. ఏ భాషకైనా వర్ణసమామ్నాయంలో ప్రతివర్ణసహితోచ్చారణను చెప్పకుండా కేవలం వర్ణాల జాబితాను మాత్రం ఇస్తే కొత్తగా భాష నేర్చుకొనేవారికి, బోధించే వారికిగూడా దానివల్ల అట్టే ప్రయోజనం ఉండదు.

# 4
# సంధి

ఉచ్చారణం రెండు రకాలు: సంహితోచ్చారణం, వ్యవహితోచ్చారణం. సంహితోచ్చారణం అంటే మాటలు కలిపి మాట్లాడటం, లేదా కలిపి చదవటం. భాషావ్యవహారానికి ఇది సహజమైన స్థితి. మాటలు కలపకుండా విడివిడిగా ఉచ్చరించటం వ్యవహితోచ్చారణం. స్పష్టత అవసరమైనప్పుడు ఇలా చేస్తాం. ఒక భాషను ద్వితీయ భాషగా నేర్చుకొనేవాళ్ళు తొందరగా కలిపి మాట్లాడ (చదవ) లేరు. ఉదా. ఆయన-ఇప్పుడు-ఎక్కడ-ఉన్నాడు? అనేది సంహితోచ్చారణలో 'ఆయనిప్పుడెక్కడున్నాడు?' అంటాం. ఈ వాక్యంలో ఉన్న మాటలను విరిచి మరో విధంగా రాస్తే మన ఉచ్చారణలో ఒక్కొక్క మాట స్వరూపంలో ఏం జరిగిందో తెలుస్తుంది. అయన్-ఇప్పుడ్-ఎక్కడ్-ఉన్నాడు? అంటే అచ్చు పరంగా ఉన్నప్పుడు పూర్వస్వరాలు ఉచ్చారణలో వినిపించటం లేదు. ప్రత్యేకంగా ఈ పదాలను ఉచ్చరించినప్పుడు (అవసానంలో) గాని, వాక్యంలో పరాన అచ్చులు గాకుండా హల్లులు వచ్చినప్పుడుగాని, దీర్ఘాచ్చుల మీద వచ్చినప్పుడు గాని, వీటి చివరి అచ్చులు యథారూపంలోనే వినిపిస్తాయి; ఉదా. 'ఆయన కార్లో ఇప్పుడు కాలేజీకి వెళ్ళాడు.' రెండు పదాల మధ్యనేగాక ప్రకృతి ప్రత్యయాల మధ్యకూడా ఇలాంటి తేడాలు వినిపిస్తాయి. వాడికి ← వాడి + కి, వాణ్ణి ← వాడి + ని. ప్రకృతి ప్రత్యయాలు కలిసినప్పుడు మొదటి ఉదాహరణలో మార్పు లేదు, రెండోదాంట్లో

'వాడి' బదులు 'వాణ్' అని 'ని' బదులు 'ణి' అని ఉచ్చరిస్తున్నాం. ప్రకృతి ప్రత్యయాలను కలిపినప్పుడు స్పష్టతకోసం గూడా విసంహితోచ్చారణ ఉండదు.

పదాంశం అంటే అర్థవంతమైన కనిష్ఠరూపమనీ, పరిసర భేదాన్నిబట్టి ఏర్పడే పదాంశభేదాల్ని సపదాంశాలంటారనీ, పదనిర్మాణంలో ఇలాంటి పదాంశాలు ఒకటి గాని అంతకంటె ఎక్కువ గాని ఉంటాయని ముందుతెలుసుకుంటాం (చూ. 'పదం-పదాంశం', పేజీలు 51-61). తెలుగులో ఆగమనార్థకమైన ధాతు పదాంశాన్ని (వచ్ ~ వస్ ౦౦ రా) అని సూచించవచ్చు. సపదాంశాల మధ్య అన్యోన్యసంబంధం రెండు రకాలని నిరూపించవచ్చు. ఒకటి: సపదాంశాలన్నిటిని ఒక పట్టికగా ఇచ్చి ఒక్కొక్కటి ఏయే పరిసరాల్లో వస్తుందో సూచించటం.

1. వచ్చ్- ఇ, ఏ, ఏ లకు పూర్వం. వచ్చి, వచ్చే, వచ్చేడు
2. వస్- తా, తూ, తే లకు పూర్వం. వస్తాడు, వస్తూ, వస్తే
3. రా- (అ)న్, (అ)ని, (అ)క, మొదలైనవాటికి పూర్వం. రాన్, రాని, రాక మొదలైనవి.

ఈరకమైన పదాంశ నిరూపణ పద్ధతిని పట్టిక అంటారు. ఇలా కాక సపదాంశాల్లో ఒకదాన్ని ప్రాథమికంగా తీసుకొని, ఇతర సపదాంశాలను సూత్ర పద్ధతిలో దాన్నుంచి నిష్పన్నం చెయ్యవచ్చు. వచ్చ్, వస్, రా లలో వచ్చ్ అనే రూపం ప్రాథమికంగా తీసుకొన్నాం అనుకోండి. అప్పుడు వస్, రా లను సూత్ర ప్రాయంగా ఇలా నిష్పన్నం చెయ్యవచ్చు.

ద్విరుక్త 'చ' కారం త కారం పరమైనప్పుడు అద్విరుక్తచకారమై, తర్వాత సకారం అవుతుంది. అవర్ణంతో మొదలయ్యే ప్రత్యయం పరమైనప్పుడు 'వచ్చ్' కు 'రా' ఆదేశంగా వస్తుంది. ఈ సూత్రాలను సంకేతాలతో ఇంకా కురచగా రాయవచ్చు.

1. $హ_1\ హ_2 \rightarrow హ_2 / _ + హ_3$ (సంయుక్త హల్లుకు పరాన మరో హల్లు వస్తే, మొదటి హల్లు లోపిస్తుంది; ఉదా. చెప్తూ, చేయిస్తూ)
2. $చ్ \rightarrow స్ / _ + త్$
3. $వచ్చ్ \rightarrow రా / _ +$ { అన్ (తుమర్థం); అక (వ్యతిరేక అసమాపకక్రియ); అని (వ్యతిరేక విశేషణం) }

4. రా + అ → రా ( దీర్ఘాచ్చుకు ఒకేపదంలో హ్రస్వాచ్చు పరమైతే, హ్రస్వాచ్చు లోపిస్తుంది.)

ఇలాంటి వర్ణనను సూత్రవిధానం అంటారు. సాంప్రదాయికాలైన సూత్రాల్లో మొదటిది వచ్- →వస్- నిష్పత్తిలోనే కాకుండా మిగిలిన చోట్ల కూడా పనికి వస్తుంది. వేచి – వేస్తూ; కాచి – కాస్తూ; తెచ్చి – తెస్తూ (← తెచ్ + తూ ← తెచ్ + తూ). రెండో సూత్రం 'వచ్' కు ఆదేశంగా 'రా' వస్తుందని మాత్రమే సూచిస్తుంది. ఒకటి వర్ణాల మార్పును సూచించేది, రెండోది రూపంలో వచ్చే పూర్తి మార్పును సూచించేది. ఒకటి సామాన్యసూత్రం, రెండోది వైయక్తిక సూత్రం.

పై రెండు పద్ధతులకు ప్రయోజనం ఒకటే (పదాంశ నిరూపణ) అయినా వాటి విధానంలో చాలా తేడాలున్నాయి. సాంకేతికంగా చూపిస్తే –

పట్టికా పద్ధతి

పదాంశం : A; రూపాంతరాలు : a, b, c
క్రమంగా పరిసరాలు: X, Y, Z
A = {a, b, c}; A = a [X
b [Y
c [Z

[ = పరిసరాన్ని నిర్దేశిస్తుంది.

a, b, c లు వాటి పరిసరనిర్వచనంతో కలిపి ఒక పదాంశం అవుతుంది అన్నమాట .

a b c ల కంటే భిన్నమైన రూపం ఏదీ లేదు. A అనేది వాటి సామాన్యార్థాన్ని సూచించే ఊహాగమ్యమైనది, రూపరహితమైనది అయిన గుర్తు

సూత్ర పద్ధతి

ఈ పద్ధతిలో పదాంశానికి ఒక ప్రాథమికరూపం వ్యాకర్త ఊహిస్తాడు. దానికి A అని గుర్తు పెట్టుకుంటాడు. ఇది a b c లలో ఒక దాని రూపంతో తుల్యంగా ఉండవచ్చు, లేదా వాటికి భిన్నంగా నన్నా ఉండవచ్చు. అప్పుడు నిష్పత్తి సూత్రాలలో:

1. A → a / _ X

2. $A \rightarrow b / _ Y$

3. $A \rightarrow c / _ Z$

(పరిసరం X అయినప్పుడు 'A' 'a' గా మారుతుంది; Y అయినప్పుడు 'b' గా మారుతుంది; Z అయినప్పుడు 'c' గా మారుతుంది.)

రెండు పద్ధతుల ప్రయోజనాలు భాషలో రూపాంతరాలైన a, b, c ల ఐక్యాన్ని సూచించటమే. అయినప్పుడు ఏకకాలిక రూపాల్లో ఒకదానినుంచి మరొకటి వచ్చిందనటం వ్యాకర్త ఉద్దేశించి కొంత అపోహను కలిగించవచ్చు. అంటే నిజంగా వ్యక్తుల ఉచ్చారణలో 'వచ్చ్' 'వస్' గా మారిందని, 'వచ్చ్' 'రా' గా మారిందని. కాని ఇది చారిత్రకసత్యంగా నిరూపించలేము. ఒక కాలంలో ఉన్న ప్రాత, క్రొత్త, త్రోవ మొదలైన పదాలు 'ర'చ్యుతి వల్ల పాత, కొత్త, తోవ ఏర్పడ్డాయి. ఇది చారిత్రక సత్యం. ఈ మార్పులో

ర్ → ø /# హల్లు _ అచ్చు

పదాదిని (# గుర్తు తర్వాత) వచ్చే హల్లు (స్పర్శం)తో కలిసిన 'ర' వర్ణం లోపిస్తుంది- అంటే ర అభావం అవుతుంది- అని పై సూత్రార్థం. ఈసూత్రం భాషలో నిజంగా జరిగిన పరిణామాన్ని సూచిస్తుంది. సూత్రవిధానంలో చ్→ స్, వచ్చ్→ రా అనే సూత్రాలలో ఈపద్ధతి పాటించిన ఉద్దేశం, ప్రయోజనం చారిత్రక పరిణామాన్ని సూచించటంలేదు; సపదాంశాల ఏకత్వాన్ని నిరూపించటమే. ఈరకమైన అపోహకు దారి తీస్తుంది కాబట్టి పట్టికాపద్ధతే సూత్రపద్ధతికంటె భాషాస్వభావవ్యక్తీకరణకు ఉచితమైందని కొందరు శాస్త్రజ్ఞుల ఊహ. కాని సూత్రవిధానమే వర్ణనాలాఘవదృష్టితో బలీయమైందని చాలామంది శాస్త్రజ్ఞులు దాన్నే స్వీకరించారు. వర్ణనాత్మకవ్యాకరణంలో ఉపయోగించే సూత్రపద్ధతికి, చారిత్రకవ్యాకరణంలో ఉపయోగించే సూత్ర పద్ధతికి లక్ష్యంలో తేడాలుంటా యని గుర్తించినప్పుడు ఈ అపోహకు తావు లేదని చాలామంది శాస్త్రజ్ఞులంటారు. ఈ రెండు పద్ధతులను భాషావర్ణనలో ఉపయోగించవచ్చు.

పదాంశాలు (సపదాంశాల మొత్తం) కలిసి పదాలు, పదాలు కలిసి పద బంధాలు, పదబంధాలు కలిసి ఉపవాక్యాలు, ఉపవాక్యాలు కలిసి వాక్యాలు భాషలో ఏర్పడుతుంటాయి. వాక్యాన్ని అర్థహాని లేని చివరి దశవరకు వ్యాకరిస్తే లభించేవి పదాంశాలు. ఇవి నియతపద్ధతుల్లో కలిస్తేనే ఉత్తరోత్తర నిర్మాణ

భేదాలు ఏర్పడుతున్నాయి. సంహితోచ్చారణలో పదాంశాలవల్ల ఏర్పడే వర్ణ వికారసర్వస్వాన్ని సంధి అని నిర్వచింపవచ్చు. సూత్రపద్ధతిలో ఈ వర్ణవికారాలు సాధారణంగా మూడు రకాలు ఉంటాయి – లోపం, ఆగమం, ఆదేశం. (కత్తి : కత్తు–లు, గది : గదు–లు మొదలైన శబ్దాల్లో ఏకవచనం చివరి అచ్చు బహు వచనంలోని లువర్ణగతమైన ఉత్వానికి సమీకరణరూపంగా వచ్చినా, ఆదేశంగా చూపించవచ్చు)

ప్రకృతిప్రత్యయాల మధ్య జరిగేది పదమధ్యసంధి, ఉదా. గూడు : గూళ్ళు (← గూడు + లు ); రెండు పదాల మధ్య జరిగేది పదాంతసంధి. ఉదా. గూళ్ళేదు (← గూడు లేదు). పదమధ్యసంధి నిత్యంగా జరుగుతుంది, అంటే ఇక్కడ వ్యవహితోచ్చారణం సాధ్యం గాదు. పదాంతసంధి వ్యవహితోచ్చారణలో జరగదు 'గూడు లేదు' అని. వ్యవహారంలో 'గూళ్ళేదు' 'వాణ్ణాతో చెప్పాడు' అని మనం అన్నా రాసేటప్పుడు, స్పష్టతకోసం విరిచి మాట్లాడేటప్పుడు 'గూడు లేదు', 'వాడు నాతో చెప్పాడు' అని అనవచ్చు. లిఖితభాషకు వ్యవహారభాషకు ఈవిధమైన తేడా లుండటం అవసరం.

ఒకే పదాంశంలో సంధి జరగదు. ఒకటి కంటే ఎక్కువ పదాంశాలను కలిపి ఉచ్చరించినప్పుడు జరిగేదే సంధి. ఏయే వర్ణాలు, ఏపరిసరాల్లో ఎలా మారతాయో ఆమార్పుల సర్వస్వాన్ని కొన్ని సూత్రాల రూపంలో చెప్పేది సంధి పరిచ్ఛేదం. ఈమార్పులు ఏభాషలో అయినా క్రమబద్ధంగా నియతంగా ఉంటాయిగాని అవ్యవస్థితంగా ఉండవు. పదాంశాల కలయికవల్ల దగ్గరికి చేరిన వర్ణాలే కాక దూరంగా ఉన్నవి కూడా మార్పు చెందవచ్చు. ఇది గూడా సంధిలో భాగంగానే చెప్పుకోవాలి; ఉదా. ములికి + లు → ములికు + లు → ములుకు + లు. ఇక్కడ 'లి' లో ఇత్వం ఉత్వం కావటం 'ములికి' 'లు' అనే రెండు పదాంశాలను కలిపి ఉచ్చరించటంలో వచ్చింది కాబట్టి సంధివిషయమౌతుంది. సంధి అచ్సంధి అని హల్సంధి అని రెండు రకాలు. పదాంశాల అజ్వర్ణాల్లో మార్పులు వస్తే అచ్సంధి, హల్వర్ణాలో మార్పులు వస్తే హల్సంధి, రాముడు ఎక్కడ → రాముడెక్కడ (అచ్సంధి), సంస్కృతంలో తత్ చరిత్రమ్ → తచ్చరిత్రమ్ హల్సంధి. తెలుగులో పదాంశాలు కలిపినప్పుడు అచ్చులు హల్లులు గూడా మారటం తరుచు జరుగుతుంది: తాడు + లు → తాళ్ళు. ఉత్వలోపం అచ్సంధి, డ–ల లకు ళ్ళ ఆదేశం హల్సంధి. ఇది అజ్ఝల్ సంధి.

బహువచన నిర్మాణం

సాంప్రదాయికవైయాకరణులు తెలుగులో స్వరసంధిని అందులోనూ పరరూపసంధినే గుర్తించారు. త్రాడు + లు → త్రాళ్ళు, గూడు + లు → గూళ్ళు మొదలైన చోట్ల హల్సంధిని ఎందుచేతనో గుర్తించలేదు.

నేటి తెలుగులో బహువచన ప్రత్యయమైన పదాంశం రెండు రూపాలతో వినిపిస్తుంది ( లు ~ ళు). మూర్ధన్యం తరవాత ళు, ఇతరత్రా లు, ఉదా. గూళ్ళు, తాళ్ళు, గుళ్ళు, కొడవళ్ళు, బొమ్మలు, నగలు, చీరెలు మొదలైనవి. బహువచన ప్రత్యయం చేరినప్పుడు ప్రాతిపదికప్రత్యయాల్లో జరిగే మార్పులాధారంగా తెలుగులోని నామపదాలను ఈకింది తరగతులుగా విభజించవచ్చు.

1. ప్రత్యయంలోనూ, ప్రాతిపదికలోనూ మార్పులేనివి. దీర్ఘాచ్చు చివర ఉన్నవన్నీ నిశ్శేషంగా ఈ తరగతికి చెందుతాయి. ఉదా. కిలోలు, పోటీలు. చివరి అచ్చు అ.

| ఏక. | బహు. |
|---|---|
| బొమ్మ | బొమ్మ-లు |
| గోడ | గోడ-లు |
| తోట | తోట-లు |

2. (a) ప్రాతిపదికల చివరి ఇ, ఉ, లు—మూర్ధన్యవర్ణాలైన ట, డ, ంట, ండ లకు పరంగా ఉన్నవి—లోపిస్తాయి.

| | |
|---|---|
| కోటి | కోట్-లు |
| చోటు | చోట్-లు |
| బంటు | బంట్-లు |
| గూడు | గూడ్-లు |
| తమ్ముడు | తమ్ముడ్-లు |
| గుడి | గుడ్-లు |
| బండి | బండ్-లు |
| పండు | పండ్-లు |

3. (a) రెండక్షరాల మాటల్లో దీర్ఘాచ్చుకు పరంగా ఇ, ఉ లతో కలిసిన ల, ర లకు ఆదేశంగా మూర్ధన్యడకారం వస్తుంది; చివరి అచ్చులోపిస్తుంది.

| | |
|---|---|
| ఊరు | ఊడ్-లు |
| కాలు | కాడ్-లు |
| మైలు | మైడ్-లు |

(అపవాదాలు కార్లు, -గార్లు, మొదలైనవి)

3. (b) డకారం లకారం పరంగా ఉన్నప్పుడు ళకారం అవుతుంది. పై రూపాలు ఊళ్-లు, కాళ్-లు, మైళ్-లు, గూళ్-లు, తమ్ముళ్-లు అవుతాయి.

3. (c) మూర్ధన్యవర్ణపరమైన లకారం మూర్ధన్యమౌతుంది. ఊళ్ళు, కాళ్ళు, మైళ్ళు, గూళ్ళు, తమ్ముళ్ళు.

4. ప్రాతిపదిక చివరి మూర్ధన్యద్విరుక్త ట,డ లు బహువచనప్రత్యయం ముందు అద్విరుక్తమౌతాయి. (చివరి అచ్చు లోపం పైసూత్రంవల్ల.)

| | |
|---|---|
| చెట్టు | చెట్-లు |
| రెడ్డి | రెడ్-లు |

5. హ్రస్వాచ్చు పరాన ఉన్న -న్ను, -ల్లు, లు, రెండక్షరాల కంటె ఎక్కువ ఉన్న మాటల్లో చివరి -లి, -లు వర్ణాలు, బహువచనానికి ముందు -ండ్‌గా మారుతాయి.

| | |
|---|---|
| పన్ను | పండ్-లు |
| ముల్లు | ముండ్-లు |
| కన్ను | కండ్-లు |
| చెల్లెలు | చెల్లెండ్-లు |
| కొడవలి | కొడవండ్-లు |

6. చివరి -ం లోపించి, పూర్వ హ్రస్వాచ్చు దీర్ఘమౌతుంది. పూర్వాన ఉన్న ఎ, ఏ గా మారుతుంది.

| | |
|---|---|
| గుర్రం | గుర్రాలు |
| పెండ్లాం | పెండ్లాలు |
| పందెం | పందేలు |
| గొళ్లెం | గొళ్లేలు |

7. అకారేతరాచ్చుకు పరంగా ఉన్న 'య్యి' వర్ణం బదులు 'తు' వస్తుంది, పూర్వాచ్చు దీర్ఘమౌతుంది.

| | |
|---|---|
| చెయ్యి | చేతు-లు |

| | |
|---|---|
| గొయ్యి | గోతు-లు |
| నుయ్యి | నూతు-లు |

8. ప్రాతిపదికల చివరి ఇ, ఉ గా మారుతుంది. అంతకు ముందున్న ఇ కూడా పదాది కాకపోతే ఉ గా మారుతుంది; ఇది తత్సమేతరాల్లో మాత్రమే.

| | |
|---|---|
| బావి | బావు-లు |
| పులి | పులు-లు |
| సంగతి | సంగతు-లు |
| మనిషి | మనుషు-లు |
| కొలిమి | కొలుము-లు |
| సమితి | సమితు-లు |
| ప్రతినిధి | ప్రతినిధు-లు |
| వరిధి | వరిధు-లు |

9. 'ండ్లు' కు ఆదేశంగా కొన్ని మాండలికాల్లో ళ్ళు వస్తుంది. ఇండ్లు → ఇళ్ళు, వండ్లు → వళ్ళు, మొదలైనవి. ఇది శబ్దసిద్ధమైన 'ండ్లు' కు కూడా వర్తిస్తుంది. గొండ్లెం[గొండ్ళెం] → గొళ్ళెం, పెండ్లి[పెండ్ళి] → పెళ్ళి, మొదలైనవి.

10. పైసూత్రాలు వర్తించని అపవాదరూపాలు (irregular forms):

| | |
|---|---|
| రాయి | రాళ్ళు |
| పొయ్యి | పొయ్యిలు |
| పెండ్లి | పెండ్లిండ్లు |
| వరి | వడ్లు |
| -గారు | -గార్లు |
| ఎద్దు | ఎద్దులు, ఎడ్లు |
| వెయ్యి | వేలు |
| చేను | చేలు |
| పేను | పేలు |
| ఏడు | ఏండ్లు |
| పువ్వు | పూలు |

తెలుగులో బహువచననిష్పత్తికి పైన ఇచ్చిన సూత్రాలు సమగ్రం కాదు. మచ్చుకు సూచించినవే.

# 5

# నేటి తెలుగులో హల్సంధి

అవ్యవహితోచ్చారణలో దగ్గరగా ఉన్న రెండుమూడువర్ణాల్లో వచ్చే లోపాదేశాదికార్యాలను 'సంధి' అనవచ్చు. తెలుగులో గ్రంథస్థమైన ప్రాచీన కావ్యభాషను పరిశీలిస్తే హల్సంధులకంటే, అచ్సంధులే బహుళంగా కనబడతాయి. రెన్నాళ్ళు, వేన్నీళ్లు ఇత్యాదులు సాధువులుగా మన ప్రాచీన వ్యాకర్తలు సాధించారు; కాని అలాటి మార్పులు ఒక్క 'డ–న' ల మధ్యనేగాక సజాతీయాలైన మిగిలిన హల్లుల మధ్యగూడా చాలాకాలం కిందటే ఏర్పడి ఉండవచ్చు. ఇప్పటి కోస్తా జిల్లాల్లో ఉన్న శిష్టుల (విద్యావంతులైన నడిమితరగతి నాగరికుల) వ్యవహారం మాత్రమే ఈ వ్యాసానికి ఆధారం. వీరి వ్యవహారంలో హల్సంధి చాలా ఎక్కువగా ఉంటుంది. హ్రస్వాచ్చుకు ఇరువైపులా ఉన్న హల్లుల్లో –అచ్చులోపించి–చాలా రకాల మార్పులొస్తాయి. అమార్పుల్ని ఈ కింది విధంగా విభజించొచ్చు.

ఒకటోరకం మార్పు

$హ_1$ అ $హ_2 \rightarrow హ_1 హ_2$

ఈ సూత్రాని కర్థం: పూర్వపర హల్లుల్లో మార్పేమీ రాదు. మధ్యనున్న అచ్చు లోపించటంవల్ల ఈ హల్లులు రెండూ కలిసి సంయుక్తాక్షరంగా మార్తాయి; అ = హ్రస్వాచ్చు; దీనికి ముందూ వెనకా ఉన్న వర్ణాలు హల్మాత్రాలుగానే

గ్రహించాలి. (హ$_1$ కి పూర్వాన, హ$_2$ కు పరాన అచ్చులుండాలి.)

ఉదా. a. ట అ ర → ట్ర మాట్రాడు

డ అ ర → డ్ర వాడ్రాడు

b. ప అ మ → ప్మ కడుప్మంట

బ అ మ → బ్మ గులాబ్మొగ్గ

c. న అ త → న్త దాన్తో ఏం పని?

న అ ద → న్ద ఇచ్చిన్దాన్తో తృప్తిపడు

న అ జ → న్జ పన్జరగదు

న అ ర → న్ర మన్రాముడు

న అ ల → న్ల విన్లేదు

d. ర అ న → ర్న వార్నే చూశాను

ర అ ల → ర్ల మార్లేదు

e. ల అ త → ల్త కాల్తో తన్నాడు

ల అ ద → ల్ద కయ్యానికాల్దువ్వాడు

ల అ చ → ల్చ పాల్చెంబు

ల అ జ → ల్జ గాజుల్జత

ల అ న → ల్న ఈ మాటల్నెందుకు?

ల అ ర → ల్ర పాల్రాయి

రెండోరకం మార్పు

హ$_1$ అ హ$_2$ → హ$_2$ హ$_2$

హ్రస్వాచ్చు లోపించి దానికి పూర్వాన ఉన్న హల్లు (హ$_1$) పరహల్లు (హ$_2$) గా మారిపోతుంది.

a. కంఠ్యాలు

క అ క → క్క పెరుక్కో!

గ అ క → క్క అడుక్కో!

గ అ గ → గ్గ తరుగ్గా ఉంది

క అ గ → గ్గ చెరుగ్గడ

b. తాలవ్యాలు

| | | | | |
|---|---|---|---|---|
| చ అ చ | → | చ్చ | లేచ్చెప్పు! (లేచి + చెప్పు) |
| జ అ చ | → | చ్చ | జాచ్చెట్టు |
| జ అ జ | → | జ్జ | గాజ్జాడీ |
| చ అ జ | → | జ్జ | లేజ్జిడిసిపొయ్యాడు ( లేచి + జిడిసి...) |

c. దంత్యాలు

| | | | |
|---|---|---|---|
| త అ త | → | త్త | పాత్తలుపు (పాత+ తలుపు) |
| ద అ త | → | త్త | ఎవరిత్తీశావ్? (ఎవరిది+ తీశావ్?) |
| ద అ ద | → | ద్ద | నాద్దేనికితెచ్చావ్? (నాది+దేనికి) |
| త అ ద | → | ద్ద | పాద్దారం (పాత+ దారం) |

d. దంత్యం + తాలవ్యం

| | | | |
|---|---|---|---|
| త అ చ | → | చ్చ | పాచ్చెప్పు |
| ద అ చ | → | చ్చ | గేచ్చర్మం (గేదె+చర్మం) |
| త అ జ | → | జ్జ | రాజ్జాడీ (రాతి+ జాడీ) |
| ద అ జ | → | జ్జ | సూజ్జారిపోయింది (సూది+ జారి) |

e. మూర్ధన్యాలు

| | | | |
|---|---|---|---|
| ట అ ట | → | ట్ట | నాట్టం (నాటటం) |
| డ అ ట | → | ట్ట | పాట్టం (పాడటం) |
| డ అ డ | → | డ్డ | పాడ్డం (పాడడం) |
| ట అ డ | → | డ్డ | నాడ్డం (నాటడం) |

f. ఓష్ఠ్యాలు

| | | | |
|---|---|---|---|
| ప అ ప | → | ప్ప | కొప్పడ్డాడు |
| బ అ ప | → | ప్ప | జలుప్పట్టింది |
| బ అ బ | → | బ్బ | బాబ్బాబు! |
| ప అ బ | → | బ్బ | నాబ్బండ (నావ+ బండ) |

పూర్వ పర హల్లులు ఒకే విధంగా ఉన్నప్పుడు హ$_1$ హ$_2$ యథాతథంగానే ఉంటాయన్నా, లేకపోతే 'హ$_1$' 'హ$_2$'గా మారుతుందన్నా చిక్కులేదు.

| | | | |
|---|---|---|---|
| న అ న | → | న్న | విన్ను ('వినను) |

మ అ మ → మ్మ భూమ్మీద (అ)
ల అ ల → ల్ల నెల్లు (నెలలు); కల్లు (కలలు)
ర అ ర → ర్ర వార్రాలేదు
వ అ వ → వ్వ బావ్వెల్లాడు
స అ స → స్స చూస్సరిగా చెప్పు (చూసి+సరిగా)

మూడోరకం మార్పు

హ్$_1$ అ హ్$_2$ → హ్$_3$ హ్$_3$

ఇక్కడ సంధివల్ల ఏర్పడ్డ ద్విత్వమైన హ్$_3$ హ్రస్వాచ్చుకు ముందూ వెనకా గల రెండు హల్లుల కన్నా భిన్నమైంది. పూర్వహల్లు 'డ' వర్ణం, పరహల్లు 'న' కాని, 'ల' కాని అయినప్పుడు సంధివల్ల ఏర్పడ్డ వర్ణాలు క్రమంగా ''ణ్ణ', 'ళ్ళ' లుగా ఉంటాయి.

a. డ అ న → ణ్ణ వాణ్ణి, మూణ్ణెల్లు
b. డ అ ల → ళ్ళ చూళ్ళేదు, వాళ్ళేడు

నాల్గోరకం మార్పు

ఈ కింది మార్పు ధ్వని శాస్త్రజ్ఞులు తప్ప సాధారణులు గుర్తించటం కొంత కష్టం. హ్$_1$ అ హ్$_2$ → హ్$_3$ హ్$_2$ లేక హ్$_1$ హ్$_3$

హ్రస్వాచ్చు లోపించగానే పూర్వహల్లుగాని, పరహల్లుగాని మరొక వర్ణం (హ్$_3$)గా పరిణమిస్తుంది. దీన్ని బట్టి మూర్ధన్యవర్ణంతో కలిసే 'న-ల'లు 'ణ-ళ'లుగా మార్తాయి. కొందరి ఉచ్చారణలో ఈ మార్పు కన్పించదు.

a. న అ ట → ణ్ట విణ్టం (వినటం)
న అ డ → ణ్డ నూణ్డబ్బా (నూనె + డబ్బా)
ల అ ట → ళ్ట చాళ్టంలేదు
ల అ డ → ళ్డ పాళ్డబ్బా (పాల డబ్బా)
b. ట అ న → ట్ణ పాట్ణాకురాదు (పాట + నాకు)
ట అ ల → ట్ళ నోట్ళోనుంచి మాట్రాడు

పైన నిరూపించిన మార్పులన్నిట్నీ ఈకింది విధంగా ఒక పటంలో చూపించవచ్చు: హ్$_1$ = పూర్వ హల్లు; హ్$_2$ = పరహల్లు; వీటి సంధివల్ల ఏర్పడే

వర్ణాలు (ద్విత్వాలు, సంయుక్తాలు) ఆరెండు వరసలూ కలిసేచోట ఇవ్వబడ్డాయి. సంధి లేని చోట్ల మధ్యాచ్చు నిల్చి ఉంటుందని ఊహించుకోవాలి.

| | హ్$_2$ | క | గ | చ | జ | ట | డ | త | ద | ప | బ | న | మ | ల | ర | వ | స |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| హ్$_1$ | | | | | | | | | | | | | | | | | |
| క | | క్క | గ్గ | | | | | | | | | | | | | | |
| గ | | క్క | గ్గ | | | | | | | | | | | | | | |
| చ | | | | చ్చ | జ్జ | | | | | | | | | | | | |
| జ | | | | చ్చ | జ్జ | | | | | | | | | | | | |
| ట | | | | | | ట్ట | డ్డ | | | | | ట్న | | ట్ళ | ట్ర | | |
| డ | | | | | | ట్ట | డ్డ | | | | | ణ్ణ | | ళ్ళ | డ్ర | | |
| త | | | | చ్చ | జ్జ | | | త్త | ద్ద | | | | | | | | |
| ద | | | | చ్చ | జ్జ | | | త్త | ద్ద | | | | | | | | |
| ప | | | | | | | | | | ప్ప | బ్బ | | ప్మ | | | | |
| బ | | | | | | | | | | ప్ప | బ్బ | | బ్మ | | | | |
| న | | | | న్చ | న్జ | ణ్ట | ణ్డ | న్త | న్ద | | | న్న | | న్ల | న్ర | | |
| మ | | | | | | | | | | | | | మ్మ | | | | |
| ల | | | | ల్చ | ల్జ | ళ్ట | ళ్డ | ల్త | ల్ద | | | ల్న | | ల్ల | ల్ర | | |
| ర | | | | | | | | ర్త | ర్ద | | | ర్న | | ర్ల | ర్ర | | |
| వ | | | | | | | | | | | | | | | | వ్వ | |
| స | | | | | | | | | | | | | | | | | స్స |

ప్రాచీనవ్యాకర్తలు గ్రాంథికభాషలో చూపించిన నియతి లాటిదే జీవద్భాషలోనూ 'సహజస్థితిలో గోచరిస్తుందని నిరూపించటమే ఈ వ్యాసానికి ఉద్దేశం. ఈ విధంగా ఇతర వ్యాకరణకార్యాలు గూడా అన్ని మాండలికాల్లోనూ సమగ్రంగా పరిశీలించటం ప్రమాణాంధ్రవ్యాకరణ నిర్మాణానికి మొదటి మెట్టు.

# 6

# పదం – పదాంశం

## వాక్యం - పదం

భాషావ్యాపారంలో మనం సాధారణంగా అనేవి, వినేవి వాక్యాలుగానే ఉంటాయి. ఈ వాక్యాలు కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి. ఎంత చిన్న వాక్యమైనా ఒక పదంకన్నా తక్కువ పరిమాణంలో ఉండటానికి వీల్లేదు. ఉదాహరణకు, 'అది ఎవరి ఇల్లు?' అని ప్రశ్నిస్తే దానికి జవాబుగా 'మాది' అనవచ్చు. ఇది ఏక పదమైనా వాక్యమనే చెప్పాలి; అంటే 'అది మాది' అనే సంపూర్ణ వాక్యానికి సంక్షిప్త రూపం.

వాక్యానికి కనిష్ఠ రూపం పదమైనా ప్రతిపదాన్ని సందర్భవిరహితంగా వాక్యం అనటానికి వీల్లేదు. ఒకకోశంలో ఉన్న పదాలను ఒకదాని తరవాత ఒకటి చదివినప్పుడు అవి వాక్యాలుకావు. స్థూలంగా వాక్యాన్ని నిర్వచించవలసివస్తే 'రెండు విరామాలమధ్య సహజమైన వ్యవహారంలో ఏర్పడే వాగ్రూపం' అనవచ్చు. అంటే ప్రతివాక్యానికీ ముందూ చివరా విరామం, నిశ్శబ్దత హద్దులుగా ఉంటాయి. ఈ హద్దులమధ్య ఉన్న వాగ్వ్యాపారానికి (అంటే వాక్యానికి) అంతకుముందు, ఆ తరువాత వచ్చే వాక్యాలకు నిర్మాణాత్మకమైన సంబంధం నిరూపించటం సాధ్యంకాదు. అంటే భాషావ్యవహారంలో ఒక వాక్యం పూర్తి

అయిన తరువాత దాని స్వరూపాన్నిబట్టి ఆ తరువాత వచ్చే వాక్యం స్వరూపం ఎలా ఉంటుందో నిర్ణయించలేము.

వాక్యం అర్థవంతంగా ఉంటుంది. కేవలం పదసంయోజనవల్లనే వాక్యా లేర్పడవు. అర్థరహితమైన వాక్యాలు సహజమైన భాషావ్యవహారంలో ఉండవు. పదం వాక్యానికి సంక్షిప్తరూపం అన్నాం కాబట్టి ప్రతిపదమూ అర్థవంతంగానే ఉండాలి.

పదాంశ నిర్ణయం

తరచుగా పదంలో భాగాలకు–పదాంశాలకు–వ్యవహర్తలు ఊహించదగిన అర్థాలుంటాయి. ఉదాహరణకు 'బొమ్మలు' అనే పదంలో రెండు అర్థవంతమైన పదాంశాలున్నాయి. 1. బొమ్మ; 2. లు (బహువచన ప్రత్యయం). 'బొమ్మ'ను అంతకంటె చిన్న ముక్కలుగా 'బ్–ఒ–మ్–మ్–అ' అని విడగొడితే దాని అర్థం పోతుంది. అందువల్ల తెలుగులో 'బొమ్మ' అర్థవంతమైన కనిష్ఠరూపం. అలానే ఒకటి కంటే ఎక్కువ సంఖ్యనుగురించి మాట్లాడేటప్పుడు నామానికి 'లు' చేరుస్తాం. దీని అర్థం బహువచనబోధకత. దీన్ని 'ల్–ఉ' అని ఇంకా చిన్న ముక్కలుగా విడగొట్టి అదేవిధంగా ఒక్కొక్కముక్కకు వేరే అర్థం నిరూపించటం సాధ్యంకాదు. అందువల్ల '-లు' కూడా తెలుగులో అర్థవంతమైన కనిష్ఠ రూపమనే చెప్పాలి. 'బొమ్మ', 'లు' అనే రెండు ముక్కలనూ కలపటంవల్ల 'బొమ్మలు' అనే పదం ఏర్పడ్డది. 'బొమ్మ' అన్నా పదమే అవుతుంది. కాని '-లు' పదంకాదు. ఎందుకంటే, ఏ సందర్భంలోనూ 'లు' ఒక వాక్యానికి సంక్షిప్త రూపంగా ఉపయోగించలేం కాబట్టి. భాషలో ఉన్న పదాలన్నిటినీ అర్థవంతమైన కనిష్ఠాంశాల కింద విభజించటానికి సాధ్యమైన ప్రతిముక్కను పదాంశం అందాం. ఇలాంటి పదాంశాలు ఒక నియతమైన క్రమంలో కలియటంవల్ల పదా లేర్పడతాయి. 'బొమ్మ-లు' పదం, కాని 'లు-బొమ్మ' పదంకాదు. ఒక్కొ క్కప్పుడు ఒక పదాన్ని అంతకంటే చిన్నముక్కలుగా విడగొట్టటానికి సాధ్యం కానప్పుడు అదే పదాంశం కూడా అవుతుంది. దీన్ని బట్టి ఒకే పదం పదాంశంకూడా కావచ్చు. కాని ప్రతిపదాంశమూ పదంతో తుల్యం కాదు. 'బొమ్మ' ఒకపదం, ఒక పదాంశం; 'బొమ్మలు' ఒక పదం, రెండు పదాంశాలు, '-లు' పదాంశమే కాని పదంకాదు.

పై చర్చనుబట్టి భాషలో అర్థవంతమైన కనిష్ఠరూపం పదాంశమని నిర్వచించ వచ్చు. కేవల వర్ణాలయిన అ,ఆ, ఇ,ఈ, క,గ, చ,జ మొదలైనవాటివల్ల పదాలు ఏర్పడుతున్నా వాటికి అర్థం లేదు కాబట్టి అవి పదాంశాలు కావు. తెలుగు వర్ణ సమామ్నాయంలో 'ఆ' ఒక వర్ణం; కాని 'వాడా?' పుస్తకమా?' 'వస్తాడా?' మొదలైన వాక్యాల్లో చివర చేరిన 'ఆ' ప్రశ్నార్థాన్ని సూచిస్తుంది. ఇది అర్థవంతమైంది కాబట్టి ఏకవర్ణమైనా పదాంశమే. ఒక పదాంశం పొడవు ఒక వర్ణం మొదలు అనేక (పది పదిహేను) వర్ణాలదాకా ఉండవచ్చు.

## పదాంశం - సపదాంశం

కొన్ని పదాంశాలెప్పుడూ వాక్యపరిసరాలు మారినా రూపంలో ఏవిధమైన మార్పూ లేకుండా వస్తాయి. నేటి తెలుగులో దీర్ఘాచ్చు చివర ఉన్న పదాంశాలన్నీ స్థూలంగా ఈ తెగకు చెందినవి. ఉదా.జరీ, దగా, లంగా, లుంగీ, పకోడీ ఇలాంటివి. ఆంగ్లంలో box, tree, cat, fan మొదలైనవి ఎక్కడ వచ్చినా ఒకేరూపంతో ఉంటాయి. కాని కొన్ని పదాంశాలు పరిసర భేదాన్నిబట్టి రూపభేదాన్ని పొందుతాయి. ఉదా. 'వచ్-ఇ' (=వచ్చి) క్త్వార్థకం, రెండు పదాంశాలు; 'వస్-తూ' (=వస్తూ) శత్రర్థకం, రెండు పదాంశాలు. ఈ పదాంశాల్లో ఆగమనార్థకమైన ధాతువు అచ్చుకుముందు 'వచ్' అనీ, 'త' వర్ణానికి ముందు 'వస్' అనీ రెండు రూపాలతో కనిపిస్తున్నది. ఈ విధమైన రూపభేదమున్నా ధాత్వర్థంలో మార్పేమీ లేదు. అంటే, 'వచ్చి-వస్తూ' అనే పదాలకు వేరు వేరు అర్థాలు క్త్వార్థక, శత్రర్థక ప్రత్యయాలయిన 'ఇ-తూ' ల వల్ల ఏర్పడ్డవికాని ధాతువులో ఉన్న రూపభేదాన్నిబట్టి కాదు. అందువల్ల ఒక పదాంశానికి ఒకటి కంటె ఎక్కువ రూపాలు, పరిసరాల (ముందూ వెనకా ఉన్న వర్ణాల) భేదాన్నిబట్టి ఏర్పడవచ్చు. అర్థంలో మార్పు రాకుండా ఏర్పడ్డ రూపాంతరాలను సపదాంశాలనవచ్చు. ఒకే వర్ణం పరిసరాలను బట్టి చాల రకాలు (సవర్ణాలు)గా ఉచ్చరించినట్లు, ఒకే పదాంశం పరిసరభేదాన్నిబట్టి భాషా వ్యవహారంలో రూపాంతరాల (సపదాంశాల)తో ప్రవర్తిస్తుంది.

## పదాంశం - అర్థస్వరూపం

ప్రతి పదాంశమూ అర్థవంతంగా ఉండాలని చెప్పాం. కొన్ని చోట్ల అర్థం స్పష్టంగా ఉంటుంది. కొన్ని చోట్ల అర్థం ఉన్నదని మనకు తెలిసినా దాన్ని

స్పష్టీకరించటం క్లిష్టమవుతుంది. నామాలు, క్రియలూ, విశేషణాలూ అయిన పదాంశాల (ఉదా. ఇల్లు, వచ్చు, గొప్ప మొదలైనవాటి) అర్థాలు వ్యవహర్తలు చప్పున గ్రహించగలరు. వ్యక్తీకరించగలరు కూడా. కాని బహువచన '-లు', క్త్వార్థక '-ఇ', శత్రర్థక '-తూ' మొదలైన వాటి అర్థాలను శాస్త్రజ్ఞుడు గుర్తించ గలిగినట్టు సామాన్యభాషావ్యవహర్త గుర్తించలేడు. ఆర్థికదృష్టితో భాషలో ఉన్న పదాంశాలన్నిటినీ రెండు రకాలుగా విభజించవచ్చు. 1. విశ్వజ్ఞానపరాలు, 2. భాషాజ్ఞానపరాలు. మొదటి రకానికి చెందిన పదాంశాలు ప్రపంచభాష లన్నిటిలోనూ తుల్యార్థయోగంలో ఉంటాయి. రెండో తెగకు చెందినవి ప్రతి భాషకూ, భాషాకుటుంబానికీ విలక్షణంగా ఉంటాయి.

### ధాతువు - ప్రత్యయం

కొన్ని పదాంశాలు పదాలుగాకూడా ఉండవచ్చని చెప్పాం; 'బొమ్మ, గోడ' మొదలైనవి. వీటికి స్వతంత్రప్రయోగయోగ్యత ఉంటుంది. కొన్ని పదాంశా లెప్పుడూ అనుబంధాలుగానే వస్తాయి. –లు, –ఇ, –తు, –కు, –ను మొదలైనవి. దీన్నిబట్టి పదాంశాలను స్వతంత్రాలని, అనుబంధాలని రెండు రకాలుగా విభజించవచ్చు. ప్రత్యయాలన్నీ అనుబంధపదాంశాలే. ధాతువులు కొన్ని స్వతంత్రాలు; అనుబంధాలుగా కూడా ఉండవచ్చు. పదాంశాలు పద నిర్మాణావయవాలు కాబట్టి ధాతువులనీ, ప్రత్యయాలనీ రెండు రకాలుగా ఉంటాయి. ఏ భాషలో అయినా ప్రతిపదంలోనూ కనీసం ఒక ధాతువైనా ఉంటుంది. ధాతువు ఒక పదంచెప్పే అర్థంలో ప్రధానభాగాన్ని తెలియజేస్తుంది. ఉదాహరణకు 'అమ్ము, అమ్మకం, అమ్ముబడి, అమ్ముతున్నాడు', మొదలైన రూపాలన్నిటిలో అనుస్యూతంగావచ్చే ప్రధానార్థాన్ని సూచించే పదాంశం 'అమ్ము' అనే క్రియాధాతువు. పదనిర్మాణంలో ధాతువు పోగా మిగిలినవి ప్రత్యయాలు. ఇవి ఎప్పుడూ ధాతువులకు అనుబంధాలుగానే వస్తాయి. ఏ భాషలో అయినా ప్రత్యయాల సంఖ్యకంటె ధాతువుల సంఖ్య ఎక్కువగా ఉంటుంది. కాని ధాతువులకంటె ప్రత్యయాలకు వాడుక ఎక్కువ.

పదంలో ప్రధానార్థవాహకం ధాతువు అని నిర్వచించుకొన్నాం. కాని ఉపసర్గలున్న భాషల్లో ధాత్వర్థాన్ని ఇదమిత్థమని నిరూపించటం కష్టం. సంస్కృతంలో ప్ర–హార, ఆ–హార, వి–హార, సం–హార, ఉప–హార మొదలైన

పదాల్లో ధాతుభాగం 'హేర' అనే రూపంతో ఉన్నా దాని అర్థం నిర్ణయించటం కష్టం.[1] అలాగే ఆంగ్లంలో con-ceive, per-ceive, re-ceive, de-ceive మొదలైన రూపాల్లో -ceive- ధాతువైనా దాని అర్థం నిరూపించటం కష్టం. ఇందువల్ల ధాతునిరూపణలో అర్థమేకాకుండా ఇతర పద్ధతులుకూడా మరి కొన్ని ఉండాలి. ఊనిక ప్రధానమైన భాషల్లో ధాతుభాగంమీద ఊనిక పడుతుంది. కొన్నిభాషల్లో పదంలో ధాతువుకు నియతమైన స్థానం ఉంటుంది. ద్రావిడభాషల్లో ఉపసర్గలు లేవు కాబట్టి ధాతువెప్పుడూ పదాదినే ఉంటుందని నిరవవాదంగా చెప్ప వచ్చు. చైనీస్ భాషలో పదాలుకాని ప్రత్యయాలు లేవు కాబట్టి ధాతువులన్నీ పదాలే.

## ధాతువు - ప్రాతిపదిక

ప్రత్యయానికి నిబద్ధమైన పదరూపాన్ని ప్రాతిపదిక అనవచ్చు. ఉదా. 'అన్నిటికి' లో 'కి' ప్రత్యయం, 'అన్నిటి' అనే ప్రాతిపదికకు చేరుతుంది. ఇది ఔపవిభక్తిరూపం. '-టి' అనే ఉపవిభక్తి 'అన్ని' అనే ప్రాతిపదికకు చేరుతుంది. 'అన్నిటికి' పదం; 'అన్ని-, అన్నిటి-' ప్రాతిపదికలు; 'అన్ని' ధాతువు. అలానే 'చెప్పించక' అనే వ్యతిరేకక్త్వార్థకక్రియాపదంలో '-అక' ప్రత్యయానికి ముందున్న 'చెప్పించ్-' ప్రాతిపదిక; ధాతువు 'చెప్పు'. 'బొమ్మలకు' అనే పదంలో '-అ' ప్రత్యయం; బొమ్మలు ప్రాతిపదిక. 'బొమ్మలు' పదమైనప్పుడు 'బొమ్మ' ప్రాతిపదిక; '-లు' ప్రత్యయం. ఇక్కడ ధాతువు కూడా 'బొమ్మ' అవుతుంది. దీన్ని బట్టి ధాతువులన్నీ ప్రాతిపదికలు కావచ్చు కాని, ప్రాతిపదిక లన్నీ ధాతువులు కాకపోవచ్చు.

## ప్రత్యయ విభాగం

ప్రత్యయాలన్నీ అనుబంధపదాంశాలేకాని పదాలు కావు. పదంలో వాటి స్థానభేదాన్నిబట్టి ప్రత్యయాల్ని మూడు రకాలుగా విభజించవచ్చు. ధాతు పూర్వాలు, ధాతు పరాలు, ధాత్వంతరాలు. సంస్కృత భాషలో ఉన్న 'ప్ర, పరి, ఉప' మొదలైన ఉపసర్గలన్నీ ధాతుపూర్వాలు. ద్రావిడభాషల్లో ధాతుపర ప్రత్యయాలే కాని ఉపసర్గలు లేవు. ఉదా కు, ను, రు, మొదలైనవి. సెమిటిక్ కుటుంబానికి చెందిన భాషల్లో ధాతువుమధ్య కొన్ని ప్రత్యయాలు వస్తాయి. ఉదా హీబ్రూభాషలో గ్నొబ్ = దొంగిలించు, గనబ్ =.దొంగిలించాడు, గొనెబ్ = దొంగతనం . ఈ పదాల్లో 'g-n-b ధాతువు. ఇక్కడ ప్రత్యయాలు ధాతువులో

కలిసి ఉన్నాయి. కాని కేవలం పూర్వాన, పరాన రాలేదు. ఇంగ్లీషులో sing-sang-sung ఇలాటివి. సంస్కృతంలో 'రుధ్' ధాతువుకు రూపనిష్పత్తిలో '-న-' అనే వికరణప్రత్యయం చేరుతుంది. ఉదా. రుణద్ధి.

ధాతుపదాంశాలు కొన్ని పదాలతో తుల్యంగా ఉన్నా-అంటే స్వతంత్ర ప్రయోగ యోగ్యత కలిగి ఉన్నా-కొన్ని ధాతువులు సర్వత్రా ప్రత్యయాల మాదిరి అనుబంధాలుగానే వస్తాయి. క్రియాధాతువులన్నీ ఇటువంటివే. విశేషణ ధాతువులు 'ఆ, ఈ, ఏ' లు, 'జోరీగ, కందిరీగ, పన్నీరు, దూమెరుగు, తూనీగ' మొదలైన పదాల్లో జోర్-, కందిర్-, పన్-, దూ-, తూన్- అనేవి ఎప్పుడూ అనుబంధాలుగానే వచ్చే ధాతువులు. ఇవి తరచు ఇతర ధాతువుల ముందు రావు గాబట్టి వీటిని ఉపసర్గలనటానికి వీల్లేదు. తమిళంలో 'పని' అంటే మంచు. 'పన్నీరు' అంటే మంచునీరు. 'దూ' అంటే బహుశా కొద్ది, తక్కువ, తేలిక అని అర్థాలు. 'దూముడి' అంటే వదులుముడి అని అర్థం. పరాన వచ్చిన ఈగ, నీరు, మెరుగు, మొదలైనవి స్వతంత్ర పదాంశాలు.

పదాంశరూపభేదాలు

ప్రతి పదాంశానికి ఒక రూపమూ, అర్థమూ ఉంటాయని చెప్పుకొన్నాం. క్వాచిత్కంగా భాషల్లో నిర్మాణాన్నిబట్టి రూపంలేకుండా అర్థం ఉన్నవి, అర్థంలేకుండా రూపం ఉన్నవి కూడా కొన్ని సపదాంశాలుండవచ్చు. ఒక పదాంశానికి చాలాపదాల్లో రూపాంతరాలు కనిపిస్తూ, అదే పరిసరాల్లో కొన్ని పదాల్లో రూపం లేకపోయినా ఆ పదాంశార్థం వస్తుంటే శూన్యరూపంగా ఆ పదాంశం ఉన్నట్టే గుర్తించాలి. వీటిని రూపశూన్యసపదాంశాలనవచ్చు. తెలుగులో వ్యతిరేకక్రియల్లో మూడు పదాంశాలుంటాయి: ధాతువు, వ్యతిరేకార్థక ప్రత్యయం -అ-, పురుషార్థక ప్రత్యయం.

ఉదా. చెప్ప్-అ-డు

వండ్-అ-డు

అమ్మ్-అ-డు

తిన్-అ-డు

కొన్-అ-డు

పిలవ్-అ-డు

కాని 'తెచ్చు' ధాతువుకు 'తే-Ø-డు, 'వచ్చు' ధాతువుకు 'రా-Ø - డు' వ్యతిరేకరూపాలు. వీటిలో వ్యతిరేకార్థాన్ని బోధించే 'అ' ప్రత్యయం లేకపోయినా దాని అర్థం నిల్చి ఉంది. ఉండవలసిన –అ– అనే రూపం లేకపోయినా అర్థం వస్తుందికాబట్టి '–అ–' రావలసిన స్థానంలో ఒక సున్నా గుర్తు పెట్టుకొని దీన్ని రూపశూన్యసపదాంశమనవచ్చు. ఈ క్రియల్లో వ్యతిరేకార్థకతను సూచించే పదాంశానికి రెండు సపదాంశాలున్నాయని సూచించవచ్చు. 1. –అ– ; 2. –Ø–. ఇలాగే ఆంగ్లంలో చాలాచోట్ల బహువచన ప్రత్యయంగా వచ్చే -s, -es కు బదులు కొన్నిపదాల తరవాత బహువచనప్రత్యయం శూన్యరూపంలో వస్తుంది. ఉదా. sheep, deer, fish మొదలైనవి.

భాషల్లో శూన్యసపదాంశాలుంటాయి కాని శూన్యపదాంశాలుండవు అంటే, ఒక పదాంశానికి రూపం క్వాచిత్కంగా లేనిచోట్ల నిర్మాణపూరణ దృష్టితో సృష్టించుకున్నది శూన్యసపదాంశం. అర్థం స్పష్టంగా లేకపోయినా రూపం కన్పించే పదాంశాలుకూడా కొన్ని ఉన్నాయి. ఉదా. పల్లెటూరు, దుక్కిటెద్దు, పేదరాలు, మొదలైన వాటిల్లో ఆగమాలుగావచ్చే '–ట్–' '–ర్–', వర్ణాలు పూర్వపర పదాంశాల్లో వేటికీ చెందవు. పల్లె, దుక్కి, పేద, ఊరు, ఎద్దు, ఆలు, అని వీటి రూపాలు వ్యస్తంగాకూడా కనిపిస్తాయి. 'ట్–' '–ర్–' రూపాలకు ప్రత్యేకమైన అర్థంలేదు. కాబట్టి వాటిని అర్థశూన్య పదాంశాలనవచ్చు. కాని ఒక దృష్టితో చూస్తే 'పల్లె–ఊరు', 'దుక్కి–ఎద్దు', 'పేద–ఆలు' అనే పదాలు ఆగమరహితంగా రావు కాబట్టి, ఈ రెండు పదాల సార్థకత, ప్రయోగయోగ్యత, ఈ ఆగమాలవల్లనే సిద్ధిస్తున్నది కాబట్టి, రెండేసి పదాలను కలపటమే వీటి అర్థంగా చెప్పుకోవచ్చు. అలాటప్పుడు అర్థశూన్యపదాంశాలు భాషలో ఉండవనే చెప్పవచ్చు. వీటి అర్థం భాషానిర్మాణపరమైనది గాని విశ్వజ్ఞానపరమైనది కాదు. పదహారు, పదిహేడు, మొదలైనవాటిల్లో 'హ' కారం ఇలాటిదే.

## పదాంశం - పరిసరభేదాలు

పదాంశానికి ఒకటికంటె ఎక్కువ రూపాలు ఉండవచ్చుననీ, అవి ఎప్పుడూ భిన్నపరిసరాల్లోనే వస్తుంటాయని, అలాంటి పరిసరభేదాన్ని బట్టి వాటి రూప భేదం సూత్రప్రాయంగా నిరూపించవచ్చుననీ అనుకొన్నాం. సపదాంశాలకు రూపంలో కొద్ది తేడాలుంటాయి; కాని అర్థంలో మార్పుండదు. ఇలా కొద్ది తేడాలతో వచ్చిన రూపాంతరాలనన్నిటినీ ఏకపదాంశభాగాలుగా గుర్తించాలి.

ప్రతి సపదాంశమూ వేరువేరు పరిసరాల్లోనే వస్తుంది కాని రెండు మూడు సపదాంశాలకు ఒకే పరిసరం ఉండదు.

| | | | |
|---|---|---|---|
| 1. | వస్–తూ | : | వస్తూ |
| | వచ్చ్–ఇ | : | వచ్చి |
| | రా–క | : | రాక |
| 2. | విణ్–టూ | : | వింటూ |
| | విన్–ఇ | : | విని |
| | విన్–అక | : | వినక |
| 3. | చూస్–తూ | : | చూస్తూ |
| | చూస్–ఇ | : | చూసి |
| | చూడ్–అక | : | చూడక |

మొదటి వరసలో ధాతువు వస్–, వచ్చ్–, రా– అని మూడు రూపాలతో కనిపిస్తుంది. ఈ మూడూ మూడు రకాల పరిసరాల్లో వస్తున్నాయి. అచ్చు ముందు 'వచ్చ్' అని, 'త' కారం పరమైనప్పుడు 'వస్' అని, ఇతరత్రా 'రా' అని. ఈ పరిసరాలను తారుమారు చేస్తే అవిష్టరూపాలు ఏర్పడతాయి. (*వసి, *వచ్చ్–తూ, *వస్క). ఈ నియమం తెలుగు మాట్లాడే ఏ వ్యవహార్తా ఉల్లంఘించలేడు. ఇలాంటి ప్రవృత్తిని 'అన్యోన్యపూరకవ్యాప్తి' అని కొందరు తెలుగులో అంటున్నారు. ఒక పదాంశానికి చెందిన సపదాంశాలను ఈ కింది విధంగా సూచిస్తారు.

| | |
|---|---|
| వచ్చ్, వస్, రా | 'come' |
| విణ్, విన్ | 'hear' |
| చూస్, చూడ్ | 'see' |
| తూ, టూ | శత్రర్థకప్రత్యయం |
| అక, Ø | వ్యతిరేకార్థకప్రత్యయం |
| ఇ | క్త్వార్థకప్రత్యయం |

సపదాంశభేదాలు పరిసరపదాంశభాగాలయిన వర్ణాల ఉచ్చారణలనుబట్టి నిర్దేశించటానికి వీలు కావచ్చు. '–తూ' లో 'త' వర్ణం 'వస్–' లో ఉన్న 'స' వర్ణం దంత్యాలు; 'వచ్చ్–తూ' అనే రూపం తెలుగు ఉచ్చారణలో సాధ్యంకాదు కాబట్టి

'చ' వర్ణం 'స' వర్ణంగా మారింది. ధాతుసపదాంశంలో ఉన్న వర్ణాల ఉచ్చారణకు, పరిసరసపదాంశాల ఉచ్చారణకు సన్నిహితసంబంధం నిరూపించవచ్చు. కొన్నిటి మధ్య ఇలాటి సంబంధం నిరూపించటం సాధ్యంకాదు. 'మెచ్చి, మెచ్చుక' అనే రూపాలు భాషలో ఉన్నా, 'వచ్చి, వచ్చుక' అనేవి లేవు. 'వచ్' స్థానంలో 'రా' ఉండటానికి 'అక' లోని వర్ణాల ఉచ్చారణకు సన్నిహితసంబంధంలేదు.

ఈ చర్చనుబట్టి ఒక పదాంశానికి రూపాంతరాలైన సపదాంశాల అన్యోన్య సంబంధం పరిసరవర్ణనియతమని, పరిసరరూపనియతమని రెండు రకాల విభజించవచ్చు. వస్తాడు, వస్తే మొదలైన చోట్ల కూడా 'త' వర్ణానికిముందు 'వచ్' బదులు 'వస్' అనే సపదాంశమే కనిపిస్తుంది. అంటే తెలుగులో 'చ్త' ఉచ్చారణలో సాధ్యంకాదు కాబట్టి. కాని '–అక', లేక '–క' ప్రత్యయంముందు 'వచ్' బదులు 'రా–' ఉచ్చారణేతర కారణాలవల్ల వస్తున్నది. అంటే వీటి పరస్పరోచ్చారణలకు సహజసంబంధం లేదు. మొదటి రకమైన సంబంధంగల సపదాంశాలను ~ గుర్తుతోను, రెండో రకమైన సంబంధమున్న సపదాంశాలను ∞ గుర్తుతోను వేరుచేస్తారు. (వచ్ ~ వస్ ∞ రా.)

### ఇతర పదాంశభేదాలు

ప్రత్యయాలూ, పదాలూ కాని అనుబంధపదాంశాలు ఒక తెగకు చెందినవి ఉన్నాయి. ఉదా. –అ ప్రశ్నార్థకం, –ఏ ఏవార్థకం, –ఓ సందేహార్థకం, –కదా కిలార్థకం, మొదలైనవి. వీటికి స్వతంత్రప్రయోగయోగ్యత లేదు కాబట్టి పదాలు అనటానికి వీల్లేదు. అయినా నామం, క్రియ, విశేషణం, మొదలైన ప్రత్యేకభాషా భాగాలకి చెందిన ప్రత్యయాల (ను, డు, ము, రు, తో, మొదలైనవి) మాదిరివి కూడా కావు, ఇవి చేరే రూపం స్వతంత్రప్రయోగ యోగ్యతకల పదమన్నా, పదబంధమన్నా, వాక్యమన్నా అవుతుంది. ఈ కారణాలవల్ల వీటిని ప్రత్యయా లనకుండా పదకల్పకావ్యయాలనవచ్చు.

ఇంతే కాకుండా అక్షరపరిగణను బట్టి ఏకాచ్కాలు, ద్వ్యచ్కాలు, త్ర్యచ్కాలు, మొదలైన విధంగా పదాంశాలను విభజించవచ్చు. ఉదాహరణకు ద్రావిడభాషల్లో ప్రాథమిక ధాతువులెప్పుడూ ఏకాచ్కాలుగానే ఉంటాయి. సెమెటిక్ కుటుంబ భాషల్లో (హీబ్రూ, అరబిక్ మొదలైనవి) ధాతువు మూడు హల్లులతో ఉంటుంది.

కొన్ని ప్రత్యయాలు పదాల ఉత్పత్తి ప్రక్రియలోను, మరికొన్ని నిష్పత్తి ప్రక్రియలోను వినియోగిస్తాయి. కృత్తద్ధితప్రత్యయాలు మొదటి తెగకు చెందినవి. మాటకారి, దిగుదల, అందగత్తె, చదువరి, మొదలైన శబ్దాల్లో కనిపించే '-తనం, -కారి, -దల, -కత్తె, -అరి' నామోత్పత్తి ప్రక్రియలో కనిపిస్తాయి. ప్రేరణార్థకంలో వచ్చే '-ఇంచు, -పు' మొదలైనవి క్రియా ప్రాతిపదికల నిర్మాణంలో వస్తాయి. నామ, క్రియా విభక్తులు -కు, -ను, -తో, -డు, -రు, -వు, -ను, -ము, మొదలైనవి రెండో తెగకు చెందినవి. ఒకే పదంలో ఈ రెండు రకాల ప్రత్యయాలూ వచ్చినప్పుడు నిష్పాదక ప్రత్యయాలెప్పుడూ ఉత్పాదక ప్రత్యయాల తర్వాతనే కాని ముందు రావు. ఉదా. మంచి-తనం-లో. ధాతువు మంచి, తద్ధితం-తనం, విభక్తి -లో.

## అనుబంధం

ఈ వ్యాసంలో ప్రయోగించిన పారిభాషికపదాలకు ఆంగ్లంలో సమానపదాలు.

| | |
|---|---|
| పదం | word |
| పదాంశం | morpheme, morph |
| సపదాంశం | allomorph |
| రూపం | morph, form |
| ధాతువు | root |
| ప్రత్యయం | affix |
| ధాతుపూర్వం | prefix |
| ధాతుపరం | suffix |
| ధాత్వంతరం | infix |
| ప్రాతిపదిక | stem |
| స్వతంత్రరూపం | free form |
| అనుబంధ రూపం | bound form |
| పరిసరం | environment |
| అర్థశూన్య పదాంశం | empty morpheme |
| రూపశూన్య సపదాంశం | zero morph |

| | |
|---|---|
| అన్యోన్యపరిపూరకవ్యాప్తి | complementary distribution |
| పరిసరవర్ణనియతి | phonological conditioning |
| పరిసరరూపనియతి | morphological conditioning |
| పదకల్పకావ్యయం | clitic |
| అక్షరం | syllable |
| ఉత్పత్తి | derivation |
| నిష్పత్తి | inflexion |
| ప్రాథమికధాతువు | primary root |

## జ్ఞాపిక

1. అసలు ధాతువు 'హ్వా'.

# 7

# సన్నిహిత సంబంధులు

నిర్మాణంగల ప్రతి పదార్థంలోనూ రెండు ముఖ్యాంగాలుండాలి: ఒకటి అవయవాలు, భాగాలు; రెండు, ఆ అవయవాలు ఏదో ఒక క్రమపద్ధతిలో కూడటం. ఒక గది కట్టుబడిలో ఇటుక, సున్నం, వాసాలు, పెంకు మొదలైనవి అవయవాలు. కూడిక తీరు: ముందు పునాది కట్టుబడి, కిందిగోడ, పైగోడ, వాసాలు అమర్చటం, దానిమీద పెంకు కప్పటం. కట్టినగదిలో ఈ అవయవాలన్నీ ఒకదానితో ఒకటి కలిసిపోయి ఒకే నిర్మాణంగా కనిపిస్తున్నా—భాగాలన్నీ కూడవలసిన తీరులో కూడినప్పుడే అది నిర్మాణం అవుతుంది. అంటే కప్పు కట్టిన తర్వాత గోడ కట్టటం జరగదు. అవయవాల అన్యోన్య సంబంధం నిరూపిస్తూ—ఆ అవయవితో ఉన్న సంబంధం నిరూపించినప్పుడు—అవయవి నిర్మాణం నిర్వచించినట్లు అవుతుంది.

## వాక్యావయవాలు

భాషను వాక్యరూపంలో వ్యవహరిస్తాం. ప్రతివాక్యానికి కొన్ని అవయవాలు—అవి కొన్ని పద్ధతుల్లో కలిసినప్పుడే వాక్యం ఏర్పడటం అనేది సహజం. సరైన భాగాలను సరైన తీర్లలో కలిపి వాక్యాలు కూర్చేతీరు వ్యవహర్తల భాషా కౌశలంలో ఉంది. సామాన్యవ్యవహర్తలు దీన్ని కొంత గుర్తించగలుగుతారు గాని నిర్మాణాన్ని నిర్వచించలేకపోవచ్చు. అది భాషా శాస్త్రజ్ఞుడి పని.

ఉదాహరణకు 'రాము ఇంట్లో ఉన్నాడు' అనే వాక్యంలో మూడు మాట లున్నాయి. 'రాము', 'ఇంట్లో', 'ఉన్నాడు'. సాధారణంగా మనం చెప్ప దలచుకొన్న విషయం వాక్యంలో ముందుగా అంటాం; తరవాత దాన్ని గురించిన వ్యాఖ్యానం వస్తుంది. 'రాము'ను గురించి చెబుతున్నాం; అది విషయం. వ్యాఖ్యానం 'ఇంట్లో ఉన్నాడు' అని. స్థూలంగా ప్రతివాక్యమూ ఇలా విషయం-వ్యాఖ్యానం అనే రెండు భాగాలుగా ఉంటుందని చెప్పవచ్చు, వీటినే కర్త-ఆఖ్యాతం అనీ అనవచ్చు. పై సామాన్యవాక్యాన్ని రెండు ప్రధాన అవయవాలుగా విడగొడితే (1) రాము, (2) ఇంట్లో ఉన్నాడు. 'రాము ఇంట్లో' కలిసి ఒక అవయవం ఎందుకు కాకూడదు అనవచ్చు. 'ఇంట్లో' అనే మాటకు 'రాము'తో దగ్గర సంబంధమా 'ఉన్నాడు'తో దగ్గర సంబంధమా? 'ఇంట్లో' 'ఇల్లు' అనే నామవాచకానికి సప్తమ్యంతరూపం. దాని తరవాత వచ్చే క్రియను మార్చామనుకోండి:

*రాము ఇంట్లో వెళ్ళాడు.

ఇది సమ్మతమైన వాక్యంకాదు. కారణం: 'వెళ్ళు' క్రియగా ఉన్నప్పుడు గమ్యార్థంలో వచ్చే స్థలవాచక పదానికి చతుర్థీవిభక్తి వస్తుందికాని సప్తమి రాదు. 'రాము ఇంటికి వెళ్లాడు' అనవచ్చు. అంటే 'ఇంట్లో' అనే పదానికి కర్తతో కంటే క్రియతోనే సన్నిహితసంబంధం కనిపిస్తుంది. 'రాము - ఇంట్లో' అనేవాటికి అలాంటి సంబంధం లేదు. 'రాము' బదులు మరే పదమన్నా కర్తృస్థానంలో వచ్చినా 'ఇంట్లో' మారకపోవచ్చు. కమల/అమ్మ/నాన్న/ తమ్ముడు/ఆవు/ చెట్టు - ఏదన్నా 'రాము' బదులు రావచ్చు. అలానే 'ఇంట్లో' బదులు ఊళ్ళో/ వాకిట్లో/అడవిలో/అంగట్లో - ఏదన్నారావచ్చు. అంటే వాక్యంలో ఉన్న మూడు మాటలను రెండుగా చేస్తే

రాము ఇంట్లో ఉన్నాడు.

అవుతుంది 'ఇంట్లో ఉన్నాడు' అనే అవయవాల మధ్య సన్నిహితసంబంధం ఉంది; ఆపైన 'రాము ఇంట్లో ఉన్నాడు' అనేవి సన్నిహితాలు. ఈ రకమైన సంబంధాన్ని కుండలీకరణాల్లో కింది తీరున సూచించవచ్చు.

[[రాము] [[ ఇంట్లో ] [ఉన్నాడు]]]

1 2 3

ఈ రెండుభాగాలు వాక్యావయవాలు. వీటిల్లో మొదటిది నామపదబంధం; రెండోది క్రియాపదబంధం. సంక్షిప్తంగా నామబంధం, క్రియాబంధం అని వీటికి పేరు పెట్టుకొంటే వీటి అన్యోన్యసంబంధం ఈకింది తీరున చెట్టుబొమ్మగా చూపించవచ్చు.




కుండలీకరణాలుగాని చెట్టుబొమ్మలుగాని అవయవ-అవయవి సంబంధం నిరూపించటానికి ఉపయోగిస్తాయి. పైన చూపిన నిర్మాణం

రాము | ఇంటికి వెళ్ళాడు
రాము | అన్నం తిన్నాడు
నాన్న | పుస్తకం కొన్నాడు

మొదలైన వాక్యాలకు కూడా సరిపడుతుంది. వాక్యావయవాలు పదబంధాలుగా ఉండవచ్చు; కేవలం పదాలు కావచ్చు. పదబంధాలు పదాల కలయికవల్ల ఏర్పడతాయి. పదాలు ఏకపదాంశాలన్నా కావచ్చు; అనేకపదాంశాల కలయికవల్ల ఏర్పడ్డవన్నా కావచ్చు. 'ఇంట్లో' 'ఉన్నాడు' అనేవి అనేక పదాంశాలవల్ల ఏర్పడ్డవి. ఇల్లు (ధాతువు), -తి (ఔపవిభక్తికం), -లో (సప్తమి ప్రత్యయం) – ఈ మూడు కలిస్తే 'ఇంటిలో' (సంధి మూలంగా) → 'ఇంట్లో' అనే పదం ఏర్పడ్డది; 'ఉన్నాడు' లో కూడా మూడు పదాంశాలున్నాయి. ఉన్ (ధాతువు), -నా- (కాలార్థక ప్రత్యయం), -డు (పురుషార్థక ప్రత్యయం ఏకవచనం). వీటిని గూడా సన్నిహిత సంబంధులుగా విడగొట్టడం ఎలా?

ఔపవిభక్తిక రూపానికి విభక్తి ప్రత్యయం చేరుతుంది. విభక్తిప్రత్యయం లేకపోయినా ఔపవిభక్తిక రూపం 'ఇంటి' విశేషణంగా వాడవచ్చు [[ఇన్][టి]]. 'ఇంటికప్పు' మొదలైనచోట్ల, అంటే 'తి' కి సంధిపరంగా వచ్చిన 'టి' ధాతువుతో సన్నిహితం కాని విభక్తిప్రత్యయంతో కాదు. ఉపవిభక్తి కలిసిన నామానికి విభక్తి

కలుస్తుంది. అందువల్ల [[[ఇన్]టి]లో], లేదా -




అని సూచించవచ్చు. ఉన్నాడు సమాపకక్రియ. కాలార్థకప్రత్యయ సహితమైన ధాతువుకే పురుషార్థక ప్రత్యయం కలుస్తుంది. అందువల్ల [[[ఉన్]నా]డు] అని గాని, చెట్టు బొమ్మలో -




అనిగాని, సూచించవచ్చు.

వాక్యాన్ని క్రమంగా పదాంశాలదాకా విడగొట్టవచ్చు. అలా వ్యాకరించటంలో అవయవ-అవయవి సంబంధం నిరూపితమౌతుంది. పదాల కలయికవల్ల సమాసాలు, పదబంధాలు ఏర్పడతాయి.

పదబంధాలు

'తియ్యమామిడిచెట్లు మాపెదనాన్నగారి ఇంట్లో ఉన్నాయి.'

ఈ వాక్య నిర్మాణం 'రాము ఇంట్లో ఉన్నాడు' కంటే భిన్నం కాదు. దీన్ని రెండుగా విభజిస్తే-

'తియ్యమామిడిచెట్లు' - నామబంధం;

'మా పెదనాన్నగారి ఇంట్లో ఉన్నాయి' - క్రియాబంధం.

ఇక్కడ వాక్యావయవాలు పదబంధాలు కాబట్టి అవి పదాలకు అవయవులుగా ప్రవర్తిస్తున్నాయి. ఈ వాక్యాన్ని సంగ్రహించి చెబితే 'చెట్లు ఇంట్లో ఉన్నాయి'

అవుతుంది. వాక్యనిర్మాణానికి ఏముప్పు రాలేదు. కాని,

'తియ్యమామిడి.... నాన్నగారి.....ఉన్నాయి'

అనటానికి వీలులేదు. 'తియ్య' 'మామిడి'కి విశేషణం; 'తియ్యమామిడి' 'చెట్టు'కు విశేషణం. విశేషణం విశేష్యగుణాన్ని గురించి చెబుతుంది. 'తియ్య'కు 'చెట్టు'తో నేరుగా సంబంధంలేదు. ఈ పదబంధంలో ఉన్న అవయవాల సంబంధం ఈ కింది తీరున ఉంటుంది.

[[[[తియ్య] [మామిడి]] చెట్టు]లు]

'లు' బహువచనం– వ్యస్తంగా ఉన్న 'చెట్టు' తో గాక సమాసపదంలో ఉన్న 'తియ్యమామిడిచెట్టు' తో కలుస్తుంది. అక్కడ ఉన్నవి 'చెట్లు' గాదు 'తియ్య మామిడి చెట్లు'. మామిడి చెట్టు మొత్తానికి తియ్య సన్నిహితం కాదు. తియ్యటిది మామిడిపండు కాని మామిడిచెట్టు కాదు. అందువల్ల –

తియ్య–మామిడి
తియ్య–మామిడి–చెట్టు
తియ్య–మామిడి–చెట్టు–లు

అదేవిధంగా ఏవేవి కలిస్తే వ్యవహర్త బుద్ధికి అర్థవంతమైన భాగాలనిపిస్తాయో అలా కలవటం వల్ల పదాలనుంచి పదబంధాలు ఏర్పడతాయి.

'మా పెదనాన్నగారిదొడ్లో' ఈ పదబంధాన్ని అర్థవంతంగా విభజించు కొంటూ పోతే

పెద – నాన్న
పెద – నాన్న – గారు
మా – పెద – నాన్న – గారు
మా – పెద – నాన్న – గారు – ఇ
మా – పెద – నాన్న – గారు – ఇ – దొడ్డి
మా – పెద – నాన్న – గారు – ఇ – దొడ్డి – లో



సంధివరంగా కొన్ని అచ్చులు హల్లులు లోపించటంవల్ల – మనం ఉచ్చరించే రూపం నిష్పన్నం అవుతుంది.

పై పదబంధంలో ఏడు పదాంశాలున్నాయి. మూడు పదాలున్నాయి. 'మా' తరవాత 'పెద' వచ్చినా వాటికి సన్నిహిత సంబంధంలేదు. 'మా– పెదనాన్నగారు' సన్నిహితసంబంధులు. క్రమంగా అవయవ–అవయవి సంబంధం వాక్యస్థాయినుంచి పదాంశస్థాయిదాకా చెయ్యాలంటే స్థూలంగా వ్యవహర్తల భాషాజ్ఞానం, ఊహ, సార్థకవిభజన ప్రధానంశాలుగా ఇంతవరకు చూశాం. ఈ రకమైన విభజనకు ఒక స్థూలమైన విధానం ఏర్పరచవచ్చు.

1. అవయవాల వేర్పాటు సార్థకంగా ఉండాలి.

ఉదాహరణకు: మా–పెద– ఒక అవయవి కాదు. 'పెదనాన్న' అవయవి అవుతుంది. 'మా పెదనాన్న' అవయవి అవుతుంది. '–ఇ' అనే ఉపవిభక్తి మొత్తం నామబంధానికి చేరిందిగాని ఒక్క 'గారు' కు మాత్రం చేరింది గాదు. 'ఇ' అంటే 'చెందిన' అని. 'పెదనాన్నగారికి చెందిన' అనే అర్థం 'ఇ' కలయిక వల్ల తెలుస్తుంది. <u>మా పెద</u> – నాన్న – <u>గారి దొడ్డి</u> –లో కింద గీత పెట్టిన వాటికి సార్థకత లేదు.

2. వీలైనంతవరకు అవయవులు కాదగినట్టుగా అవయవాలను విడగొట్టాలి.

నామబంధం అవయవం, అవయవి కూడా. అలానే 'పెదనాన్నగారు' 'పెదనాన్న–గారు' రెండు అవయవాలున్న అవయవి. 'పెదనాన్న' అవయవం; పైభాగాలతో పోలిస్తే అవయవం; బాహిరంగా అవయవం; కింది భాగాలతో పోలిస్తే అవయవి. 'పెద–నాన్న' అనేవి అవయవాలు.

'వ్యస్తప్రయోగయోగ్యత' వల్ల ఈసంబంధం గుర్తించవచ్చు. 'పెదనాన్న', 'పెదనాన్నగారు', 'మా పెదనాన్నగారు', 'మా పెదనాన్నగారిదొడ్డి' వ్యస్త ప్రయోగయోగ్యాలు. కాని 'మా పెద', 'గారిదొడ్డి' లాంటివి ఏ సందర్భం లోనూ వాడం కాబట్టి వాటికి నిర్మాణాత్మకత లేదు.

3. సంధిగతంగా ఉచ్చారణలో మార్పులు రాని రూపాలను సన్నిహిత సంబంధులుగా విడగొట్టాలి.

4. వీలైనంతవరకు అవయవాలను రెండుగా విడగొట్టాలి.

సందిగ్ధనిర్మాణాలు

పై సూత్రాలు కొండ గుర్తులుగా వినియోగిస్తాయి. కొన్ని సందర్భాల్లో నిర్మాణం సందిగ్ధంగా ఉంటుంది. అది 'పెద్ద పండ్ల చెట్టు' అన్నప్పుడు 'పెద్ద' కు అన్వయం 'పండ్ల' తోనా? 'చెట్టు' తోనా? ఏదన్నాకావచ్చు.

1.



2.



పై విధంగా రెండర్థాల నిర్మాణ భేదం సూచించవచ్చు. అలానే 'రెండెడ్ల బండ్లు' అన్నప్పుడు 'రెండు' కు అన్వయం 'బండ్ల' తోగాని 'ఎడ్ల' తోగాని కావచ్చు. అర్థభేదం అన్వయభేదాన్నిబట్టి ఏర్పడ్డట్టు చూడవచ్చు.

1.



2.



ఒక్కొక్కప్పుడు అవయవి భాగాలు రెండుకంటే ఎక్కువ చెయ్యవలసి వస్తుంది : 'రామలక్ష్మణభరతశత్రుఘ్నులు' అన్న బహుపదద్వంద్వంలో నాలుగు మాటలున్నాయి. దీన్ని సన్నిహితసంబంధులుగా విడగొడితే–

రామలక్ష్మణభరతశత్రుఘ్న–లు

అని అవుతుంది. దీంట్లో మొదటిది సమస్తపదం. దాన్ని రెండు ముక్కలుగా అర్థవంతంగా విడగొట్టను వీలులేదు.

అందుకని 'రామ-లక్షణ-భరత-శత్రుఘ్ను' నాలుగు సమానార్థత గల నాలుగు మాటలవుతాయి.

అవయవాల్లో ప్రధానాప్రధానభేదాలు

విడగొట్టిన పదాంశాలను గాని పదాలను గాని అవయవితో పోల్చి వాటి అన్యోన్య సంబంధం నిరూపించవచ్చు. వీటిల్లో కొన్నిటికి అవయవి నిర్మాణంలో ప్రధానపాత్ర ఉంటుంది. ఇవి అధారావయవాలు; కొన్ని ఆధేయావయవాలు. A ఆధారం B ఆధేయం అయినప్పుడు, A లేనిది B ఉండదు; B లేకపోయినా A ఉంటుంది. పదనిష్పత్తిలో ప్రత్యయాలెప్పుడూ ఆధేయాలు, ప్రకృతులు ఆధారాలు. ఉదా. అమ్ముతూ, అమ్మి, ఇంట్లో, ఇంటికి, మాటకారి. ఈ మాటల్లో -తూ, -ఇ, -లో, -కి, -కారి ఆధేయాలు. వాటి ప్రకృతులు ఆధారాలు. సమాసనిర్మాణాలలో విశేషణాలు ఆధేయాలు; విశేష్యాలు ఆధారాలు. 'తియ్య-మామిడి' ఒకరకం మామిడి; 'తియ్య' విశేషణం 'మామిడి' విశేష్యం. 'తియ్యమామిడి చెట్టు'లో 'తియ్యమామిడి' విశేషణం. 'చెట్టు' విశేష్యం. 'తియ్య మామిడిచెట్టు' ఒకరకం చెట్టుగాని ఒకరకం మామిడి గాదు. అవయవసంబంధం నిరూపించేటప్పుడు ప్రధానావయవం అని, అప్రధానావయవం అని వేర్పరచవచ్చు. సమాసాలు, పదబంధాలలో అప్రధానావయవాలు లోపించినా అవయవి వాక్యనిర్మాణానికి హాని రాదు.

'చెట్లు దొడ్లో ఉన్నాయి', 'తియ్యమామిడి చెట్లు మా పెదనాన్నగారి దొడ్లో ఉన్నాయి' అనే రెండు వాక్యాల స్థూల నిర్మాణం ఒకటే.

అవయవి-అవయవాల్లో ఏపదానికి మొత్తం అవయవి స్థానంలో రాదగిన సామర్థ్యం ఉంటుందో అది ప్రధానం; ఆధారపదం. ఆరకమైన అవయవిని endocentric construction అంటారు. అలా కానిది exocentric. ప్రతి పదబంధంలోనూ ఉన్న సన్నిహితసంబంధుల్లో ప్రధానావయవాన్ని ఉంచి మిగిలిన వాటిని లోపింపచెయ్యటంవల్ల సంక్షిప్తవాక్యం ఏర్పడుతుంది. అవయవపదాల అన్యోన్యసంబంధాన్ని అంటే అవయవ-అవయవి సంబంధాన్నిబట్టి సమాసాలను కర్మధారయం, ద్వంద్వం, బహువ్రీహి అనే విభాగం మన ప్రాచీనులు చేశారు. కర్మధారయంలో ఏదో ఒకపదం - అన్నిటికన్నా ప్రధానపదం, మిగిలినవి విశేషణాలు అవుతాయి. అలాంటి ప్రధానపదం తెలుగులో ఎప్పుడూ సమాసం

చివరనే ఉంటుంది. వీటిని ఉత్తరపదప్రధానకర్మధారయాలు అన్నారు; పూర్వ పదప్రధానకర్మధారయాలు తెలుగులో ఉండవు. అన్యపదప్రధానమైంది బహువ్రీహి; ద్వంద్వం ఉభయపదప్రధానం. వీటిలో ఏభాగాన్ని సడలించినా నిర్మాణం దెబ్బతింటుంది. 'మొగుడు పెళ్ళాలు వచ్చారు'లో 'మొగుళ్ళు వచ్చారు', 'పెళ్ళాలు వచ్చారు' అనటానికి వీల్లేదు. కర్మధారయాలను endocentric అనీ బహువ్రీహిని exocentric అనీ ఆంగ్లంలో వ్యవహరిస్తారు. 'తెల్లగుర్రం' కర్మధారయం (endocentric). 'తెల్ల' ఆధేయం; 'గుర్రం' ఆధారం. 'కూరగాయలు' ద్వంద్వం (coordinate construction). 'పుట్టుగుడ్డి' మొదలైనవి బహువ్రీహి. కర్మధారయంలో పూర్వపరావయవాల మధ్య సంబంధాలు ఎన్నో రకాలు ఉండవచ్చు.

సమాసాలు ఎలా ఏర్పడతాయో ఏ ఏ సంబంధాలు సమాసావయవాల మధ్య ప్రవర్తిస్తాయో మనకు పూర్తిగా తెలియదు.

సారాంశం

1. పదాంశాల నియత సంయోగంవల్ల పదాలు - పదాల నియత సంయోగం వల్ల పదబంధాలు - పదబంధాలనియత సంయోగం వల్ల వాక్యాలు ఏర్పడతాయి. వాక్యం నిర్మాణావధిగా తీసుకొని పదాంశస్థాయిదాకా అవయవ విభాగం చేసి చెట్టుబొమ్మతోగాని బ్రాకెట్లతోగాని నిర్మాణాంతరదశలు నిరూపించవచ్చు.

2. ఒక్కొక్క నిర్మాణాన్ని రెండేసి ముక్కలుగా చేయటంవల్ల వచ్చేవి నిర్మాణావయవికి అవయవాలు. వాటిని సన్నిహిత సంబంధులు అంటాం.

3. అవయవం కాని అవయవి వాక్యం; అంటే వాక్యం నిర్మాణావధి. అది దేనికీ అవయవంకాదు. అవయవికాని అవయవం పదాంశం. అంటే పదాంశం ఎప్పుడూ అవయవమే కాని దానికి అర్థవంతమైన అవయవాలుండవు.

4. సన్నిహిత సంబంధులను నిరూపించటానికి ముఖ్యసూత్రాలు:

(a) అవయవాలు వీలైతే స్వతంత్రప్రయోగయోగ్యాలుగా ఉండేటట్టు విభజించాలి.

(b) అవయవాలకు ఆధారాధేయసంబంధం ఉందో లేదో

పరిశీలించాలి. ఆధేయం దేనిమీద ఆధారపడి నిలుస్తుందో అది దానితో సన్నిహితం అవుతుంది.

(c) అవయవ విభాగం సాధారణంగా ద్విధారూపంగా ఉండాలి (బహుపద ద్వంద్వాలలో రెంటికంటే ఎక్కువ సమానార్థత గల అవయవాలు కలవవచ్చు).

(d) విడగొట్టిన అవయవాలు మళ్ళీ అవయవులయ్యే వీలైతే అలా విభజించాలి.

5. సన్నిహిత సంబంధులలో ఏది ప్రధానమో ఏది అప్రధానమో అర్థాన్ని బట్టి, అవయవితో వాటికున్న సంబంధాన్నిబట్టి నిరూపించవచ్చు. ప్రకృతులు ఆధారాలు; ఉపసర్గలు, ప్రత్యయాలు ఆధేయాలు. విశేషణాలు ఆధేయాలు; విశేష్యాలు ఆధారాలు. స్వతంత్ర పదాలు ఆధారాలు; నిబద్ధపదాలు ఆధేయాలు. ఉదా. పన్నీరు, కన్నీరు ఇత్యాది శ్లిష్టసమాసాల్లో పన్–, కన్– ఆధేయాలు.

6. అవయవాల అన్వయ భేదాన్ని బట్టి ఒకే బాహిర రూపంతో ఉన్న సమాసాల్లో అర్థభేదం వస్తుంది. అర్థభేదానికి కారణం సన్నిహిత సంబంధుల అన్వయభేదం అయి ఉంటుందని ప్రదర్శించవచ్చు.

# 8

# షష్ఠీవిభక్తి ‘యొక్క’ విచారణ

తెలుగులో ప్రామాణికసాంప్రదాయిక వ్యాకరణాలన్నీ -కు/-కి లతో పాటు ‘-యొక్క’ ను గూడా షష్ఠీవిభక్తిగా పరిగణించాయి. సాంప్రదాయిక వ్యాకరణాలు కవిపండితులకోసం రాసినవి గాని సామాన్యులకు గాదు. మరి ఏకావ్యంలోనూ ప్రయోగం లేకపోయినా లక్షణం చేసిన ఘనత ఒక ‘-యొక్క’కే దక్కటం ఆశ్చర్యం కలిగిస్తుంది. దీని చరిత్రను పరామర్శిద్దాం.

ఆంధ్రశబ్దచింతామణిలో ‘యొక్క చ శేషే షష్ఠీ’ (అజంత. సూ. 32) అని చెప్పటమేగాక సంజ్ఞ. సూ. 40లో దీన్ని కళగా నిర్దేశించింది. కేతన (13వ శతాబ్ది) ఆంధ్రభాషాభూషణంలో (పద్యం 83) అవసరమైతేనే ‘యొక్క’ ప్రయోగిస్తారని రాశాడు. ఉదాహరణలో లోపించినదాన్నే ఇచ్చాడు. విన్నకోట పెద్దన్న (14వ శతాబ్ది) కావ్యాలంకారచూడామణి (ఉల్లాసం 9-97) లో కి, కు, యొక్క, లోపల, నన్ ‘పదాల’ ను షష్ఠీవిభక్తులుగా జాబితామాత్రం ఇచ్చాడు కాని ప్రయోగలివ్వలేదు. ఆంధ్రకౌముది కర్త గణపవరపు వేంకటకవి (17వ శతాబ్ది) శేషషష్ఠిలో విగ్రహవాక్యాల్లోనే ‘యొక్క’ వస్తుందనీ, కావ్యప్రయోగానికి అనర్హమనీ రాశాడు (అజంత. పేజీలు 157-8). అహోబలపతి (క్రీ.శ. 1700) ప్రబంధాల్లో దీని ప్రయోగం కనిపించదని చెబుతూ నన్నయ కళల్లో దీన్ని పరిగ్రహించటం వల్ల దీని ప్రయోగం ఇష్టమేనంటాడు (అజంత-32). తిమ్మకవి (1690-1760) సర్వలక్షణసార సంగ్రహంలో (1-32) ఈవిభక్తిని

'– ఒక్క' అని నిర్దేశిస్తూ ఇది ప్రయోగంలో కనిపించదనీ దీని అర్థం మాత్రం నిలుస్తుందనీ అంటాడు. పంధొమ్మిదో శతాబ్దికి చెందిన బాల (తత్సమ 1–7) ప్రౌఢ (కారక–15) వ్యాకరణాలు షష్ఠీవిభక్తి ప్రత్యయంగా దీన్ని సూచించినా కావ్యప్రయోగాలివ్వలేదు. ప్రౌఢవ్యాకరణం (కారక–16) 'యొక్క' లోపాన్ని బహుళగ్రహణంచేత విధించింది. పైపరిశీలననుబట్టి ఏదో బలవత్తరమైన కారణం వల్ల కావ్యప్రయోగం లేకపోయినా '–యొక్క'ను గుర్తించవలసివచ్చిందని తెలుసుకోవచ్చు. ఏమిటి ఆకారణాలు అని పరిశోధించటం ఈవ్యాసం ఉద్దేశం.

తెలుగుశాసనాల్లో పదిహేనో శతాబ్దిదాకా 'యొక్క' ప్రయోగం కనిపించదు. పదిహేను తర్వాత చాలా వచనరచనల్లో దీని ప్రయోగం కనిపిస్తుంది. పండితారాధ్యచరిత్రలో (1–89 పేజీలో):

*'అవిరలసూక్తభాష్యార్థమెట్లనిన*
*హే రుద్ర యనగ తానో రుద్ర యనుట*
*వారక మరియుఁ 'దవప్రణీతా' వ*
*నంగఁ బూర్వార్థ మనంగ నీయొక్క*
*సంగతి లింగపూజావేళలందు.....'*

సంస్కృతశబ్దానికి అర్థవివరణంలో 'యొక్క' ఏకైక ప్రయోగం ఈ ప్రాచీన కావ్యంలోనే కనిపిస్తుంది (పండితా. ఉపో. 232). దీన్నిబట్టి షష్ఠీవిభక్తికి తెలుగులో వివరణ ఇచ్చేటప్పుడు 'యొక్క' ప్రాచీనకాలంనుంచి పండిత వ్యవహారంలో ఉన్నట్లు తెలుస్తుంది. విశ్వనాథనాయకుని (1520) రాయవాచకం (పేజీలు 12, 13, 70, 97, మొదలైనవి) లోనూ, బాలసరస్వతీయం (అజంత. 9, 10, 11; సంధి. 41, 42) లోనూ ఈ విభక్తిప్రయోగం తరచుగా కనిపిస్తుంది. అర్వాచీనవచనరచనలో ఇంకా దీని వాడుక పెరిగింది.

పైచర్చనుబట్టి మూడు విశేషాలు తెలుస్తాయి: (1) షష్ఠీతత్పురుష సమాసాలకు తెలుగులో చెప్పే విగ్రహవాక్యాల్లో మాత్రం 'యొక్క' ప్రయోగం మన సాహిత్యారంభకాలంనుంచి ఉండేది; (2) పదహారో శతాబ్దితర్వాతనే ఇది వచనప్రయోగంలో కనిపించటాన్నిబట్టి ఇది కొద్దిమంది వాడుకనించి విద్యా వంతులందరి వాడుకలోకి వ్యాపించి ఉండాలి; ముఖ్యంగా వచనభాషలో తరచుగా వాడుతున్నట్టు తెలుస్తుంది; (3) దీని ప్రయోగం కావ్యాల్లో లేకపోవటాన్ని

బట్టి దీని వాడుక తెలుగుభాష మాట్లాడటానికి గానీ రాయటానికి గానీ అనవసరమనీ, మన నుడికారానికి సరిపడదనీ, కేవలం సంస్కృతపండితులు తెలుగు పాఠం చెప్పేటప్పుడే దీని అవసరమనీ గ్రహించవచ్చు. ఒకరకంగా సంస్కృతాభిమానం తెలుగులో పెరుగుతూ వచ్చిందనటానికి ఇది నిదర్శనమనీ చెప్పవచ్చు. మరి లక్ష్యం లేకుండా లక్షణం రాసినది ఇది ఒక్కటే కావటానికి బలీయమైన కారణాలుండాలి. అవేమిటో పరిశీలిద్దాం.

తెలుగులోనూ ఇతర ద్రావిడభాషల్లోనూ నామపదాలే స్థానాన్ని బట్టి విశేషణాలవుతాయి. ఉదా. కోటగోడ, గోడసున్నం, మొదలైనవి. నామవాచకం ప్రథమావిభక్తిలోనే విశేషణార్థాన్ని పొందుతుంది. అంటే నిజంగా అలాంటి నామవాచకాలు పరాన వచ్చిన నామాలతో సంబంధార్థంలో (షష్ఠ్యర్థంలో) వస్తాయని గుర్తించాలి. కాని షష్ఠ్యర్థంలో వచ్చినప్పుడు కొన్ని నామపదాల్లో మార్పులు వస్తాయి, ఉదా. ఇల్లు: ఇంటికప్పు, కాలు: కాలిగోరు, ఊరు: ఊరిపెద్ద. కాని తెలుగులో ఔపవిభక్తికాలుకాని నామవాచకాలసంఖ్య ఎక్కువ. వీటి రూపాలు ప్రథమలో ఉన్నట్టే షష్ఠిలోనూ ఉంటాయి. జాజిమొగ్గ, మనిషి మాట, మొదలైనవి. మరి సంస్కృతంనుంచి తెలుగులో ఎన్నో శబ్దాలు చేరాయి. వీటిలో షష్ఠ్యర్థంలో కొన్ని ప్రత్యయాలు చేరతాయి.

| ఏక. | బహు. |
|---|---|
| ప్ర. రాముఁడు | రాములు |
| ష. రాముని– | రాముల్–అ (రాములు+అ) |
| ప్ర. సీత | సీతలు |
| ష. సీత– | సీతల్–అ (సీతలు+అ) |

బహువచనంలో దేశ్యాలకు, తద్భవాలకు, అన్యదేశ్యాలకు గూడా –అ అనే ప్రత్యయం షష్ఠ్యర్థంలో వస్తుంది. (సాంప్రదాయిక వ్యాకరణాలు లు+అ ను విభజించకుండా మొత్తాన్ని లడాగమం అన్నాయి. అది వేరే సంగతి.) ఏకవచనంలోనే వైవిధ్యం కనిపిస్తుంది. '–ఇ, –టి, –తి, –ని, –సున్న' సాధారణంగా ఏకవచనంలో వచ్చేవి. శేషషష్ఠి అంటే సంబంధనిర్దేశంలో వచ్చే విభక్తి, అంటే ఇతరవిభక్తులు చెప్పని సంబంధాలను చెప్పేది.

ఇంగ్లీషులో దీన్ని genitive అంటారు. విశేష్యాలమధ్య ఉన్న కొన్ని

సంబంధాల నిర్దేశంలో తెలుగులో -కు ప్రత్యయం వైకల్పికంగా వస్తుంది, ఉదా. నాకు తమ్ముడు, నాతమ్ముడు, నీకు నెచ్చెలి, నీనెచ్చెలి. మరికొన్ని సంబంధాల్లో ఇది సాధ్యంగాదు. వాని గుణములు *వానికి గుణములు అనటానికి వీలులేదు. తెలుగులో ఏకాక్షరవిభక్తులకంటే విభక్తి అర్థంలో వచ్చే నామపదాలే ఎక్కువ. వీటిని post-position(s) అంటారు, ఉదా. రామునిచేత, రామునితోడ, రామునికొఱకు, రామునివలన, రామునియందు, మొదలైనవి; 'చెయ్యి', 'తోడు', 'కొఱ' (పని), 'వలను', 'అందు' అనేవి తెలుగులో ప్రత్యేకపదాలు కాబట్టి పూర్వాన ఉన్న విశేష్యంతో ఒక రకమైన సమానసంబంధం వీటి ప్రయోగంలో కనిపిస్తుంది. అంటే, 'రామునికి సంబంధించిన పనికి' అన్న అర్థంలో రామునికొఱకు అని ప్రయోగిస్తాము. అన్ని విభక్త్యర్థాలలోనూ అంతర్లీనంగా షష్ఠ్యర్థం వస్తున్నది. మరి షష్ఠీవిభక్తిలో రాముని- అనేదే సరిపోతుంది. కాని అక్కడ విభక్త్యర్థానికి తెలుగులో ఏస్పష్టమైన ప్రత్యయం లేకపోవటం పాతప్రవచనాల్లో ఒక సమస్య అయింది. వ్యాకర్తల దృష్టిలో -ని ఆగమమేగాని విభక్తి ప్రత్యయం కాదు గదా! ఇక్కడ చేత, తోడ, వలనలతో సరితూగగలిగినది ఏదీ లేకపోవటం పండితులను, ఆనాటి అధ్యాపకులను వేధించి ఉండాలి. నిజంగా -ఇ, -టి, -తి వర్ణాలే ఆ అర్థాన్ని ఇస్తున్నా వ్యాకరణమర్యాద ప్రకారం వీటిని షష్ఠీ ప్రత్యయాలనటం కుదరక, ఆగమాలుగా వచ్చే ఉపవిభక్తులని వీటికి పేరు పెట్టారు (నిగాగమం తప్ప). ఒకటి భాషాచరిత్ర దృష్టి, రెండోది వ్యాకరణదృష్టి. సంస్కృతంలో '-స్య' మొదలైన షష్ఠీవిభక్తులకు తుల్యంగా ఏదన్నా సామాన్య సంబంధనిర్దేశకమైన పదంకోసం వెదకటం '-యొక్క' ఆవిర్భావానికి ముఖ్య కారణం. షష్ఠీవిభక్తులుగా నిరూపించినవి కి/కు, యొక్క, లో, లోపల. వీటిలో 'కి/కు' లు చతుర్థిలో ఎక్కువగా వస్తాయి; ఏదో ఒకటిరెండుచోట్ల మాత్రం షష్ఠ్యర్థం వస్తుంది; లో/లోపల సప్తమీ విభక్తులు. అందుచేత నిజమైన సంబంధషష్ఠికి సరిపడ్డ ప్రత్యయం లేకపోవటం సంస్కృత పండితులకు తెలుగు నేర్పవలసిన చోట సమస్య అయింది. ఆరోజుల్లో చదువుకోటం అంటే ముఖ్యంగా సంస్కృతంలో ఉన్న శాస్త్రాలు, సాహిత్యం చదవగల్గటమే కదా!

'-ఒక్క/-యొక్క' అంటే సంబంధించిన అని అర్థం

ప్రాచీనద్రావిడభాషలో 'ఒ' అనే ధాతువుకు 'సరిపడు, సంబంధించు'

అని అర్థం. ఈక్రియ ప్రాచీనతమిళంలో ఉంది. ఉత్తమపురుషలో 'ఒక్కితేన్' (వర్తమానం), 'ఒత్తేన్' (భూతం), 'ఒప్పేన్' (భవిష్యత్తు), 'ఒక్క' (తుమర్థం) అనే 'ఒ' ధాతు నిష్పన్న క్రియారూపాలు తమిళంలో ఉన్నాయి. మలయాళంలో 'ఒక్కు' అనే ధాతువు అదే అర్థంలో వస్తుంది. దీంట్లో కాలార్థక 'క' ప్రత్యయం ధాతుభాగం అయింది. తమిళమలయాళాల్లో తుమర్థంలో 'ఒక్క' అవ్యయంగా వాడతారు; దీని అర్థం 'కలిసి, కూడి' అని. ఈఅర్థం తెలుగు షష్ఠీవిభక్తికి బాగా సరిపడుతుంది. తెలుగులో ఉన్న 'ఒప్పు' క్రియాధాతువుగూడా ఈ ప్రాచీన 'ఒ' ధాతుజన్యమే. తెలుగు 'యొక్క' విభక్తికి 'చెందిన, సంబంధించిన' అనే అర్థాలవల్ల అది ధాతుజన్యవిశేషణమై ఉండాలి; 'తగు' : 'తగ్గ' లాగా ప్రాచీన *ఒక్ ధాతువునించి 'ఒక్క' అనే విశేషణరూపం ఏర్పడి ఉండవచ్చు. ఇదే –ఇ, –అ అనే ఆగమాలకు పరంగా వచ్చినప్పుడు విసంధిలో యడాగమంవచ్చి 'యొక్క' అయి ఉంటుంది. అర్థాలు: 'ఒప్పిన, కూడిన, సరిపడ్డ' అనేవి. తమిళంలో 'ఒక్కల్' అంటే 'సంబంధులు, చుట్టాలు' అని తిరుక్కుఱళ్‌లో ప్రయోగం ఉంది. మరి, *ఒక్ అనే ధాతువునించి ఏర్పడ్డ క్రియారూపం మరేదీ లేదే అనవచ్చు. ఇది అసాధారణం కాదు. *ఊరు 'మాట్లాడు' ధాతువు నించి ఏర్పడ్డదే 'ఊరక' అనే వ్యతిరేకక్త్వార్థకం. అలాటిదే 'మిన్నక' కూడా. అలానే ప్రాచీనాంధ్రంలో *ఉఱు 'లక్ష్యపెట్టు' ధాతువునించి ఏర్పడ్డ వ్యతిరేకక్రియలే (ఉఱఁడు, ఉఱక, మొదలైనవి) అప్పటిభాషలో నిలిచిఉన్నాయి. 'ఒక్క/యొక్క' అనే క్రియారూపం చదువుకొన్నవాళ్ళ వాడుకలో నన్నయ్య కాలానికి ముందే ఉండిఉండాలి; దాని చరిత్ర పోల్చుకోరాని రీతిలో ఉండటంవల్ల –యొక్క అనేదే దాని యదార్థరూపంగా గుర్తించి ఉండవచ్చు. ద్రుతనకారపరంగా వచ్చిన –ఉండి క్రియను –నుండి గా వ్యాకర్తలు పరిగణించటం గూడా ఇలాటిదే. అందుకనే ఇది అధ్యాపకులనుంచి విద్యార్థులకు వాళ్ళనుంచి ఇతర విద్యావంతులకు సంక్రమించి ఉంటుంది. బాలసరస్వతీయం ఆనాటి పండితుల పారంచెప్పే వాడుకభాషకు ప్రతిబింబం. 'యొక్క' విభక్తి ప్రయోగం దీంట్లో చాలా ఎక్కువగా కనిపిస్తుంది.

---

*ఈవ్యాసం నా అధ్యాపక జీవితంలో రాసిన మొట్టమొదటి పరిశోధనవ్యాసం. బహుశా 1950 ప్రాంతంలో ఆంగ్లంలో రాశాను. దాని తెలుగు అనువాదం 1951లో త్రిలింగలో అచ్చయిన గుర్తు కాని అది దొరకలేదు. అందువల్ల ఇప్పుడు ఈ సంకలనంకోసం మళ్ళీ అనువాదం చేశాను.

పరిశీలించినగ్రంథాలు

| గ్రంథం పేరు | కర్త |
| --- | --- |
| ఆంధ్రశబ్దచింతామణి | ? నన్నయ్య |
| ఆంధ్రభాషాభూషణము | మూలఘటిక కేతన |
| కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దన |
| ఆంధ్రకౌముది | గణపవరపు వేంకటకవి |
| అహోబలపండితీయం | అహోబలపతి |
| సర్వలక్షణసారసంగ్రహము | కూచిమంచి తిమ్మకవి |
| బాలవ్యాకరణము | పరవస్తు చిన్నయసూరి |
| ప్రౌఢవ్యాకరణము | బహుజనపల్లి సీతారామాచార్యులు |
| పండితారాధ్యచరిత్ర | పాల్కురికి సోమన (చిలుకూరి నారాయణరావు సంపాదన) |
| రాయవాచకము | విశ్వనాథనాయకుడి స్థానాపతి |
| బాలసరస్వతీయము | బాలసరస్వతి |
| ఆంధ్రభాషావికాసము | గంటి జోగిసోమయాజి |
| భాషోత్పత్తిక్రమము | కోరాడ రామకృష్ణయ్య |

*South Indian Inscriptions*, Vol. VI

*Nellore District Inscriptions*, Vol. II

# 9

# అరకులోయభాష : ఆంధ్రంతో సంబంధం

విశాఖపట్టణానికి వాయవ్యంగా డెబ్బై మైళ్ళ దూరంలో అరకులోయ ఉంది. ఆచుట్టుపక్కల కొండల్లో, దూరదూరంగా ఇళ్ళుకట్టుకొని నివసించే ఆదివాసి జాతులెన్నో ఉన్నాయి. బగత, కొట్య, మొలియ, పైండి, డొంబు, వాల్మీక, మూకదొర, కొండదొర, సామంతు – ఇక్కడ కొన్ని ప్రధానమైన కొండతెగలు. వీటన్నిటిలోను పెద్దకులం బగత. 'బగత' భక్తశబ్దభవం. వీళ్ళూ, కొట్యాలు, మూకదొరలు, గోమాంసం వర్జించటంవల్ల మిగిలిన కొండతెగలకన్నా తాము గొప్పవాళ్ళమని చెప్పుకుంటారు. కొండదొరలు, సామంతులు తప్ప మిగిలిన తెగలకు ప్రత్యేకమైన భాష లేదు. వాళ్ళ మాతృభాష ఒక రకం ఓఢ్రభాషాపభ్రంశం. కొద్దిపాటి తెలుగు అక్కడి అన్ని తెగలవారూ మాట్లాడగలరు. కొండదొరలకు, సామంతులకు స్వతంత్రభాషలున్నాయి. సామంతులు వాళ్ళని వాళ్ళు 'కువి-కువిజ' (బహువచనం) అని పిలుచుకుంటారు. వీళ్ళనే సాలూరు ప్రాంతంలో 'జాతాపు దొరలు, కోందులు' అని కూడా అంటారు. కాని కోందులనే పేరు వాళ్ళు సహించరు. ఏకారణంవల్లనో అది ప్రస్తుతం నీచార్థద్యోతకం అయింది. సామంతులు కులపెద్దను 'హమన్త' అంటారు. ఇది సామంతశబ్దభవం. వీళ్ళు మాట్లాడేది 'కువి' లేక 'ఖోన్డ్' అనే పేరు గల ద్రావిడభాష. 'కొండదొర' (కొండదొరల మొదటి పేరు

అసలు అది కాదు) అన్నది తెలుగువాళ్ళు తమకిచ్చిన పేరని వాళ్ళు చెప్తారు. వీరి భాషను 'కూబిభాష' అని గాని 'కొండభాష' అని గాని అనవచ్చు. సాంఘికంగా వీళ్ళు బగత, కొట్య, మూకదొరలకన్నా తక్కువ; మిగిలిన తెగలకన్నా ఎక్కువ. వీళ్ళనే కొండకాపులు, కొండపొరొజ (ప్రజ)లు, పాండవరైతులు అని గూడా కొన్ని ప్రాంతాల్లో అంటారు. వీళ్ల మాట్లాడే 'కూబి' భాష, సామంతులు లేక జాతాపు దొరలు మాట్లాడే 'కువి' భాష, ఒరిస్సా దక్షిణజిల్లాల్లో 'ఖోన్డు'లనే మరొక కొండతెగ మాట్లాడే 'కూయి' భాష చాలావరకు సన్నిహిత నిర్మాణం కలవి. 'కూ' లేక 'కూయి' అంటే పర్వతం, 'కూఞ' అంటే పర్వతవాసి. సంధిలో వచ్చిన 'యవ'ల వల్ల 'కూయి, కూవి' శబ్దాలూ, ఓఢ్రభాషాసాహచర్యంవల్ల 'వ' కారం 'బ' కారంగా మారి 'కూబి' శబ్దం ఏర్పడ్డాయి. బహుశా, సుమారు పది పన్నెండు శతాబ్దుల కిందట ఈమూడూ ఒకే ఒక భాషకు మాండలికాలుగా ఉండి ఉంటాయి. ఆమూలభాష ప్రాచీనద్రావిడభాషాశాఖల్లో ఒకటి.

ఒకశతాబ్ది కిందట కాల్డ్వెల్ రాసిన ద్రావిడభాషావ్యాకరణంలో ద్రావిడభాషలు పన్నెండని మాత్రమే పేర్కొన్నాడు. కాని, గడిచిన ఏభై యేళ్ళలో జరిగిన పరిశోధనల ఫలితంగా ఇప్పటికి తేలిన ద్రావిడభాషల మొత్తం సంఖ్య ఇరవైనాలుగు. వాటిని నాలుగు ప్రాంతీయగణాలుగా విభజించవచ్చు: 1. దక్షిణద్రావిడభాషలు (9): తమిళం, మలయాళం, కన్నడం, తుళు, కొడగు, ఇరుళ, బడగ, తొద, కోత; 2. దక్షిణమధ్యద్రావిడభాషలు (7): తెలుగు, కూయి, కువి, కూబి (కొండ), గోండి, పెంగొ, మండ; 3. మధ్యద్రావిడ భాషలు (5): పర్జి, ఒల్లారి, గదబ, కోలామి, నాయకి; 4. ఉత్తరద్రావిడ భాషలు (3): కురుఖ్, మాల్తో, బ్రాహూయీ.* ఇవి గాక ఇంకా మరుగు పడ్డవి ఎన్నో ఉండవచ్చు. కొండ (కూబి) భాష ప్రత్యేకభాషగా ఇటీవలనే గుర్తించబడ్డది. 1951 సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం ఈ భాష మాట్లాడేవారి సంఖ్య 14,052. అరకులోయ బ్లాకులో 900 దాకా కొండదొరల ఇళ్ళున్నాయి. ఇంటికి సగటున నలుగురి చొప్పున లెక్కించినా, ఆంధ్రప్రాంతంలో వీళ్ళ జనాభా 3600; మిగిలిన పదివేల చిల్లర తక్కిన ఏజన్సీప్రాంతంలోనూ ఒరిస్సాలోని కోరాపుట్ జిల్లాలోనూ ఉండవచ్చు. ఈభాషాప్రధానలక్షణాలను సంగ్రహంగా ప్రదర్శించి, తెలుగుతోను, మిగిలిన ముఖ్య ద్రావిడభాషలతోను పోల్చిచూపటమే ఈవ్యాసం ఉద్దేశం.

* నాలుగు గణాలు చెయ్యటం ఇటీవలి పరిగణనం ఈ వ్యాసం రాసే నాటికి పెంగొ, మండ భాషలు వెలుగు చూడలేదు

## వర్ణాలు : చరిత్ర

కొండ లేక కూబి భాషలోని వర్ణాలను ఈ కింది గుర్తులతో సూచించవచ్చు:

హల్లులు

| | కంఠమూలీయ | కంఠ్య | తాలవ్య | మూర్ధన్య | దంతమూలీయ | దంత్య | ఓష్ఠ్య |
|---|---|---|---|---|---|---|---|
| స్పర్శాలు | ʔ | క గ | | ట డ | | త ద | ప బ |
| కంపితం | | | | | ఱ్హ ఱ | | |
| శిథిలస్పర్శం | | | | ఢ | | | |
| ఊష్మాలు | హ | | | | స జ | | |
| అనునాసికాలు | | ఙ | | ణ | న | | మ |
| రేఫం | | | | | ర | | |
| పార్శ్వికం | | | | | ల | | |
| అంతస్థాలు | | | య | | | | వ |

అచ్చులు

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఒ, ఓ.

హల్వర్ణాల్లో /ʔ క ట త ప ఱ్హ స/ పరుషాలు లేక శ్వాసవంతాలు (voiceless); /గ డ ద బ ఢ ఙ ణ న మ ర ఱ హ య జ వ ల/ సరళాలు లేక నాదవంతాలు (voiced).

ఈభాషకు విలక్షణమైన వర్ణాల్లో /ʔ/ ఒకటి. దీన్ని ఆంగ్లంలో '*glottal stop*' అంటారు. నాదతంత్రులే స్థానకరణాలుగా జరిగే వాయుస్తంభనస్ఫోటన వల్ల ఈధ్వని ఏర్పడుతుంది. తెలుగువాళ్ళు అ-ఆ, ఇ-ఈ, ఉ-ఊ అని అక్షరాలు చదివేటప్పుడు ప్రతి రెండు ధ్వనులమధ్య గొంతులో ఏర్పడే తాత్కాలికవాయు నిరోధమే ఈధ్వని లక్షణం. కొండభాషలో అది అర్థభేదకమైన ధ్వని కాబట్టి ప్రత్యేకవర్ణంగా గ్రహించాలి. రవర్ణం తెలుగులోని సాధురేఫ లాగానే ఈషత్కంపితం. ఱవర్ణం తెలుగులో ద్విరుక్తమైన రకారంలాగా (గొర్రె, బర్రె - ఇత్యాదుల్లో లాగా) అధికకంపితం. దీనికి సరియైన శ్వాసవర్ణం 'ఱ్హ'; సంకేతాంతరం లేక రెండు గుర్తులతో రాసినా, దీన్ని ఒకే ధ్వనికి గుర్తుగా భావించాలి. జవర్ణం తెలుగులోని

జ జే లాగా కాక, ఆంగ్లంలో zoo, zero మొదలైన శబ్దాల్లోని 'z' లాగా ఉంటుంది. స, ఝ- లు క్రమంగా పరుష సరళాలు. మిగిలిన వర్ణాల ఉచ్చారణ చాలావరకు తెలుగులోలాగానే ఉంటుంది. ఈ భాషలోని / ఢ/ వర్ణం మటుకు తెలుగులో ప్రత్యేకవర్ణత్వం లేకుండా అచ్చులమధ్య 'గడ, మడత' మొదలైన చోట్ల ఉచ్చరించే ఢకారంలాగే ఉంటుంది. హిందీలోని 'పూఢీ, గాఢీ' మొదలైన చోట్ల ఉన్నది ఈ శిథిలఢకారమే. కాని తెలుగులోలాగా గాక కొండ భాషలో డ, ఢ- లు ప్రత్యేక వర్ణాలు, ఉదా: గఢ = చెరుకుగడ; గడ = ఏరు, గడ్డ.

కొండభాషలో మాండలికభేదాలు విస్తృతంగా కనిపిస్తాయి. అరకు లోయలో ఉన్న 'కొండ' వ్యవహారం కన్నా, ఒరిస్సా సరిహద్దు నానుకొని ఉన్న కొండగ్రామాల్లో వాళ్ళ వ్యవహారం కొంత విలక్షణంగా ఉంటుంది. ఈ భాషలో ప్రతిపదంలోని రెండోఅచ్చుమీద ఊనిక ఉంటుంది. పదం మొదటిఅచ్చు హ్రస్వమైనప్పుడు, రెండోఅచ్చుపైన ఉన్న ఈఊనిక మరింత స్పష్టంగా తెలుస్తుంది. దీనివల్ల రెండోఅచ్చు మొదటిఅచ్చుకన్నా దీర్ఘతరంగానూ, బిగ్గరగానూ వినిపిస్తుంది. ఉదా. మరన్ = చెట్టు; సరస్ = పాము; పఢయ్ = పాత, అనే పదాలు అరకులోయ ప్రాంతంలో 'మరాన్, సరాస్, పఢాయ్' అని వినిపిస్తాయి. ఈపదాలకు సమానరూపాలు అరకులోయకు పదిమైళ్ళ దూరంలో ఉన్న 'సొవ్వ' అనే సరిహద్దు గ్రామంలో 'మ్రాను, స్రాసు, ప్ఢాయి' అని ఉచ్చరిస్తారు. వీటికి సరియైన తెలుగురూపాలు ప్రాచీనభాషలోని మ్రాను, త్రాచు, ప్రా- (=ప్రాత) అన్నవి. నన్నయ్యకు పూర్వపు తెలుగుశాసనాల్లో కనిపించే 'వాన్డు, మూన్డు' అనే శబ్దాలు, క్రీ.శ. 9వ శతాబ్దినాటికే వాణ్డు, మూణ్డుగా మారి, ఆదికావ్యకాలం నాటికి వాఁడు, మూఁడు ('ఁ' అనునాసిక్యానికి గుర్తు)గా రూపొంది, ఆతరువాత నేటి వాడు, మూడుగా ఏర్పడ్డాయి. కాని కొండ భాషలో ఇప్పటికీ మన ప్రాచీనశాసనరూపాలకు దగ్గరైన 'న్ట' సహిత రూపాలు ఉచ్చారణలో ఉన్నాయి. చారిత్రకంగా ప్రాచీనతమిళంలోను, ప్రాచీనాంధ్రం లోనూ మాత్రమే ఈ వర్ణసంయోజనం కనిపిస్తుంది.

ఉదాహరణలు:

(కొం. = కొండ; త. = తమిళం; మ. = మలయాళం; క. = కన్నడం; తె. = తెలుగు; ప్రా. = ప్రాచీన-)

కొం. ఉన్టి; త. ఒన్టు; తె. ఒణ్డు; క. ఒన్దు.

కొం. నిన్ను; తె. నిణ్ణు.

కొం. నేన్ను; త. ఞాన్ను; ప్రా.తె. నేణ్ణు, నేఁడు.

కొం. పన్ని; ప్రా.త. పన్ని; తె. పన్ని; క. పన్ని, హన్ని.

కొం. మూన్ని; త. మూన్ను; ప్రా.తె. మూన్ను, మూణ్ణు, మూఁడు; తె. మూడు; క. మూఱు (కన్నడరూపంలో దీర్ఘంమీద హల్లుకుముందు అనునాసికం లోపించటం సహజం.)

కొం. వాన్ను; ప్రా.తె. వాన్ను, వాణ్ణు, వాఁడు; తె. వాడు.

తెలుగులోనూ మిగిలిన ద్రావిడభాషల్లోనూ ఏనాడో పోయిన ర, ఱ లభేదం ఇంకా వీళ్ళ ఉచ్చారణలో ఉంది. ఉదా. ఎఱని = ఎర్రని; ఏఱు = నీరు (తెలుగులో ప్రవాహార్థకమైన 'ఏఱు'కు ఇది సోదరశబ్దం. ప్రా.త. యాఱు; క. అఱు); కఱ్-ని = నల్లని; కుఱి = పొట్టి, కురచ (ప్రా.తె. కుఱు, కుఱుచ); నీఱు = బూడిద (ప్రా తె. నివుఱు, నీఱు; త.క. నీఱు); పిఱ = పిర్ర (ప్రా.తె. పిఱ్ఱి, పిఱుఁదు); మఱి = (ప్రా.తె. మఱియు); ఱెక = రెక్క (ప్రా.తె. ఱెక్క, ఎఱక); ఱెవ = రెప్ప (ప్రా.తె. ఱెప్ప).

తమిళకన్నడాంధ్రాలలో 'ఱ'కారంతో కనిపించని శబ్దాలుకూడా ఈ భాషలో కొన్ని నిలిచిఉన్నాయి. ఉదా. పిఱు = వాన; కొఱు = కోడి; ఱెశా = ఎండ్రకాయ. ఈ కిందిమాటల జంటలో ర-ఱ ల కనిష్ఠభేదం కనిపిస్తుంది. నారు = (పొగ) నారు; నాఱు = ఊరు.

ప్రాచీనద్రావిడంలో ద్విరుక్త ఱ వర్ణం (= ఱ్ఱ) ఈ భాషలో 'ఱ్ఱి' గా మారిపోయింది. కొం. ఉఱ్ఱి; త. ఉఱి; తె. ఉట్టి (ఈ మాటలో తెలుగు-కొండ రూపాలకు పూర్వస్థితిలో *ఉఱ్ఱి అనే రూపం ఉండి ఉండాలి.)

ప్రాచీనద్రావిడ 'ఴ' వర్ణం తమిళం, మలయాళాల్లో కొన్ని మాండలికాల్లో ఈ నాటికీ ఉచ్చారణలో ఉంది. అది తెలుగులో క్రీ.శ. 7, 8 శతాబ్దులకే భిన్నపరిసరాల్లో 'డ, ర'లు గాను, కన్నడంలో 'ళ, ర'లు గాను మారిపోయింది. ఈవర్ణం కొండభాషలో అంతటా 'ఢ' (శిథిలఢకారం) వర్ణంగా మారింది.

కొం. ఏఢు; త. ఏఴ్; ప్రా.తె. ఏడు; తె. ఏడు (=7); క. ఏళు.

కొం. కొఢొ; త. కుఴన్తై; తె. కొడుకు.

కొం. కొఢ్వు; త. కొటు; తె. క్రొవ్వు; క. కొర్బు.

కొం. ఢూ- (క్రియ); త. ఉటు; ప్రా.తె. ఉుక్కు; తె. దుక్కు, దున్ను.

ప్రాచీనద్రావిడ *ళవర్ణం కొండభాషలో అరకులోయ మాండలికంలో లవర్ణంగాను, దానికి పశ్చిమోత్తర మాండలికాల్లో ఢవర్ణంగాను మారుతుంది. ఇది తమిళకన్నడాల్లో ఇంకా నిలిచిఉంది; తెలుగులో క్రీ.శ 8వ శతాబ్దినాటికే లవర్ణంగా మారిపోయింది. ఉదా.:

కొం. ఆలు, ఆఢు (=భార్య); త. ఆళ్; తె. ఆలు; క. ఆళ్.

కొం. కలు, కఢు; త. కళ్; తె. కలు, కల్లు.

తెలుగులో నవర్ణంగా మారిన ప్రాచీనద్రావిడ *ణ వర్ణం ఈ భాషలో తమిళ కన్నడాల్లో లాగా ఇంకా నిలిచింది. ఉదా.:

కొం. పణి; త. పణి; ప్రా.తె. పణి; తె. పని.

కొం. కణు, కణ్కు; త. కణ్; ప్రా.తె. కణి (= చూచి, క్త్వార్థంగా); తె. కను, కన్ను; క. కణ్, కణ్ణు.

ఈ భాషలోని జవర్ణం ప్రాచీన ద్రావిడ *జ్కు వర్ణ సంయోజనంవల్ల ఏర్పడ్డది. ఉదా. కొం. డాజ్ = దాగు; ప్రా.తె. డాంగు, డాఁగు, అడంగు, అడఁగు; త. అటఙ్కు; క. అడంగు, అడగు.

/ɔ/ వర్ణం ప్రాచీన 'వ, గ'ల నుంచి ఏర్పడ్డది.

ప్రాచీనాంధ్రంలో వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడ్డ పదాది డవర్ణం అర్వాచీన భాషలో క్రమంగా దవర్ణంతో కలిసిపోయింది. ఉదా. డిగ్గు, డిగు > దిగ్గు, దిగు; డాఁగు > దాఁగు; డగ్గర > దగ్గర, మొదలైనవి. ఇప్పటికీ కొండభాషలో డిగ్ (=దిగు), డిప్ (=దించు); డాజ్ (=దాగు), డాప్ (=దాచు); డగ్టు(= దగ్గర) అనే ఉచ్చారణలు వినిపిస్తాయి.

పై నిరూపణనుబట్టి తేలిన సారాంశం: చారిత్రకంగా కొండభాషలోని వర్ణనిర్మాణం నేటి తెలుగుకన్నా ప్రాఙ్నన్నయ శాసనభాషకు చాలా సన్నిహితంగా కనిపిస్తుంది. దీన్ని బట్టి నేటి కూయి, కువి, కూబి భాషలు మాండలికాలుగా ఉన్న మూలభాషలో, కూబి మాండలికానికీ, ప్రాచీనాంధ్రానికీ ఎక్కువ జననరూప సన్నిహితత్వం ఉండి ఉండాలి.

# వ్యాకరణం

**విశేష్యాలు**

ఈ భాషలోని నామపదాలను మహత్తులనీ, అమహత్తులనీ విభజించవచ్చు. పురుషవాచకశబ్దాలు మహత్తులు. తదితరశబ్దాలు అమహత్తులు. ఏకవచనంలోనూ, బహువచనంలోనూ ఇదే పద్ధతి. తెలుగులోవలె గాక స్త్రీ వాచకశబ్దాలు రెండు వచనాల్లోనూ అమహత్తుల్లాగానే ప్రవర్తిస్తాయి. ఉదా. వాన్లు వాతన్ = వాడు వచ్చాడు; వార్ వాతర్ = వారు వచ్చారు (పురుషులు మాత్రం); అది వాతద్ = అది వచ్చింది (స్త్రీ తిర్యగ్జడాలు); అవి వాతె = అవి వచ్చాయి (స్త్రీ తిర్యగ్జడాలు).

మహద్బహువచన ప్రత్యయాలు 'ర్, రు' వర్ణాలు; అమహద్బహువచన ప్రత్యయాలు 'క్/కు, జ్/జు' వర్ణాలు. ఉదా.:

**మహత్తులు**

| ఏక. | బహు. |
|---|---|
| అనసి (=అన్న) | అనసిర్ (అన్నలు) |
| కొడ్డా (=పిల్ల) | కొడ్డార్ (=మగపిల్లలు)<br>కొడ్డాక్ (=ఆడపిల్లలు) |
| అయెన్ / ఎయెన్ (= ఎవడు) | అయెర్ / ఎయెర్ (= ఎవరు) |

**అమహత్తులు**

| | |
|---|---|
| మరన్ (=చెట్టు) | మరక్ (=చెట్లు) |
| గుఱమ్ (=గుర్రం) | గుఱమ్కు (=గుర్రాలు) |
| పెని (=పేను) | పెన్కు (=పేలు) |
| డుపి (=దుప్పి) | డుపిజ్ ( = దుప్పులు) |
| ప్లేను (= ఎముక) | ప్లేకు (= ఎముకలు; చూ. ప్రా.తె. ప్రేఁగులు) |

ఈ భాషలో నామవిభక్తులు నాలుగు: షష్ఠి లేక ద్వితీయాది విభక్త్యంగం, ద్వితీయ–చతుర్థి, తృతీయ–పంచమి, సప్తమి. ద్వితీయాది విభక్త్యంగం ఏక వచనంలో –తి/–ది, బహువచనంలో –అ, –ఇ అనే ప్రత్యయాలు చేరటంవల్ల ఏర్పడుతుంది. ఈరూపం సంబంధార్థబోధకం (షష్ఠి) కూడా అవుతుంది.

ద్వితీయ–చతుర్థి ప్రత్యయం –జ్; తృతీయ–పంచమి ప్రత్యయం –అణ్ఢ్; సప్తమీ ప్రత్యయం –ఉ. అమహత్తుల్లో ప్రథమావిభక్తి రూపాలే ద్వితీయా విభక్త్యర్థంలో కూడా వైకల్పికంగా రావచ్చు. ఉదా.:

అమహత్తు (మరన్ =చెట్టు)

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్రథమ | మరన్ (=చెట్టు) | మర–క్ (=చెట్లు) |
| షష్ఠి (ద్వితీయాద్యంగం) | మర–తి (చెట్టుయొక్క) | మరక్–అ (=చెట్లయొక్క) |
| ద్వితీయ } చతుర్థి | మరన్, మరన్–దిజ్ (= చెట్టును, చెట్టుకు) | మరక్–అ–జ్ (= చెట్లను,చెట్లకు) |
| తృతీయ } పంచమి | మర–త్–అణ్ఢ్ (=చెట్టుచేత,చెట్టునుంచి) | *? |
| సప్తమి | మరత్–ఉ (=చెట్టులో, చెట్టుపై) | ? |

మహత్తు (కొఢొ = పిల్లవాడు)

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్రథమ | కొఢొ | కొఢొ–ర్ |
| షష్ఠి | కొఢొ–ది– | కొఢొ–ర్–ఇ– |
| ద్వితీయ, చతుర్థి | కొఢొ–ది–జ్ | కొఢొ–ర్–ఇ–జ్ |
| తృతీయ, పంచమి | కొఢొ–ద్–అణ్ఢ్ | ? |
| సప్తమి | కొఢొ–ద్–ఉ | ? |

ప్రథమపురుష సర్వనామాల్లో ద్వితీయాది విభక్త్యంగం '–ఇ' ప్రత్యయం వల్ల ఏర్పడుతుంది. ఉదా. వాన్డు: వని– (తె. వాడు: వాని); వార్ : వరి– (తె. వారు: వారి).

* ప్రశ్నగుర్తులున్నచోట సరియైన రూపాలు నా సేకరణలో ఎక్కడా తగల్లేదు.

సర్వనామాలు

ప్రథమావిభక్తిలోనూ, ప్రథమేతరవిభక్తుల్లోనూ వచ్చే సార్వనామిక ప్రాతిపదికలు:

| | ఏక. | బహు. |
|---|---|---|
| ఉత్తమపురుష | నాన్ : నా– (= నేను : నా–) | మాప్ : మా– (= మేము : మా–) |
| | | మాట్: మా– (= మనము : మన–) |
| మధ్యమపురుష | నీన్ : నీ– (= నీవు : నీ–) | మీర్ : మీ– (= మీరు : మీ–) |
| ప్రథమపురుష | వాన్డు : వని– (= వాడు : వాని–) | వార్ : వరి– (= వారు : వారి–) |
| | వేన్డు : వెని– (= వీడు : వీని–) | వేర్ : వెరి– (= వీరు : వీరి–) |
| | అది : దని– (= అది : దాని–) | అవి : వన్కు– (= అవి : వాని–) |
| | ఇది : దెని– (= ఇది : దీని–) | ఇవి : వెన్కు– (= ఇవి : వీని–) |

తమిళమలయాళకన్నడాల్లో ద్వితీయాది విభక్త్యంగాలు ఉత్తమపురుషలో ఎన్–/నన్–, ఎమ్/నమ్– అనీ, మధ్యమ పురుషలో నిన్–/నిమ్– అనీ ఉంటాయి. వీటితో పోలిస్తే కొండభాషలో సర్వనామాల ద్వితీయాది విభక్త్యంగాలు దక్షిణ ద్రావిడభాషల కన్నా తెలుగు రూపాలకే దగ్గరగా ఉన్నాయి.

సంఖ్యావాచకాలు

ఈభాషలో ఒకటినించి నాలుగువరకు పరంపరగా వచ్చిన సంఖ్యా వాచకాలు నిలిచిఉన్నాయి. ఐదుకు పైవన్నీ తెలుగునించి ప్రాచీనస్థితిలోనే ఎరవు తీసుకొన్నవిగా కనబడతాయి.

కొం. ఉన్ణి = ఒకటి; ఒరెన్ = ఒక్కడు (మహత్తు); ఏవార్థకం చేరినప్పుడు: ఒరేన్డె = ఒక్కడే; ఒర్సు–ఒకసారి. త. ఒన్డు = ఒకటి; ఒరువన్ = ఒక్కడు. క. ఒందు; ఒబ్బను (పూర్వరూపాలు: < *ఒర్బను < *ఒర్వను); ప్రా. తె. ఒరుఁడు = ఒక్కడు, అన్యుడు (చూ. ఒండొరులు = ఒకరి నొకరు).

కొం. రుణ్ణి = రెండు; రిఎర్ = ఇద్దరు; రినేణ్డ్ = రెన్నాళ్లు. త. ఇరణ్డు = రెండు; ఇరువర్ = ఇద్దరు. క. ఎరడు; ఇబ్బరు (పూర్వరూపాలు: < *ఇర్బరు < *ఇర్వర్). తె. రెండు; ఇద్దఱు (పూర్వరూపం: < *ఇర్–దఱు).

కొం. మూన్ణి = మూడు; మువఎర్ = ముగ్గురు; మునేణ్డ్ = మూణ్ణాళ్ళు.

ప్రా.త. మూన్ఱు = మూడు; మూవర్ = ముగ్గురు. తె. మూడు (పూర్వరూపాలు: మూన్ఱు, మూణ్డు, మూఁడు); మూవురు, మూగురు, ముయ్యురు, ముగురు. క. మూఱు, మూరు (= మూడు), మూవర్ = ముగ్గురు.

కొం. నాల్గి = నాలుగు; నాల్ఎర్ = నలుగురు. త. నాల్, నాఌ్కు (= నాలుగు); నాల్వర్ (= నలుగురు). తె. నాల్గు; నలుగురు. క. నాల్కు; నాల్వర్ = నలుగురు.

మిగిలిన సంఖ్యావాచకాలు: కొం. అయ్దు, ఆఱు, ఏడు, తొమ్మిది, పది. ఇవి తెలుగునించి ఎరవు తెచ్చుకున్నవి.

క్రియలు

ధాతువులు కొన్ని అజంతాలు; కొన్ని హలంతాలు. సాధారణంగా రెండక్షరాలకు (syllables) మించిన ధాతువులు లేవు. ఏకాచ్కధాతువుల సంఖ్యే ఎక్కువ. ఉదా: ఆ- = అగు; కి- = చేయు; వూ- = వూచు; అల్- = అల్లు; అడి- = అడ్డగించు; తిర్వి- = తిరుగు.

స్వార్థ, ప్రేరణార్థక ధాతువులు తుదియక్షరంలో సరళపరుషవర్ణభేదంతో కొన్నిచోట్ల తమిళ పద్ధతితో తుల్యంగా ఉంటాయి. ఉదా. త. అటఙ్కు = అడఁగు; అటక్కు = అడఁచు; తిరుమ్బు = తిరుగు: తిరుప్పు = త్రిప్పు. అలాగే కొండభాషలో నిజ్ = లేచు; నిక్- = లేపు; తెవ్- = తెగు; తెప్ = తెంచు; నిణ్ = నిండు; నిణ్ణ్ = నింపు.

కొన్ని చోట్ల తెలుగుమార్గాన్ని తలపించే 'పు' వర్ణకాదేశం కనిపిస్తుంది. చూ. తె. జరుగు, జరుపు; డిగు, డింపు; తిరుగు, తిప్పు; మొదలైనవి. అలాగే. కొం. డాజ్ = డాగు; డాప్ = డాచు; డిగ్ = దిగు; డిప్ = దింపు; నిల్ = నిలుచు; నిల్ప్ = నిలుపు; మొదలైనవి.

కొన్నిచోట్ల -ఇస్/-పిస్ ప్రత్యయాలను ఆగమాలుగా చేర్చటంవల్ల ప్రేరణార్థక ధాతువులు ఏర్పడతాయి. ఉదా: డస్- = దంచు, డసిస్-/డస్పిస్ = దంపించు; కి- = చేయు, కిబిస్- = చేయించు; పెట్గ్ = పైకెత్తు, పెట్గిస్- = పైకెత్తించు (బరువులు). ఈప్రత్యయాలు తెలుగులోని -ఇంచు/-పించు (చేయించు, అనిపించు) లతోను, కన్నడంలోని ప్రేరణార్థకప్రత్యయమైన '-ఇసు' తోను

పోల్చదగ్గవి. నేటి తెలుగులో, -ఇస్/-పిస్ అనే రూపాంతరాలు వ్యవహార భాషలో ఉన్నాయి (చేయిస్తాను, అనిపిస్తాను, మొదలైనవి).

కాలార్థకప్రత్యయాలు

భూతం: -త్/-ఇత్; తద్ధర్మం: -న్; వర్తమానం: -సిన్/-జిన్. మిగిలిన సమాపకక్రియావిభక్తులు: వ్యతిరేకం: -౦; విధి: ఏక.-౦అ, బహు. -దు; వ్యతిరేకవిధి (నిషేధార్థకం): ఏక. -మ, బహు. -మట్.

ఉదా.: (కూక్- = పిలుచు)

| | | | |
|---|---|---|---|
| భూతం | ప్ర. | కూక్-త-అన్ | పిలిచాడు |
| | | కూక్-త్-అర్ | పిలిచారు |
| | | కూక్-త్-అద్ | పిలిచింది |
| | | కూక్-త్-ఎ | పిలిచాయి |
| | మ. | కూక్-త్-ఇ | పిలిచావు |
| | | కూక్-త్-ఇదెర్ | పిలిచారు |
| | ఉ. | కూక్-త్-అ | పిలిచాను |
| | | కూక్-త్-అప్ | పిలిచాము (మేము) |
| | | కూక్- త్-ఆట్ | పిలిచాము (మనం) |
| తద్ధర్మం | ప్ర. | కూక్-న్-అన్ | పిలుస్తాడు |
| వర్తమానం | ప్ర. | కూక్-సిన్-అన్ | పిలుస్తున్నాడు |
| వ్యతిరేకం: | ప్ర. | కూక్-౦-ఎన్ | పిలవడు |
| | | కూక్-౦-ఎర్ | పిలవరు |
| | | కూక్-౦-ఎద్ | పిలవదు |
| | | కూక్-౦-ఎ | పిలవ్వు (అవి-) |

మిగిలిన రూపాలకు పురుషప్రత్యయాలు భూతకాలిక క్రియల్లో లాగానే ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| విధి మధ్యమ | ఏక. | కూక్ -౦-అ | పిలు |
| | బహు. | కూక్-తు | పిలవండి |
| వ్యతిరేకం | ఏక. | కూక్-మ | పిలవకు |
| | బహు. | కూక్-మట్ | పిలవకండి |

అసమాపకక్రియలు

భావార్థకం : -తెజ్/-దెజ్; క్త్వార్థకం : -సి/-జి; వ్యతిరేకక్త్వార్థకం : -ʔఇజ్; ఆనంతర్యార్థకం : -తిజ్; చేదర్థకం : -తిజ; క్రియాజన్యవిశేషణం : -ఇ; భూతం : -తి; తద్ధర్మం : -ని; వ్యతిరేకం : -ʔఇ.

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా.: | భావార్థకం | కూక్-తెజ్ | = | పిలవటం |
| | క్త్వార్థకం | కూక్-సి | = | పిలిచి |
| | వ్యతిరేకక్త్వార్థకం | కూక్-ʔఇజ్ | = | పిలవక, పిలవకుండా |
| | ఆనంతర్యం | కూక్-తిజ్ | = | పిలవగా |
| | చేదర్థకం | కూక్-తిజ | = | పిలిస్తే |

క్రియాజన్యవిశేషణాలు

| | | | |
|---|---|---|---|
| భూతం | కూక్-త్-ఇ | = | పిలిచిన |
| తద్ధర్మం | కూక్-న్-ఇ | = | పిలిచే |
| వర్తమానం | కూక్-సిన్-ఇ | = | పిలుస్తున్న |
| వ్యతిరేకం | కూక్-ʔ-ఇ | = | పిలవని |

భూతార్థక 'త' ప్రత్యయం వరమైనప్పుడు కొన్ని ధాతువుల్లో సంధిగతంగా మార్పులు వస్తాయి. ఉదా.: ఉణ్- = తిను, తాగు; భూతం: ఉటన్ = తిన్నాడు (*ఉణ్-త్-అన్); తద్ధర్మం: ఉణాన్ = తింటాడు (*ఉణ్-న్-అన్). మన్- = ఉండు; విధి: మన్ ʔఅ = ఉండు; మన్దు = ఉండండి; భూతం: మఞ్ఞన్ = ఉండెను (*మన్-త్-అన్). అలాగే, కొల్- = కొను; కొటన్ = కొన్నాడు; కొల్ ʔఅ = (తీసు)కో; కొణ్డు = కొనండి.

చారిత్రకంగా ఈ భూతార్థక -త- వర్ణం అన్ని భాషల్లోనూ కనిపిస్తుంది. ఉదా. తమిళం చెయ్, చెయ్-త్-అన్ (ఉచ్చారణలో శెయ్‌దన్); కన్నడం, గెయ్-ద-ను = చేశాడు; తెలుగులో చేసితిని; అంటిని, మొదలయిన చోట్ల భూతార్థక 'తి, టి' వర్ణాలలో ఉన్నది ఈ ప్రత్యయమే. క్రియాజన్య విశేషణ ప్రత్యయమైన 'ఇ' వర్ణం తెలుగు వ్యతిరేకక్రియా విశేషణ రూపాల్లో చేయని, కొట్టని, మొదలైన చోట్ల కనిపిస్తుంది. కొండ, గోండి భాషల్లో క్త్వార్థకప్రత్యయం -సి, -జి. ఉదా. గోండి కీ- = చేయు; కీ-సి = చేసి; వెన్-జి = విని.

చారిత్రకదృష్టితో చూస్తే తెలుగులో 'ర, ల, డ'లు చివర గల చాలా ధాతువులపై చేరిన క్త్వార్థకప్రత్యయం 'చి' గాని, 'ఇ' కాదు. ఉదా. ప్రా.తె. అర్-చి, విడి-చి, ఓర్-చి, పిలి-చి, నడ-చి, తుడి-చి. ఈ 'చి' వర్ణం ధాతు గతం కాక, భూతార్థక ప్రత్యయం కావటంవల్లనే, 'ముజ్జీత్తులు' పరమైనప్పుడు ఇది లోపించి దీని స్థానంలో సంధిగతంగా 'వ' వస్తున్నది. ఉదా. అర్వన్, అర్వక; ఏడ్వక; ఓర్వని; పిలువన్, పిలువక, పిలు, పిలుము, పిలువుము, పిలుఁడు, పిలువుడు; నడవన్; తుడవన్. అదీ గాక సోదరభాషల్లో ఈ 'చ' వర్ణం ధాతు గతంగా ఎక్కడా లేదు, ఉదా. తమిళంలో అర్-, అఴు-, ఓర్-, విళి-, నట-, తుటై- అనేవే సోదరరూపాలు. తెలుగులో కని-, విని-, మొదలైనచోట్ల క్త్వార్థక ప్రత్యయమైన '-ఇ' వర్ణ సామ్యంవల్లా, 'చి' లోని 'ఇ' క్త్వార్థంగానూ 'చ' ధాతుగతంగానూ భ్రమించటంవల్లా, ప్రక్రియాసౌలభ్యం కోసమూ తెలుగు వ్యాకరణాల్లో '-ఇ' ఒక్కటే క్త్వార్థకప్రత్యయమన్నారు.

పదజాలం

ఒకవైపు తెలుగుతోను, రెండోవైపు ఓఢ్రంతోను సన్నిహిత సంబంధం ఉండటంవల్ల ఈభాషలో రెండువైపులనించి చేరిన ఎరవుమాటలు ఎన్నో ఉన్నాయి. ఉదా. ఓఢ్రంనుంచి వచ్చిన కొన్ని: ఉసుమ్ = వేడి; ఏక్ = ఒక; ఒని = వదినె; కరియ = ఉప్పని; కుమ్బిఢ్ = తాబేలు; కొష్ల = కమలాపండు; కాజీరు = ఖర్జూరం; గతమ్ = ఎరువు, పెంటపోగు; గొర్జ = ఇల్లరికం; గాటు = కొండమీదిదారి; గుణ్డెరి = చీర; గొజ్ఞయ (డుడు) = ముల్లు (గర్ర); తియర్ = తయారు; మొదలైనవి. తెలుగునుంచి వచ్చిన కొన్ని మాత్రం: అన్దెకె = అందుకే; అన = అన్న, అన్సు = అంచు; అయ్యు; అఱు; ఏడు; ఇప = ఇప్పచెట్టు; ఉసుర్, ఊప్రి = ఉసురు, ఊపిరి; ఎర్కె = ఎరుక; ఏణ్డాద్ = ఏడాది; ఒకా = ఒక; కొన = కొన; కొమ = కొమ్మ; మొదలైనవి. ఓఢ్రంనుంచి వచ్చిందీ, తెలుగునుంచి వచ్చిందీ తెలుసుకోటానికి వీలు కాని పదాలు మూడోరకం. అవి ముఖ్యంగా సంస్కృతసమాలు, అన్యదేశ్యాలు. ఉదా. అనమ్ = అన్నం; అదమ్ = అద్దం; అకరు = అఖరు; అగస్ = అకాశం; అసఢ్ = అషాఢమాసం; ఉపకరమ్ = ఉపకారం; ఉపయ్ = ఉపాయం; కోపమ్ = కోపం; మొదలైనవి.

ఈ మూడు రకాల శబ్దాలుపోగా మిగిలిన దేశ్యశబ్దాలు మూలద్రావిడ భాషాజన్యాలయి వరంపరగా వస్తున్నవి ఎన్నో ఉన్నాయి. మచ్చుకు కొన్ని కొండ

భాషలోని దేశ్యపదాలను వాటికి సరియైన తెలుగులోని సోదరశబ్దాలను ఈకింది 'జాబితా'లో ఇచ్చాను. తమిళాది సోదరభాషల్లోనూ వీటికి సరూపశబ్దాలు దొరుకుతాయి గాని, వ్యాసవిస్తరభీతిచేత అవన్నీ అక్కడ ఇవ్వటంలేదు. ఇంతవరకు వ్యాసంలో వచ్చిన కొండభాషాపదాలు గూడా మినహాయించ బడ్డాయి. తెలుగుపదంతో పోలిక దూరంగా ఉన్నచోట తెలుగు మాటకు ముందు 'చూ.' (చూడు) అనే సంకేతం ఉంటుంది. ప్రాచీనాంధ్రపదరూపాలే చాలావరకు సామ్యనిరూపణకు ఉపయోగించేవి కాబట్టి అవే ఇచ్చాను. కొండ భాషాపదానికి అర్థం తెలుగుపదంవల్లనే చాలావరకు తెలుస్తుంది. సందిగ్ధత ఉన్నచోట్లనే అర్థాలు ఇవ్వబడ్డాయి.

నామపదాలు

| కొండ | తెలుగు |
|---|---|
| అపాసి | తండ్రి, అప్ప |
| అము (బహు. అవుర్) | అంబు, అమ్మ |
| అణ్జు (విణా. స్త్రీ) | ఆడు- |
| అట్జు | అట్టు (అట్టులు) |
| ఆల్ (శక్తి) | అలవి |
| ఇని | ఏమి |
| ఇఱ్మ | ఇఱుకు |
| ఈట్జు | ఇట్టు (ఇట్టులు) |
| ఉడ్ము | ఉడుము |
| ఎయొ (ప్రశ్నార్థకం) | ఏ |
| ఒల్ఝా | ఎలుగు (బంటి) |
| ఒఢొల్ | ఒడలు |
| కవు | కంపు |
| కటి (నల్లని) | కట్టి |
| కలమ్, కఢమ్ | కళ్ళం |
| కాకెటి | కాకర (కాయ) |
| కియు (బహు. కికు) | చెయ్యి |
| కిలిజ్ | చిలుము |

| | |
|---|---|
| కుఱు (తొడ) | కుఱువు |
| కుస (ఆకుకూర) | కూర (*కుయిర్ < *కుసిర్) |
| కూరు | కురుపు |
| క్వాఎర్ (కొడవలి) | చూ. కోయు |
| కొఢియ (కోడలు, తమ్ముడిభార్య) | కోడలు |
| కొఱొయ్ | కొఱవి |
| కొడ్వెలి | కొడవలి |
| కోడి | ఆవు |
| గాలు (కూతురు) | చూ. తమిళం మగళ్ |
| గుర్డు (కంటిగుడ్డు) | గ్రుడ్డు |
| గెయ్‌ద | గేదె |
| గొఱాన్ | కొండ (శాసన. క్వొణ్ణ; చూ. త. కుణ్ణమ్) |
| గొఱ్య, గొఱె | గొఱియ, గొఱ్ఱె |
| గోఢి (శిఖరం) | కోడు |
| డుము (ఎముక) | దుమ్ము |
| డోమ | దోమ |
| తన్జి | తండ్రి |
| తియెల్ | దిగులు |
| తివ | తీవ, తీగె (ప్రా. తివ) |
| తుమ్బు | తుమ్ము |
| తుమ్బెటి | తుమ్మెద |
| తూపి (ఎలుకబోను) | చూ. తూరు, తూపు. |
| నమిల్ | నెమలి, నమలి |
| నాజ్సరస్ | నాఁగు (త్రాచు) బాము |
| నాఱు (ఊరు) | నాఁడు |
| నిఱి (నిలువైన) | చూ. నిలుచు, నిట్ట (నిలువు) |
| నియు (నూనె) | నెయ్యి |

| | |
|---|---|
| నిరుణ్డ్ (పోయిన ఏడు) | నిరుఁడు |
| నీఢ | నీడ |
| నెగి (మంచి) | నెగి (శాసనభాష) |
| నేన్టు | నేఁడు (ఈరోజు) |
| నోఱెస్ (పులి) | చూ. నోఱు |
| నోబు (జ్వరం) | నోవు |
| పసిఙ్ | పసుపు |
| పాలు (స్తనం) | చూ. పాలు |
| పాఢ్ విఙ. (పాడుబడ్డ) | పాడు, ప్రా- |
| పిఢియు, ష్ఢియు (బహు.పిఢ్కు) | ప్రువ్వు (పుర్వు, పురుగు) |
| పుణ్టి | పుట్ట |
| పుఢ్గు | పురువు |
| పుయు (బహు. పూజు) | పువ్వు, పూ |
| పుఱె (నీరు తాగే సొరడిప్ప) | చూ. పుణ్టె, బుణ్టి |
| మఱిన్ (కొడుకు) | చూ. మఱఁది |
| ముణ్ట్కి | ముఱికి |
| మేన్డొల్ | మేను |
| ఱివ | రెమ్మ |
| లేజ | లేఁగ |
| లొ౨ఇ(ల్) | లోఁగిలి |
| వణ్ట్తి | వట్టి (ఎండిన) (ప్రా.వణ్టె, వణ్టియ) |
| వెఱి | వెట్టి |
| సిపెర్కుట | చీపురుకట్ట |
| సిసు | చిప్ప |
| సీన్తెల్మరన్ | ఈఁతమ్రాను |
| సీర | సిర |
| సెఱి | జెట్టి |
| సె౨ఇ (చెడు) | సేగి |

| | |
|---|---|
| సేట్లి | చేట |
| సోసు (తాగినమత్తు) | చూ. సొగయు, చొకుç |

క్రియలు

| కొండ | తెలుగు |
|---|---|
| అట్ (కొట్టు) | అడుచు |
| అల్- | అల్లు |
| ఆ- | అగు |
| ఇన్- | అను, చూ. త. ఎన్- |
| ఉన్ద | ఇంద(ము) |
| ఉట్మి | రువ్వు, విసరు |
| ఊరి, ఊర్పి- | ఉరియు, ఉరియించు |
| ఒల్లి- | ఒరలు (విలపించు) |
| కాప్బ్-, కాప్- | కాఁగు, కాఁచు |
| కిన్భ్-, కిస్- | చినుఁగు, చించు |
| కిస్- | గిచ్చు |
| కెఌ్జ్- (మూయు, తలుపువేయు) | చూ. చెఱ |
| కొయ్- | కోయు |
| కొన్-/కొణ్- | కొను (ప్రే. కొలువు) |
| జాటి- | జాట్టు |
| డాట్- | దాటు |
| ఢిఙ్గ్- | మ్రింగు |
| ఢూ- | దున్ను |
| ఢూస్- | దువ్వు, దూయు, డూయు |
| త-/తె- | తెచ్చు, తే |
| తిగి- (అదుము) | తిగియు |
| తీఱ్- (ముగియు) | తీఱు |
| తుట్బి- | తుఱుము |

| | |
|---|---|
| తొఢిఙ్- | తొలుకు (చూ. త. తుళుఙ్కు) |
| దేల్- | తేలు |
| దూఙ్- | తూఁగు |
| నఢి- | నడచు |
| నిగ్-ఢి- (సాగు) | నిగుడు |
| నూట్- | నూరు |
| నొ- | నొచ్చు, నోయు |
| పఱ్- | పఱచు |
| పాట్- | పాడు |
| పూ- | పూచు |
| పెట్- (బరువులెత్తు) | చూ. పెటిక (=ఎద్దు) |
| పెఢెల్-, ప్ఢెల్ - | ప్రేలు (చిట్లు) |
| మక్- (తిరగతిప్పు) | మగుడు, మగుచు |
| మట్- (తిరిగివచ్చు) | మఱలు |
| మర్జి- (నేర్చు) | మరుగు |
| ముఢ్-గ్- (మునుగు) | ముడుగు, బ్రుంగు |
| మెట్స్- | మెరయు, మెరచు |
| రాల్- | రాలు |
| వణ్క్- | వణఁకు |
| వఢ్- | వడియు (నీళ్ళు, మొ॥) |
| వట్- | ఎండు |
| వెయ్-/వె- (వేడెక్కు, కాలు) | వేఁగు (=కాగు) |
| సిల్- (వ్యతిరేకక్రియ) | లే-, లే(దు) |
| సుఢ్ | చూడు, చూచు |

ఈ వ్యాసాన్ని బట్టి సమగ్రమూ, నిర్దుష్టమూ అయిన ద్రావిడ భాషాచరిత్ర రాయటానికి అనాగరికభాషాసామగ్రి ఎంత ఆవశ్యకమో పాఠకులకు విదిత మౌతుంది. ఈ నాటికి చాలామంది విజ్ఞులనబడేవారు కూడా ద్రావిడభాషలంటే గణించదగినవి నాలుగేనని (తమిళమలయాళకన్నడాంధ్రాలు), మిగిలిన అనాగరికభాషలు తులనాత్మక పరిశోధనలో గూడా అప్రధానమైనవనీ

వాదిస్తుంటారు. అటువంటివారికి ఈ వ్యాసం కనువిప్పుగా ఉండగలదని ఈ రచయిత ఆశయం. సాహిత్య విషయంలో ఈ భాషలకు ప్రాధాన్యం లేకపోయినా, భాష పారిశ్రామికసమాజాల్లో మారినంత వేగంగా ఆదిమ (గిరిజన) సమాజాల్లో మారదు. అన్ని దక్షిణద్రావిడ భాషల్లోను జారిపోయిన 'ర-ఱ' ఉచ్చారణ భేదం కొండభాషలో నిల్చిఉండటం దీనికొక తార్కాణం.*

---

* ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి కోరికపై ఇటీవల ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో స్థాపించిన 'ఆదిమజాతి సంస్కృతి పరిశోధక శాఖ' కార్యక్రమం భాగంగా 1958 డిసెంబరు – 1959 మార్చి నెలలమధ్య అరకులోయ ప్రాంతంలో పర్యటించి సేకరించిన 'కొండదొర' భాషాసామగ్రిలో స్వల్ప భాగం మాత్రమే ఈ వ్యాసానికి విషయం. అచిరకాలంలో ఈ పరిశోధనఫలితాలు గ్రంథరూపంలో వెలువడవచ్చు. శ్రీకాకుళం, విశాఖపట్నం ఏజన్సీ ప్రాంతాల్లో గిరిజనభాషలు పరిశోధించటానికి అవకాశాలు కల్పించిన మా విశ్వకళా పరిషత్తు అధికారులకు నా కృతజ్ఞత. కొండభాషా పరిశోధనలో కొంత కాలం నాకు సహాయకులుగా పనిచేసిన శ్రీ తూమాటి దొణప్పగారికి నావినతి. కాని ఈ వ్యాస సామగ్రిలోను రచనలోను ఉన్న తప్పులకూ ఒప్పులకూ బాధ్యత ఈ వ్యాసకర్తదే.

1959 అక్టోబరు భారతిలో ప్రచురించిన 'ధ్వని: వర్ణం' అన్న వ్యాసంలో నిరూపించిన అర్థంలోనే ఈ వ్యాసంలో 'వర్ణం' అన్న పదం ప్రయోగించబడ్డది.

ఈవ్యాసం ఆంధ్రపత్రిక శార్వరి ఉగాది సంచిక 1960-61లో ప్రకటితం. పే. 165- 171.

# 10

# తెలుగు మాండలికాలు : ప్రమాణభాష

## ఉపోద్ఘాతం

జీవద్భాషకు మార్పు సహజం. మార్పువల్ల భాషలో బహురూపత, వైవిధ్యం (variation) ఏర్పడతాయి. ఈ బహురూపత మూడువిధాలు. (1) చారిత్రకం: ఒక కాలంలో ఉన్న రూపాలకు కాలాంతరంలో ఏర్పడ్డ తుల్యరూపాలకు మధ్య తేడాలుంటాయి. ఇప్పటి తెలుగులో 'వాడు' (ప్రథమైక వచనం) రూపానికి పూర్వపూర్వ రూపాలు 'వాఁడు < వాణ్డు < వాన్టు < *అవన్టు' అని. ఇదే విధంగా భాషాభాగాల్లో వచ్చిన మార్పులవల్ల ఆధునికభాష పూర్వభాష నుంచి ఎలా పరిణమించిందో తెలుస్తుంది. (2) ప్రాంతీయం: ఒకే కాలంలో ఒక ప్రాంతంలో ఉన్న వాడుకకు మరొక ప్రాంతంలో ఉన్న వాడుకకు మధ్య సమానశబ్దాల్లోనూ, వ్యాకరణభాగాల్లోనూ తేడాలుండవచ్చు; ఉదా. వచ్చినాడు, వచ్చిండు, వచ్చాడు. ఇలాటివి ప్రాంతీయభేదాలు. (3) సాంఘికం: సాంఘికవ్యవస్థలో ఉన్న మార్పులు—ఆర్థికసాంస్కృతికపరమైనవి—వ్యవహర్తల మాటల్లో ప్రతిఫలిస్తాయి. ఈతేడాలను వర్గమాండలికాలంటారు. చావ/సావ, వెండి/యెండి, లేదు/నేదు, అట్టా/గట్టా మొదలైన మాటలను బట్టి వ్యవహర్త సాంఘిక స్థాయిని గుర్తించవచ్చు. తరగతులనుబట్టి వచ్చే భేదాలు ఒక కాలంలోనే ఒకే ప్రాంతంలోనే ఉండవచ్చు.

పైన పేర్కొన్నవి గాక ఇతర హేతువులవల్ల వ్యవహార వైవిధ్యంలో అవాంతర భేదాలు ఎన్నో రకాలు ఉండవచ్చు; ఉదా. లిఖితభాష/ వాడుకభాష; ఉపన్యాస భాష/ సంభాషణభాష; గృహవ్యవహారం/ బహిరంగవ్యవహారం; అలాగే వృద్ధుల భాష, స్త్రీలభాష, విద్యార్థులభాష, పసిపిల్లలభాష – కొన్ని చోట్ల గుర్తించదగిన తీరుగా ఉంటాయి. తెలంగాణా విద్యార్థుల్లో 'చెమ్సా', 'లైటుగొట్టటం'[1] బాగా వ్యాప్తిలో ఉన్నాయి. ఇవి ఇతరులు వాడరు. కొన్ని రకాల తిట్లు ఆడవాళ్ళ నోటనే వినవస్తాయి. ఇంతే గాక వృత్తులనుబట్టి, వక్తృశ్రోతల పరిచయాన్ని, సందర్భాన్నిబట్టి వాడుకలో మార్పులు కనిపిస్తాయి. తెలుగు మాతృభాషగా మాట్లాడేవాళ్ళ తీరు, ద్వితీయభాషగా మాట్లాడేవాళ్ళ తీరు వేరుగా ఉంటాయి. ఈఅధ్యాయంలో ముఖ్యంగా ప్రాంతీయ, వర్గమాండలికాల స్వరూపమూ, వాటికీ ప్రమాణభాషకూ ఉన్న సంబంధమూ ప్రధానంగా చర్చిస్తాను.

## నేటి తెలుగులో భాషామండలాలు

వృత్తిపదపరిశోధన ఆధారంగా తెలుగునాడును నాలుగు భాషామండలాలుగా విభజించవచ్చునని తేలింది. అవి: (1) పూర్వమండలం (కళింగదేశం: శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం జిల్లాలు), (2) దక్షిణమండలం (రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు), (3) ఉత్తరమండలం (తెలంగాణా; మహబూబ్‌నగర్, ఖమ్మం జిల్లాల్లో కోస్తా రాయలసీమలను ఆనుకొన్న తాలూకాలు ఆయా భాషామండలాల్లో కలుస్తాయి), (4) మధ్యమండలం (ఉభయగోదావరులు, గుంటూరుకృష్ణాజిల్లాలు). ఈకింది వృత్తిపదాల్లో ఆయా మండలాలకే పరిమితమైన విలక్షణశబ్దాలు 'ఇటాలిక్సు'లో సూచించబడ్డాయి.

| | 1<br>పూర్వమండలం<br>(కళింగ) | 2<br>దక్షిణమండలం<br>(రాయలసీమ) | 3<br>ఉత్తరమండలం<br>(తెలంగాణ) | 4<br>మధ్యమండలం<br>(ఇతర కోస్తాలు) |
|---|---|---|---|---|
| 1. | – | తువ్వనేల | దుబ్బనేల | తువ్వనేల |
| 2. | మోట | కపిల | మోట | మోట |
| 3 | మదుం | తూము | తూము | తూము |

| | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|
| 4. | పూజ/పూదు | కాడిమాను/ కాడిమాకు | కాండి/కాణి/ కాని | కాడి |
| 5. | నాగలి | నాగేలి/మడక | నాగలి | నాగలి |
| 6. | మేడి | మేడితోక | పాలె | మేడి |
| 7. | నక్కు | కర్రు/కారు | కర్రు | కర్రు |
| 8. | ఏటికర్ర | నాగ/నగ | ఏటికర్ర/ఏటికోల | ఏడికర్ర |
| 9. | పేడ | పేడ | పెండ | పేడ |
| 10. | ఉండ | గాను/గాలు | గారె/గిర్ర/వయ్యి | చెక్రం |
| 11. | ఆనపకాయ | సొరకాయ | ఆనిగెంకాయ | సొరకాయ |
| 12. | గోంగూర | గోగాకు | పుండికూర/ పుంటికూర | గోంగూర |
| 13. | చోడి (బహు. చోళ్లు) | రాగి | తమిదె | తమిదె |
| 14. | గంటె/గంటె | సద్ద | సజ్జ/సద్ద | సజ్జ |
| 15. | – | వసె/వయ్యి | వయ్యి | – |
| 16. | గాబు | కలువు | కలువు | కలువు |
| 17. | ఎలుగు/కంచె | కంచె/కర | ఎలుగు/కంచె | కంచె |
| 18. | ఆసు | ఆసుమాను | ఆసు/తానె | ఆసు |
| 19. | చిలప | చిలప/ఇచ్చె/చిట్టె | చిట్టె | చిలప/ఇచ్చె |
| 20. | నాడె | నాడె/కొమ్ము | నాడె | నాడె |
| 21. | పైన | వన్నె | వన్నె/వనె | వన్నె/వన్ని/వని |
| 22. | పోము | పోగు | పోగు | పోగు |
| 23. | రాట్నం | రాటం/రాట్నం | రాట్నం | రాట్నం/రాటం |
| 24. | పునాది | బునాది/గునాది/ గునాదరం | బునాది/పునాది | పునాది |
| 25. | చూరు | చూరు/చుంచు | చూరు | చూరు |
| 26. | గొలుసు | చిలుకు | గొండ్లెం | గొండ్లెం |
| 27. | గునపం | గడ్డపార/గడారు | గడ్డపార | గడ్డపలుగు /గడ్డపార |

పై ఉదాహరణలలో 2-17 వ్యవసాయపదాలు. 18-23 చేనేత పదాలు. 24-27 ఇండ్ల కట్టుబడి పదాలు. ఇవి వరుసగా వృత్తిపదకోశ సంపుటాలు 1, 2, 4 నుంచి ఉద్ధరించబడ్డాయి. రెండు మండలాలు కలిసేచోట రెండు రకాల వాడుకలూ వినిపిస్తాయి. ఒకే మండలంలో రెండుమూడు మాటలున్నప్పుడు అవి ఉపమాండలికభేదాలను సూచిస్తాయి.

పై మాండలికవిభజన దేశీయవృత్తుల్లో జానపదులు వాడే భాష ఆధారంగా చేసింది. ఈ రకమైన వృత్తుల్లో ఉన్నవాళ్ళు ఒకచోటినుంచి మరొక చోటికి వలస పోవటం అంతగా జరగదు. అందువల్ల ఈప్రాంతీయభేదాలు ఇటీవల ఏర్పడ్డవి గాక తెలుగుభాషాచరిత్రలో కొన్ని శతాబ్దులుగా పాతుకుపోయినవని చెప్పవచ్చు. ప్రజలమధ్య వ్యవహారప్రాబల్యం సన్నగిల్లటమే ప్రాంతీయభేదాలు ఏర్పడటానికి ప్రధానకారణం. రాజకీయపు సరిహద్దులు, నైసర్గికసీమలు (పర్వతపంక్తులు, నదులు) కూడా భాషామండలాలకు పొలిమేరలవుతాయి. వాటికిరువైపులా ఉన్న వ్యవహర్తలు కలవటం, ఒకరితో ఒకరు మాట్లాడుకోటం తరచుగా జరగదు. ఒక ప్రాంతం వాడుకలో ఏర్పడ్డ నూతనశబ్దాలు, ధ్వనిపరిణామాలు, ఆ ప్రాంతంలోనే వ్యాపించి సరిహద్దు తగిలిన చోట ఆగిపోతాయి. ప్రతిప్రాంతానికి సాంస్కృతికవాణిజ్యకేంద్రంగా ఏదో ఒక పట్టణం ఉంటే పరిసరప్రజల రాకపోకలకు అది కూడలి అవుతుంది. ఈవిధంగా భిన్నభాషామాండలికాలకు భిన్నకేంద్రాలు ఏర్పడవచ్చు.

శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు 16వ శతాబ్దం దాకా కళింగరాజ్య భాగంగా ఉండి మిగిలిన దేశంతో రాజకీయ సంబంధం లేకపోవటం వల్ల అక్కడి పలుకుబళ్ళు మిగిలిన తెలుగుదేశంకంటే విలక్షణంగా ఉంటాయి. మదుం, వూజా (= కాడి), నక్కు, ఉండ (= చెక్రం), ఆనవ, చోడి, గంటె, గాబు (= కలువు), పైన, పన్నె (= దువ్వెన), పోము (= పోగు), గొలుసు (= గొళ్ళెం), గునపం, మొదలైన శబ్దాలు ఈ ప్రాంతానికే విలక్షణంగా ఉన్నాయి. తెలుగు చోడుల కాలంలోను, విజయనగర పరిపాలనలోను ఏకప్రాంతంగా ఉన్న రాయల సీమ, నెల్లూరుజిల్లాల వాడుకలో ఎక్కువ సమరూపత కన్పిస్తుంది. ఈ ప్రాంతానికే విలక్షణంగా ఉన్న మాటలు: కపిల (= మోట), నాగేలి/నాగెల, నాగ, గాను/గాలు, రాగి, వాసి (= ఒకరంగు), కర, కొమ్ము, రాటం, గునాది (= పునాది), చిలుకు, గడారు మొదలైనవి. ఈ ప్రాంతంలోనూ కొన్ని

పలుకుబళ్ళలో పెన్నానదికి ఉత్తరాన ఒకతీరు, దక్షిణాన ఒకతీరు కనిపిస్తుంది: నాగేలి, కర్రు ఉత్తరాన; మడక, కారు దక్షిణాన. తెలంగాణా రాయలసీమలకు కృష్ణా తుంగభద్రలు నైసర్గికసీమలైనట్లు గుర్తించవచ్చు. అదే భాషావ్యవహారంలోనూ ప్రతిబింబిస్తున్నది. కాకతీయులు, మహమ్మదీయులు పరిపాలించిన తెలంగాణా ప్రాంతానికి రాజకీయమైన సరిహద్దే వ్యవహారసీమగా కూడా మనకు కనిపిస్తుంది. ఉర్దూ ప్రభావంవల్ల హైదరాబాదు చుట్టుపట్ల కొన్ని తెలుగు మాటలకు బదులు ఉర్దూ మాటలు వచ్చినా, తెలంగాణా ప్రాంతానికే విలక్షణమైన దేశ్యశబ్దాలు కూడా ఎన్నో ఉన్నాయి. ఉదా. దుబ్బనేల (= సన్నటి ఇసకనేల), కాణి/ కాని (= కాడి), గారె/ గిర్ర (= చెక్రం; హైదరాబాదు చుట్టుపట్ల పయ్యె < ఉర్దూ పహియా), పుండికూర/ పుంటికూర (= గోంగూర), పెండ (= పేడ), చిట్టె (= చిలప), మొదలైనవి. రాజకీయమైన అస్తిమితత్వమే కృష్ణాగోదావరీ మధ్యదేశం ప్రత్యేక భాషామండలంగా కనిపించకపోవటానికి కారణం. అంటే ప్రతిమాట వాడుక లోనూ మిగిలిన మూడు మండలాల్లో ఏదో ఒకదానితో కలవటమే మధ్యాంధ్ర మండలం వ్యవహారంలోని విలక్షణత. దీన్ని మిశ్రవ్యవహారమండలం అనవచ్చు.

### మాండలికపరిశీలనవిధానం

మాండలికపరిశీలన ప్రయోజనదృష్టినిబట్టి ఎన్నో రకాల జరగవచ్చు. (1) ఏదో ఒక 'అర్థం' తీసుకొని ఆ అర్థంలో ప్రతిచోటా ఏమాట వాడతారో ఊరూరూ తిరిగి సేకరించవచ్చు, లేదా 20, 30 మైళ్ళ దూరంలో ఉన్న ఊళ్ళు తిరిగి సేకరించవచ్చు. 'పొలం దున్నే పనిముట్టు' కు నాగలి, నాగేలి, నాగేలు, నాగెల, నాంగలి, మడక అనే మాటలు వాడుకలో ఉన్నట్లు తెలిసింది. ఈ మాటల్లో 'మడక' తప్ప మిగిలినవన్నీ అన్యోన్యం రూపాంతరాలు, అంటే చారిత్రకంగా ఒకే ప్రాచీనశబ్దంనుంచి ఏర్పడ్డవి (< *నాఙ్గేల్); 'మడక' వీటికి పర్యాయపదం. (2) దేశం అంతటా ఒకే శబ్దం ఉచ్చారణ భేదాలతో మాత్రమే ఉంటుందని తెలిసిన కొన్ని మాటలు తీసుకొని ఆయా భేదాలను ధ్వనివిధేయలిపిలో సేకరించటం. 'రేగడి, రేగడ, రేగిడి, రేవడి, రేవడ, రాగడి, రాగిడి' మొదలైన పదాల్లోని రే/ రా, గ/ వ, డ/ డి భేదాలు ఏ ప్రాంతాల్లో వస్తున్నాయి అనే సూక్ష్మపరిశీలన దీనివల్ల సాధ్యమవుతుంది. అలాగే లేక/ లేదు శబ్దాల్లో మొదటి పదంలో 'లే' వివృతం (అకారం పరమైనప్పుడు), రెండో పదంలో సంవృతం (అకారేతరాచ్చు పరమైనప్పుడు). దేశం అంతటా ఈరకంగానే ఉందో లేదో ప్రాంతీయదృష్టితో

పరిశీలించి తెలుసుకోవచ్చు. (3) కొన్ని వ్యాకరణ ప్రక్రియలకు చెందిన విశేషాలను కూడా దేశమంతటా నూటికి పైగా కేంద్రాలను తీసుకొని సేకరించవచ్చు. ఉదా. భూతార్థక ప్రత్యయం—చెప్పాడు, చెప్పినాడు, చెప్పిండు (ఏ/ ఇనా/ ఇన్); లేదా సంధికార్యాలు మొదలైనవి.

ప్రాంతీయభేదాలనే గుర్తించదలుచుకొన్నప్పుడు ఏదో ఒక వర్గానికి చెందిన వారి వాడుకనుంచే ఉద్దేశించిన వివరాలు సేకరించాలి. ఇలా సేరించిన వాడుకకు ఒక్కొక్కదానికి ఒక సంకేతం పెట్టుకొని తెలుగుదేశపటంలో గుర్తించవచ్చు. వాడుక మారిన చోట సంకేతం మారుతుంది. ఈవిధంగా తయారుచేసిన పటాలను మాండలికపటాలంటారు. పదాలు ప్రధానంగా గీచిన పటాలను 'word atlas' అనీ, ధ్వనులు ప్రధానంగా గీచిన పటాలను 'phonetic atlas' అనీ, వ్యాకరణ విశేషాలను లక్ష్యంగా గీచిన పటాలను 'grammatical atlas' అనీ వ్యవహరించవచ్చు. ఇంతవరకు తెలుగులో జరిగిన మాండలికపరిశీలన ప్రధానంగా పదాల వాడుక లక్ష్యంగా చేసింది. అది కూడా భాషామండలాలు నిరూపించే ఉద్దేశంతో చేసింది కాదు; వృత్తుల్లో ఉన్న పదాలను కోశస్థం చేసే దృష్టితో చేసింది. అందువల్ల పై మాండలికనిర్ణయం స్థూలదృష్టితో చేసింది మాత్రమే.

పై విధంగా గీచిన పటాలలో వాడుక మారినచోట గుర్తులు మారుతుంటాయి. అలాటి గుర్తులన్నీ ఒకవైపుకు వచ్చేటట్టు వేరుచేసి పటంలో గీచిన గీతను వ్యవహార భేదకరేఖ (isogloss) అంటారు. ఇలాటి వ్యవహారభేదకరేఖలు చాలా పటాల్లో కలిసి నియతప్రాంతాలను వేరుచేస్తున్నప్పుడు వాటన్నిటినీ బొత్తిగా మరో పటంలో గీయవచ్చు. బొత్తిగా ఏర్పడ్డ వ్యవహారభేదకరేఖలే భాషామండలాలకు సరిహద్దులుగా గుర్తించాలి. అంటే ఒక మండలం వాడుక ఇక్కడ సన్నగిల్లి అక్కణ్ణించి మరోమండలం వాడుక మొదలవుతుంది. పై నిరూపించిన విధానం ఈ అధ్యాయం చివర ఇచ్చిన మచ్చు పటాల్లో చూడవచ్చు.

మాండలికపటాలనుబట్టి ప్రతిపదానికి ఉన్న పుట్టుపూర్వోత్తరాలను గ్రహించవచ్చు. ప్రజలు ఏయే దిక్కుగా వలస పోయిందీ ఊహించవచ్చు. భాషకు సాంఘికరాజకీయచరిత్రకు సమన్వయం పదపటాల్లో గోచరిస్తుంది. ఒక కొత్త మాట ఏదో ఒక కేంద్రంలో పుట్టి చుట్టుప్రక్కల ఎంతదూరం వ్యాపించిందీ తెలుసుకోవచ్చు. ఉదా. పయ్యె (= చక్రం), తుకం (= నారు) అనే మాటలు అన్యదేశ్యాలు; ఉర్దూ. పహియా = చక్రం; తుఖుమ్, తుఖ్మ = 'గింజ, జీవాణువు'

నుంచి వాడుకలో కలిసినవి. వీటి వ్యాప్తి హైదరాబాద్ కేంద్రంగా చుట్టుప్రక్కల జిల్లాలకు పరిమితంగా ఉంది. ఇతరతెలంగాణాప్రాంతంలో గిర/గిర్ర/గిల్ల (= చక్రం), నారు పదాలే వ్యాప్తిలో ఉన్నాయి. ఈవిధంగా కొత్తమాటలకు పాదైన కేంద్రాన్ని focal area' అంటారు. అవి ప్రసరించిన మేర అంతకు ముందున్న పాత మాటల వాడుక మాసిపోతుంది. ఈరకమైన మార్పులకు లోబడకుండా ఉన్న దూరస్థలాల్లో కొన్ని పాత మాటల వాడుక నిలిచిపోవచ్చు. అలాటి ప్రాంతాన్ని పురాతనవ్యవహారప్రాంతం (relic area) గా గుర్తించవచ్చు. ఆదిలాబాదుజిల్లా ఉత్తరపు కొసన 'నారు' కు 'నేరు' అనే వాడుక ఉంది. పూర్వ ద్రావిడంలో ఉన్న *ఞారు' శబ్దం నుంచి తెలుగులో నిష్పన్నమైనది నారు/నేరు అని ఉండవచ్చు. 'నా/నే'ల మార్పు '*ఞా' మాతృకకు సూచన[2]. ఈ ప్రాంతంలోనే 'కాడికి' పూర్వరూపం 'కాణ్డి' కూడా వాడుకలో ఉంది. దీని అర్వాచీనరూపాలు కాణి/కాని మిగిలిన తెలంగాణాలో ఉన్నాయి. రెండు భాషా మండలాల మధ్య వ్యవహారభేదకరేఖలు కిందుమీదుగా పోతున్నట్టు ఈ అధ్యాయం చివరి పటాల్లో చూడవచ్చు. ఇలాటి ప్రాంతాన్ని మాండలికసంధి ప్రాంతం (transition zone) గా గుర్తించవచ్చు. అంటే రెండు మండలాలలో విలక్షణంగా ఉన్న మాటలు అన్నీ ఈప్రాంతప్రజల వాడుకలో వినిపిస్తాయి. ఖమ్మంజిల్లా తూర్పు ప్రాంతంలో గాలు/రోజా/గిర్ర (=చెక్రం) మూడు ప్రాంతాలకు విలక్షణమైన వాడుకలున్నాయి (చూ. పటం 4.). పది ఇరవై ఏళ్ళకొకసారి మళ్ళీ పదసేకరణ చేసి అంతకుముందు గీచినవాటితో పోల్చి చూస్తే వ్యవహారభేదకరేఖలు మరో తీరున గుర్తించవలసిరావచ్చు. దీన్నిబట్టి ఒక పదం వ్యాప్తి ఏదిక్కున పోతున్నదో దానికి గల సాంఘికరాజకీయహేతువు లేమిటో గ్రహించవచ్చు. పైన చూపిన 'పయ్యె', 'తుకం' మాటల బదులు మళ్ళీ దేశ్య శబ్దాలు వ్యాపించి వీటి వ్యాప్తి సంకుచితం కావచ్చు. ఉర్దూ పార్యభాషగా గాక తెలుగుకు ప్రాధాన్యం పెరుగుతున్నది కాబట్టి ఈఊహ సమంజసమని తోస్తుంది. కాని పునఃపరిశీలనవల్లగాని ఈసంగతి తేలదు.

మాండలిక పదపరిశోధనవల్ల ప్రాచీనకవిరచితగ్రంథాల్లో వచ్చిన మాటలకు స్పష్టార్థనిరూపణ సాధ్యమౌతుంది. నిశితంగా పరిశీలించినప్పుడు కొందరు కవులు వాడిన మాండలికపదాలు ఆధారంగా వారు ఏప్రాంతంవారో ఊహించ వచ్చు. 'గునపం', 'గడ్డపార' శబ్దాలు పింగళిసూరన కళాపూర్ణోదయంలో

కనిపిస్తాయి. (కళా. 6 : 8; 6 : 23). ఈ మాటలకు అంతకు పూర్వం కావ్యాల్లో అట్టి ప్రయోగాలు లేవు. ('గునవం' మాత్రం ఎర్రాప్రెగ్గడ హరివంశం ఉ. 2 : 16లో ఉన్నట్టు సూర్యరాయాంధ్రనిఘంటువు.) పింగళి సూరన పూర్వులు గోదావరీ పరిసరాల నుంచి పలనాడు, పాకనాడు ప్రాంతాలకు వ్యాపించినట్లు ఈ కింది పద్యం వల్ల తెలుస్తుంది. (ప్రభావతీప్రద్యుమ్నము : అవతారిక)

ఉ. రంగుగ గౌతమీ పరిసరంబులఁ గృష్ణ కెలంకులన్ ఘనుల్
పింగళి రామయాదులు లలిం బలనాటను బాకనాటనుం
బింగళి గాదయాదు లిటఁ బెంపువహించిన యస్మదాద్యులా
పింగళి గోకమంత్రి యిలుపేరని చాలఁ బ్రసిద్ధులెల్లచోన్.''

ఈ పద్యంలో 'ఇట' ఏ ప్రాంతమో తెలియటంలేదు (చూ. చాగంటి శేషయ్య 10.99 [1953]), 'గునవం' అనే మాట వాడుక ఇప్పుడు పూర్వాంధ్రంలో, తూర్పుగోదావరి ప్రాంతానికి మాత్రం పరిమితం. ఇతర ప్రాంతాల్లో గడ్డపార, గడ్డపలుగు శబ్దాలున్నట్టు మాండలిక పరిశోధనలో తెలిసింది. (చూ. మాం. వృ. కో. 4. 72; పటం 16). గోదావరి మాండలికపదం వాడుకనుబట్టి పింగళి సూరన మధ్యాంధ్రమండలంనుంచి తరవాత దక్షిణాంధ్రానికి వచ్చినట్టు ఊహించవచ్చు. ఇతని తండ్రి కృష్ణాజిల్లాలోని 'నిడమానూరు' అగ్రహారికుడు. కళాపూర్ణోదయ కృతిభర్త నంద్యాల కృష్ణమరాజు దక్షిణమండలంలో ఉన్నవాడు.

అదే విధంగా 'మోట' అనే అర్థంలో 'కపిల' శబ్దం నెల్లూరు ప్రాంతంలో వాడుకలో ఉన్నది. తిక్కన భారతంలోనే దీనికి ఏకైకప్రయోగం కనిపిస్తున్నది. (భారతం, ఆశ్రమ. 1.72).

కుడువ నిచ్చు తటియుఁ గురువర క్రక్కించు
నవసరంబు నెఱిఁగి యరిన్నపాలు
నీవు ధీరవృత్తి నిడుఁద్రాట బోనిమ్ము
క్రమ్ము కపిల యనఁగఁ గ్రమ్మి చెఱుపు.

మాండలిక పటాలు ఆధారంగా ఆయా పదాల స్థూలచరిత్రను ఈ కింది విధంగా గుర్తించవచ్చు:

(1) నాలుగు మండలాల్లోనూ ఒకే శబ్దం (రూపభేదాలున్నా) కనిపిస్తే

(a) అది దేశ్యమయితే భాషామండలాలు ఏర్పడక పూర్వమే దేశమంతటా వ్యాపించి వాడుకలో నిలిచి ఉన్నట్టు గమనించాలి. (b) అన్యదేశ్యమైతే ఇటీవల మాత్రమే ఆధునికవ్యవహారంలో వ్యాపించినదై ఉండాలి. ఉదా (a) పేడ/పెండ; (b) పొరంబోకు/పోరంబోకు. కొన్ని ప్రాకృతభవాలు దేశ్యశబ్దాలలాగా ప్రాచీన కాలంలోనే వ్యాప్తిలోకి వచ్చి నిలిచిపోయినవి ఉన్నాయి. ఉదా. గానుగ (< ప్రా. ఘాణ < సం. ఘాతన).

(2) మూడు మండలాల్లో దేశ్యశబ్దమూ, నాలుగో మండలంలో అన్య దేశ్యమూ ఉంటే, అన్యదేశ్యం ఇటీవల వ్యాప్తిలోకి వచ్చి అంతకు ముందున్న దేశ్యశబ్దాన్ని తోసివేసినట్టు గ్రహించాలి. తెలంగాణా, రాయలసీమల్లో కొంత మేర వాడుకలో ఉన్న 'తానె' ఉర్దూ నుంచి వచ్చిన అన్యదేశ్యం (చూ. మాం. వృ. కో. 2. 43; పటం 3).

తెలంగాణా ఉత్తర ప్రాంతంలో 'పాలె' మిగిలిన దేశమంతటా ఉన్న 'మేడి, మేడితోక'కు పర్యాయం. ఇది మరాఠీప్రాంతంనుంచి వ్యాపించిన మాట. (మరా. ఫాళ్ 'కర్రు' – అర్థవిపరిణామం).

(3) ఒక మండలంలో మాత్రమే దేశ్యపదం మిగిలి, ఇతర మండలాల్లో అన్యదేశ్యం ఉంటే, దేశ్యపదం ప్రాచీనం, అన్యదేశ్యం అర్వాచీనమని, సాంఘిక చరిత్రలో వచ్చిన మార్పులవల్ల అన్యదేశ్యం వ్యాపించి ఉంటుందని గుర్తించాలి. ఒక్క దక్షిణమండలంలోనే 'కపిల/కపిలె' అనే మాట నిల్చి ఉంది. మిగిలిన దేశమంతటా 'మోట' (< హిం. మోర్). మోటకు, కపిలకు కట్టుబడి తేడాలుండవచ్చు (చూ. మాం. వృ. కో. 1. 47–8, 67; పటం 3).

(4) ఒక మండలంలో వాడే రెండు దేశ్యపదాలకు సరిగా మరో మండలంలో ఒకే మాట వాడుకలో ఉంటే, (a) రెండు మాటల అర్థమూ ఒకే పదానికి ఆరోపించటంవల్ల రెండోది జారిపోయి ఉండవచ్చు, లేదా (b) ఒక పదానికున్న అర్థం విరిచి రెండు పదాలకు దాన్ని ఆరోపించి ఉండవచ్చు. ఉదా. (a) పూర్వమండలం (కళింగదేశం)లో వరినారుకు 'ఆకు' అని మిరప, పొగనారుకు 'నారు' అని రెండు మాటలుండగా మిగిలిన ప్రాంతంలో ఈ రెండింటికీ 'నారు' అనే మాటనే వాడతారు. (b) తెలంగాణాలో 'తుకం', 'నారు' రెండూ వాడే చోట మొదటి పదాన్ని 'వరినారు' అర్థంలోను, 'నారు' ఇతరమైన మొలకలకు వాడతారు. 'తుకం' ఉర్దూనుంచి వచ్చి చేరిన ఇటీవలి మాట (చూ. మాం. వృ. కో. 1. 91).

(5) ఒకే అర్థంలో రెండు మాటలుండి, ఒకటి ఎప్పుడూ సమాసగతం గాను, మరొకటి వ్యస్త, సమస్త రూపాల్లోనూ వస్తుంటే, కేవలసమాసగతమైన రూపాంతరం ప్రాచీనమని గుర్తించాలి. ఉదా. చెవుడుకట్టెముల్లు, చెవుడుకర్ర, చెవుడుదారం, చెవుడుపలుపు. దీని రూపాంతంరం 'చేడు' వ్యస్తంగాను, సమాసాల్లోను కూడా వస్తుంది. దీని అర్థం 'నేస్తున్న గుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర'. చెవుడు-, చెముడు- పదాలు కొన్ని చోట్ల రాయలసీమలోను, శ్రీకాకుళంలోను మాత్రం వచ్చాయి. అంటే దేశం అంతటా ఒకప్పుడు 'చెవుడు-' శబ్దమే ఉండి దాని సంక్షిప్త రూపంగా 'చేడు' ఏర్పడి ఉంటుంది (చూ. మాం. వృ. కో. 2, పుట 45; పటం. 5). 'చెవుడు-', 'చెముడు-' శబ్దాలున్నవి పురాతనవ్యవహారప్రాంతాలు (relic areas) గా గుర్తించాలి.

(6) ఇప్పుడు రాకపోకల సంబంధంలేని దూరప్రాంతాల్లో ఒక మాట వాడుక పరిమితంగా లంకల మాదిరిగా కనిపిస్తే, ఆ మాట అతిప్రాచీనమనీ, ఆ తరువాత వాడుకలోకి వచ్చిన అర్వాచీనరూపంవల్ల దీని వ్యాప్తి కాలక్రమాన సంకుచితమై పోతున్నదనీ ఊహించాలి. పైన (5) లో ఇచ్చిన ఉదాహరణ దీనికి సరిపోతుంది. శ్రీకాకుళంజిల్లాలో కొద్దిచోట్ల, రాయలసీమలో కొద్దిచోట్ల మాత్రమే 'పరిటె' అనే శబ్దం ఉంది. మిగిలినదేశ మంతటా 'పంటె' శబ్దం. ఈ రెండిటి పూర్వరూపం 'పరింటె' అయి ఉంటుంది. (ఇటువంటిదే గంటె, గరిటె < *గరింటె). పరిటె/పంటె 'చేత్తో నూలు చుట్టే పనిముట్టు' (చూ. మాం. వృ. కో. 2. 49: పటం 9).

### వర్గమాండలికాలు

ఇంతవరకు నిరూపించిన మాండలికవిభాగం స్థిరవృత్తులనాశ్రయించి బతికే జానపదుల వాడుక ఆధారంగా చేసింది. విద్యాగంధంలేని పామరుల భాషకు చదువుకొన్న నడిమి తరగతివారి భాషకు మధ్య తేడాలు ఎన్నో కనిపిస్తాయి. ఇవి ఉచ్చారణలోను, వ్యాకరణంలోను, పదజాలంలోను ఉండవచ్చు. ఉచ్చారణకు సంబంధించినంతవరకు శిష్టశిష్టేతరుల మధ్యనున్న భేదాలు అన్ని భాషామండలాలకు సామాన్యమైనవి ఎన్నో ఉన్నాయి. ఉచ్చారణను బట్టి ఒకవ్యక్తి విద్యావంతుడు అవునోకాదో చెప్పవచ్చు కాని ఏకులస్థుడో చెప్పటం

కష్టం. స్థూలంగా పైకులాలవాళ్ళు చదువుకున్నవారు కావటం, వెనుకబడ్డ కులాల్లో చదువు తక్కువగా ఉండటంవల్ల వర్గమాండలికాలు కులాశ్రయ ధర్మాలని కొందరు అపోహపడ్డారు గాని అది సరి అయిన దృష్టికాదు. తక్కువ కులం వ్యక్తి చదువుకొన్నవాడైతే చదువుకున్నవారి ఉచ్చారణ పూర్తిగా పట్టు బడుతుంది. శిష్ట శిష్టేతరుల ఉచ్చారణలు ఈ కిందివిధంగా ఉంటాయి.

| శిష్టోచ్చారణలో | జానపదోచ్చారణలో |
|---|---|
| 1.a. ఒత్తులు నిలుస్తాయి.<br>భాగవతం, ధర్మం<br>b. హకారం నిలుస్తుంది<br>హరివిల్లు, రోహిణి | ఒత్తులు పోతాయి<br>బాగవతం, దర్మం<br>హకారం పోతుంది<br>అరిల్లు, రోయిణి |
| 2. అద్విరుక్త చకారం అంతటా నిలుస్తుంది.<br>చవుడు, చుక్క, వలచన | చకారం సకారం అవుతుంది<br>సవుడు, సుక్క, వలసన |
| 3. పదాది వకారం నిలుస్తుంది<br>(ఇ, ఈ, ఎ, ఏల ముందు)<br>విల్లు, వీధి, వెండి, వేడి. | వకారం పోతుంది<br>యిల్లు, యీది, యెండి, యేడి. |
| 4. సంయుక్త హల్లులు నిలుస్తాయి.<br>భక్తి, చేస్తాడు, కలెక్టర్ | a. హల్లులు సమీకరణం పొందుతాయి.<br>బత్తి, సేత్తాడు.<br>b. స్వరభక్తి రావచ్చు: కలకటేరు. |
| 5. శ, ష, స ల భేదం ఉంటుంది.<br>శాస్త్రి, భాష, కాసు, | శ, ష, లు సకారంగా మారతాయి.<br>సేత్రి, బాస, కాసు. |
| 6. మూర్ధన్యదంతమూలీయభేదంనిలుస్తుంది.<br>వల్లం: పళ్ళెం; దాన్ని: వాణ్ణి | మూర్ధన్యాలు దంతమూలీయాలవుతాయి.<br>ళ→ల; ణ→న.<br>వల్లం: పల్లెం; దాన్ని: వాన్ని. |
| 7. 'f' 'ఫ' వేరుగా ఉంటాయి.<br>ఆఫీసు, కాఫీ, తోఫు. | 'f' 'ఫ' గా మారుతుంది.<br>ఆపీసు, కాపీ, తోపు. |
| 8. పదాది గకారం దేశ్యశబ్దాల్లో నిలుస్తుంది.<br>గట్టు, గడ్డ, గండి | 'గ', 'గె' గామారుతుంది.<br>గెట్టు, గెడ్డ, గెండి. |

శిష్టవ్యవహారస్వరూపం

జానపదులు సక్రమంగా విద్యావంతులైనప్పుడు శిష్టోచ్చారణను అనుకరిస్తారు. అసలు శిష్టోచ్చారణలో శిష్టత ఏధర్మాలవల్ల ప్రాప్తించిందో తెలుసుకోవచ్చు. పై ఉచ్చారణభేదాల్లో 1, 4, 5, 7 చాలావరకు అన్యదేశ్యాలకు చెందినవి. జానపదుల భాషలోకంటె చదువుకొన్నవాళ్ళ భాషలో సంస్కృత శబ్దాల వాడుక ఎక్కువ. పాఠ్యపుస్తకాలవల్ల, వార్తాపత్రికలవల్ల ఇది సాధ్యమవు తుంది. ఇంగ్లీషు మన దేశానికి రాకముందు చదువుకొన్నవాళ్ళంటే సంస్కృతం చదువుకొన్నవాళ్ళే. అలాగే ఇంగ్లీషు తెలిసినవాడు సంస్కృతాంధ్రాలు తెలిసిన వాడికన్నా సంస్కారవంతుడుగా పరిగణించబడుతున్నాడు. దీనికి కారణం ఎక్కువ భాషలు తెలిసినవాళ్ళు ఎక్కువ తరగతుల్లో కలిసిపోగలరు. ఎక్కువ మందితో వ్యవహారదక్షత ఏర్పడుతుంది. అల్పవ్యవహారపరిధి గల జానపదులకు అధికవ్యవహారదక్షత గల విద్యావంతులు ఆదర్శమై వాళ్ళభాష, కట్టు, నడవడి ఒరవడి అవుతాయి. వాటిని అనుకరించి జానపదులు నాగరకులనిపించు కోటానికి ప్రయత్నిస్తారు. విద్యావిధానం, నగరజీవితం ఈ ప్రక్రియకు ఉపకరణా లవుతాయి. ఈనాడు క్రాపు, సూటు, బూటు, పెళ్ళిళ్ళలో దండలు వేసుకోటం వగైరా రెండు సంస్కృతుల సమ్మేళనంలో అన్యసంస్కృతినుంచి దేశీయ సంస్కృతిలో వచ్చిన మార్పులు. సమాజంలో వ్యక్తులకు తెలియకుండానే విలువలు మారుతుంటాయి. ఈవిలువల మార్పులో ప్రయోజనదృష్టి కొంత వరకు కనిపిస్తుంది. కాని, కారణాలు పూర్తిగా పరిశోధిస్తేనే గాని తెలియవు. ప్రపంచంలో అన్ని సమాజాల్లోనూ ఈప్రక్రియ కనిపిస్తుంది. నార్మన్ దండయాత్ర తర్వాత ఫ్రెంచి జీవితవిధానం, ఫ్రెంచిభాష బ్రిటిష్ ప్రజలని, ఇంగ్లీషుభాషని ఎంతో ప్రభావితం చేశాయి. అధికవ్యవహారదక్షత (ఎక్కువ మందితోమాట్లాడగల నేర్పు) ఉన్నవాళ్ళు సంస్కారవంతులనిపించుకొంటారు. వాళ్ళవాడుక మిగిలినవాళ్ళకు ప్రమాణం అవుతుంది. స్థూలంగా భాషలో ప్రామాణ్యం ఏర్పడే తీరు ఇది.

ఉచ్చారణలోలాగానే కొన్ని పదాల రూపనిష్పత్తిలో గూడా నాగరకుల భాషకు, జానపదుల భాషకు భేదాలున్నాయి. 'పోతుంది, తెలియదు (తెలేదు, తెలీదు)' అనేవి శిష్టుల వాడుకలో ఉంటే 'పోతది, తెలవదు' మొదలైనవి ఇతరుల వాడుకలో ఉన్నాయి. నిజంగా 'పోతది, తెలవదు' రూపాలకు తక్కువ విలువ

కట్టటానికి, 'పోతుంది, తెలియదు' రూపాలకు ఎక్కువ విలువ కట్టటానికి భాషాగతమైన కారణాలులేవు. 'కురుస్తుంది : కురవదు' – రెండూ శిష్టవ్యవహారంలో ఉన్నాయి. వాటిలాగానే 'తెలుస్తుంది : తెలవదు' కూడా తెలుగు వ్యాకరణ సూత్రాల వల్ల సాధ్యాలవుతాయి. 'కురవదు : తెలవదు' రెంటికీ ప్రాచీనభాషలో 'కురియదు, తెలియదు' అనే ప్రమాణరూపాలున్నాయి. చారిత్రకంగా జరిగిందేమంటే – 'పిలుచు : పిలవదు' గణంలో 'కురియు : కురవదు' శిష్టుల భాషలో చేరాయి; కాని 'తెలియు : తెలవదు' చేరలేదు. జానపదుల భాషలో ఇవి గూడా ఆగణంలోనే చేరాయి. 'కలియు : కలవదు', 'నెరియు : నెరవదు', ఇలాంటివన్నీ, అన్ని తరగతుల వ్యవహారంలోనూ 'పిలుచు' వర్గంలో చేరిపోయినాయి. అయినప్పుడు 'తెలవదు' ఎందుకు ప్రమాణం కాలేదు? ఇతరకారణాలవల్ల 'శిష్టత' సంపాదించినవాళ్ళ భాషలో ఈమార్పు రాలేదు కాబట్టే 'తెలవదు' శిష్టేతరవ్యవహారానికి ఉపలక్షకమయింది. అంటే దీన్నిబట్టి ఏది శిష్టం, ఏది అశిష్టం అనే నిర్ణయం కేవలం భాషకు సంబంధించింది కాదు. ఇతరసామాజిక విషయాలనుబట్టి గూడా ఏర్పడుతుంది. కోస్తా జిల్లాల వాడుకలో 'అలా, ఇలా, ఎలా' (గోదావరి) అనే రూపాలు 'అట్లా, ఇట్లా, ఎట్లా' (గుంటూరు) అనే వాటికంటే నాజూకు అవుతున్నాయి. 'వస్తున్నది' (గుంటూరు) కంటె 'వస్తోంది' (గోదావరి) కి ఇప్పుడు విస్తృతి పెరిగింది. 'చేసుకొనేందుకు' (గుంటూరు) అని ఇదివరకు రాసేవాళ్ళు 'చేసికొందికి' అని రాస్తున్నారు. 'ఏంది' కంటె 'ఏమిటి' నాజూకైన మాట. ఒకే కాలంలో శిష్టవ్యవహారంలో ఉన్న రూపాలమధ్య పోటీ ఏర్పడి కొన్ని వాడుకలో నిలుస్తాయి. కొన్ని జారిపోతాయి. ఆనిల్చినవి ప్రామాణికాలు.

తెలుగునాడంతటా వ్యాప్తిలో ఉన్న పై భేదాలేగాక ప్రాంతీయంగా కూడా శిష్టేతరవ్యవహారభేదాలు వినిపిస్తాయి. కళింగమండలంలో పామరులు లకారం నకారంగా ఉచ్చరిస్తారు: లేదు → నేదు; లాగుతూ → నాగుతూ. అన్వాదుల క్రియారూపాల్లో ట → త: అంటాడు → అంతాడు.

తెలంగాణా ప్రాంతంలో అ ఆ లు పరమైన వకారం కూడా జానపదుల వాడుకలో లోపిస్తుంది. వచ్చిండు → అచ్చిండు; వాన → ఆన. త్రికంలోని అ/ ఆ, ఇ/ ఈ ల స్థానంలో గ/ గా, గి/ గీలు వస్తాయి. అంత → గంత; ఇప్పుడు → గిప్పుడు; అట్టా → గట్టా. వర్ణవ్యత్యయం వల్ల ర్ల → ల్ర గామారుతుంది.

బర్లు → బ్రలు; ఊర్ల = (ఊర్లో) → ఊ్రల. సెప్పది (< చెప్పదు), వస్తాండు (< వస్తా ఉన్నాడు), మొదలైనవి గూడా తెలంగాణా పామరభాషలో వినవస్తాయి.

ఆధునిక వచనరచనల్లోనూ, సినిమా, రేడియో, మొదలైన జనతా వ్యవహార సాధనాల్లోను వాడే తెలుగులో చాలా వరకు ఏకరూపత కనిపిస్తుంది. ఇది స్థూలంగా మధ్యాంధ్రంలోని విద్యావంతుల వ్యవహారం ఆధారంగా ఏర్పడ్డది. గడిచిన 30, 40 ఏండ్లుగా రచనలన్నీ ఈ మాండలికంలోనే జరగటంవల్ల, రచయితలెక్కువగా ఈ ప్రాంతంవారు కావటంవల్ల ఇదే రాష్ట్రమంతటికీ ఆధునిక ప్రమాణభాషగా చలామణి అవుతున్నది. ఇతరమాండలిక ప్రయోగాలు ఈ ప్రమాణభాషతో కలిసి ఇది విస్తృతం అవుతున్నది. ప్రమాణభాష సాధారణంగా రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక ప్రాధాన్యం గల రాజధానీనగరాల్లో నివసించే విద్యావంతుల భాషపై ఆధారపడి ఉంటుంది. తెలుగుదేశచరిత్రలో విజయనగరం, కొండవీడు, నెల్లూరు, అద్దంకి, రాజమహేంద్రవరం, వరంగల్లు, చంద్రగిరి వేరువేరు కాలాల్లో రాజధానులుగా ఉండేవి. ఫ్రాన్సులో పారిస్, ఇంగ్లాండులో లండన్, ఇటలీలో ఫ్లారెన్స్ లాగా ఏదో ఒక పట్టణమే కొన్ని శతాబ్దులపాటు సాంస్కృతిక కేంద్రంగా ఉన్నట్లు తెలుగుదేశానికి ఏఒక్కటి రాజధానిగా లేదు. ఆధునిక బెంగాలీభాషకు కలకత్తా కేంద్రం; ఆధునిక మరాఠీకి పూనా, కన్నడానికి మైసూరు, హిందీకి ఢిల్లీ (ఇటీవల అలహాబాదు); తెలుగునాడులో అలాటి పట్టణం ఏఒక్కటీ లేదు. అందువల్ల భాగ్యవంతమైన కృష్ణాగోదావరీ పరిసరమధ్యమండలం విద్యకు, ధనానికి, సంస్కృతికి, విద్యావంతులకు ఆటపట్టయింది. ఈకారణంగా నేటి ప్రమాణభాష అక్కడి రచయితల రాతల నుంచి వ్యాపించింది.

ఆధునికప్రమాణభాషలోనూ ప్రాంతీయభేదాలు లేకపోలేదు. అంటే ఎదువుకున్నవాళ్ళు తమ ప్రాంతపు పలుకుబళ్ళను రచనలోకి ఎక్కిస్తారు. కాని అట్టి భేదాలు గ్రామీణవ్యవహారంతో పోల్చుకుంటే చాలా తక్కువ; అర్థావగాహనకు అడ్డు వచ్చేవికావు. ఉదా. అలా, అట్లా, అట్టా– మూడూ శిష్టరచనల్లో కనిపిస్తాయి; భూతార్థక ప్రత్యయంలో శిష్టులరచనల్లో తేడాలున్నాయి. ఉదా. వచ్చాడు/ వచ్చినాడు. తెలంగాణలో శిష్టులు 'వచ్చిండు' అని అంటున్నా, సభల్లోను, రచనల్లోను 'వచ్చినాడు' అనే అంటారు. విధ్యర్థంలో 'చెప్పుద్రి, చేయుద్రి' స్థానంలో ఇప్పుడు 'చెప్పండి, చేయండి' అనే వాడుకలు వస్తున్నాయి.

వ్యతిరేకవిధిలో చెప్పకు/ చెప్పవాకు/ చెప్పబాకు/ చెప్పాకు/ చెప్పాక మొదలైనవి, నిర్ధారణలో చెప్పాలి/ చెప్పాలె/ చెప్పాల మొదలైనవి, చదువుకున్నవారే వేరువేరు ప్రాంతాల్లో అంటారు. అయినా 'చెప్పకు, చెప్పాలి' వంటి రూపాలకు ఎక్కువగా లిఖితవాఙ్మయంలో చెలామణి ఏర్పడుతున్నది. కోస్తా జిల్లాల్లో శిష్టులు 'వస్తూ, పోతూ' అనీ, శిష్టేతరులు 'వస్తా, పోతా', అనీ అంటారు. రాయలసీమలో శిష్టులు కూడా 'వస్తా, పోతా' రూపాలు వాడుతారు. అన్నమాచార్యుల కీర్తనల భాషలోనూ శత్రర్థ ప్రత్యయంగా '–తా' కనిపిస్తుంది. అయినా ఇప్పుడు రాయల సీమ రచయితలు 'తూ' రూపాలనే రాతల్లో వాడుతున్నారు. పైవిధంగా శిష్టుల వాడుకలో ఉన్న బహురూపత క్రమంగా తగ్గి లిఖిత ప్రమాణ భాషలో ఏకరూపత ఏర్పడుతుంది. ఈ ప్రక్రియ పూర్తికావటానికి కొన్ని దశాబ్దులు పట్టవచ్చు.

శిష్టభాష, ప్రమాణభాష

(a) ఒక కాలంలో శిష్టభాషాలక్షణమనిపించుకొన్నది మరోకాలంలో అశిష్టం కావచ్చు. నన్నయభాషలోను, సమకాలీన శాసనాల్లోను గసడదవాదేశసంధి కనిపిస్తుంది. ఉదా. 'వాడుసెప్పె' మొదలైనవి. ఇప్పుడు 'వాడు సెప్పాడు' అని 'చ', 'స' గా మారిస్తే పామరజనవ్యవహారమనిపిస్తుంది. 'తెచ్చుతాడు' మొదలైనవి కేతన గ్రామ్యాలన్నాడు. అదే (> తెస్తాడు) ఇప్పుడు శిష్టరూపమైంది.

(b) ఒక ప్రాంతంలో శిష్టవ్యవహారం మరొక ప్రాంతలో శిష్టేతరం కావచ్చు. రాయలసీమలో శిష్టవ్యవహారంలో 'వస్తా', 'పోతా', మొదలైన శత్రర్థకరూపాలు, కోస్తా జిల్లాల వాడుకలో 'తక్కువ రకం' వాడుకగా పరిగణించబడతాయి. 'వచ్చినాడు' మొదలైనవి రాయలసీమశిష్టరూపాలు కళింగమండలంలో గ్రామీణ వ్యవహారంలో వినిపిస్తాయి. పై కారణాలవల్ల శిష్టం–అశిష్టం అనే భేదాన్ని ప్రాంతీయంగా, వర్గరూపంగా కొద్దిపరిధిలో కూడా తరతమదృష్టితో నిరూపించ వచ్చు. కాని ప్రమాణ–అప్రమాణభేదం రాష్ట్రం మొత్తానికీ, భాష అంతటికీ సంబంధించిన విలువ. ప్రతి ప్రాంతంలోని శిష్టవ్యవహారమంతా ప్రమాణంగాదు; కాని, ప్రమాణ భాషలో చేరినది ఏ మండలంలోనూ అశిష్ట వ్యవహారమై ఉండదు. అనుకరణ ఏముఖంగా జరుగుతున్నదన్నదాన్ని బట్టి ఏది ప్రమాణమో ఏది అప్రమాణమో గుర్తిస్తాము. ఉదా. శిష్టుల్లోనే 'అట్లా' ప్రయోగం తగ్గి 'అలా' ప్రయోగం పెరుగుతున్నది.

(c) ఒక లక్షణమే కొన్ని మాటల్లో శిష్టవ్యవహార ధర్మం కావచ్చు; మరి కొన్ని మాటల్లో శిష్టేతర ధర్మం కావచ్చు. వకారంలోపం 'వెళ్ళాడు, వేశాడు' శబ్దాల్లో శిష్టుల్లోనూ ఉంది. ఉదా. వాడెళ్ళాడు; వాడు నన్ను వడేశాడు. కాని ఇతర శబ్దాల్లో ఇది శిష్టేతరభాషాలక్షణ మౌతుంది. ఉదా. వాడు యేడికి (=వేడికి) తట్టుకోలేడు. అలాగే 'కురవదు', 'కలవదు' శిష్టం, శిష్టేతరం కూడా; కాని 'తెలవదు' శిష్టేతరుల వాడుకే.

(d) సాంఘిక చరిత్ర కారణంగా తద్భవాలకు, దేశ్యశబ్దాలకు పరపతి తగ్గి, అన్యదేశ్యాలకు, తత్సమాలకు విలువ (శిష్టవ్యవహార యోగ్యత) పెరుగుతుంది. 'కూడు, బువ్వ, కత, పొద్దు, మంగలి, చాకలి, గొల్ల', మొదలైన మాటలకు ఈనాడు విలువ తక్కువ. వాటి బదులు 'అన్నం, కథ, రోజు, క్షురక, రజక, యాదవ' శబ్దాలకు విలువ ఎక్కువయింది.

(e) మాండలిక భేదాలున్నా పదాలు మాత్రం సందర్భాన్నిబట్టి ప్రమాణ భాషలో చేరవచ్చు. సొరకాయ–ఆనపకాయ, భోగట్టా–సంగతి, చెక్క–వక్క, ఇలాటివన్నీ ప్రమాణభాషలో చేరాయి. ఉత్తమరచనల ద్వారా మాండలికపదాలు ప్రమాణభాషలో చేరతాయి.

(f) శిష్టశిష్టేతర భేదం రెండువర్గాల వాడుకలో ఉన్న ఉచ్చారణలు, వ్యాకరణ కార్యాలు, పదాలను ఆశ్రయించి ఉంటుంది. ఒకరి వాడుకలోనే ఉన్న వాటిలో ఈభేదం కనిపించదు. వృత్తిపదాలు చాలావరకు దేశ్యాలు; ఆయా వృత్తుల నాశ్రయించి బతికే జానపదుల వ్యవహారంలోనే ఉంటాయి. ఆ పదాల్లో శిష్టశిష్టేతర భేదం నిరూపించటం సాధ్యం కాదు. నాగలి, గొర్రు, గుంటక, మేడి, గొడ్డలి – ఇలాటి మాటల్లో ఈ తేడా కనిపించదు. అలాగే కలెక్టరాఫీసు గుమస్తా తన పనిలో వాడే మాటలకు శిష్టేతరుల్లో శబ్దాలుండవు కాబట్టి అవి గూడా వర్గమాండలికాలకు లక్ష్యం కావు. బహురూపత (రూపాంతరత్వం) ఉన్న చోటనే ప్రమాణీకరణానికి ఆవశ్యకత ఏర్పడుతుంది.

ప్రమాణభాషకు ఆవశ్యకత ఏమిటి అన్నప్రశ్న మిగిలిపోయింది. ప్రమాణ భాషకు ఈ కింది లక్షణాలు, ప్రయోజనాలు ఉంటాయి. 1. ప్రమాణభాష ఎక్కువమంది ప్రజలకు సమ్మతంగా ఉంటుంది. 2. విద్యాబోధన ప్రమాణభాషలో జరుగుతుంది. ప్రమాణభాష నేర్చుకోటమే విద్యావంతుడనిపించుకోటానికి

లక్షణమవుతుంది. 3. మాండలికాలకంటె ప్రమాణభాషాప్రయోగానికి వ్యాప్తి ఎక్కువ. ఉపన్యాసాలు, వచనరచనలు, వార్తాపత్రికలు, సినిమాలు, రేడియో, టెలివిజన్, మొదలైన విజ్ఞానవ్యాపకసాధనాలన్నీ ప్రమాణభాషనే వాడతాయి. 4. ప్రమాణభాష వ్యవహర్తల సాంస్కృతిక వైజ్ఞానిక ఐకమత్యానికి ఒక సంకేత మవుతుంది. ప్రాంతీయ, వర్గమాండలికాలు వాళ్ళ వేర్పాటుకు గుర్తులవుతాయి. 5. ప్రమాణభాష ప్రాథమికంగా ఏదో ఒక ప్రాంతంలో చదువుకొన్నవాళ్ళ వాడుక ఆధారంగా ఏర్పడి, మాండలికప్రయోగాలను కలుపుకొంటూ వ్యాప్తమవుతుంది. 6. కొన్ని భాషల్లో ప్రాచీన కావ్యభాషే ప్రమాణభాషగా వ్యవహర్తలు గుర్తిస్తారు. అప్పుడు మాండలిక ప్రభావం ప్రమాణభాషపై అట్టే పడదు; ఉదా. అరబిక్, తమిళం. కాని వ్యవహారానికి దూరమయ్యేకొద్దీ ఈ పరిస్థితి క్రమంగా మారి ఏదో ఒక మండలంలో ఉన్న శిష్టభాషే ప్రాచీన ప్రమాణభాషను తోసివేసి వస్తుంది. ఈ మార్పుకు కొన్ని శతాబ్దులు పట్టవచ్చు.

జానపదులు విద్యావంతులైనకొద్దీ నాగరకులు ప్రమాణభాషను మరింత క్లిష్టం చేసి తమ వ్యక్తిత్వాన్ని దూరాన్ని నిలుపుకోటానికి ప్రయత్నిస్తారు. ఈనాడు అధిక సంస్కృతీకృతమైన హిందీ, 'ఖడీబోలీ' కంటే దూరమై పోవటం దీనికి లక్ష్యం. వర్తమానభాషల్లో ప్రమాణభాషను మాండలికసమ్మేళనంతో సులభ గ్రాహ్యం చెయ్యటం అవసరం.

జ్ఞాపికలు

1. ముఖస్తుతితో ఆశ్రయించే వ్యక్తి 'చెమ్చా'; ఆకర్షణీయంగా ముస్తాబు కావటం 'లైటుగొట్టటం'.
2. పూర్వద్రావిడ '*ఞాన్' శబ్దంనుంచి తెలుగులో నేను/నా- రూపాలేర్పడతాయి.




పటం 8 (మాం. వ్యా. లో. I, పటం 10, పుట 74)



పటం 6 (మాం. వ్యా. కో. I, పటం 29, పుట 98)




పటం 8 (మాం. వృ. కో. I, పటం 81, పుట 95)




పటం 10 (మాం. వ్య. కో. II, పటం 9, పుట 49)



పటం 18 (మాం. వ్యా. కో. IV, పటం 18, పుట 72)

# 11

# తెలుగు మాండలికాలు : కరీంనగర్ వాడుక

## భాషలో వ్యవస్థ

తెలుగు సుమారు నాలుగు కోట్లమందికి మాతృభాష. తెలుగువాడెవడైనా తనకు తెలుగు రాదనుకొన్నా, తనకు వచ్చింది 'మంచి తెలుగు' కాదనుకొన్నా - ఇవి అసహజమైన అభిప్రాయాలనుకోవాలి. కొందరి తెలుగు మరి కొందరికి 'ఏస' గా ఉండవచ్చు (ఏస అంటే 'కొత్తదనం'); కాని తెలుగు కాదనిపించదు. ఈ కింది వాక్యాలు తెలుగు మాటలతో కూర్చినవైనా తెలుగు మాతృభాషగా మాట్లాడే వాళ్ళెవరూ ఆమోదించరు. ఎందుకంటే అవి 'ఏస' గా ఉండటంవల్ల కాదు - తెలుగు వాడుకకు విరుద్ధంగా ఉండటంవల్ల (* = అసహజవాక్యానికి గుర్తు).

1. *ఆయన ఊరి నుంచి వచ్చింది.
2. *ఆయన నాకు అడిగాడు.
3. *ఆయన నన్ను చెప్పాడు.
4. *పువ్వులు కడుపు నిండా భోంచేస్తున్నాయి.
5. *వాడు బాగా విరిగి పోయినాడు.

ఈవాక్యాలను సరిదిద్దమంటే తెలుగు పిల్లవాడెవడైనా సులభంగా దిద్దుతాడు. కాని, 'అవి ఎందుకు తప్పు?' అని అడిగితే చాలామంది సరైన జవాబు చెప్పలేరు. 1వ వాక్యంలో కర్త ఆయన (పురుషవాచకం) అయినప్పుడు క్రియలో చివర 'డు' గాని, 'రు' గాని ఉండాలి. 2వ వాక్యంలో అడుగు అనే క్రియతో నాకులో ఉన్న '-కు' (చతుర్థీ) విభక్తి సరిపడదు; నన్ను అనే ద్వితీయా విభక్తి రూపం ఉండాలి. 3వ వాక్యంలో గూడా విభక్తి దోషం ఉంది. చెప్పు ప్రధాన క్రియ అయినప్పుడు దానికి ముందు వచ్చే నామపదం (ద్వితీయకర్మపదం) చతుర్థీ విభక్తిలో ఉండాలి, 'నాకు' అని. 4వ వాక్యంలో అర్థవైరుధ్యం కనిపిస్తున్నది. 'ఫోంచేయటం' మనుషులు చేసే పని గాని, పూలు చేసే పని కాదు. 5వ వాక్యంలో గూడా అటువంటి దోషమే కనిపిస్తుంది. 'విరగటం' అనేది ప్రాణులకు జరగదు; నిర్జీవమైన (స్థావరమైన) గట్టి వస్తువులకు జరుగుతుంది. కొన్ని సవరణలు చేస్తే సరైన వాక్యాలు సిద్ధిస్తాయి:

6. ఆయన ఊరినించి వచ్చాడు.
7. ఆయన నన్ను అడిగాడు.
8. ఆయన నాకు చెప్పాడు.
9. పువ్వులు తోట నిండా రాలిపొయినాయి.
10. వాడు బాగా పరిగెత్తాడు.

6-10 వాక్యాలు వ్యాకరణయుక్తమైనవని ప్రతి తెలుగువాడూ అంగీకరిస్తాడు. 1-5 వాక్యాలు వ్యాకరణానికి విరుద్ధం. తెలుగు మాట్లాడే ప్రతివాడికీ ఈ వ్యాకరణజ్ఞానం గుప్తస్థితిలో ఉంటుంది. ఒక భాష మాట్లాడగలగటం అంటే ఆ భాషా నిర్మాణానికి కారణమైన వ్యాకరణజ్ఞానం కలిగిఉండటమే. పిల్లలకు నడక వచ్చినంత సహజంగా స్వభావసిద్ధంగా భాషాజ్ఞానం గూడా అబ్బుతుంది. కాని ఈ జ్ఞానం అజ్ఞాతంగా మెదడులో ఉంటుంది. ఆలోచించే శక్తి ఉన్న ప్రతివాడికీ తన మనసు ఎలా పనిచేస్తుందో తెలియదు; అది మానసికశాస్త్రజ్ఞుడి పని. మన శరీరంలో ఉన్న భాగాలన్నీ ఎలా పనిచేస్తున్నాయో మనకు తెలియదు; అది శారీరకశాస్త్రజ్ఞుడి పని. అలాగే భాషనుపయోగించే ప్రతివాడికీ ఆ భాషాజ్ఞానం ఏసూత్రాలమీద ఆధారపడ్డదీ తెలియదు. ఈ సూత్రాలను పరిశోధించేది భాషా శాస్త్రం. ఊహలో ఉన్న అర్థాలకు ఉచ్చారణలో ఉన్న మాటలకు గల సంబంధం

నిరూపించేదే వ్యాకరణం. ఇది వ్యవహర్త జ్ఞానగతమైనది. దీన్ని వ్యక్తీకరించి సూత్రరూపంలో చూపించేది ఆభాషకు వ్యాకరణశాస్త్రం అవుతుంది. లిఖిత రూపంలో సమగ్రమైన వ్యాకరణం ఒక భాషకు లేనంత మాత్రాన ఆభాషకు వ్యవస్థ (వ్యాకరణం) లేదనుకోటం, సమగ్రమైన మానసికశాస్త్రం లేనంత మాత్రాన మనస్సుకు ఆలోచనాశక్తి లేదనుకోటం లాంటిదే.

'ఆయన ఊరినుంచి వచ్చాడు' అనటానికి బదులు, 'ఆడు ఊరినుంచి అచ్చిండు' అని ఎవరన్నా అంటే అది అంతకు ముందు వినని వాళ్ళకు 'ఏస'గా ఉంటుంది గాని వ్యాకరణవిరుద్ధమైన వాక్యం మాత్రం కాదు. మరి కొందరు అచ్చిండు కు బదులు వచ్చిండు అంటారు. దాన్నే మరి కొందరు వచ్చినాడు అంటారు. ఇవి వ్యాకరణవిరుద్ధమైన రూపాలు కావు. ప్రాంతీయంగానూ, సాంఘికంగానూ వచ్చిన తేడాలనుబట్టి వాడుకలో ఏర్పడిన మార్పులు. ఇక్కడ వచ్చినాడు లో నా హ్రస్వమై వచ్చినడు = వచ్చిండు అయింది. తెలంగాణా జానపదుల వాడుకలో పదాది వకారం లోపించి అచ్చిండు అయింది. కాని, క్రియకూ కర్తకూ ఉన్న లింగ, పురుష, వచనాలలో సమానధర్మం ఉండటంలో ప్రాంతీయభేదాలు లేవు. అంటే 'వాడు వచ్చాడు', 'వాడు వచ్చినాడు', 'వాడు వచ్చిండు', 'ఆడు అచ్చిండు' మొదలైన వాక్యాలే ఉంటాయి కాని, *'వాడు వచ్చింది', *'ఆడు అచ్చింది' మొదలైనవి ఎక్కడా వినం. వీటిలో ఒకటి వ్యాకరణ విషయం; రెండోది ప్రాంతీయ, సాంఘిక భేదాలనుబట్టి వచ్చింది. ఈరెండూ వేరువేరు ధర్మాలు. పై చర్చనుబట్టి కొన్ని విషయాలు గ్రహించవచ్చు. (1) ప్రతి భాషకూ వ్యవస్థ (అంటే వ్యాకరణం) ఉంటుంది. ఆభాష మాట్లాడే ప్రతివ్యక్తికీ భాషాజ్ఞానం సహజంగా ఉంటుంది. వ్యాకరణవిరుద్ధమైన వాక్యాలు మాతృ భాషలో ఎవరూ పలకరు. (2) వ్యవహారభేదాలు ఒక వ్యక్తి ప్రాంతాన్నిబట్టీ, చేసే వృత్తినిబట్టీ, చదివిన చదువునుబట్టీ ఏర్పడతాయి. ఈమార్పులకూ వ్యాకరణానికీ సంబంధం లేదు. వ్యాకరణం, వ్యాకరణజ్ఞానం ప్రాంతీయభేదాలకు అతీతం.

## భాష - మార్పు - ప్రామాణ్యం

తెలుగు జీవద్భాష. జీవద్భాష మిగిలిన సజీవవ్యవస్థల లాగానే కాలక్రమాన మారుతుంది. భాష లేనిదే సమాజం లేదు. భాషవల్ల అన్యోన్యవ్యవహారం సాధ్యం కావటంవల్లనే సామాజికవ్యవస్థ ఏర్పడ్డది. ఒకే సమాజంలో ప్రాంతానికీ

ప్రాంతానికీ, తరగతికీ తరగతికీ మధ్య తిండి, కట్టు, ఉనికి, పెళ్ళిళ్ళు, పేరంటాలు, మొదలైనవాటిల్లో తేడాలున్నట్లే భాషావ్యవహారంలోనూ తేడాలు కనిపిస్తాయి. అలవాట్లు వేరైనా తెలుగు సంస్కృతిలో ఏకరూపత కనిపిస్తుంది. వాడుకలో వినిపించే ప్రాంతీయభేదాలకూ తరగతి భేదాలకూ అతీతంగా తెలుగుభాషలో ఏక రూపత ఉంది. పిల్లలకు తల్లిదండ్రుల భాష ఒరవడి అవుతుంది. చదువులేని వాళ్ళకు చదువుకొన్నవాళ్ళ భాష ఒరవడి అవుతుంది. విజ్ఞానప్రసారక సాధనా లయిన వార్తాపత్రికలు, రేడియో, పుస్తకాలు మొదలైనవాటి వల్ల కొందరి వాడుక మరి కొందరికి ఆదర్శప్రాయం అవుతుంది. ఈరకంగా ఏభాషలో అయినా కొన్ని పదాలు, కొన్ని ఉచ్చారణలు సభ్యవ్యవహారానికి యోగ్యమైనవిగా మారతాయి. విద్యాభ్యాసం ద్వారా ప్రమాణరూపాలను అనుకరించి నేర్చుకొని మిగిలినవాళ్ళు సభ్యత సంపాదించటానికి ప్రయత్నిస్తారు.

ప్రమాణ - అప్రమాణభాషా భేదాల స్వరూపం మనకింకా సమగ్రంగా తెలియదు. విద్యార్థులలో బహుముఖమైన వ్యవహారదక్షత కల్పించటం విద్యా విధానానికి లక్ష్యమైతే, ప్రమాణభాష ద్వారా విద్యాభ్యాసం జరగాలి. దీనికి విస్తృతమైన మౌలికపరిశోధన జరగాలి. ఏలక్షణాల వల్ల కొన్ని వాడుకలు ఒరవడి అవుతాయి? తెలుగుదేశంలో స్థానికంగా ఎన్ని ప్రమాణవ్యవహారా లున్నాయి? స్థానికప్రమాణాలకూ రాష్ట్రప్రమాణవ్యవహారానికీ అన్యోన్య సంబంధం ఏమిటి? భిన్నప్రాంతాల్లో విద్యావ్యాప్తికి పనికివచ్చే మార్పులు ఏమిటి? ఏమార్పులు వస్తే ప్రమాణభాష అందరికీ ఆమోదయోగ్యమవుతుంది? మొదలైన ప్రశ్నలకు కావలసిన సామగ్రి కోసమే తెలుగు అకాడమీ మాండలికపరిశోధనా కార్యక్రమానికి పూనుకొన్నది. ఈపరిశోధన ప్రయోజనాలు:

(1) తెలుగుభాషలో కులవృత్తి ప్రాంతభేదాల స్వరూపాన్ని, వాటికి అతీత మైన తెలుగు భాషాప్రధానైక్యాన్ని పరిశీలించటం.

(2) ఏయే ఉచ్చారణలు, పదాలు ఏప్రాంతంలో ఏకారణాలవల్ల ప్రమాణాలుగా స్వీకరిస్తున్నారో తెలుసుకోటం. దీనివల్ల స్థానికప్రమాణాల స్వరూపం తెలుస్తుంది; అసలు ప్రామాణ్యబుద్ధి ఏధర్మాల నాశ్రయించి ఏర్పడేదీ తెలుస్తుంది.

(3) స్థానికప్రమాణాలకు రాష్ట్రప్రమాణాలకు ఉన్న సమానరూపాలను, భేదాలను పరిశీలించటం.

(4) ప్రమాణభాష ద్వారా రాష్ట్రం అంతటా ఆధునికవిజ్ఞాన వ్యాప్తికి తోడు పడటం. ప్రాథమికమాధ్యమికకళాశాలాస్థితుల్లో ఏయే ప్రమాణాలు ఆధారంగా అధ్యాపకులు పాఠాలు చెప్పాలో శాస్త్రీయంగా నిర్ణయించటం.

కరీంనగరు తెలుగు : కొన్ని విశేషాలు

పై ఆశయాలతో మొదట కరీంనగరు జిల్లాలో వేరువేరు తరగతులవాళ్ళ వాడుకను కొన్ని మాటల, వాక్యాల, సంభాషణల, కథల రూపంలో సేకరించి టేపురికార్డరు మీద రికార్డు చేయటం జరిగింది. ఈనమూనాలను పరిశీలించిన మీదట తేలిన విశేషాలు కొన్ని:

1. వాక్యనిర్మాణంలో తెలంగాణా వాడుకకు కోస్తా జిల్లాల వాడుకకు మధ్య తేడాలేవీ కనిపించటంలేదు. ఉదాహరణకు ఈకింది వాక్యాలు పరిశీలించండి.

(అ) తెలంగాణా : అయితే వాఙ్గగ్గర ఉద్దెర తీస్కుందామంటే వాడెక్కువ రాస్పడు.

కోస్తా : అయితే వాడి దగ్గర అప్పు తీసుకుందామంటే వాడెక్కువ రాస్తాడు.

(ఆ) తెలంగాణా : అక్కడ ఏదో అవసరానికి కొన్ని పైసల్ తీస్కానిపోయి ఇగ అనుకొన్న ప్రకారం చేస్కోవాలె.

కోస్తా : అక్కడ ఏదో ఒక అవసరానికి కొంత డబ్బు తీసుకు పోయి, ఇహ అనుకున్న ప్రకారం చేసుకోవాలి.

తెలంగాణా వాక్యంలో ఒక్కొక్క పదం బదులు దానికి సరియైన కోస్తా జిల్లా మాట వాడితే ఒక మాండలికం ఇంకో మాండలికం అవుతుంది. అంటే పదనిర్మాణంలోనూ, కొన్ని శబ్దాల ఉచ్చారణల్లోనూ తేడాలు కనిపిస్తాయి గాని వాక్యగతమైన పదాల కూర్పులో చెప్పుకోదగ్గ మార్పులేవీ లేవు. ఉర్దూ భాషా ప్రభావం వల్ల కొన్ని అన్యదేశ్యాలు – కోస్తా జిల్లాలవాళ్ళు వాడనివి – తెలంగాణా వ్యవహారంలో కనిపిస్తాయి. పోతే, నామక్రియారూపాల్లో కొన్ని ధ్వనుల మార్పులు తెలంగాణాభాషలో ఏర్పడ్డాయి. ఈకింది సూత్రాలవల్ల కరీంనగరు జిల్లా వాడుకలో ఉన్న రూపాలను మిగిలిన కోస్తా రాయలసీమ మండలాల భాషతో సమన్వయించవచ్చు.

2. అపదాది (అంటే పదం మొదట గాక ఇతర చోట్ల ఉన్న) దీర్ఘాచ్చులు చాలావరకు హ్రస్వాచ్చులవుతాయి; హ్రస్వాచ్చులు లోపిస్తాయి. ఈసూత్రానికి పూర్వపరహల్లులతో సంబంధం ఉంది. వివరాలు ముందు గాని స్పష్టపడవు.

(క) అపదాది దీర్ఘాచ్చు → హ్రస్వం

(క్రియాపదాల్లో పురుషప్రత్యయం ముందున్న అచ్చు సర్వత్రా హ్రస్వం అవుతుంది.)

అంటారు → అంటరు
వస్తాడు → వస్తడు
చెప్తా(ను) → చెప్త(ను)

ఉత్తమపురుష ప్రత్యయమైన 'ను' క్రియాపదాల్లో కోస్తాజిల్లాల భాషలోనూ లోపిస్తుంది.

వచ్చాను → వచ్చా
చేశాను → చేశా, మొ॥

పై సూత్రాన్ని బట్టి

చెప్పినాడు → *చెప్పినడు
చెప్పినారు → *చెప్పినరు

అయినాయి.

'న' కు పరంగా దంత్యం (*త, ద*) గాని, దంతమూలీయం (*ర ల న*) గాని, తాలవ్యం (*చ, జ*) గాని, మూర్ధన్యం (*ట, డ*) గాని వస్తే, దాని హ్రస్వాచ్చు లోపిస్తుంది. అందువల్ల

చెప్పినడు → చెప్పిండు
చెప్పినరు → చెప్పిన్రు

అవుతాయి. అలానే చెప్పినది → చెప్పింది; చెప్పనిది → చెప్పంది మొదలైన రూపాలు వస్తాయి. అచ్చులు దీర్ఘంగా ఉన్న రూపాలు ఇంకా నేటి రాయలసీమ వ్యవహారంలో వినిపిస్తాయి. దీన్నిబట్టి తెలంగాణా, రాయలసీమ వాడుకలు కలిసి ఉండేవని, తెలంగాణా ప్రజల ఉచ్చారణలో పై మార్పులు వచ్చి భూతకాలిక క్రియలు ఏర్పడ్డాయని నిరూపించవచ్చు.

| రాయలసీమ | | | | తెలంగాణా (కరీంనగరు) |
|---|---|---|---|---|
| (వాడు) వచ్చినాడు | → | *వచ్చినడు | → | వచ్చిండు |
| (వారు, మీరు) వచ్చినారు | → | *వచ్చినరు | → | వచ్చిన్రు |
| (అది) వచ్చినది | → | | | వచ్చింది |
| (అవి) వచ్చినాయి | → | | | వచ్చినయ్ |
| (నువ్వు) వచ్చినావు | → | | | వచ్చినవ్ |
| (నేను) వచ్చినా(ను) | → | | | వచ్చిన |
| (మేము) వచ్చినాం | → | | | వచ్చినం |

మిగిలిన భూతకాలిక క్రియల రూపాలు గూడా ఈ సూత్రానికి సరి పడతాయి. క్రియేతర పదాల్లో గూడా దీర్ఘాచ్చు హ్రస్వం కావటం జరుగుతుంది.

దసరాకు → దసరకు

వాక్యం మధ్యలో వచ్చే కేవల ప్రత్యయాలైన

కూడా → గుడ

కాని → కని

అని కనిపిస్తాయి.

(చ) అవదాది హ్రస్వాచ్చులు లోపిస్తాయి.

| | | | | |
|---|---|---|---|---|
| 1) | ద – క : | ఎందుకంటే | → | ఎంద్కంటే |
| 2) | త – ల : | చేతులో | → | చేతుల → చేత్ల |
| 3) | ద – ల : | అందులో | → | అంద్ల |
| 4) | ద – వ : | చదవక | → | చద్వక |
| 5) | స – క : | తీసుకుందాం | → | తీస్కుందాం |
| 6) | స – న : | చేసిన | → | చేస్న |
| 7) | న – క : | దానికి | → | దాన్కి |
| | | కనుక | → | కన్క |
| 8) | న – గ : | అనగదొక్కుతాంది | → | అనగదొక్తాంది |
| 9) | డ – వ : | నడవాలె | → | నడ్వాలె |
| 10) | డ – స : | నడుస్తాంది | → | నడ్స్తాంది |
| 11) | ర–గ–స : | జరుగుతనె | → | జర్గ్తనె |

ఏయే హల్లుల మధ్య ఉన్న హ్రస్వాచ్చులు లోపిస్తాయో వివరాలు ఇంకా స్పష్టంగా తెలియవు. వీటి లోపం ఎంతవరకు శిష్టశిష్టేతర వ్యవహారాలను వేరుచేసేది గూడా ముందుగా నిర్ణయించటానికి వీలు కాదు.

3. ద్విత్వ హల్లులు అద్విరుక్తాలవుతాయి. ఉదాహరణకు: ట్ట, క్క, మొదలైనవి.

పట్టుక వచ్చి → పట్టుకచ్చి → పటక్చ్చి
తొక్కుతాంది → తొక్తాంది
ఎక్కువమంది → ఎక్వమంది

4. తెలంగాణా భాషలో జానపదుల వాడుకలో ముఖ్యంగా కనిపించే మార్పులు:

(క) అప్పుడు, ఇప్పుడు శబ్దాల్లో అ, ఇ ల బదులు గ, గి లు వినిపిస్తాయి.

అప్పుడు → గప్పుడు
అట్లా → గట్లా
అక్కడ → గక్కడ
ఈదేశం → గీదేశం, మొదలైనవి.

(చ) వ, వా, వి, వీ, వె, వే లలో మొదటి వకారం పోతుంది. (ఈ మార్పు కోస్తా జిల్లాల జానపదులలో గూడా కనిపిస్తుంది గాని అక్కడ వి, వీ, వె, వే ల లోని వకారం లోపిస్తుంది.)

వచ్చిండు → అచ్చిండు
వెనకకి → ఎన్కకి
వాన → అన
వాళ్ళు → అళ్ళు → అల్లు

(ట) మహాప్రాణాక్షరాలు (ఒత్తులు) అల్పప్రాణాలవుతాయి. (ఒత్తులు పోతాయి.)

విద్యార్థులు → విద్యార్తులు
దీర్ఘం → దీర్గం
ప్రభుత్వం → ప్రబుత్వం

(త) చకారం సకారం అవుతుంది.

చదివిండు → సదివిండు
చస్తరు → సస్తరు

(వ) ళ, ళ్ళ లలో మూర్ధన్యత పోయి ల, ల్ల లు అవుతాయి.

వాళ్ళు → వాల్లు
మళ్ళీ → మల్లీ
ఒకవేళ → ఒకేల

(గ) క్ష → చ్చ అవుతుంది.

లక్షణం → లచ్చనం

పైవాటిలో (ట), (త), (వ), (గ)లు తెలుగుదేశమంతటా శిష్ట, శిష్టేతర వ్యవహారాలకు సరిపడతాయి. హ్రస్వాచ్చుల లోపం వల్ల దేశ్యశబ్దాల్లో సంయుక్త వర్ణాలు తెలంగాణా వ్యవహారంలో ఎక్కువగా వినిపిస్తాయి. ఇవి కోస్తా రాయల సీమల్లో ఉండవు.

5. కరీంనగరు వ్యవహారాన్ని పరిశీలిస్తే మరో మార్పు విస్తృతంగా కనిపిస్తుంది. క్రియాపదాల్లో మొదట వచ్చే 'క, చ, త, ప'లు 'గ, జ, ద, బ'లుగా మారతాయి. 'ప' కొన్ని చోట్ల 'వ' గా కూడా అవుతుంది.

ఎట్లాగుట్టాలె (గు ← కు)
తీస్కబోయేసరికి (బో ← పో)
ఏంజెయ్యాలె (జె ← చె)
డంక గొడ్తది (గొ ← కొ)
పోరాటం జేస్తందుకు (జే ← చే)
మీరు జద్వకున్రి (జ ← చ)
రాజా బిలిచిండు (బి ← పి)
కల్లు దాగుడు (దా ← తా)

కరీంనగర్ సంచికలో అచ్చయిన వ్యవహారఖండికలు చదువుతుంటే ఇలాంటి ఉదాహరణలు ఎన్నో కనిపిస్తాయి. ఈమార్పు వాక్యాదిన వచ్చే నామపదాల్లో కనిపించదు. క్రియలెప్పుడూ వాక్యమధ్యంలోనో, వాక్యాంతంలోనో వస్తాయి;

కాబట్టి, అచ్చుల తర్వాత వచ్చే క్రియల్లో పరుషాలు (క, చ, ట, త, ప లు) సరళాలు (గ, జ, డ, ద, బ లు) అవుతాయి అని స్థూలంగా సూత్రించవచ్చు. కోస్తా, రాయలసీమ వ్యవహారాల్లో కాని, కూడా→ గాని, గూడా అవటానికి ఇదే కారణం.

చెయ్యగలడు
చెయ్యబోతాడు
చెప్పదలిచాను
అమ్మజూపాడు
వెళ్ళగొట్టాను

మొదలైన చోట్ల అనుబంధక్రియల్లో మాత్రం ఈ మార్పు కోస్తా, రాయలసీమల్లో శిష్టోచ్చారణలోనూ జానపదోచ్చారణలోనూ కనిపిస్తుంది. ఇలాటి మార్పువల్లనే ఒకటి, ఇక మొదలైన శబ్దాలు కరీంనగరు భాషలో ఒగటి, ఇగ అని వినిపిస్తాయి. గ → హ మార్పు వచ్చి కొన్ని కోస్తా ప్రాంతాల్లో ఒహటి, ఇహ, సహం, మొహం మొదలైన ఉచ్చారణలు వినిపిస్తాయి. అంటే ప్రాచీనోచ్చారణలు ఇంకా తెలంగాణాలో నిల్చి ఉన్నాయని చెప్పవచ్చు.

6. మరొక ప్రధానమైన ధ్వనుల మార్పు తెలంగాణా (కరీంనగరు) తెలుగులో కనిపిస్తుంది. ఒక పదం చివరి దీర్ఘాచ్చు మీద వచ్చిన మరొక పదం మొదటి హ్రస్వాచ్చు తొందరగా మాట్లాడటంలో లోపిస్తుంది.

| | | |
|---|---|---|
| అన్నట్టా + అంటె | → | అన్నట్టా_ంటె |
| మార్పుదేవాలే + అని | → | మార్పుదేవాలే_ని |
| మంచిదయ్యా + అంటడు | → | మంచిదయ్యా_ంటడు |
| ఇస్తలే + అంటడు | → | ఇస్తలే_ంటడు |
| పిల్సకరాపో + అని | → | పిల్సకరాపో_ని |

ముఖ్యంగా అను ధాతువులో అ లోపిస్తున్నట్టు పై ఉదాహరణలను బట్టి గ్రహించవచ్చు. ఇలానే ఉన్నడు, ఉంటడు, మొదలైన క్రియల్లో ఉ లోపించటం వల్లనే తెలంగాణాలో వర్తమానార్థక క్రియలు ఏర్పడుతున్నట్టు నిరూపించవచ్చు. కరీంనగరు తెలుగులో (శిష్టభాషలో గూడా) వర్తమానార్థకక్రియలకూ తద్ధర్మ భవిష్యదర్థకక్రియలకూ ఉన్న రూపభేదాలు ఈ కింది పట్టికను పరిశీలిస్తే తెలుస్తాయి.

| వర్తమానం | | తద్ధర్మం (భవిష్యత్కాలం) |
|---|---|---|
| 1) (నేను) వస్తాన్న/ వస్తన్న | : | వస్త |
| 2) (మేం) వస్తాన్నం/ వస్తన్నం | : | వస్తం |
| 3) (నువ్వు) వస్తాన్నవ్/ వస్తన్నవ్ | : | వస్తవ్ |
| 4) { మీరు / వాళ్ళు } వస్తాన్రు/ వస్తన్రు | : | వస్తరు |
| 5) (వాడు) వస్తాండు/ వస్తండు | : | వస్తడు |
| 6) (అది) వస్తాంది/ వస్తంది | : | వస్తది |
| 7) (అవి) వస్తాన్నయ్/ వస్తన్నయ్ | : | వస్తయ్ |

తద్ధర్మభవిష్యద్రూపాల్లో కోస్తా రాయలసీమ వ్యవహారానికీ, తెలంగాణా వ్యవహారానికీ అట్టే తేడా లేదు:

*వస్తా(ను), వస్తాం, వస్తావు, వస్తారు, వస్తాడు, వస్తుంది, వస్తాయ్.*

తెలంగాణా ప్రాంతంలో ఈరూపాల చివర పురుషప్రత్యయం ముందున్న దీర్ఘాచ్చు హ్రస్వం అవుతుంది (చూ. 2. పైన). కాని, వర్తమానక్రియల్లో తెలంగాణా (ప్రస్తుతం కరీంనగరు) వాడుకకు పూర్వరూపాలు రాయలసీమ వ్యవహారంలో ఇంకా నిల్చి ఉన్నాయి. రాయలసీమ, కోస్తా జిల్లాల వాడుకల్లో తేడాలు ఈవిధంగా ఉంటాయి:

| రాయలసీమ (శిష్టభాష) | కోస్తా (శిష్టభాష) |
|---|---|
| వస్తా ఉన్నా(ను) | వస్తూ ఉన్నాను/ వస్తున్నాను |
| వస్తా ఉన్నాం | వస్తున్నాం |
| వస్తా ఉన్నావ్ | వస్తున్నావ్ |
| వస్తా ఉన్నారు | వస్తున్నారు |
| వస్తా ఉన్నాడు | వస్తున్నాడు |
| వస్తా ఉన్నది | వస్తున్నది |
| వస్తా ఉన్నయ్ | వస్తున్నయ్ |

రాయలసీమ వచ్చినాడు, తెలంగాణాలో వచ్చిండు – ఈరెండింటికీ మూల రూపం వచ్చినాడు అనీ, అది స్వస్వరూపంలో ఇంకా రాయలసీమలో నిల్చిఉందనీ

తెలంగాణాలో *వచ్చినడు → వచ్చిండు గా మారింది అనీ ఇదివరకు నిరూపించాం. వర్తమానార్థక క్రియల్లోనూ అలానే జరిగినట్లు నిరూపించవచ్చు. ముందు ఉన్నాడు, ఉన్నారు మొదలైన రూపాల్లో దీర్ఘాచ్చు హ్రస్వమై ఉన్నడు, ఉన్నరు అనే రూపాలేర్పడ్డాయి (చూ. పుటలు 134, 135). ఆ తర్వాత దీర్ఘాచ్చు మీద ఉ లోపించి

వస్తా + ఉన్నడు → వస్తాన్నడు;

మూడో మార్పు డు, రు ల ముందున్న 'న్న' లో ద్విత్వం పోయింది.

వస్తాన్నడు → *వస్తానడు (→ వస్తాండు);

పురుష ప్రత్యయం ముందున్న దీర్ఘాచ్చు వికల్పంగా హ్రస్వం కావటంవల్ల

వస్తాండు → వస్తండు

గా మారింది. రూపపరిణామం ఈ కింది విధంగా జరిగిఉంటుంది.

1) వస్తాఉన్నాను → వస్తాఉన్న → వస్తాన్న → వస్తన్న
2) వస్తాఉన్నాం → వస్తాఉన్నం → వస్తాన్నం → వస్తన్నం
3) వస్తాఉన్నావ్ → వస్తాఉన్నవ్ → వస్తాన్నవ్ → వస్తన్నవ్
4) వస్తాఉన్నారు → వస్తాఉన్నరు → వస్తాన్నరు → *వస్తానరు → వస్తాను → వస్తను
5) వస్తాఉన్నాడు → వస్తాఉన్నడు → వస్తాన్నడు → *వస్తానడు → వస్తాండు → వస్తండు
6) వస్తాఉన్నది → వస్తాన్నది → *వస్తానది → వస్తాంది → వస్తంది
3) వస్తాఉన్నాయ్ → వస్తాఉన్నయ్ → వస్తాన్నయ్ → వస్తన్నయ్

పైరూపాల్లో వస్తాంది, వస్తాన్నయ్, వస్తను లాంటివి అధ్యాపకుల భాషలోనూ వినిపిస్తాయి. ఇవి కేవలం జానపదుల భాషకు చెందినవే అనటానికి వీల్లేదు. కోస్తా జిల్లా భాషలో గూడా కొందరి వ్యవహారంలో వస్తాఉంది, చేస్తాఉంది-లాంటి వాడ్కలు వినిపిస్తాయి.

7. కరీంనగరు వ్యవహారంలో నామక్రియావిభక్తులకు సంబంధించిన కొన్ని విశేషాలు:

నామవిభక్తులు

| కరీంనగరు | కోస్తా |
|---|---|
| (1) వానిదగ్గరకు | వాడిదగ్గరకు |
| (2) పండ్గవరకైన కుట్టి ఇవ్వమని | పండగకు.../ పండగ(నాటి) కి... |

(కాలార్థంలో అవధిని సూచించే ప్రత్యయం తెలంగాణాలో వరకు. కోస్తా జిల్లాల్లో ఇంతవరకు, అంతవరకు అనే చోట్ల స్థలకాలార్థాల్లో ఈవాడుక ఉంది; ఇతరత్ర స్థలార్థకశబ్దాల్లో 'అవధి' ని సూచించటానికి ఈ ప్రత్యయం వస్తుంది. ఉదా.: మా ఇంటివరకు = మా ఇంటిదాకా. ఇదివరకు, అదివరకు అనేవి కేవలం కాలార్థంలోనే ఉన్నాయి. కోస్తా జిల్లాల్లో –దాకా అనే ప్రత్యయం – వరకు స్థానంలో విరివిగా వాడతారు. నిన్నటిదాకా, ఇంటిదాకా.)

| కరీంనగరు | కోస్తా |
|---|---|
| (3) అందుకొరకు (అప్పుడప్పుడు కోసం గూడా వినిపిస్తుంది) | అందుకోసం |
| (4) నిన్నటిసంది (కాలార్థం) | నిన్నటినుంచి |
| ఎక్కడినుంచి (స్థలార్థం) (అప్పుడప్పుడు 'ఎక్కడి నుండి' అని గూడా వినిపిస్తుంది) | ఎక్కడినుంచి |
| (5) సప్తమీవిభక్తి లో → లొ → ల (జానపదుల భాషలో ఎక్కువగా –ల) | లో |
| అండ్లో, అండ్లొ | అందులో, దానిలో |
| చేత్ల | చేతిలో |
| (6) పట్టింపుతోని; దాన్తోని | పట్టింపుతో; దాంతో |
| (7) దాని వల్ల | దాని వల్ల |
| (8) ఊర్లోపట | ఊళ్ళో |

క్రియావిభక్తులు

ఇదివరకు వివరించినవి కాక ఈ కింది రూపాలు తెలంగాణా వాడుకలో వినిపిస్తాయి.

| తెలంగాణా (కరీంనగరు ఆధారంగా) | కోస్తా |
|---|---|
| (1) చెప్పుది (జానపద) / చెప్పుదు (శిష్ట) | చెప్పుదు |
| (2) చెప్పంగ | చెప్పగా |
| (3) (మీరు) చెప్పుండ్రి | చెప్పండి |
| (4) చెప్పకుంటె | చెప్పకపోతే |
| (5) చెప్పుడు | చెప్పటం/ చెప్పడం |
| (6) చెప్పాలె | చెప్పాలి |
| (7) చెప్తలేదు | చెప్పటంలేదు |
| (8) చెప్పేటి/ చెప్పే | చెప్పే, చెప్పేటి (– అప్పుడు ముందు) |
| (9) చెప్పగల్గుత | చెప్పగలను; చెప్పగలుగుతాను |

కొన్ని చోట్ల చేస్తిని, చెప్తిని లాంటి రూపాలు భూతకాలంలో తెలంగాణా వాడుకలో ఉన్నాయి. వీటికీ, విరివిగా వాడే చేసిన, చెప్పిన లాంటి రూపాలకూ మధ్య ఉన్న సంబంధం మనకు ఇంకా పూర్తిగా తెలియదు.

శబ్దజాలంలో ప్రాంతీయభేదాలు తెలుగుదేశమంతటా కనిపిస్తాయి. విషయాన్ని బట్టి వ్యవహర్త ఉచితమైన మాటలు ఏరుకుంటాడు. రాజకీయ రంగంలో మెలిగేవాళ్ళపై పత్రికల భాషాప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. సందర్భోచితంగా ఎవరు ఏమాటలు వాడతారు అనేది శైలికి సంబంధించిన వైయక్తిక విషయం. కరీంనగరు విద్యార్థి భాషలో 'ఆదర్శాలు, జాతీయభావాలు, సూచనలు, అభిమానమైన విషయం, జాతీయ కార్యక్రమాలు, ప్రభుత్వదృష్టి, అనర్థకం' – ఇలాంటి మాటలు వినిపించాయి. బి. ఏ. దాకా చదువుకున్న ఒక వర్తకుని వాడుకలో ఇంగ్లీషు మాటలు ఎక్కువ కనిపించాయి. చదువు అట్టే లేని చేనేతపనివాడి వ్యవహారంలో ఎక్కువ దేశ్యశబ్దాలు దొర్లాయి. ప్రమాణాప్రమాణ భేదాలు ఉచ్చారణలోను, రూపనిష్పత్తిలోను కనిపించినంత స్పష్టంగా పదాల

ఎన్నికలో కనిపించవు. కొన్ని సందర్భాల్లో మాత్రం దేశ్యశబ్దాలకంటె అన్యదేశ్యాలకు వ్యవహర్తలు ఎక్కువ విలువ కడతారు. అందువల్లనే, 'చాకలి, కంసాలి, గొల్ల' మొదలైన మాటల బదులు 'రజక, విశ్వబ్రాహ్మణ, యాదవ' అనే శబ్దాలకు ప్రస్తుతం ఎక్కువ గౌరవం వచ్చింది. సామాజికవ్యవస్థలో వచ్చే మార్పులను ఇలాంటివి ప్రతిబింబిస్తాయి.

ఇంతకుముందు శిష్టభాషా లక్షణాలకు జానపద భాషాలక్షణాలకు తేడాలు చూపించాం. కాని జానపదవ్యవహారానికీ శిష్టవ్యవహారానికీ మధ్య ఎన్నో అంతరువులు కనిపిస్తాయి. అంటే, కేవల శిష్టవ్యవహారాన్ని కేవల జానవపద వ్యవహారాన్ని మినహాయిస్తే చాలామంది వాడుకలో వాళ్ళ సాంఘికస్థితి, విద్య, వృత్తి, ఇతరవ్యవహర్తలతో సంబంధం, మొదలైనవాటినిబట్టి శిష్ట, జానపద వ్యవహారలక్షణాలు కలగలుపుగా కనిపిస్తాయి. ఒక వ్యక్తికి మామూలుగా (ఇంటి దగ్గర నేర్చుకున్న వాడుకలో) మాటలకు ఒత్తులు ఉండవలసినచోట ఒత్తులు లేకుండా ఉచ్చరించే అలవాటు ఉందనుకోండి; అంటే మాట్లాడేటప్పుడు అతని నోటికి చప్పున అప్రయత్నంగా వచ్చే ఉచ్చారణలు 'దర్మం, బారతం, బాద' అని ఉంటాయి. అతను తనకంటె చదువుకున్నవాళ్ళు (శిష్టులు) అని అనిపించే వాళ్ళతో మాట్లాడేటప్పుడు ప్రయత్నపూర్వకంగా ఇలాటి మాటల్లో ఒత్తులు నిలపటానికి ప్రయత్నిస్తాడు – 'ధర్మం, భారతం, బాధ' అని. కాని ప్రయత్నపూర్వకంగా నేర్చుకొన్నవి పాత అలవాట్లు మారేదాకా పూర్తిగా సాధ్యపడవు. అందువల్ల అవ్యక్తి ఉచ్చారణలో కొన్ని ఒత్తులున్న మాటలు, కొన్ని ఒత్తులు లేనివి వినిపిస్తుంటాయి. ఒకే మాటను అలవాటుకొద్దీ ఒత్తులు లేకుండా ఉచ్చరించి సరిదిద్దుకొని ఒత్తులతో మరోసారి ఉచ్చరించటం గూడా జరుగుతుంది. ఇలాటి మార్పులను బట్టి అతను ఏ ఉచ్చారణలు, రూపాలు తన అలవాటులో ఉన్నవాటికంటె శిష్టసమాజంలో యోగ్యమైనవిగా అనుకొంటున్నాడో మనకు తెలుస్తుంది. చాలామంది వ్యవహారాన్ని ఇలా పరిశీలించిన మీదట వాళ్ళ వాడుక ఏరకంగా మారేది మనం తెలుసుకోవచ్చు. ఒకే మాటకు రెండు మూడు ఉచ్చారణలు ఒకే వ్యక్తిలో ఒకే కాలంలో వినిపించటం 'అవ్యవస్థ' గాదు. అతని వ్యవహారపరిణామానికి గుర్తు.

ఈసూత్రాన్నిబట్టి కరీంనగరు భాషను పరిశీలిస్తే చాలా రకాలైన మార్పులు నడిమి తరగతివాళ్ళ వాడుకలో కనిపించాయి.

1) ఒక అధ్యాపకుడి భాషలో శిష్టుల వాడుకలో లాగా పదాది చకారాలు ఎక్కువ చోట్ల ఉన్నాయి. కొద్ది చోట్ల సకారాలు నిలిచి ఉన్నాయి. కాని, 'ళ' మాత్రం ఎక్కువగా 'ల' గానే వినిపిస్తుంది. 'వచ్చు'లో కొన్ని చోట్ల 'వ' నిలుస్తుంది; కొన్ని చోట్ల పోతుంది. ఎక్కువ చోట్ల ఒత్తులు ఉండవు.

| | | |
|---|---|---|
| చేస్తేనే గాని<br>చేయగల్గుత | — | సూస్తున్న |
| ఒకవేల | — | ఒకేల |
| | — | అచ్చేసిన |
| | | కొన్నేల్లు |
| ఏవిధంగయిన | — | ఈవిదంగ, |
| | | బాద పడ్తన్న |

(2) ప్రధానంగా రాజకీయాల్లో తిరిగే ఒక వ్యక్తి వ్యవహారంలో ఈకింది మార్పులు కనిపించాయి.

| | | |
|---|---|---|
| చేసోక్కవచ్చు, చద్వక | — | లేసిన్రు, ఇడ్సిపెట్టి |
| వచ్చేటోడు<br>వాల్లు, వీల్లు | — | అచ్చెటోడు, అచ్చిన్రు |
| | — | అస్తది |

ఎవల్లు, వీల్లకు, అనెటోల్లు మొదలైనవి. (ళకార రూపాలు చాలా తక్కువ.)

| | | |
|---|---|---|
| అర్థమైతలేదు | — | అబిప్రాయం |
| | — | విద్యార్తులకు |
| | — | ప్రబుత్తం |
| | — | అర్తం |

(ఒత్తులు చాలా తక్కువ)

(3) ఒక పదిహేడేళ్ళ బ్రాహ్మణవిద్యార్థి భాషలో ఎన్నో పత్రికల్లో వచ్చే సంస్కృతశబ్దాల వాడుక ఉన్నా ఒత్తులు చాలావరకు పాయినాయి. 'చ/స' ల మార్పు కనిపిస్తుంది. వకారం కొన్ని చోట్ల, దాని లోపం మరి కొన్ని చోట్ల కనిపిస్తుంది. సప్తమీవిభక్తి లో → ల గా మారుతుంది. ఉదా.:

| | | |
|---|---|---|
| అభిమానమైన విషయం | — | జాతీయ బావాలు |
| అనర్థకమని | — | ప్రబుత్వద్రుష్టి |

— ముక్యంగ
— అర్తం జేస్కొని
చాలా, చెప్పి — సదువుడు, సదవకపోవుడు

(4) ఇంకొక పద్దెనిమిదేళ్ళ బ్రాహ్మణవిద్యార్థి భాషలోనూ ఒత్తులు లేకపోవటం జరుగుతుంది; ళ్ళ - ల్ల ల మార్పు కనిపిస్తుంది. ఉదా.:

వాన్లు, వాళ్ళు, వాల్లు
అట్టి పరిస్థితి — బాషనె
అశరాస్యులు — అచ్చెరాస్యత
ఎలాగో సాదించాం (ఇది కోస్తా జిల్లా రూపం)
దుస్టశక్తుల నేటియి
అర్థం జేస్కొని
ప్రజల్లోపల } — { ఇండియాల వున్న
హయాంలో } — { పరిస్థితులల్లో

(5) ఒక పద్దెనిమిదేళ్ళ హరిజనవిద్యార్థి భాషలో గూడా ఒత్తులు లేకపోవటం, 'ళ' బదులు 'ల' ఉచ్చారణ ఎక్కువగా కనిపిస్తాయి. కాని 'స' బదులు 'చ', 'ల' బదులు సప్తమీవిభక్తిలో 'లో' అక్కడక్కడా వినిపించాయి. వకార లోపం కొన్ని చోట్ల, వకారం నిలవటం కొన్ని చోట్ల ఉంది. కొన్ని శబ్దాల్లో మామూలుగా లేని చోట్ల కూడా ఒత్తులు కనిపించాయి.

అధిఖారి, నూరా అర్వై
వాట్ని — అటిమీద
చూడు — సూడు
చంపిండు — సంపిండు
ఊర్లో — ఊర్లో
గోతిలోకి — గోతిల దిగి
వచ్చింది } — { మందలకచ్చి (=మందలోకి వచ్చి)
వచ్చిన } — { అస్తది
వీల్లు, మల్ల

ఒకటి రెండు చోట్ల మాత్రం అ, ఈలకు బదులు గా, గీల వాడుక నిలిచింది: గిదొక తెక్కా.

(6) ముప్పయిమూడేళ్ళు చదువుకొన్న వర్తకుడి భాషలో ఆంగ్లశబ్దాలు, సంస్కృతశబ్దాలు విరివిగా ఉన్నాయి. ల్ల బదులు ళ్ళ తరుచు వినిపిస్తుంది. పదాదిన స కారం, చ కారం మారుతుంటాయి. పదాది వ కారం ప్రయత్న పూర్వకంగా మాట్లాడినప్పుడు నిలుస్తుంది; మామూలు వాడుకలో పోతుంది. ఒత్తులు లేవు; లో → ల (సప్తమీవిభక్తి ప్రత్యయాల) మార్పుగూడా కనిపిస్తుంది.

| | | |
|---|---|---|
| వస్తరు, వీళ్ళుందరు<br>వాళ్ళుందరు, వాణ్ని గుడ | } | ఎవరచ్చినా, వాల్లు,<br>వాల్లకు, సిన్నోల్లం |
| దాన్లో | : | అమెరికాల |
| అర్ధం గాదు | : | అర్తమైతది<br>దీర్గం దీసి, వాల్ల పచారం |

(7) అట్టే విద్యావంతుడు గాని ఒక చేనేతపనివాడి వ్యవహారంలో ళ్ళ → ల్ల గావటం, ఆ ఈ ల బదులు గా గీ లు రావటం తరుచుగా కనిపిస్తుంది. చ బదులు స రావటం కొన్ని చోట్ల జరుగుతుంది. లో ప్రత్యయం బదులు సర్వత్రా ల వస్తుంది. కొన్ని చోట్ల పదాది వ కారం లోపిస్తుంది.

| | | |
|---|---|---|
| ఓలకాళ్ళే<br>చిన్నోళ్ళు<br>ఆడోళ్ళు<br>మొగోళ్ళు | } | అల్లు<br>వాల్లు<br>ఆడోల్లు<br>ముందటోల్లు |
| అప్పుడు | | గప్పుడు, గిప్పుడు, గీదేశం<br>ఖాలం, బార్యలు |
| చేస్కుంటరు<br>చదువుకున్న | } | సదువుకుంట |
| | : | ఇంట్ల (ఇంట్లో)<br>మొగ్గంల (మొగ్గంలో) |

స్థాలీపులాకంగా ప్రదర్శించిన పై ఏడుగురి వ్యవహారంలో కనిపించే మార్పులను బట్టి ఈకింది విశేషాలు తెలుస్తాయి.

(1) ఆ ఈ ల బదులుగా గా గీ ల వాడుక కేవలజానపదవ్యవహారలక్షణం. కొద్ది సంస్కారం ఉన్నవాళ్ళు ఈ అలవాటు అంతకు ముందున్నా తొందరగా

మార్చుకుంటారు. చివరి వ్యవహర్త వాడుకలోనే *గప్పుడు, గీడ, గిట్ల* ( అప్పుడు, ఇక్కడ, ఇట్ల బదులు) లాంటి శబ్దాలు ఎక్కువగా వినవచ్చాయి.

(2) స కారం బదులు చ కారం ఉచ్చరించటం ప్రమాణ వ్యవహారలక్షణం. ఎక్కువ మందితో వ్యవహరించే అవకాశం ఉన్నవాళ్ళు క్రమంగా స బదులు చ ఉచ్చారణ నేర్చుకొనే ప్రయత్నం చేస్తారు.

(3) అంతకంటె కష్టమైంది పదాది వ కారం నిలపటం – అచ్చిండు బదులు వచ్చిండు అనటం. పదాది వకార రూపాలు శిష్టోచ్చారణలో చేరతాయి.

(4) మూర్ధన్య ళ కారానికి ల కారాని కంటె విలువ ఎక్కువ – వాళ్ళు, వీళ్ళు, మొదలైన ఉచ్చారణలు వాల్లు, వీల్లు స్థానంలో సంస్కారవంతుల భాషలో ఎక్కువగా ఉంటాయి. వీటి అనుకరణ ఇంతకు ముందు చెప్పినవాటి కంటె కాస్త క్లిష్టమనిపిస్తుంది.

(5) అన్నింటి కంటె క్లిష్టమైంది ఒత్తులు ఉచ్చరించగలగటం. అంటే ఒత్తులు బాగా ఉచ్చరించగలిగినవాళ్ళు, అంతకు ముందే ఇతర శిష్టోచ్చారణలు నేర్చుకొని ఉంటారన్నమాట. అనుకరణక్లేశంలో చివర సాధించేది ఒత్తుల ఉచ్చారణ.

పై అనుశీలనను బట్టి అధ్యాపకులు, విద్యాబోధనలో ఏయే ఉచ్చారణలు సవరించటంలో ఎక్కువ శ్రద్ధ చూపించాలో తెలుసుకోవచ్చు. ఈ పరిశోధన దేశమంతటా క్షుణ్ణంగా జరిగిన తర్వాత అధ్యాపకులకు ప్రమాణభాషా బోధనను గురించి ప్రత్యేకంగా ఉపకారకగ్రంథాలు (guides) రాసి, 'ఓరియంటేషను కోర్సు'లు నడపటం సాధ్యమవుతుంది.

## 12

# ఆధునిక ప్రమాణభాష

గ్రాంథికవ్యావహారికభాషల మధ్య జరిగిన వాదోపవాదాలను మళ్లీ తిరగ దోడటం అనవసరం. ప్రాచీననవీనభాషల్లో ఏది పాఠ్యగ్రంథాల రచనకు ఉపయోగించాలి అనేది మనం చర్చించవలసిన ప్రశ్న. ప్రాచీనభాషకు ప్రామాణిక భాష అనీ, నవీనభాషకు గ్రామ్యం అనీ మారు పేర్లు పెట్టడంవల్ల మొదటినుంచీ ఈవాదం తప్పుదోవన పడ్డది. సుమారు 55 ఏళ్ల క్రితం తలెత్తిన ఈ వాదోపవాదాల ఫలితం అప్పటికి తేలకపోయినా, ఇప్పటికి చాలావరకు కాలమే దాన్ని నిర్ణయించింది. ఒక్క స్కూలు పుస్తకాల్లో తప్ప మిగిలిన విద్యావ్యాపక సాధనాలన్నింటిలోనూ ఒక రకమైన ప్రామాణికనవీనభాష వ్యాపించి రూపు దిద్దుకున్నది. కుల, వర్గ, ప్రాంత పరిమితులకు అతీతంగా వ్యాపించిన నేటి ప్రమాణ భాషకు లక్షణం నిర్దేశించటం అట్టే క్లిష్టమైన పని కాదు. దిన, వార, మాస పత్రికలన్నిటిలోనూ (ఏప్రాంతానికి చెందినవైనా) రేడియోలో, పండితసభల్లో, రాజకీయసమావేశాల్లో, రాష్ట్రశాసనసభల్లో, విజ్ఞానప్రచారానికి ప్రకటించే ప్రభుత్వ పత్రికల్లో, విద్యాబోధనలో – వీటన్నిట్లోనూ ఆధునికప్రమాణభాష వ్యాప్తిలోకి వచ్చింది. కొద్ది రోజుల్లో తెలుగు అధికారభాష కాబోతున్నది. ఒకవేళ మన మందరం ప్రాచీన కావ్యభాషలోనే ప్రభుత్వతంత్రం జరగాలని నిర్ణయించినా, అది జరిగే పని కాదు. (1) మరి పాఠ్యగ్రంథాల్లో సర్వవ్యాపి అయిన నవీనభాషను

ప్రవేశపెట్టటం అవశ్యకమా, కాదా అనేది ముందు నిర్ణయించాలి. (2) ఈ నిర్ణయం జరిగిన తరువాత ఏయే పాఠ్యగ్రంథాల్లో ఎంతవరకు దీన్ని ప్రవేశపెట్టాలి, భాషాగ్రంథాల్లో కావ్యభాషను ఏతరగతినుంచి ఎంతవరకు. ఏయే ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకుని ఉంచాలి అనేది తరవాత నిర్ణయించాలి.

పాఠ్యగ్రంథాల్లో నవీనభాష ప్రవేశపెట్టటానికి గల అవశ్యకతలో ఉన్న తత్త్వం ఏమిటి అన్నదాన్ని గురించి సంగ్రహంగా మనవి చేస్తాను.

## భాష, సంస్కృతి

మానవజాతి భౌతికసాంస్కృతికవ్యవస్థలనుగురించి చెప్పే (అంత్రపాలజీ) శాస్త్రంలో ఇటీవల జరిగిన పరిశోధనలనుబట్టి భాషాసంస్కృతుల పరస్పర సంబంధాన్నిగురించి ఎన్నో విశేషాలు బయటపడ్డాయి. మిగిలిన సాంఘిక వ్యవస్థల లాగానే భాష సాంఘికవ్యవస్థ. ఒక సమాజంలో ఉన్న వ్యక్తుల ఆలోచనా విధానం, వాళ్ళు మాట్లాడే భాషలో నలిగిన కొన్ని మార్గాల్లోనే నడుస్తుంది. మన అలవాట్లూ, నమ్మకాలూ, మనకు పరిసరవస్తువులతోటీ, వ్యక్తులతోటీ ఉన్న సంబంధం, మన ప్రవర్తనను నియమించి మనం వాడే మాటల్లో ప్రతిఫలిస్తాయి. మనం అలవరుచుకొన్న అలవాట్లకు మనమే లోబడిపోతాం. అలాగే మన· మనం ఆలోచనలను వ్యక్తీకరించటానికి సృష్టించి అలవరుచుకొన్న భాషకు, మన ఆలోచనాశక్తి లోబడి, ఆభాషతో కట్టుబడిపోతుంది. వాడుకొనే మాటలను వదిలిపెట్టి ఆలోచించటం దుర్లభం అవుతుంది. దీన్నే మనం 'భాషలో ఆలోచించటం' అంటాం.

1. భిన్నభాషా సమాజాలకు వాస్తవిక జగత్తు ఆయా భాషావ్యవస్థల భేదాల్ని బట్టి వేరువేరుగా కనిపిస్తుంది. కొన్ని భాషల్లో రంగులకు అయిదు పేర్లుంటాయి. మరి కొన్నింటిలో ఆరూ, ఏడూ ఉండవచ్చు. ఆయా భాషల్లో ఉన్న పేర్లనుబట్టి వ్యవహర్తలు ఒక రంగుకూ, ఇంకొక రంగుకూ భేదాలు నిరూపించి ప్రకటించ గలరు. ఉదాహరణకు మనం తెలుగులో, 'బొగ్గు నల్లగా ఉంటుంది'; 'అతను నల్లగా ఉంటాడు'; 'కృష్ణుడు నల్లటివాడు'; 'నల్లమబ్బులు' మొదలైన చోట్ల ఇంగ్లీష్‌లో బ్లాక్, బ్రౌన్, బ్లూ, గ్రే అని నాలుగు రకాలుగా ఉన్న వర్ణవిభాగానికి 'నలుపు' అని ఒకే పేరు పెట్టుకున్నాం. అంటే అవాంతర భేదాలు లెక్కలోకి రాని ఒకే రంగుగా దీన్ని మనం భావిస్తాం. పచ్చటి మనిషి – పచ్చటి ఆకు అనే చోట్ల

ఆంగ్లంలో 'ఎలో, గ్రీన్' అనీ హిందీలో 'పీలా, హరా' అనీ వేరు వేరుగా ఉన్న రంగుల పేర్లకు మనం ఒకే శబ్దం ఉపయోగిస్తాం. మన భావనావ్యాపారంలో మొట్టమొదట ఈరెండు రంగులనూ భిన్నవర్ణాలుగా వేరుచేసే అవసరం లేక పోయిఉండవచ్చు. ఆకుపచ్చని పండు పక్వమైనప్పుడు పసుపుపచ్చగా మారటం, లేత ఆకు ముదిరి, పండి, రాలిపోయినప్పుడు పరిణామదశల్లో కలిగే అనుక్రమం వీటి అభేదనిరూపణకు హేతువు కావచ్చు. ఈధాతువునుంచి వచ్చిన శబ్దాల్లో ఉన్న అర్థసామ్యం గమనించండి. పచ్చ, పచ్చి, పసుపు, పసరు, పసిడి, పసి, పసిమి, పైడి, పైరు, మొదలైనవి. కాలాంతరంలో, వ్యవహారంలో ఏర్పడ్డ ఆవశ్యకతనుబట్టి ఈరంగుల్లో అవాంతరభేదాలకు కూడా పదాలు కల్పించుకున్నాం. ఉదా.: ఆకుపచ్చ, పసుప్పచ్చ, చిలకాకుపచ్చ, ముదురాకుపచ్చ; అలానే ఊదా, మట్టిరంగు, నీలం, మొదలైనవి. భాషకూ, భావానికీ గల సంబంధం ఇలాంటి ప్రత్యేకసందర్భాల్లోనే కాదు, వ్యాకరణంలో కూడా – సంధి, సమాసం, కారకం, మొదలైనవాటిలో కూడా కనిపిస్తుంది.

2. తెలుగులో దేశ,కాల, భేదాన్ని స్పష్టంగా విడమర్చి చెప్పటం తక్కువ. ఇది మన ఆలోచనావిధానంలో పాతుకుపోయిన కలయిక. ఉదా.: ఎంతదాకా వెళ్తావు? ఎంతదాకా ఉంటావు? అన్నప్పుడు దేశంలోనూ కాలంలోనూ ఉన్న దూరపరిమితిని సూచించటానికి 'దాకా' అని ఒకే ప్రత్యయం ఉపయోగిస్తాం (ఇంగ్లీషులో 'హౌ ఫార్', 'హౌ లాంగ్' అనే భేదం ఉంది.).

3. తెలుగు మాట్లాడే వ్యక్తి తన చుట్టుపక్కల ఉన్న వ్యక్తులతోను, పదార్థాలతోను తనకున్న సంబంధం దూరమా, దగ్గరా అనేది వ్యక్తీకరించటానికి ఎంతో భాషాసామగ్రిని ఉపయోగిస్తాడు. స్థూలంగా జగత్తును రెండు రకాలుగా విభజించాడు. అతనికి వ్యక్తులంతా ఒక ఎత్తు, వ్యక్తులు కాని తిర్యగ్జడాలు మరొక ఎత్తు. అందుకనే 'ఎన్ని పుస్తకాలు? ఎన్ని ఆవులు/ ఎన్ని కుక్కలు?' – అంటాము. (శిష్టసమాజంలో ఇప్పుడు స్త్రీని 'అది' అని నిర్దేశించే పద్ధతి తక్కువైపోతున్నది.) మిగిలిన వ్యక్తులతో ఉన్న సంబంధంలో భౌతికంగా దూరపువాళ్లలోనూ, దగ్గరవాళ్లలోనూ తనతో వాళ్ళకున్న సంబంధాన్ని చెప్పటానికి చాలా అవాంతరభేదాలు కల్పించుకోవలసివచ్చింది. ఉదా.: దూరవ్యక్తి నిర్దేశంలో 'వాడు, అతను, ఆయన, వారు,' అనీ, సమీపవ్యక్తినిర్దేశంలో 'వీడు, ఇతను, ఈయన, వీరు' అనీ, మధ్యమపురుషలో 'నీవు, మీరు, తమరు'

అనీ- ఇలాటి రూపాలను ఏయే సందర్భాల్లో ప్రయోగించాలో మనకు తెలుసు. ప్రాచీనభాషలో ఈభేదం అంత స్పష్టంగా లేదు. ఉదాహరణకు, నన్నయ్యగారు హేళన చెయ్యవలసివచ్చిన చోట గౌరవార్థకశబ్దాలు ఉపయోగించారు- "వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె"[1] .

ఇంకో విశేషం, తెలుగులో బహువచన రూపాలే గౌరవార్థక రూపాలుగా మారాయి. అంటే ఒక వ్యక్తికి వ్యక్తులసమూహం ఎప్పుడూ గౌరవ స్థానమే. ఆ సమూహంలో పెద్దవాళ్లూ చిన్నవాళ్లూ ఉండవచ్చు. అందుకని గౌరవార్థతకు భంగం రాకూడదు. ఒక తెలుగువాడు మరొకడితో మాట్లాడుతున్నప్పుడు గానీ, మరొకణ్ణి గురించి మాట్లాడుతున్నప్పుడు గానీ, ఒక్కొక్కరితో తనకు ఉన్న సంబంధం అతని మాట తీరును బట్టే మనకు తెలుస్తుంది (అతను ఉపయోగించే ప్రథమ, మధ్యమపురుషరూపాన్ని బట్టి). కాని వ్యక్తుల సమూహాన్ని గురించి చెప్పినప్పుడు తనతోగల సంబంధం నిర్దేశించే అవసరం తక్కువ. అంటే బహువచన రూపాల్లో రెండుమూడు రకాల గౌరవద్యోతకత ఏర్పడలేదు.

4. ఆర్య భాషల్లో అన్న, తమ్ముడు, అక్క, చెల్లెలు అనే రెండు రకాలైన విభజనకు, వ్యక్తి కంటే పెద్ద, చిన్న భేదానికి మాటలులేవు. దీన్నిబట్టి కూడా తెలుగు వాడుకలో వ్యక్తికి, వ్యక్తికి మధ్య ఉన్న అంతరాన్ని మాట తీరులోనే అడుగడుగునా నిర్దేశించటం ఎంత అవశ్యకమో తెలుస్తుంది.

5. ఇంతే కాకుండా, మనం ఉపయోగించే క్రియల్లో కూడా మన ఆలోచనా విధానం, కాలక్రమాన దాంట్లో వచ్చిన పరిణామం, స్పష్టమవుతాయి. భావక్రియలకు, వ్యతిరేకక్రియలకు పరస్పరసంబంధం ప్రాచీనభాషలోకంటే మరింత స్పష్టంగానూ, సమగ్రంగానూ ఇప్పటి భాషలో ఏర్పడ్డది.

| భావక్రియం | వ్యతిరేకక్రియం |
|---|---|
| వండుతాడు | వండడు |
| వండ్రేడు / వండినాడు | వండలేదు |
| వండి, వండుతూ | వండక / వండకుండా |
| వండితే | వండకపోతే |
| వండినా | వండకపోయినా |

| | |
|---|---|
| వండగలడు | వండలేడు |
| వండనిచ్చేడు | వండనియ్య(వ్వ)లేదు |

(–ఇచ్చు)తో మిగిలిన కాలార్థక రూపాలు కూడా ఉన్నాయి)

| | |
|---|---|
| వండవచ్చు 1 | వండకపోవచ్చు |
| వండవచ్చు 2 | వండగూడదు |
| వండు | వండకు, వండబోకు, వండవద్దు (నిషేధంలో అర్థ విశేషాలున్నాయి) |

ఇలాగే అన్ని క్రియల్లో కూడా భావ, వ్యతిరేకక్రియల మధ్య భేదం నిరూపించటం నవీన భాష ఉపయోగించే మన భావవ్యక్తీకరణకు చాలా అవసరం. క్రియకు కర్తృపదంగా ఒక నామంగాని, సర్వనామంగాని, మరొక క్రియా పదంగాని ప్రాచీనభాషలో ఉండవచ్చు. ఉదా.: రాముడు వెడలెను, నేను వెడలితిని, వెడలవలయును. ఈచివరి ప్రయోగంలో 'వలయు' ప్రధానక్రియ, 'వెడల–' దానికి కర్త. 'తత్ప్రతీకారము వలయుఁ జేయ' (భార. 1–6–242), 'క్రోధిగాఁ దవస్వికిఁ జన్నే?' (భార. 1–2–174). ఈవిధంగా రెండు క్రియా పదాలూ అన్యపదవ్యవహితాలుగా కూడా ప్రయోగించవచ్చు. కాలక్రమాన భాషలో ఈవిధంగా వ్యవహితాలుగా ఉండగలిగిన 'వలయు, కూడు, వచ్చు' మొదలైన క్రియలు అప్రధానాలై సహాయక్రియలుగా అన్నంతరూపంతో కలిసి సంయుక్తక్రియలు ఏర్పడ్డాయి. ఇలాటివి: 'వెళ్ళాలి, వెళ్ళవచ్చు (వెళ్ళొచ్చు), వెళ్ళగూడదు, వెళ్ళవద్దు (వెళ్ళొద్దు)', మొదలైనవి. అంటే ఈమార్పు భాషా వ్యవహర్తల ఆలోచనావిధానంలో వచ్చిన పరిణామానికి నిదర్శనం. వ్యాపారానికి సంబంధించిన కాల, పురుష, ప్రత్యయార్థాలతోబాటు ఇలాటి 'మోడల్స్' కూడా ఏకవ్యాపారభాగాలుగానే భావించటం జరిగింది. ఉదా.: 'వచ్చి, చెప్పి, వెళ్ళేడు' అన్న వాక్యంలో మూడు ప్రత్యేకక్రియలున్నాయి. ఈమూడూ మూడు ప్రత్యేక వ్యాపారాల్ని సూచిస్తాయి. – రావటం, చెప్పటం, వెళ్లటం. కాని 'అతను మాట నిలబెట్టుకోలేకపోతున్నాడు' అనే వాక్యంలో 'నిలుచు, పెట్టు, కొను, లే, పోవు, ఉండు' అనే ఆరు ధాతువులున్నాయి. కాని ఇవన్నీ ఒకే వ్యాపారాన్ని సూచిస్తాయి. ఈవిధంగా నవీనభాషలో సంయుక్తక్రియలను బహుళంగా అర్థవిశేషాల్లో ప్రయోగిస్తాం. ప్రాచీనభాషలో ఇవి ఇంత సమగ్రంగా ఏర్పడి ఉండలేదు. అయితే, ఇప్పటి భాషలోనే 'నిలబెట్టికొనలేకపోవుచున్నాడు' అని మార్చి

గ్రాంథికరూపం చెయ్యగూడదా అంటారేమో. అంటే, ప్రాచీనత నవీనతల మధ్య భేదం ఒక్క తు-చుల భేదాన్ని ఆశ్రయించింది అనుకోటం అపోహ. ఏక క్రియాపదంలో భాగమైన ప్రతి అవయవంలోనూ, వాటి కలయికలోనూ నవీనతాముద్ర స్పష్టంగా ఉంది. 'తు' తీసి 'చు' పెడితే ప్రామాణికం అయిపోతుంది అనుకోటం రైలుపెట్టెలు లాగటానికి గుర్రాన్ని కట్టినట్టుంటుంది.

6. స్ఫూర్తి భాషకు జీవగర్ర. ఇది ఒక్కొక్కప్పుడు ఒక సంధి చెయ్యటం వల్ల కాని, ఒక హ్రస్వాచ్చును దీర్ఘం చెయ్యటంవల్ల కాని అభివ్యక్తం అవుతుంది. ఆరకమైన మార్పు ఉచ్చారణలో రావటం, భావస్ఫూర్తికి దోహదమవుతుంది. ఉదా.: ఎగేశాడు, చంపేశాడు, తెలిసీ తెలియని వయస్సు, ఎగాదిగా చూశాడు, చాలామంది, నాతోగూడా వచ్చేడు, ఇప్పించండి- ఈ రూపాల్ని ఒక అయిదారు వందల సంవత్సరాల వెనక్కు నడిపించి, 'ఎగవేసెను, చంపివేసెను, తెలిసియు దెలియని వయసు, ఎగందిగం జూచెను, చాలమంది, నాతోగూడ వచ్చెను, ఇప్పింపుడు'- అని రాయవలసివస్తే భావవ్యక్తీకరణ ఎంత కుంటుపడుతుందో చిత్తగించండి. ఇప్పటి భాషలో ఆలోచించటానికి అనువైన రూపాలను, ప్రత్యయాలు మార్చి, వికృతగ్రాంథికరూపాలుగా చేసిపెట్టిన సందర్భాలు పుస్తకాల్లో కుప్పతిప్పలుగా ఉన్నాయి. (చూ. అనుబంధం)

## పై చర్చ సారాంశం

భాష ఒక సాంఘికవ్యవస్థ. అందుకనే, మానవుడికి చుట్టుపక్కలున్న జగత్తులోని వాస్తవికత ఒక్కొక్క భాషాసమాజానికి ఆయా భాషావ్యవస్థల భేదాన్నిబట్టి భిన్నంగా గోచరిస్తుంది. ఆసమాజంలోని వ్యక్తులందరి సామూహికాలోచనావిధానం భాషలో శబ్దజాలంలోనే గాక, వ్యాకరణభాగా లన్నిటిలోనూ ప్రతిబింబిస్తుంది.

ఏ ఒక్క భాషలోనైనా, ఒక కాలంలో ఉన్న వ్యవస్థ సమూలంగా మారకపోయినా, కాలక్రమాన కొన్ని విలక్షణపరిణామాలకు లోనవుతుంది. ఆపరిణామాలు ఆభాషావ్యవహర్తల ఆలోచనావిధానంలోనూ, జీవితవిధానం లోనూ వచ్చిన మార్పులవల్ల ఏర్పడ్డవి. భాషను సమకాలీనసంస్కృతికి దూరం చేసి ఒక కాలంలో లేని భాషాసామగ్రి కాలాంతరంలో ఆసమాజానికి వాగుపకరణంగా చెయ్యటం అస్వాభావికం. అంతేకాకుండా భాషకూ జీవితానికీ

ఉన్న సంబంధాన్నీ, తప్పొప్పుల విలువలనూ సరిగా అర్థం చేసుకోక పోవటంవల్ల ఇలాటి వైపరీత్యాలు ఏర్పడతాయి. ఇప్పుడు పాఠ్యపుస్తకాల భాష నవీనభాష కంటె గొప్పదని బోధకులు నిరూపించటానికి ప్రయత్నించినప్పుడు, జిజ్ఞాసువైన విద్యార్థికి కొత్తగా నేర్చుకోవలసివచ్చిన పాతభాష తన అనుభవాన్ని అభివ్యక్తం చెయ్యటానికి అసమర్థమై తికమక కలిగిస్తుంది. దీనివల్ల బోధనలక్ష్యమే దెబ్బతింటుంది. కొందరు వ్యకులు గుర్తించినా గుర్తించకపోయినా భాషలో వచ్చే పరిణామాలు సంఘశ్రేయోముఖంగానే ఎవరి శక్తికి లోబడకుండా వస్తూనే ఉంటాయి. సమాజంలో సంస్కారహీనులు సంస్కారవంతులను మిగిలిన అలవాట్లలోలాగానే భాషలోనూ అనుకరిస్తారు. సంస్కారవంతులు తాము మాట్లాడేది భ్రష్టభాష అనీ, రాసేది ఉత్కృష్టభాష అనీ ఊహించటం అట్టే ఉచితం గాదేమో. కాలగమనాన్ని మార్చలేకపోయినా, 'గతకాలము మేలు వచ్చు కాలముకంటెన్' అని అనుకోటం సామాన్యమైన మానసికదౌర్బల్యం అనిపిస్తుంది. ఈసందర్భంలో చాలాకాలం కిందట ఒక ప్రముఖ భాషా శాస్త్రజ్ఞుడు చెప్పిన వాక్యాన్ని గుర్తించాలి. "A language is no better and no worse than those who speak it."[2] భాషకు వాక్కు స్వాభావిక రూపం. ఏభాషలో అయినా లిఖితవాఙ్మయం ఏర్పడటం, ఆభాషావ్యవహర్తల సాంస్కృతిక ఔన్నత్యానికి ఒక చిహ్నం. ఇంకా లిఖితరూపంగా లేని భాషలు ప్రపంచంలో కొన్ని వేలున్నాయి. వాగ్రూపంగా గాని, లిఖితరూపంగా గాని సామాజికులు తమ అభిప్రాయాలు ఒకరికొకరు నివేదించుకోటానికీ, విజ్ఞాన వ్యాప్తికీ ఉపయోగించేది కాబట్టి భాష సాంఘికవ్యవస్థ అవుతుంది. సంఘ జీవితంలో వచ్చిన పరిణామాలూ, వ్యక్తుల మధ్య ఉన్న ఎక్కువ తక్కువలూ సమకాలీనభాషలో తప్పక ప్రతిబింబిస్తాయి.

ఏభాషకయినా మార్పు సహజం. ఒకరినొకరు అర్థంచేసుకోటం అన్నది సాంఘికవ్యవస్థగా భాషాప్రయోజనం కాబట్టి, మార్పు నియతంగా, నిదానంగా వస్తుంది. ఒకరిమాట ఒకరు తెలుసుకోనంతగా భాష ఏకాలంలోను మారదు. ఒక భాష మాట్లాడేవ్యక్తుల మధ్య అన్యోన్యవ్యవహారం ఏకారణంచేతనైనా సన్నగిల్లటంవల్లనే భాషలో మార్పులేర్పడతాయి. ఇవి ప్రాంతీయభేదాలు కావచ్చు; కుల, వర్గ, సాంస్కృతిక భేదాలను ఆశ్రయించినవి కావచ్చు. చరిత్రకందినంత వరకూ ఇలాంటి భేదాలు లేని భాష ప్రపంచంలో ఎక్కడా లేదు. అంటే, ఒక భాష

మాట్లాడేవాళ్లందరి మధ్య వాడుక అన్ని చోట్లా అన్ని కాలాల్లోనూ సమానమైన సాంద్రతతో ఉండదు. దీనికితోడు ప్రాచీనవాఙ్మయం ఉన్న భాషల్లో మారిస్తేనే కాని మారని లిఖితభాషకూ, మార్చకపోయినా మారే వ్యవహారభాషకూ అంతరం ఏర్పడుతుంది. సాహిత్యసృష్టి సంస్కారవంతుల వల్లనే జరుగుతుంది. ఏభాషలో అయినా మొట్టమొదటి సారిగా లిఖితసాహిత్యం వెలువడితే ఆ సాహిత్యంలో ఉన్న భాష ఆనాటి సంస్కారవంతుల వ్యవహార భాషకంటే భిన్నంగా ఉండటానికి వీల్లేదు. వేరువేరు ప్రాంతాలకు చెందిన సంస్కారవంతులవల్ల సాహిత్య సృష్టి జరిగితే వారి వ్యవహారంలోని ప్రాంతీయభేదాలు కూడా సమకాలీన సాహిత్యంలో ప్రతిఫలిస్తాయి. ప్రతి యుగంలోను (ప్రతిభావంతులై) స్వచ్ఛంద మార్గాన్ని అవలంబించగలిగిన రచయితలు పైకి రాకపోతే తమ పూర్వికుల సాహిత్యంలో భాషే వారికి ఒరవడి అవుతుంది. రచయితలు అశక్తులైనప్పుడే సంప్రదాయోల్లంఘనం దోషం అనిపిస్తుంది. ఈకారణంవల్ల సాహిత్యభాషకూ, కాలాంతరంలో పరిణతమైన సంస్కారవంతుల వ్యవహారానికీ దూరం ఎక్కువ అవుతుంది.

నన్నయ్య భారతం మనకు ప్రథమసాహిత్యసృష్టిగా కనిపిస్తున్నా, ఆభాష సమకాలీనవ్యవహారభాషకు సన్నిహితం కాదు కాబట్టి, పరంపరగా వచ్చిన పూర్వ సాహిత్యభాషనే చాలా చోట్ల నన్నయగారు ఒరవడిగా పెట్టుకొన్నట్లు కనిపిస్తుంది. నన్నయగారికి సమకాలీనశాసనభాషను పరిశీలిస్తే – 'ఇస్తిమి', 'ఏంభయి' వంటి రూపాలూ, ఆతరువాత కేతన, గ్రామ్యరూపాలుగా చూపెట్టిన– 'వాటీ, వీటీ, పంచాకు, తోపించాకు, తెచ్చుతారు, మమ్మూ' మొదలైన రూపాల్నిబట్టి ఇటీవల గ్రాంథికభ్రష్టరూపాలుగా కొందరు భావించే శిష్టవ్యావహారికరూపాలు ఆనాటికే వ్యవహారంలో ఉన్నట్లు, సంస్కారవంతుల వ్యవహారం ఆనాటికీ, ఈనాటికీ అట్టే మారనట్టూ మనకు స్పష్టమవుతుంది.

## ప్రమాణభాష ఏర్పడే తీరు

అసలు భాషలో ఏది ప్రమాణం? ప్రమాణీకరణం ఎలా జరుగుతుంది? ప్రామాణ్యలక్షణం ఏమిటి? అనే ప్రశ్నలకు జవాబులు తెలుసుకోటం అవసరం.

(1) నవీనభాషకంటే పూర్వభాష ప్రామాణికం అయితే, అంతకంటె పూర్వభాష మరీ ప్రామాణికం కావాలి. 'వాడు' కంటె 'వాండు' ప్రామాణికం

అయితే, అంతకంటె పూర్వరూపాలయిన 'వాణ్ణు, వాన్లు' మరీ ప్రామాణికాలు కావాలి. అలాటప్పుడు మనం నిరూపించే ప్రామాణికభాషలో 'క్రొత్త' కంటె 'క్ట్రొత్త,' 'ప్రాత' కంటె 'ప్తాంత' మరింత ప్రామాణికాలు కావలసివస్తుంది. కాని, కావ్యభాషలో పుస్తకాలు రాయాలనేవాళ్లు కూడా తమ వాదంలో ఈఉపపత్తి ఒప్పుకోరనుకుంటాను. దీన్నిబట్టి ప్రాచీనతకూ, ప్రామాణ్యబుద్ధికీ సంబంధం లేదని నిరూపించవచ్చు.

(2) ప్రాచీనసాహిత్యంలో ఉన్న భాష ప్రామాణికం అని ఒప్పుకోగూడదా అని అనవచ్చు. ఇది ఇంతకుముందు నిరూపించిన ఉపపత్తుల్ని బట్టి, మన ఆలోచనావిధానానికి దూరమైపోయింది. కాబట్టి ప్రస్తుతం విజ్ఞానప్రచారానికి ఉపకరణంగా పనికిరాదు. అదీగాక, కావ్యభాషాప్రయోజనం పూర్వకాలం పరిమితం. వచనవాఙ్మయం, నాటకాలూ, వార్తాపత్రికలు, విస్తృతమైన విద్యాబోధనప్రణాళికలూ ఆనాడు లేవు. కేవలం కవితాప్రయోజనానికి ఉపయోగించిన భాషను నేటి విస్తృతప్రయోజనాలకు, జనసామాన్యానికి ఉపయోగించటం అసహజంగా ఉంటుంది. కావ్యభాషలో ఎంతయినా కృత్రిమత్వం అంగీకరించవచ్చు. అది కవి వైయక్తికవిషయం. ఇప్పుడు కవిత్వం రాసే వాళ్లయినా వారి ఇష్టంవచ్చిన భాషను వాడుకోనివ్వండి. వచనంలో విజ్ఞాన ప్రచారానికి ఉపయోగించే భాషకూ, కవితాభాషకూ ప్రయోజనంలోనూ లక్ష్యంలోనూ చాలా అంతరం ఉంది. ఈకారణాలవల్ల ప్రాచీనకావ్యభాషను ఈకాలపు ప్రమాణభాషగా స్వీకరించటం అసహజం. విద్యార్థులకు ఉపకారం కంటె అపకారం ఎక్కువ చేస్తుందేమో. కావ్యభాషకు, వచనవాఙ్మయానికి ఉపకరణంగా వాడే కృత్రిమరచనలు ఇప్పుడు విరళమై పోతున్నాయి.

(3) ఎక్కువమంది వ్యవహారంలో ఉన్నది ప్రమాణభాష కాగూడదా అంటే, అదీ గాదు, ఏభాషలోనయినా సంస్కారవంతుల పూనిక వల్లనే ఆభాషా ప్రయోజనం, వ్యాప్తి విస్తృతమవుతాయి. వాళ్లెప్పుడూ అల్పసంఖ్యాకులుగానే ఉంటారు. ప్రపంచంలో చాలా భాషల్లో ఏర్పడ్డ అనేకప్రాంతీయభేదాల్లో, ఏదో ఒక ప్రాంతానికి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతికకారణాలవల్ల ప్రాధాన్యం ఏర్పడి, ఆప్రాంతంలో ఉన్న ఉత్తమసంస్కారులు వ్యవహరించే భాషే ప్రమాణభాషగా రూపొందుతుంది. అది కాలక్రమాన విజ్ఞానవ్యాపకసాధనాల ద్వారా వ్యాపించి, మిగిలిన మాండలికాలవారికి అనుకరణీయమవుతుంది. అదే విధంగా లండన్

నగరంలో సంస్కారవంతుల వ్యవహారాన్ని బట్టి 15, 16 శతాబ్దుల కాలంలో ప్రమాణాంగ్ల భాష ఏర్పడ్డది.

"The modern standard languages which prevail within the bounds of an entire nation supersede the provincial type. The standard languages become more and more uniform as time goes on. In most instances they have grown out of the provincial type that prevailed in the upper class of the urban centre that became the capital of the unified nation." (L. Bloomfield, *Language*. pp. 482-483.)

నేటి ప్రామాణిక ఫ్రెంచిభాష పారిస్‌నగరంలోని సంస్కారవంతుల వ్యవహారాన్నిబట్టి ఏర్పడ్డది. అలాగే ఫ్లారెన్సు నగరంలోని విజ్ఞుల వ్యవహారమే ఇటాలియన్‌గా మారింది. ప్రస్తుతం రోమ్ నగరంలోని సంస్కారవంతుల భాష నవీన ఇటాలియన్ భాషకు ఒరవడి.

మొన్నమొన్నటి వరకూ తెలుగుమాట్లాడే ప్రాంతాలన్నిటికీ సాంఘికంగానూ, రాజకీయంగానూ ఏకీభావం కలగలేదు. ఆంధ్రుల చరిత్ర మొదట్నించీ పరిశీలిస్తే లండన్, పారిస్ నగరాల్లాగా తెలుగుదేశమంతటికీ కొన్ని శతాబ్దులపాటు ఏకైక రాజధానిగా ఉన్న నగరం ఏదీ లేదు. అమరావతి, రాజమహేంద్రవరం, కొండవీడు, విజయనగరం, వరంగల్లు భిన్నకాలాల్లో రాజకీయ, సాంస్కృతిక కేంద్రాలు కావటంవల్ల ఏ ఒక్క ప్రాంతంలోనో ఉన్న భాష యూరపియన్ జాతుల్లోలాగా దేశమంతటికీ ప్రామాణికతను అందుకోలేకపోయింది. లిథువానియన్, జర్మన్ భాషల్లో ఇలాటి కారణాల వల్లనే అనేకమాండలికాల కలయికవల్ల ప్రమాణభాషలు ఏర్పడ్డాయి (చూ. Bloomfield, p. 483). నార్వేదేశం చాలాకాలం రాజకీయంగా డెన్మార్కుకు చెందటంవల్ల ప్రామాణిక డేనిష్‌భాష రాజకీయభాషగా చలామణి అయింది. నార్వేలో కొద్ది మార్పులు పొందిన సంస్కారవంతులభాష ప్రామాణికభాష, Dano-Norwegian Ricksmål రాజకీయభాష (జాతీయభాష) గా అయింది. కాని 1813లో నార్వేకు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చిన తరువాత అది జనసామాన్యంలో ఉన్న ప్రాంతీయమాండలికాల ప్రభావంతో చాలా మార్పులకు లోనయింది. 1840లో Ivar Asen అనే భాషాశాస్త్రజ్ఞుడు (1813-1896) నార్వేలోని

మాండలికాల సమాహారస్వరూపంగా ఒకే ప్రమాణభాషను కల్పించి, దాన్ని జాతీయభాషగా Dano-Norwegian స్థానంలో అంగీకరించవలసిందనే ఉద్యమం లేవదీశాడు. దీన్ని Landsmål (దేశభాష) అంటారు. ఇప్పుడు ఈరెంటినీ కూడా ప్రామాణికాలుగా గ్రహించారు. అవి కాలక్రమాన కొన్ని సర్దుబాట్లతో ఏకరూపత పొందుతున్నాయి. ఈరెండిటి సంబంధం అలహాబాద్ హిందీ, ఢిల్లీ హిందీలకు గల సంబంధం లాటిది. ప్రామాణికాంధ్రభాషలో కూడా ఎన్నో మాండలికోచ్చారణలూ, పదాలూ, రూపాలూ కలిసిపోయినాయి.

పై చర్చ సారాంశం ఏమిటంటే, భాషేతర కారణాలవల్ల (విద్య, విజ్ఞానం, రచనా పాటవం, పలుకుబడి, అధికారం, ధనం కలిగి ఉండటంవల్ల) ఏభాషా సమాజంలోనైనా కొందరు సంస్కారవంతులనిపించుకొంటారు. భాషా ప్రచారంలో వారికున్న ప్రాధాన్యాన్ని బట్టి వారి వ్యవహారం, సంస్కారహీనులకు అనుసరణీయమవుతుంది. విద్యా, విజ్ఞానాలు ఒక సమాజంలో వృద్ధిపొందేకొద్దీ ప్రమాణభాషపరిమితప్రయోజనం గల మాండలికాలను తనలో కలుపుకుంటూ దేశమంతటా వ్యాపిస్తుంది.

"The standard language takes speakers from the provincial and local dialects: with spread of prosperity and education it becomes familiar to larger and larger stratum." (Bloomfield, p. 485)

పామరుడు తన చిన్నతనంలో కుల, వర్గ, ప్రాంతపరిమితమైన ఒక మాండలికంలో మాట్లాడతాడు. కాని వయోజనుడుగా ప్రామాణికభాష నేర్చుకొని విద్యాసంస్కారవంతుడైన తరువాత తన పిల్లలకు ప్రామాణిక వ్యవహారమే అలవరుస్తాడు. ఈవిధంగా, ప్రామాణికభాష మాండలికాన్ని అతిక్రమించి కాలక్రమాన దేశమంతటా వ్యాపిస్తుంది. నేటి తెలుగులో కొన్ని రకాల ఉచ్చారణలూ, కొన్ని వ్యవహారరూపాలూ సంస్కారవత్వానికి ఉపలక్షకాలుగా ఉన్నాయి.[3]

(4) వ్యాకరణశాస్త్రం లేని భాష ప్రామాణికం కాదనీ, ప్రాచీనభాషకు వ్యాకరణం ఉన్నది కాబట్టి అదే ప్రామాణికంగా ఒప్పుకోవాలనీ కొందరి అభిప్రాయం. అంటే వ్యాకరణశాస్త్రం రాయటానికీ, ప్రమాణభాష ఏర్పట్టానికి

అనినాభావసంబంధం ఉందని అలా చెప్పేవాళ్ల ఊహ. నియతి సహజంగా వ్యవహారభాషలో ఉంటుంది.

ఒక రకమైన పలుకుబడి మీద ప్రజాసామాన్యానికి ప్రామాణ్యబుద్ధి ఏర్పడటానికి, దానికి ఒక గ్రంథరూపమైన అనుశాసనం ఉండటంతో నిమిత్తం లేదు. అంటే ఇప్పుడు బాలవ్యాకరణం లాంటిది లేకపోయినా నేటి శిష్టవ్యవహార భాష ప్రమాణభాషగా చలామణి అవుతున్నది. నేటి ప్రమాణభాషకు ప్రాచీన కావ్యభాష కంటె నిష్కృష్టమైన వ్యాకరణం రాయవచ్చు. బహుళసూత్రాల సంఖ్య తగ్గించవచ్చు. వ్యాకరణంలో బహుళసూత్రాల సంఖ్య ఎక్కువయ్యే కొద్దీ శాస్త్రంలో బిగింపు తక్కువవుతుంది.

ప్రమాణభాషకు ఏకరూపత, మనం అనుకొనేంతగా అక్కర్లేదు. అలాంటిది ప్రపంచంలో ఏ ప్రమాణభాషకూ లేదు. కాని, సంస్కారవంతుల భాషలో జానపదుల వ్యవహారంలో ఉన్నంత వైవిధ్యం కనిపించదు. విద్యా విజ్ఞానాలు దేశం నాలుగుమూలలా వ్యాపించినకొద్దీ పదాల్లో తప్ప అలాటి సామరస్యం చాలావరకు కనిపించదు. నామవాచకాల్లో మాండలికభేదాలు సాహిత్యంద్వారా ప్రమాణభాషకు పుష్టి చేకూరుస్తాయి. మాండలికరూపాల్ని కలుపుకొంటూ కాలక్రమాన ప్రమాణభాష ప్రబలమవుతుంది. వృత్తులకే పరిమితమయ్యే పదాలు ఎన్నో వృత్తివిద్యాబోధన ద్వారా ప్రమాణభాషలో చేరతాయి.

"The standard language influences the surrounding dialects at wider range and more pervasively as it gains in prestige. It affects especially provincial centres and through them, their satellite dialects." (Bloomfield, p. 485.)

## ముగింపు

గ్రాంథికవ్యావహారికభాషాసమస్య బెంగాలీలో మహాకవి టాగూర్ రచనల వల్ల ఏభై ఏళ్ళక్రితమే పరిష్కారమైంది. మన కావ్యభాష వంటి 'సాధుభాష'ను వదిలిపెట్టి పాఠ్యగ్రంథాల్లో నేటి మన వ్యవహారభాషకు తుల్యమైన 'చలిత్‌భాష' ప్రవేశపెట్టారు. ఇలాటి సమస్యలు కొన్ని శతాబ్దుల కిందటనే ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ దేశాల్లో పరిష్కృతాలయినాయి. నిర్బంధవయోజనవిద్య వ్యాపించి

ఆధునికవిజ్ఞానం జనసామాన్యాన్ని అందుకోవలసిన ఈరోజుల్లో మన విద్యా విధానంలో ఈ సంస్కరణ ఎంతైనా అవసరం.

జ్ఞాపికలు

1. 'వీరు కుంతీదేవులు' 1-7-239 వంటి ఒకటి రెండు ప్రయోగాలు తప్ప నన్నయభాషలో 'వారు, వారలు, వీరు, వీరలు' అనేవి కేవల బహువచన రూపాలుగానే కనిపిస్తాయి. చూ. నన్నయ పదప్రయోగకోశము, 1960.
2. Lousbury; quoted by the late G. V. Apparao, *A Minute of Dissent*, p. 61 (1914).
3. ప్రమాణ, అప్రమాణభాషాలక్షణాలకు చూ. ఇదే పుస్తకంలో 'తెలుగు మాండలికాలు: ప్రమాణభాష'.

# 13

# తెలుగుభాష : నాడు, నేడు, రేపు

నాటి తెలుగు చరిత్రకు పూర్వదశ

బెలూచిస్థానంలో మాట్లాడే బ్రాహుయీమొదలు శ్రీలంకలో మాట్లాడే తమిళంతో సహా మొత్తం 24 భాషలతో దక్షిణ ఆసియా అంతటా ఆవరించి ఉన్నది ద్రావిడభాషాకుటుంబం. సింధూనదీలోయల్లో క్రీ. పూ. 2500 ఏళ్ళ కిందట వర్ధిల్లి తరవాత వింధ్యపర్వతాలదాకా వ్యాపించిన మొహంజోదారో నాగరికత ప్రాచీనద్రావిడ నాగరికత అని ఇటీవలి రష్యన్, ఫినిష్ పరిశోధకుల నమ్మకం. సుమారు 5000 ఏళ్ళకు ముందట ఈభాషాకుటుంబానికి మాతృక అయిన భాష ఒకటి ఉండి ఉండాలి. క్రీ. పూ. 2000 ఏళ్ళ కిందట ఈప్రాచీనద్రావిడ మాతృక మూడు శాఖలుగా చీలింది – దక్షిణ, మధ్య, ఉత్తర ద్రావిడ శాఖలని. క్రీ. పూ. 1500 ప్రాంతంలో దక్షిణద్రావిడశాఖ మరి రెండు ఉపశాఖలయింది. ఒక ఉపశాఖలోని మాండలికాలు ఏడు భాషలయినాయి – తమిళం, మలయాళం, కన్నడం, తుళు, తొద, కోత, కొడగు అని. రెండో ఉపశాఖ మళ్ళీ ఏడు భాషలయింది – తెలుగు, గోండి, కొండ, కూయి, కువి, పెంగో, మండ అని. ఈ 24 భాషల్లోను ఎక్కువమంది మాట్లాడేది తెలుగు. తెలుగు, తమిళం, మలయాళం, కన్నడాలే ఈకుటుంబంలో ప్రాచీనకాలంనుంచి లిఖితసాహిత్యం ఉన్న భాషలు. సాంస్కృతికంగా తెలుగు తమిళకన్నడాలతో సాహచర్యం కల్గిఉన్నా, పుట్టుకలో

తనకు ఉత్తరాన ఉన్న గోండి, కూయి, కువి, మొదలైన పొరుగు భాషలకే సన్నిహితం – అని తులనాత్మకపరిశోధనలవల్ల తేలింది. పై రెండు ఉపశాఖలు వేరయిన తర్వాత సుమారు క్రీ. పూ. 5, 6 శతాబ్దులకే తెలుగు ప్రత్యేకభాషగా జ్ఞాతిభాషలనుంచి వేరయి ఉండాలి.

## తెలుగుభాషా పరిణామం

తెలుగుభాషాపరిణామాన్ని స్వరూపదృష్టితోను, ప్రయోగదృష్టితోను పరిశీలించవచ్చు. స్వరూపదృష్టి అంటే ఈనాడు మనం వాడేభాష పూర్వ యుగాల్లో ఎలా ఉండేదో, ఏయే మార్పులవల్ల నేటి తెలుగు ఏర్పడ్డదో గుర్తించటం. ప్రయోగదృష్టి అంటే తెలుగు వాడుక ఏయే రంగాల్లో మొదటి నుంచి వర్ధిల్లిందో చారిత్రకంగా పరిశీలించటం.

## తెలుగు భాషాపరిణామం - స్వరూపదృష్టి

ఈదృష్టితో తెలుగుభాషాచరిత్రలో నాలుగుదశలు గుర్తించవచ్చు: (1) క్రీ.పూ. 200 – క్రీ.శ. 500; (2) క్రీ.శ. 500 – 1100; (3) క్రీ.శ. 1100 – 1400; (4) క్రీ.శ. 1400 – 1900. మొదటి దశలో ప్రాకృత సంస్కృత శాసనాల్లో తెలుగు ఊళ్ళ పేర్లు, వ్యక్తులపేర్లు మాత్రమే కన్పిస్తాయి. 6వ శతాబ్దికి చెందిన తొలి తెలుగు శాసనం కడప జిల్లాలో దొరికింది. అప్పటికే ప్రాకృత, సంస్కృతాల ప్రభావం, బౌద్ధజైనమతాల ప్రభావం తెలుగుమీద ప్రసరించింది. బహుశా క్రీ. శ. 5, 6 శతాబ్దుల కాలంలోనే పండితుల వ్యవహారం ఆధారంగా తెలుగులో సాహిత్యభాష ఏర్పడి ఉంటుంది. నన్నయ్యకు పూర్వశాసనాల్లో (కందుకూరు, కొఱవి, అద్దంకి శాసనాల్లో) కావ్యభాషాశైలి కన్పిస్తుంది. నన్నయకాలానికే కావ్యభాష వాడుకభాషకు దూరమవుతున్నట్లు నాటి శాసనాల్లో ఉన్న 'ఇస్తిమి', 'ఏంభయ్' వంటి రూపాల్ని బట్టి తెలుసుకోవచ్చు. ఈనాడు మనం ఆధునికం అనుకొనే భాషకు పరిణామ బీజాలు 11–14 శతాబ్దుల మధ్యనే ఏర్పడ్డాయి. 'వస్తాడు', 'తెస్తాడు' అనే రూపాలు 13వ శతాబ్దిలోనే వాడుకలో ఉన్నట్లు కేతన పద్యంవల్ల తెలుస్తుంది. క్రావళ్ళ క్రమంగా 13వ శతాబ్దికే పోయి క్రొత్త, ప్రాత అనే శబ్దాలకు కొత్త, పాత అన్నరూపాలు ఏర్పడ్డాయి. రక్తము, వనము మొదలైన వాటిని రక్తం, వనం అనటం శాసన భాషలో 11, 12 శతాబ్దుల్లోనే కనిపిస్తుంది. అందువల్లనే బహువచనంలో

కరణములు, కుంచములు మొదలైనవి కరణాలు, కుంచాలు మొదలైనవిగా మారాయి. సంస్కృత ఋకారాన్ని ఆనాటి ప్రజలు రు/రిగా ఉచ్చరించే వారు. 'ఇరవయ్, ముప్పయ్, నలభయ్, తొంభయ్' – ఈ రూపంలో సంఖ్యావాచకాలు 11, 14 శతాబ్దుల మధ్యకాలంలోనే వాడుకలో ఉండేవి. 'ఇచ్చినవాడు, వచ్చినవాడు' మొదలైనవి 'ఇచ్చినాడు, వచ్చినాడు'గా మారాయి. 'వచ్చెడును, వచ్చెదరు' వంటి వర్తమాన భవిష్యద్రూపాలు 'వచ్చేను, వచ్చేరు'గా ఈకాలంలో మారినట్టు శాసనాల్నిబట్టి, అన్నమాచార్యుల కీర్తనల భాషనుబట్టి తెలుస్తుంది. 14వ శతాబ్ది తర్వాత 'వచ్చినాడు' సమాపకక్రియ అయింది. 'వచ్చేది, చేసేది, వస్తూ, పాలిస్తూ' మొదలైన రూపాలు 16, 17 శతాబ్దుల్లో రూఢమైనాయి. 'చేసికొను' 'చేసుక'గా మారింది. రాయలసీమలో 'వస్తా, చేస్తా' అని, కోస్తా జిల్లాల్లో 'వస్తూ, చేస్తూ' అని మాండలికభేదాలు 17వ శతాబ్దికే ఏర్పడ్డాయి. దీర్ఘం మీద సున్నకు ఉచ్చారణ పోయి 'వాఁడు, తోఁట' అని రాసే శబ్దాలను 'వాడు, తోట' గా ఉచ్చరించేవారు. 'చేస్తున్నారు' వంటివి 17శతాబ్దికి బాగా వ్యాప్తిలోనికి వచ్చాయి. 'చేసినాడు'కు వ్యతిరేక రూపంగా 'చేయలేదు' వంటి రూపం క్రీ. శ. 1600 నాటికే ఏర్పడింది. 'చూద్దాం, వెదకుదాం' వంటి క్రియలు, 'నుంచి' విభక్తి, 'అలాగు, ఈలాగు, చాలా' వంటి అవ్యయాలు 16, 17 శతాబ్దుల్లో వచ్చిన కావ్యాల్లో కూడా కొల్లలుగా కన్పిస్తాయి.

తెలుగు భాషాపరిణామం - ప్రయోగదృష్టి

19వ శతాబ్దిలో అచ్చుయంత్రం, ఆంగ్లవిద్యావిధానం వచ్చేదాకా తెలుగు వాడుక నాలుగు రంగాల్లోనే ఉండేది. అవి: 1. కావ్యసాహిత్యం, 2. శాసనరచన, 3. జానపదసాహిత్యం, 4. సామాన్యజనవ్యవహారం.

సామాన్యజనవ్యవహారమే శాసనభాషకు, జానపద సాహిత్యానికి ఆధారం. కవిత్రయం వారి వాడుక కావ్యసాహిత్యానికి ఒరవడై కావ్యభాష ప్రజల భాషకు దూరమవుతూవచ్చింది. 16వ శతాబ్ది దాకా వచ్చిన కావ్యసాహిత్యంలో వ్యవహార భాషాప్రభావం తక్కువగా కన్పిస్తుంది. జనసామాన్యానికి ఉద్దేశించిన సాహిత్య ప్రక్రియల్లో వాడుక భాష ఎక్కువగా చొరవచేసుకొన్నట్టు 12వ శతాబ్ది నుంచి తెలుస్తున్నది. తిక్కన 'వచ్చినాడు', 'చేసినాడు' వంటి రూపాల్ని ప్రయోగించాడు. శివకవులు వైరిసమాసాల్ని ధారాళంగా వాడారు. శ్రీనాథుడి కన్నా పోతనలో

కావ్యభాషాలక్షణానికి సరిపడని ప్రయోగాలు ఎక్కువగా కన్పిస్తాయి. అన్నమాచార్యుల కీర్తనలు, యక్షగానాలు, క్షేత్రయ్య, త్యాగరాజుల భక్తి గీతాల్లోనూ, 16వ శతాబ్ది తర్వాత రాసిన ప్రబంధాల్లోనూ నాటి వాడుకభాష కావ్యభాషతో మరింతగా కలిసినట్టు తెలుస్తుంది. 19వ శతాబ్ది దాకా వచనసాహిత్యం తెలుగులో పెరగలేదు. విజయనగరకాలంనుంచి తయారైన కైఫీయత్తులు, స్థల చరిత్రల్లో మాత్రం వచనరచన కనిపిస్తుంది. రాయవాచకం, అనంతపుర చరిత్రలను బట్టి 16వ శతాబ్ది శిష్టభాషావ్యవహారం మనకు తెలుస్తుంది. 1850కి ముందు వచ్చిన పాఠ్యగ్రంథాల రచన శిష్టభాషలోనే ఉండేది. పాఠ్యపఠనాల్లో వాడుకభాషే ఉన్నట్లు బాలసరస్వతీయం మొదలైన వ్యాకరణాలకు రాసిన వ్యాఖ్యానాల వల్ల తెలుస్తుంది. ఆంగ్లపాలనవిధానం పాతుకొని, ఆంగ్లవిద్యావిధానం అమల్లోకి వచ్చింతర్వాత కూడా అన్ని రకాల ఉత్తరప్రత్యుత్తరాలూ తెలుగులోనే జరిగేవి. ఆనాడు తెలుగు అధికార భాషగా ఉండేదని గుర్తించవచ్చు. ఆంగ్లపరిపాలకులకు కూడా తెలుగు నేర్చుకోవాల్సివచ్చేది. ఆంగ్లోద్యోగులు తెలుగు నేర్చుకోటానికి విలియంబ్రౌన్, కాంప్‌బెల్, సి.పి. బ్రౌన్ మొదలైనవాళ్లు తెలుగుభాషకు వ్యాకరణాలు, కోశాలు రాశారు. 1862 లో ఒక తహశీల్దారు జిల్లాకలెక్టరుగారికి రాసిన ఉత్తరం నకలు ఈకింద మచ్చుకు ఇస్తున్నాను. తెలుగు వాక్యాల్లో అన్యదేశ్యాలు కలిసిన ద్విభాషాశైలి ఇందులో కన్పిస్తుంది.

''కడపజిల్లా... కలెక్టరు మేష్టరు మక్వే దొరగారి సముఖానకు బద్వేవోలు తాలుకా తహిశ్శిలుదారు కొప్పరపు వెంకటక్రిష్టయ్య వ్రాసుకొన్న అర్జి.

గడిచిన ఫిబ్రవరినెల తేది 24 దిన సాదరు చేయించిన నెం 24 రు హుకుములో గొడ్డవీడు గ్రామానకు సాలు గుజిస్తాలో 4-0-0 ప్రకారం పన్ను అచ్చుతూఉన్న కొందరి ఇనాములకు మిక్కిలి హీనంగా వక రూపాయి వంతు లైసెన్సు ట్యాకుసు పన్ను దాఖలు చేయడముకు కారణం వుండ్డదు గన్క తిరిగి విమర్శలో తెచ్చి తెలపవలశినదిగా నమూదు వున్నది. మవుజే మజాకూరు వయినలాతి కాలమందు యీ వయినముల సంగతి బాగా విచారించి కేవలం బీదస్తితిలో వున్నట్టు తెలియబడినందుకు వక రూపాయ ప్రకారం శిఫారసు చేశినాను. రెండు రూపాయలకంటె యెక్కువ చెల్లించడముకు యంత మాత్రం అర్హులు కారు. గుగ్గిళ్లు అమ్ముకోవడమే జీవనం గల అయిదుగురికి రెండు రూపాయల వంత్తున దాఖల్‌చెయ్యవలశినదిగా ఇప్పుడు శిఫారసు చేస్తూ ఆగ్రామ

లెక్కలను యిందుతో పంపించ్చినాను. గనుక చిత్తగించి మంజూరు పుర్మాయించ వలెను.

యిది గాక యిప్పుడు మూడు గ్రామాల లైసన్‌సు ట్యాక్సు లెఖ్ఖలు పెహరీస్తు ప్రకారం – యిందువల్ల పంపించుకున్నాను. చిత్తగించి మంజూరు వుత్తర్వు దయ చేయించవలెనని కోరుతున్నాను. యింత్తటితో తాలుకా యావత్తు గ్రామాల పయిమాయిషి వారి ఝూడా అయినది. యిది మంజూరు అయి వాపసు వచ్చిన వెంటనే బేరీజు లెఖ్ఖలు పంపించుకొంటున్నాను.

తమ విధేయుడు

౧౮౬౨ సంవత్సరం — కొ. వెంకట క్రిష్టయ్య

ది. ౧౬ మార్చి — తహశ్శీలుదారు.

(T. G. M. Lane, *A Collection of Official Documents in the Telugu Language,* పుటలు. 126 - 128. Madras, 1868.)

1853లో చిన్నయసూరి రాసిన నీతిచంద్రిక, 1858లో బాలవ్యాకరణం అచ్చుయినాయి. వీటివల్ల కావ్యభాషావ్యాకరణాన్ని వచనభాషకు కూడా ప్రవర్తింప జేయాలనే సాంప్రదాయికపండితులకు గట్టి మద్దతు గలిగింది. పండితులు తాము మాట్లాడే భాషనే 'భ్రష్టం', 'గ్రామ్యం' అని నిరసించారు. అది పుస్తకాల్లో రాయగూడదన్నారు. ఆధునికవిజ్ఞానవ్యాప్తి సమకాలీనప్రజల భాషలోనే తప్ప ప్రాచీనకావ్యభాషలో సాధ్యంకాదని గురజాడ, గిడుగులు వ్యావహారిక భాషోద్యమానికి పట్టుగొమ్మలైనారు. గ్రాంథిక వ్యావహారిక వాదాలు 1909 లో మొదలై 1915 తో ముగిశాయి. విద్యావిధానంలో గ్రాంథికమే నిల్చింది. ఆ తర్వాత 25 ఏళ్లకు, అంటే 1940 మొదలు ఆధునిక భాషకు వార్తాపత్రికలవల్ల, మేధావులైన రచయితల రచనలవల్ల పెద్దపెట్టున ప్రాపకం వచ్చింది. తెలుగులో సహజమైన వచనరచనాశైలి చిన్నయసూరి అనుయాయుల ప్రభావంనుంచి బయటపడటానికి 90 ఏళ్ళు పట్టింది. జరిగిన 30, 40 ఏళ్లుగా వ్యాపించిన వచన సాహిత్యం – (నవల, కథానిక, వ్యాసం, ఏకాంకిక), రేడియో, సినిమాలు, వార్తా పత్రికలు – వీటి మూలంగా మాండలికాలకు అతీతమైన ఆధునికభాష ప్రామాణికమైంది. ప్రభుత్వంవారు, విశ్వవిద్యాలయాలు, నిర్ణయించే పుస్తకాలలోనే కావ్యభాష సరళగ్రాంథికరూపంలో నిల్చిపోయింది.

1964లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి యాజమాన్యాన తిరుపతిలో ఒక గోష్ఠి జరిగింది. అక్కడ మాతృభాషేతర పాఠ్యపుస్తకాలన్నీ ఆధునిక భాషలోనే ఉండాలని నిర్ణయించారు. ఈ రెండో నిర్ణయం ప్రకారం గవర్నమెంటువారు రాయించిన పాఠ్యపుస్తకాలను ఏకారణాలవల్లనో ఎవరో అచ్చుగాకుండా ఆపేశారు. 1966లో తెలుగు అధికారభాష అయింది. 1967లో ఏర్పడ్డ తెలుగు అకాడెమీ రాయించిన గ్రంథాల్లో చాలావరకు అధునిక భాషే అమల్లోకి వచ్చింది. 1969 నుంచి ఉన్నతవిద్య తెలుగులో బోధించటం మొదలైంది. 1973లో ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు ఆధునికభాషలో యూనివర్సిటీ పరీక్షలు రాయ వచ్చునని తీర్మానించారు. అంతకుముందే శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీవారు తెలుగు పిహెచ్. డి. కి రాసే సిద్ధాంతవ్యాసాలు అధునిక భాషలో ఉండవచ్చు నన్నారు. ఈమార్పులను బట్టి తెలుగు బహుముఖంగా వర్ధిల్లటానికి పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయని తెలుసుకోవచ్చు.

ఇంతదాకా చూసింది తెలుగు భాషాపరిణామానికి సంగ్రహ సమీక్ష.

తెలుగు భాష : కర్తవ్యం

ఏ భాష అయినా అధునిక అవసరాలకు యోగ్యంగా రూపొందాలంటే దానికి మూడు లక్షణాలుండాలి. అవి: 1. సమగ్రమైన లిపి, 2. మాండలికాలకు అతీతమైన ప్రామాణికభాష, 3. ఆధునికశాస్త్రవిజ్ఞానాన్ని వ్యాపింప జేయటానికి అనువైన పదజాలం, రచనా విధానం.

1. తెలుగు లిపి చాలా సమగ్రమైంది. మన భాషలో ఉచ్చారణకు, లిపికి మధ్య అట్టే తేడాల్లేవు. రెండుమూడు ఉచ్చారణలకు ఒకే గుర్తుండటం, రెండు మూడు గుర్తులకు ఒకే ఉచ్చారణ ఉండటంవల్ల స్పెలింగ్ సమస్యలు ఏర్పడతాయి. ఆచిక్కులు అంతగా తెలుగులో లేవు.

2. ప్రమాణభాషా లక్షణాలివి. (1) ఎక్కువమంది వ్యవహర్తలకు సమ్మతం కావటం; (2) వివిధ రంగాల్లో ఉపయోగించబడటం; (3) ప్రమాణభాషను నేర్చుకోటమే విద్యావంతులుగా గుర్తించబడటానికి లక్షణం కావటం; (4) ఆధునిక వచనసాహిత్యం అభాషలోనే ఉండటం; (5) ఒక భాష మాట్లాడేవాళ్ళ సంస్కృతి వికాసానికి అది సంకేతం కావటం. ఈలక్షణాలన్నీ నేటి తెలుగు రచనల్లో వచ్చే భాషలో కన్పిస్తున్నాయి. ఈనాడు విజ్ఞానప్రచారసాధనాలు అన్నిటిలో

వాడుతున్న భాష ఆధునికప్రమాణభాషగా గుర్తించవచ్చు. దీంట్లో కొంత మాండలిక వైవిధ్యమున్నా అర్థబోధకు ఆటంకంగా లేదు.

ప్రమాణభాషను గూర్చి ఈ కింది సూచనలు గుర్తుంచుకోవాలి :

(1) ప్రమాణభాష మాండలికాలకు దూరమై కావ్యభాషలాగా మారిపో కూడదు. ఈనాడు తమిళంలో జరుగుతున్న అతితమిళీకరణం, హిందీలో జరుగుతున్న అతిసంస్కృతీకరణాలవల్ల ప్రమాణభాష కూడా చదువుకున్నవాళ్ళ కొద్దిమంది సొత్తే అవుతున్నది. రూఢమైన అన్యదేశ్యాలను, చివరకు మనుష్యుల పేర్లను కూడా తమిళీకరణం చేస్తున్నారు. ఉదా.: 'telephone' 'తొలైపేచి' అని, వాడుకలో రూఢంగా ఉన్న 'అక్సిరాసినర్', 'పరీక్షై', 'పిరాణవాయు', 'చర్వకళాచాలై' 'express bus', 'నమస్కారం', 'photographer' – ల బదులు, 'తలైవర్' (= president), 'తేర్వు' (= examination), 'ఉయిర్ కాఱ్ఱు' (= oxygen), 'పల్కలైక్కళకమ్' (= university), 'తురితవండి' (= express bus), 'వణక్కమ్' (= నమస్కారం) 'నిఴల్ పటమ్' (= photography), మొదలైనవి.

ఇలాగే హిందీలో 'కప్‌డా, ఆంఖ్, కేబాద్, ఔర్, హవా, దవాఖానా, తారీఖ్, ఖేతీ, బుఖార్, గుస్సా' మొదలైన వాడుకలో నలిగిన పదాలకు బదులు 'వస్త్ర్, నేత్ర్, పశ్చాత్, ఏవం, వాయు, చికిత్సాలయ్, దినాంక్, కృషి, జ్వర్, క్రోధ్' మొదలైన సంస్కృత పదాలను కృత్రిమంగా తెచ్చిపెట్టారు.

(2) సాధ్యమైనంత వరకు అభిప్రాయాన్ని తేలికమాటల్లో చెప్పే ప్రయత్నం రచయితలంతా చేయాలి. భాషను సులభం చెయ్యటం అంటే పలచన చెయ్యటం అనుకోకూడదు. ఇప్పుడు అమెరికాలో నీగ్రోలకు వారి మాండలికంలోనే ప్రాథమికవిద్య బోధించాలని ఒక ఉద్యమం బయలుదేరింది. మన దేశంలో కూడా వయోజనవిద్య ఆయాప్రాంతాల మాండలికంలో జరగటం విద్యా వ్యాప్తి దృష్ట్యా మంచిదిగా తోస్తుంది. అక్షరాస్యత ఏర్పడ్డ తర్వాత ప్రమాణ భాషనేర్పవచ్చు. రెండేళ్లనుంచి 'Council of Social Sciences Research' వాళ్లు మహబూబ్‌నగర్‌లో గర్భిణీస్త్రీలకు, చంటిపిల్లల తల్లులకు, పిల్లల పెంపకాన్ని గురించి, ఆరోగ్య సూత్రాల్ని గురించి నేర్పటానికి విద్యాకేంద్రాలు ఏర్పాటు చేశారు. మొదటి దశలో తయారుచేసిన పాఠ్యాల్లో మొదటి పాఠం

'కమల చూలాలు' అన్న వాక్యం. తీరా 'ఫీల్డు' కు వెళ్లి ఈ పాఠాన్ని మొదలుపెడితే 'చూలాలు' అన్నమాట అక్కడ ఎవరి వాడుకలోనూ లేదని తెలిసింది. ఆ అర్థంలో అక్కడ 'నిండుమనిసి, గర్భిని, పొట్టతో ఉంది' అంటారు. రెండో దశలో పాఠాలన్నీ వాళ్ళ మాండలికంలోనే తయారుచేసి చెప్పటం వల్ల చాలామందికి చదవటం, రాయటం వచ్చింది. పాడి పంటల గూర్చిన ఆకాశవాణి ప్రసారాలు, గ్రామస్థుల కార్యక్రమాలు కొంత కాలం దాకా మాండలికాల్లోనే ప్రసారం కావటం మంచిది. దీనికా్కవలసిన 'స్క్రిప్టు' ఆయామాండలికాలకు చెందిన రచయితలచేత రాయించవచ్చు.

(3) భాషాభివృద్ధికి ఏం చెయ్యాలి అనటంకంటె, ప్రమాణీకరణం పేరుతో ఏం చెయ్యగూడదో తెలుసుకోటం ముఖ్యం. భాషను ఇదివరకు వాడని ఏయేరంగాల్లో ఇక ముందు వాడాలో శాసించవచ్చు గాని, ఆభాషఎట్లా ఉండాలో ఏరకమైన పదాలు ఏరంగాల్లో వాడాలో ప్రభుత్వం కానీ విద్యాసంస్థలు కానీ, అకాడెమీలు కానీ శాసించగూడదు. భాషాస్వరూపాన్ని గూర్చి చేసిన శాసనాలవల్ల సహజమైన సృజనాత్మకశక్తి రచయితల్లో దెబ్బ తింటుంది. సంస్కృతం వ్యవహారంలో జారిపోయి ప్రజలు వాడే ప్రాకృతభాషలు నేటి ఔత్తరాహభాషలు కావటానికి ఇదే కారణం. గ్రాంథికభాషాప్రాబల్యం వల్ల తొంభై ఏళ్ళుగా తెలుగులో సహజవచనరచన, కాల్పనికసాహిత్యం పైకి రాలేదు. అధికారభాషగా తెలుగు వ్యాపించాలంటే అన్ని శాఖల్లోనూ వెంటనే తెలుగులో ఉత్తరప్రత్యుత్తరాలు జరపాలి అని ఆదేశిస్తే చాలు. ఆతెలుగు రచన ఎలా ఉండాలో, ఏపదాలు వాడాలో నిర్ణయించటం ఇప్పుడు కర్తవ్యం కాదు. నిర్బంధం లేనప్పుడు ప్రతివ్యక్తీ పదజాలనిర్మాణంలోనూ, రచనాసృష్టిలోనూ భాగస్వామి అవుతాడు.

'Central Technical Terms Commission' వాళ్ళు సృష్టించిన మాటలనే ఉపయోగించి తెలుగుదేశపు చట్టాలు అనువాదం చెయ్యాలి అనే నిర్ణయం వల్ల ఈ మధ్య తెలుగులో వచ్చిన చట్టాలు తెలుగువాళ్ళకే అర్థం కాకుండా పోయినాయి. మాటల సంగతి అటుంచి వాక్యాలు గూడా తెలుగు వాక్యాల్లా కన్పించకుండా పోయినాయి. ఉదాహరణకు, 'సందర్భము అన్యథా కోరిననే తప్ప' అనేది 'unless context otherwise requires' అనే దానికి అనువాదం. 'సందర్భం కోరటం' తెలుగు నుడికారం కాదు.

(4) దేశమంతటికీ ఒకేరకమైన పారిభాషిక పదజాలం సృష్టించుకోవాలని కొందరి వాదం. దీని ఫలితంగా 'బండి, కారు, అద్దెకారు' అనే మాటలను 'వాహనం,శకటం, వాహిక' అని రాయమంటారు. 'పన్ను' బదులు 'రాజస్వం' అనాలిట. రూఢపదాలను భాషలోనుంచి తప్పించటం మంచివని గాదు; సాధ్యమూ కాదు. సంస్కృతం నుంచి రెండుమూడు మాటలకలయికతో గూర్చిన పదాలు తెలుగులో అతకవచ్చు, దీర్ఘసమాసాలు ఇమడవు. ఉదా.: 'రూపాంతర ప్రాప్తావస్థ' (metamorphic phase), 'ఉదాసీన వక్రరేఖా విశ్లేషణ' (indifference curve analysis) మొదలైనవి కుప్పతిప్పలుగా తెలుగు అకాడెమీ పుస్తకాల్లో వేస్తున్నారు. ఏసందర్భంలోను అర్థం కానీ, రూపంకానీ మారకుండా ఉండేవి (రసాయన శాస్త్రంలో వచ్చేవి) ఇంగ్లీషునుంచి ఎరువు తెచ్చుకోటం మంచిది. సందర్భాన్ని బట్టి అర్థం మారే మాటలను వివరణాత్మకంగా తెలుగులోకి తెచ్చుకోవాలి. కొత్త భావాలు తెలుగువారి ఆలోచనావిధానంలో కలిసిపోతే కొత్తమాటల కూర్పు సహజంగా ఏర్పడుతుంది. మాటల కంటే 'concept' అర్థం చేసుకోటం ప్రధానమైంది.

(5) పరిపాలనలోను, న్యాయస్థానాల్లోను తెలుగును ప్రవేశపెట్టాలంటే ద్విభాషా శైలివాడటం మొదటి మెట్టు. అంటే ఇంగ్లీషు మాటలు, పదబంధాలు అవసరమైన చోట కలిపి తెలుగు వాక్యాల్లో మాట్లాడటం. క్రమంగా తెలుగులో ఆలోచించి రాయటం సాధ్యపడ్డప్పుడు అన్యదేశ్యాల స్థానంలో దేశ్యశబ్దాలు వస్తాయి; లేదా అన్యదేశ్యాలు మన భాషలో కలిసిపోతాయి. న్యాయస్థానంలో వాదోపవాదాలు మిశ్రశైలిలో జరిగినా నిర్ణయాలు కొంత కాలం ఆంగ్లంలోనే ఉండవచ్చు. మరో ఇరవై ఏళ్ళలో తెలుగులో చట్టాలు, న్యాయసూత్రాలు నిక్కచ్చిగా రాయటం సాధ్యమవుతుంది.

## జాతీయ అంతర్జాతీయ రంగాల్లో తెలుగు

భారతీయభాషల్లో తెలుగుది ద్వితీయస్థానం. భాష తెలీకుండా సంస్కృతిని ఎవరూ అర్థం చేసుకోలేరు. తెలుగులో వచ్చిన ఉత్తమసాహిత్యాన్ని అనువాదరూపంలో ఇతరప్రాంతాలవారికి అందించి తెలుగు నేర్చుకొనే కుతూహలం కలగచెయ్యాలి. ఇతరరాష్ట్రాల్లో ఉన్న విశ్వవిద్యాలయాల్లో తెలుగుకు ఆచార్యపీఠాలు కల్పించాలి. తెలుగుదేశంలో కూడా ఇతరరాష్ట్రాల

వారికి తెలుగుభాష, సంస్కృతి, చరిత్రల్ని గురించి శిక్షణ ఇచ్చే ఏర్పాటు చెయ్యాలి. ప్రభుత్వం స్థాపించదలచుకొన్న అంతర్జాతీయతెలుగుసంస్థ మొదట జాతీయసంస్థగా రూపొందాలి. నాకు తోచినంతవరకు ఈసంస్థ పనులు నాలుగు: (1) ఇతరభారతీయభాషల్లో వెలువడ్డ ఉత్తమసాహిత్యాన్ని శాస్త్రవిజ్ఞానాన్ని తెలుగువారి కందించటం; (2) తెలుగువారికి ఇతరభారతీయ భాషల్లోనూ, ఇతరభాషావ్యవహర్తలకు తెలుగులోను, శాస్త్రీయ పద్ధతిలో, స్వల్పకాలంలో శిక్షణనివ్వటం; (3) తెలుగుభాష చరిత్ర, సంస్కృతులకు సంబంధించిన మహోన్నతగ్రంథాలయం స్థాపించటం; (4) భాషాభివృద్ధిని గూర్చిన సమీక్షలు, గోష్ఠులు తరచుగా జరపటం.

అంతర్జాతీయ సంస్థగా తెలుగుసంస్కృతి, భాష మొదలైన వాటిలో కృషి చేసే ఇతరదేశవిద్వాంసులకు అనువైన ఉనికి, వసతులు కల్పించటం; అంతర్జాతీయ భాషల్లో (ఫ్రెంచి, జర్మన్, రష్యన్, చైనీస్, జపనీస్ మొదలైనవి) తెలుగువారికి శిక్షణ నేర్పాటుచేసే అనువాదశాఖను స్థాపించటం, దానిద్వారా ఆధునికవిజ్ఞానంలో ఇతరదేశాల్లో అచ్చయిన వ్యాసాలను, గ్రంథాలను, సంగ్రహ రూపంలో అనువదించి తెలుగు శాస్త్రజ్ఞులకు అందించటం; తెలుగులో వచ్చిన ఉన్నత సాహిత్యం, శాస్త్రవిజ్ఞానాలను ఇతర భాషల్లోకి అనువాదం చెయ్యటం; ఇతర దేశాలకు విద్యావాణిజ్య సందర్భాల్లో వెళ్ళే తెలుగువారికి మన భాషా సంస్కృతుల్ని గూర్చి ఓరియంటేషన్‌కోర్సులు ఇవ్వటం.

తెలుగు రచనల్లో సాహిత్యమైనా, శాస్త్రమైనా అంతర్జాతీయస్థాయికి రాదగిన గుణం ఉంటేనే తెలుగు అంతర్జాతీయభాష అవుతుంది. అందుకు కావాల్సిన ప్రోత్సాహం, స్వేచ్ఛ భాషకూ రచయితలకూ కల్గించటమే ప్రభుత్వమూ, విద్యాసంస్థలూ చేయవలసిన పని.

ముగింపు

తెలుగు ఆధునికభాషగా పెరగటానికి ఈ కింది సూచనలు అమలు జరగాలి:

1. పారిభాషిక పదాలను వీలయినంతవరకు తెలుగుమాటలతోనే కల్పించు కొనే ప్రయత్నం జరగాలి. అవసరమైనప్పుడు ఇంగ్లీషు నుంచి ఎరువు తెచ్చుకోటం, రెండు మూడు పదాలకు మించని సంస్కృతానువాదం వాడటం; కొత్తభావాల

అవగాహన, కొత్త మాటలను సృష్టించటం కన్నా ప్రాథమికం. వాడుక లేని పొడిమాటల సృష్టివల్ల భాష పెరగదు.

2. ప్రమాణభాషను మాండలికాలకు దగ్గరగా తెచ్చి వీలైనంత తేలిక మాటలతో అభిప్రాయాలు చెప్పుకునే అలవాటు రచనలో ఏర్పడేట్టు రచయితలు, భాషాధ్యాపకులు కృషి చెయ్యాలి.

3. రాష్ట్రపరిపాలనకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరాల్లోను, విద్యాబోధనలలోను, అనువాదం సాధ్యం కాని చోట్ల ఇంగ్లీషు మాటలు కలిసిన తెలుగు వాక్యాలతో ద్విభాషాశైలిని సహించాలి, ప్రోత్సహించాలి.

4. శాస్త్రవిషయాలను గురించి స్వతంత్ర రచనలను ప్రోత్సహించాలి.

5. భిన్న శాస్త్రాల్లో పరిశోధనపత్రికలు నడపాలి.

6. మాతృభాషాబోధన ఆమూలాగ్రంగా సంస్కరించాలి.

7. శాస్త్రీయమైన అనువాద విధానంలో విశ్వవిద్యాలయాల్లో శిక్షణ కేంద్రాలు ఏర్పరచాలి.

8. ఆధునిక భాషకు సమగ్రమైన వ్యాకరణం, కోశం సమర్థులైనవాళ్ళ చేత రాయించాలి.

9. తెలుగువిద్యాసాధనంగా పట్టభద్రులైనవాళ్ళకు ఉద్యోగాల్లో ప్రాధాన్యం ఇవ్వాలి.

10. తెలుగు శైలిని గురించిగాని, పారిభాషికపదాలను గురించి గాని, కట్టుబాట్లు, నిర్బంధాలు చెయ్యకుండా ఉండాలి.

11. తెలుగు లిపిచిహ్నాల సంఖ్య తగ్గించటానికనువైన కొద్దిపాటి సంస్కరణలు చెయ్యాలి.

భాష ఉపకరణంగా మనవిజ్ఞానం ఎంత పెరిగితే భాష అంత పెరుగుతుంది. భాషనెవ్వరూ చెడగొట్టలేరు. కాని, ప్రయోజనం లేని కట్టుబాట్ల వల్ల దాని పెరుగుదల వేగం తగ్గిపోవచ్చు. విద్యాసంస్థలు, రచయితలు, ప్రభుత్వం, అన్యోన్య సహకారంతో సక్రమప్రణాళికతో భాషాభివృద్ధికి పూనుకుంటే భాష పెరుగుతుంది.

# 14

# తెలుగుభాషా వికాసం

దక్షిణాసియాలో బెలూచిస్తాన్ మొదలు శ్రీలంక దాకా ఈనాడు వ్యవహారంలో ఉన్న 24 ద్రావిడభాషల్లోను అధికసంఖ్యాకులు మాట్లాడేది తెలుగు. జనాభాలో భారతభాషల్లో తెలుగుది ద్వితీయ స్థానం. 1971 లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశంలో తెలుగు మాట్లాడేవాళ్ళ సంఖ్య 4.34 కోట్లు. ఇతర రాష్ట్రాల్లోను ఇతరదేశాల్లోను ఉన్న తెలుగువారిని కలుపుకుంటే మనభాష మాట్లాడేవారి సంఖ్య సుమారు 6 కోట్లన్నా ఉండవచ్చు.

తెలుగు భాషావికాసాన్ని స్వరూపదృష్టి (formal view) తోనూ, ప్రయోగదృష్టి (functional view) తోనూ పరిశీలించవచ్చు. స్వరూపదృష్టి అంటే ఈనాడు మనం వాడే భాష పూర్వయుగాల్లో ఎలా ఉండేదో, ఏయే మార్పులవల్ల నేటి తెలుగు ఏర్పడ్డదో గుర్తించటం. ప్రయోగదృష్టి అంటే తెలుగు వాడుక ఏయే రంగాల్లో మొదటినించి వర్ధిల్లిందో చారిత్రకంగా పరిశీలించటం.

## తెలుగువికాసం : పరిణామదృష్టి

తెలుగుకు ముందరి దశ : ప్రాచీనద్రావిడమాతృక బహుశా 5000 ఏండ్ల కిందట మూడు శాఖలుగా చీలింది: దక్షిణశాఖ, మధ్యశాఖ, ఉత్తరశాఖ అని. దక్షిణశాఖ 3000 ఏండ్ల కింద మరి రెండు ఉపశాఖలయింది : (1) తమిళం,

మలయాళం, కన్నడం, కొడగు, తొద, కోత, (?తుళు); (2) తెలుగు, కూయి, కువి, గోండి, కొండ, పెంగొ, మండ. క్రీ.పూ. 5, 6 శతాబ్దుల కాలానికే తెలుగు ప్రత్యేకభాషగా ఏర్పడి ఉంటుంది. సాంస్కృతికంగా తెలుగు తమిళ, కన్నడాది భాషలతో సాహచర్యం కలిగి ఉన్నా పుట్టుకలో తనకు ఉత్తరాన ఉన్న కూయి, కువి, మొదలైన పొరుగుభాషలకే ఎక్కువ సన్నిహితం అని శాస్త్రజ్ఞులు నిరూపించారు. చాలా రకాలయిన ధ్వనిపరిణామాలు ఈరెండు శాఖలను వేరు చేశాయి. ఉదా.: నాటి తెలుగులో 'వాన్డు, రెండు, లేదు, మ్రాను, ప్రాంత' ఉంటే తమిళశాఖలో 'అవన్, ఇరణ్డు, ఇల్లదు, మరన్, పఴ' వంటి రూపాలు కనిపిస్తాయి. తెలుగులో ఉత్తమ, మధ్యమపురుషల్లో నా-, మా-, అని ఉంటే తమిళాదుల్లో ఎన్-, నన్-, ఎమ్-, నమ్- అనే రూపాలున్నాయి. భౌగోళికంగా తెలుగు పైరెండు ఉపశాఖలనుంచి ఏర్పడ్డ భాషలకు మధ్యస్థంగా ఉంది.

## తెలుగుభాషాచరిత్రలో పరిణామదశలు

తెలుగు భాషాచరిత్రలో స్థూలంగా నాలుగు పరిణామదశలు గుర్తించవచ్చు: (1) క్రీ.పూ. 200 - క్రీ.శ. 500; (2) క్రీ.శ. 500 - 1100; (3) క్రీ.శ. 1100 - 1400; (4) క్రీ.శ. 1400 - 1900.

### మొదటి దశ : క్రీ.పూ. 200 - క్రీ.శ. 500

మొదటిదశలో తెలుగుదేశంలో దొరికిన ప్రాకృతసంస్కృతశాసనాల ఆధారంగా తెలుగు ఊళ్ళపేర్లు, వ్యక్తులపేర్లు మాత్రమే మనకి కనిపిస్తాయి. ప్రజల భాషకు అప్పటికింకా రచనాయోగ్యత ఏర్పడలేదని తెలుస్తుంది. మొదటి తెలుగు శాసనం క్రీ.శ. 575 ఎర్రగుడిపాడు, కమలాపురం తాలూకా, కడపజిల్లాలో దొరికింది. బహుశా 6వ. శతాబ్దినించే తెలుగులో కావ్యసాహిత్యం ఉండి ఉండాలి. నన్నయ్యకు పూర్వశాసనాల్లో కావ్యభాషాశైలి కనిపిస్తుంది; నన్నయ కాలానికే కావ్యభాష వాడుకభాషకు దూరమౌతున్నట్టు తెలుస్తుంది. నన్నయ భారతంలో 'ఇచ్చితిమి, ఏఁబది, తొంబది' అనే రూపాలకు సరిగా సమకాలీన శాసనాల్లో 'ఇన్తిమి, ఏంభయ్, తొంభ' వంటివి కనిపిస్తాయి. సంస్కృత, ప్రాకృత సాహిత్యాల ప్రభావం క్రీ.పూ. 2, 3 శతాబ్దులనుంచే తెలుగుపైన పడ్డట్టు తెలుస్తుంది.

రెండో దశ : క్రీ.శ. 500 - 1100

ఈ కాలంలో కవిపండితసదస్సులకే పరిమితమైన కావ్యభాష ఒకవైపు, సామాన్యప్రజలు వాడే వాడుకభాష ఒకవైపు వర్ధిల్లాయి. కావ్యభాషాప్రభావం వాడుకలో రాసిన శాసనాల్లో కనిపిస్తుంది గాని వాడుకభాషలోవచ్చిన మార్పులు కావ్యభాషకింకా ఎక్కలేదు. ఈకాలంలో ఎన్నో రకాల ధ్వనిపరిణామాలు తెలుగులో ఏర్పడ్డాయి. ఈ మార్పులన్నీ 7-9 శతాబ్దుల మధ్య మొదలై 11, 12 శతాబ్దులకు స్థిరపడ్డాయి. అంతకు ముందున్న 'ళ, ణ'లు 'ల, న'లుగా మారాయి. ఉదా. 'ఏళన్, కొణి' అనేవి 'ఏలన్, కొని' గా మారాయి. 'ఱ' కారం భిన్న పరిసరాల్లో 'ర డ'లుగా మారింది. *ఫ్ఱోలు > ప్రోలు, *ఱచ్చు > డచ్చు 'నాశనంచేయు' లాటివి. *'న్డు' 'ణ్డు'గా మారటం మొదలయింది. వాన్డు > వాణ్డు. వర్గ హల్లుల ముందువచ్చే ఙ ఞ ణ న మలకు 'సున్న' రాసే అలవాటు కూడా ఈకాలంలో కనిపిస్తుంది. దీర్ఘం మీద ఉన్న 'సున్న'ను తేల్చి ఉచ్చరించే వారు. వాణ్డు>వాఁడు; 'ంబు'ను కొన్నిచోట్ల 'ము' అని చదివేవారు. కొట్టంబుల్ >కొట్టముల్. ఱ, రలు వేరుగా ఉన్నా కొద్దిమాటల్లో ర బదులు ఱ రాస్తుండే వారు. అంటే వాటి ఉచ్చారణలో తేడా పోతున్నది. బహువచన ప్రత్యయం ముందు 'ళు' గా ఉండి తరువాత 'లు' అయింది. నామక్రియా ప్రాతిపదికలు, విభక్తులు కావ్యభాషలోనూ నాటి వాడుకభాషలోనూ ఒకేరకంగా ఉండేవి.

మూడో దశ : క్రీ.శ. 1100 - 1400

నన్నయ భారతరచనాకాలానికే ప్రమాణీకృతమైన కావ్యభాష సాహిత్యోప యోగానికి ఒరవడి అయింది. ఈ భాషలో మార్పు మందగించింది. కాని జనవ్యవహారం మారుతూనే ఉంది. కావ్యాల్లో రాసేది ప్రజావ్యవహారానికి దూరంగా ఉండాలని కేతన (13శతాబ్ది) హెచ్చరించాడు. 'తెచ్చుతాడు, వీటీ, మమ్మూ, పంచాకుము, తోపించాకుము' మొదలైనవి గ్రామ్యాలన్నారు. ఇవి అనాటి శిష్టభాషకు దగ్గరగా కనిపిస్తాయి. అప్పటిదాకా అంతగా మారని కావ్య భాష సహజంగా మారుతున్న జనవ్యవహారభాషకు దూరమౌతూ వచ్చింది. 11 – 14 శతాబ్దుల మధ్యకాలంలో అంతకు ముందు యుగంలో మొదలైన ధ్వనుల మార్పులు వ్యాపించి స్థిరపడ్డాయి. ళ ణ ల బదులు ల న లు, ఱ కారం క్రమంగా తగ్గిపోవటం, ఱకారం ర, డలుగా మారటం, డాఁగు, దగ్గర, మొదలైన శబ్దాల్లో పదాది'డ', 'ద' గా మారి దాఁగు, దగ్గర లాంటి రూపాలేర్పడటం, కళ్ళియము,

కన్నియ, మొదలైనవి కళ్ళెము, కన్నెగా ఇయ > ఎ గా మారటం ఈకాలంలో జరిగింది. అనుస్వారం పూర్వాచ్చును అనునాసికంగా మార్చి తప్పుకొన్నది, వాండు > వాఁడు. 'చ జ' లకు 'అ ఆ ఉ ఊ ఒ ఓ' లముందు 'త్స, ద్జ' ఉచ్చారణ ఏర్పడ్డట్టు తెలుస్తున్నది: 'పుత్సుకొని' (క్రీ.శ. 1393). సంస్కృత ఋకారం తెలుగు వాళ్ళు రి/రు లుగా ఉచ్చరించేవాళ్లు. ఉదా. పిత్రుస్థానము (క్రీ.శ. 1112). క్రావళ్ళున్న మాటల్లో రావత్తు పోవటం ఆరంభమయింది: మ్రాను > మాను, త్రావు > తావు. సకారంతో ఇ ఈ ఎ ఏ లు కలిస్తే ఇప్పటిలాగా 'శ' అని ఉచ్చరించేవారు: చేశిన (క్రీ.శ. 1290). సముచ్చయ 'ను' వర్ణానికి ముందు దీర్ఘమన్నా, హ్రస్వాచ్చుమీద న్ని, న్ను అని రాయటమన్నా ఈ యుగంలో కనిపిస్తుంది. ఉదా. ఎల్లప్పుడూను (క్రీ.శ. 1003), ప్రతి సంవత్సరమున్నూ (క్రీ.శ. 1243). పదాంత మువర్ణకం 'మున్ను' గా మారింది. ఉదా. రక్తం (క్రీ.శ. 1187). కరణములు > కరణాలు. కుంచములు > కుంచాలు వంటి మార్పులు స్థిరపడ్డాయి. కావ్యభాషలో 'దేవునికి' ఉంటే వాడుకలో 'దేవుడికి' (క్రీ.శ. 1247) కనిపిస్తుంది. కావ్యభాషకే పరిమితమైన 'పొంటె, అందు, న, మెయిన్, చేసి' మొదలైన నామవిభక్తులకు శాసనాల్లో వాడుక తగ్గి 'చేత, వల్ల, నుండి, కంటె, లోపల' మొదలైనవాటి ప్రాచుర్యం ఎక్కువైంది. అన్నిటికన్నా ముఖ్యంగా 9, 10 శతాబ్దుల్లోనే శాసనాల్లో కనిపించే గౌరవార్థకప్రత్యయం '–గారు' వాడుక భాషలోనే వ్యాపించింది; కావ్యభాషకు ఎక్కలేదు. సంఖ్యా వాచకాల్లో 'ఒకడు' బదులు 'ఒకటి', 'ఏను' బదులు 'ఐదు', 'ఎణుంబొది' బదులు 'ఎనిమిది' ఏర్పడ్డాయి. ఈనాటి వాడుకలో లాగా 'ఇర్వయి, ముప్పై, నల్బయి, ఏంభై, ఎనభై, తొంభయి' 11–14 శతాబ్దులమధ్య కాలంలో విరివిగా శాసనభాషలో దొరుకుతాయి. 'మూవురు, నలువురు, ఏవురు' శబ్దాలు 'ముగ్గురు/మూగురు, నలుగురు, ఐ(దు)గురు' లాగా మారిపోయినాయి (–వురు > –గురు). క్రియల్లో ఇచ్చితిమి > ఇస్తిమి, ఇచ్చినవాడు > ఇచ్చినాడు, మొదలైన మార్పులు బహుళమయినాయి. తిక్కన భారతంలో 'ఇచ్చినాడు, వచ్చినాడు' వంటి విధేయవిశేషణాల వాడుక ఎక్కువగా కనిపిస్తుంది. 'నడచెడును, నడచెదము' వంటి కావ్యరూపాల బదులు వాడుకలో ఏర్పడ్డ 'నడచేను, నడచేము' లాంటివి శాసనాలకెక్కాయి. 'వచ్చినన్, చెప్పినన్' మొదలైనవి చేదర్థంలో 'వస్తేను/వస్తే' అనీ, అప్యర్థంలో 'వచ్చినాను/వచ్చినా' అనీ మారాయి. –తేను/–తే ప్రత్యయాలు వాడుక భాషలోనే ఉండిపోయాయి.

-అవ/-అవు లతో పాటు అర్వాచీనమైన -ఓ సంఖ్యావాచకాల్లో కనిపిస్తుంది. ఉదా. మూండోనడవు (క్రీ.శ. 1186). క్రియా విశేషణాల్లో ఎడు > ఏ గా మారింది. అనెడు > అనే; దీంతో -అట్టి చేరి కొన్ని చోట్ల అనేటి (< అనే + అట్టి) వంటివి ఏర్పడ్డాయి (క్రీ.శ. 19వ శతా.). 'త్రాసు, డేరా, డోలు' వంటివి ఎన్నో అరబ్బీ-పారశీక పదాలూ భాషలో చేరాయి.

నాల్గో దశ : క్రీ.శ. **1400-1900**

ఈ యుగంలో క్రావళ్లు చాలావరకు పోయి 'క్రొత్త, క్రింద' మొదలైనవి 'కొత్త, కింద' గా మారాయి. ఈయక > ఇయ్యక, చేయక > చెయ్యక, వాయండు > నేండు/నీండు వంటి మార్పులు కనిపిస్తాయి. హల్సంధి జరిగిన 'బ్రాంహ్మణ్ణి' 'రాముణ్ణి' లాటివి బహుళం. 'కొరకు' ప్రత్యయంవాడుక పెరిగింది. 'వాండు' (= వాడు)కు బహువచనంగా 'వాండ్లు' ఏర్పడ్డది. ఈ మార్పుకు కారణం 'వారు' గౌరవార్థకంగా పరిమితం కావటమే. ఇస్తిరి, చేస్తిరి లాగా, సమర్పిస్తిమి మొదలైన వాడుకరూపాలు శాసనాలకెక్కాయి (క్రీ.శ 1518). విధేయ విశేషణాలుగా ఏర్పడ్డ 'కట్టించినారు, సమర్పించినాడు' వంటివి సమాపక క్రియలుగా మారాయి. అంటే ఇప్పటి వాడుకలో 'కట్టించినవాళ్ళు' విధేయ విశేషణం, 'కట్టించినారు' క్రియ. విధ్యర్థం (must అనే అర్థం)లో రక్షించేది, ఎత్తేది లాటివి 14, 15 శతాబ్దులకే ఏర్పడ్డాయి. శత్రర్థకంలో 'తూ' ప్రత్యయం పైకి వచ్చింది. 'పాలిస్తూ, చేస్తూ'. వర్తమానంలో 'చేస్తున్నారు' లాంటి రూపాలు 17వ శతాబ్ది మొదటి భాగంలోనే కనిపిస్తాయి. వచ్చినాను, చేసినాను, వచ్చినా, చేసినా గా మారి 16, 17 శతాబ్దులకే రాతలో స్థిరపడ్డాయి. మనం ఈనాడు వాడే నామవిభక్తులన్నీ ఇప్పటి భాషలో బహుళంగా కనిపిస్తాయి.

ఎన్నో శతాబ్దులుగా మరుగున పడిఉన్న 'వస్తారు', 'పొందుతారు' వంటి వాడుక 16వ శతాబ్దికల్లా శాసనాలకెక్కింది. ఈనాడు తెలుగుదేశమంతటా వ్యాప్తిలో ఉన్న భవిష్యత్తద్ధర్మార్థక ప్రత్యయం -తా (వస్తాడు, చూస్తాడు, మొదలైనవాటిలో) 13వ శతాబ్దినించి వాడుకలో ఉన్నట్టు కేతన చేసిన నిషేధం వల్ల తెలుస్తుంది. వ్యతిరేక భూతంలో 'చేయలేదు' (క్రీ.శ. 1600) లాంటివి వచ్చాయి. విధ్యర్థాలు 'చెయ్యాలి, రావాలి' వంటివి 19వ శతాబ్ది నించే కనిపిస్తాయి. '-కొను', '-కు' గా మారింది: 'అనుభవించుక' (క్రీ.శ. 1961). శత్రర్థంలో '-తూ', '-తా' లే ఎక్కువగా కనిపిస్తాయి. 'భక్షిస్తా' (క్రీ.శ. 1636),

'చేస్తూ' (క్రీ.శ. 1600). క్రియావిశేషణాలుగా వచ్చే, వచ్చిన, వస్తున్న లాంటివే బహుళం. ఇక ఉచ్చారణలో మార్పులు వచ్చి 'వద్ద/ఒద్ద, వప్పగించు/ఒప్పగించు' రాస్తూ వచ్చారు. మేడ, మేక మొదలైన శబ్దాలలో ఉన్న 'ఏ' కారాన్ని ఇంగ్లీషు 'bank'లో ఉన్న అచ్చులాగా ఉచ్చరించేవాళ్ళు. దానికి సూచనగా 'మ్యేరకు' (క్రీ.శ. 1688) అని రాయటం కనిపిస్తుంది. అర్ధానుస్వారానికి ఏనాడూ గుర్తు లేదు గాబట్టి దాని ఉచ్చారణ ఉన్న చోట పక్క హల్లు ద్విత్వంగాను, లేని చోట అద్విరుక్తం గానూ రాసేవారు. ఉదా. సాగిఞ్చి (= సాగించి), తోఁటలు (= తోటలు).

సంఖ్యావాచకాలు ఈనాడు మనం ఉచ్చరించినట్లే ఉండేవి: 'నలభయి యాంభై, వక, రెండో, మూండో' అని. సంయుక్తక్రియల వాడుక ఎక్కువవుతుంది. ఉదా. వెళ్లదరుము, వట్టించుకొను, కనుక్కొను, తోసివేయు, నడిపించుకొను, మొదలైనవి. 'చేసినాడు, సాగించినాడు' వంటివి క్రియలు కాగానే 'చేసెను', 'సాగించెను' మొదలైనవాటి వాడుక తగ్గుతూ వచ్చింది. ఈ కాలంలో వచ్చిన కావ్యసాహిత్యంలో కూడా వ్యవహారభాషారూపాలు ఎక్కువ చొరవజేసుకొన్నాయి. అంటే అవి శిష్టవ్యవహారంలో ఉండేవిగా మనం భావించాలి. 'నుంచి' విభక్తి, ఉభయప్రార్థనలో 'చూతాము, వెదకుదాము' వంటి రూపాలు, అలాగు, ఈలాగు, చాలా, ఎగిరేటట్టయితే, ఇలాంటి ప్రయోగాలు ఈ యుగంలో వెలువడ్డ ప్రబంధాల్లో కొల్లలుగా కనిపిస్తాయి.

19వ శతాబ్దిలో రాసిన స్థలచరిత్రలు, కైఫీయతులు, నాటి శిష్టుల వాడుకభాషలో మిశ్రశైలిలో ఉండేవి. పౌరప్రవచనాలన్నీ వాడుకభాషలోనే. 19వ శతాబ్దిలో అధికారభాషగా తెలుగును వాడేవారనటానికి మచ్చుగా ఈ కింది 'మతలబు'ను చూడండి.

మహారాజరాజశ్రీ ఆర్. యే. రాబరట్సన్ యిస్క్వైర్ కలెక్టరు జిల్లే నెల్లూరివారి సముఖానకు

జిల్లే మజాకూరులో చేరిన గూడూరు తాలుగా యిలాకా పిడూరి సముతు పెద్దకాపు అయ్ని నారాయణరెడ్డి వ్రాసుకొన్న అర్జీదాస్తు...

సన్. 1855 సంవత్సరం వరకు నేను అమాన భూముల దున్నితూ వుంటిని. మేనెల 20 తారీఖున నేను తమ పేరట వ్రాసుకొన్న అర్జీ వివరములు జాహీరు

అయి వుండవచ్చును. అందుకు జవాబు దయచేయించలేదు. యిప్పుడు మంచి వర్షములు కురిసి సాగుబడి చేసే దినములు అయినందున సాగుబడి వృద్ధిచేసి సర్కారువారి దయకు పాత్రుడు కావలెనని అతాలుకా తహసిల్‌దారుణ్ణి అగ్రామమును యిజారాకు యిప్పించవలెనని అడిగితే అగ్రామముకు భారీచెరువు వున్నదనిన్ని చెరుకు పయిరు పెట్టితే సర్కారుకు శానా నఫా కల్గుతున్నదనిన్ని యెంచి నాకు అగ్రామం యిజారాకు యిప్పించలేదు. తానున్ను అగ్రామములో చెరుకు పయిరు వేయించడముకు యంతమాత్రమున్ను మెహనతు చేయించలేదు. గనుక నన్ను తమ సముఖముకు వచ్చేటట్టు హుకుం అయిన పక్షమందు గ్రామయావత్తు అహవాలు మనవి చేసుకొంటున్నాను. నేను కదీంరయితును. నాకు దయచేయించిన యడల మోతుబరు జామీన్ యిప్పించి సర్కారు రూకలు చెల్లించి నేను జీవనము చేసుకుంటున్నాను. యీయావత్తు సంగతులు చిత్తగించి ముందు నేను నడుచుకోవడముకు చిత్తానుసారం ఆజ్ఞ దయచేయించవలెనని వేడుకుంటున్నాను.

1864 సం॥ ఆగష్టు $x$ ది నారాయణరెడ్డి నిశాని

(Major T. G. M. Lane, *A Collection of Official Documents in the Telugu Language.* Madras, 1868. No. 67, 10. 143-44).

పై సింహావలోకనాన్ని బట్టి ఈ నాడు మనం విస్తృతంగా వాడే ప్రమాణ భాష ఇటీవలది కాదనీ, దీని పరిణామబీజాలు వాడుక భాషలో 10వ శతాబ్ది నించే క్రమంగా ఏర్పడుతూవచ్చాయనీ నిరూపించవచ్చు. వ్యవహారావశ్యకతను బట్టి వాడుకభాష పెరుగుతూ వచ్చింది. సంస్కృత ప్రాకృత పదాలతో బాటు, 12వ శతాబ్ది నించి అరబ్బీ పారసీక భాషాపదాలు, 16వ శతాబ్ది నించి పోర్చుగీసు, ఆంగ్లభాషాపదాలు విరివిగా తెలుగులో చేరాయి.

### తెలుగువికాసం : ప్రయోగదృష్టి

అచ్చుయంత్రం, ఆంగ్ల విద్యావిధానం వచ్చేదాకా తెలుగు వాడుక నాలుగు రంగాల్లోనే ఉండేది. కావ్యసాహిత్యం, శాసనసాహిత్యం, జానపద సాహిత్యం, సామాన్యజనవ్యవహారం. సామాన్యజనవ్యవహారమే శాసనభాషకు, జానపద సాహిత్యానికి అధారం. కావ్యసాహిత్యానికి కవిత్రయంవారి భాష ఒరవడై ప్రజావ్యవహారభాషకు దూరమైంది. శతకాలు, కీర్తనలు, యక్షగానాలు మొదలైన

వాటిల్లో కావ్యభాషతో బాటు వ్యవహారభాష కూడా చోటుచేసుకొన్నది. శాసన భాషలో కావ్యభాష, కావ్యభాషలో వాడుకభాష అడపాతడపా కనిపిస్తూనే ఉన్నాయి. తెలుగులో శాస్త్రగ్రంథరచన 19వ శతాబ్దిదాకా చాలా తక్కువ. తర్క, వ్యాకరణ, వైద్య, గణిత శాస్త్ర రచనలు కొద్దిపాటి ఉన్నా అవి సంస్కృత శ్లోకాల్లోనో, తెలుగు పద్యాల్లోనో ఉండేవి.

1855లో చిన్నయసూరి బాలవ్యాకరణం వచ్చేదాకా వచనరచన కొద్దిగా జరిగినా శిష్టవ్యావహారికంలో ఉండేది. ఆ తరవాత పరిస్థితి మారి గ్రాంథిక, వ్యావహారికోద్యమాలు బయలుదేరటంతో తెలుగులో వచనరచన కుంటుబడ్డది. కావ్యభాషావ్యాకరణాన్ని వచనభాషకు గూడా ప్రవర్తింపజెయ్యాలని సాంప్రదాయిక పండితులు పట్టుబట్టారు. ఆధునికభాషకు గురజాడ, గిడుగులు పట్టుగొమ్మ లైనారు. ఒకవైపు సంఘసంస్కర్తగా, మరొకవైపు రచయితగా పేరుమోసిన శ్రీ వీరేశలింగం పంతులుగారు తెలుగులో వివిధసాహిత్య ప్రక్రియలను తెచ్చిపెట్టారు. గ్రాంథిక, వ్యావహారిక వాదాలు 1919లో ముగిశాయి. విద్యావిధానంలో గ్రాంథికమే నిలిచింది. కాని ఆ తరువాత ఇరవై ఏండ్లకు – అంటే 1940 మొదలు ఆధునికభాషకు మేధావులయిన రచయితల రచనలతో పెద్దపెట్టున ప్రాపకం వచ్చింది.

చిన్నయసూరి రచనల ప్రభావం అంతకు ముందున్న సహజవచనశైలిని మటుమాయంచేసి తెలుగు వచనసాహిత్య ప్రవాహానికి అడ్డుకట్ట వేసింది. తెలుగు భాష పెరుగుదల 90 ఏళ్ళ పాటు ఇలా నిలిచిపోకపోతే మనం బెంగాలీ రచయితల కంటె ముందుగానే ఉత్తమనవలలు రాసి ఉండేవాళ్ళమనిపిస్తుంది.

1940 నుంచి తెలుగు రచనావ్యాసంగం చిన్నయసూరి ప్రభావంనుంచి బయటపడ్డది. జరిగిన 30, 40 ఏండ్లుగా వ్యాపించిన వచనసాహిత్యం (నవల, కథానిక, వ్యాసం, ఏకాంకిక) రేడియో, సినిమాలు, వార్తాపత్రికల మూలంగా మధ్యకోస్తా మండలాల్లో చదువుకున్నవాళ్ళు వాడే భాష ఆధారంగా తెలుగుకు ప్రమాణరూపం ఏర్పడింది. ఇది ఇతర మాండలికాలను కలుపుకొంటూ శక్తి మంతమైన రచనాసాధనమై, మాండలికాతీతమైన ప్రామాణ్యాన్ని, సర్వజన సమ్మతిని సంపాదించుకొన్నది. ప్రభుత్వంవారు, విశ్వవిద్యాలయాలు నిర్ణయించే పుస్తకాల్లోనే కావ్యభాష సరళగ్రాంథికరూపంలో నిలిచిపోయింది.

1964లో తిరుపతి విశ్వవిద్యాలయావరణంలో కీ. శే. పింగళి లక్ష్మీకాంతం గారి ఆధ్వర్యాన జరిగిన గోష్ఠిలో మాతృభాషేతర గ్రంథాలన్నీ ఆధునికప్రమాణ భాషలోనే రాయించాలని నిర్ణయం జరిగింది. ఈ నిర్ణయానికి కొన్ని అడ్డంకులు వచ్చినా తెలుగు అకాడమీ పుస్తకాల్లో అమలు జరిగింది. 'చూడాలి/ చూడాలె' బదులు 'చూడవలె' అనీ, 'పుస్తకం' బదులు 'పుస్తకము' అనీ మార్చి అకాడమీ వాళ్ళు భాషను ప్రమాణీకరిస్తున్నామన్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 1973లో ఆధునికభాషను యూనివర్సిటీ పరీక్షపత్రాల్లో రాయవచ్చుననీ తీర్మానించారు. అంతకు ముందే శ్రీ వేంకటేశ్వరా యూనివర్సిటీవారు తెలుగు Ph. D. సిద్ధాంతవ్యాసాలు ఆధునికభాషలో రాయవచ్చునన్నారు. ఈ మార్పులను బట్టి తెలుగు బహుముఖంగా వర్ధిల్లటానికి పరిస్థితులనుకూలంగా ఉన్నాయి.

1966లో తెలుగు అధికారభాష అయింది. తెలుగులో ఉన్నతవిద్యాభ్యాసం 1969లో మొదలయింది. ఈనాడు తెలుగులో రాయటానికి సాధ్యం కాని విషయమంటూ ఏదీ ఉండదు.

# 15

# ‘శ్వేతపత్రం’పై శాస్త్రీయవిమర్శ

1966లో తెలుగు అధికారభాష అయింది. ప్రభుత్వవ్యవహారం అంతా ఇక మీదట తెలుగులోనే నడుస్తుంది. అధికారభాషగా తెలుగును గుర్తించటంలో ఉన్న ముఖ్యమైన ఉద్దేశం ప్రజలకూ ప్రభుత్వానికీ మధ్య దూరం తగ్గించటమే. ఇంతదాకా ఇంగ్లీషులోనే పరిపాలన చాలా భాగం నడుస్తున్నది. అంటే ప్రభుత్వం జారీ చేసిన ఉత్తరువులూ, నోటీసులూ, శాసనసభల్లో చర్చించే బిల్లులూ, చేసే చట్టాలూ ఇంగ్లీషులో ఉన్నాయి. వీటిని అన్నిటినీ తెలుగులోకి తర్జుమాచేసి అధికారికపాఠాలు తయారుచెయ్యటానికి 1964లో మన ప్రభుత్వం ఒక అనువాదక సంఘాన్ని న్యాయశాఖలో భాగంగా నియమించింది. ఇంతవరకు ఈసంఘంవారు చేసిన పని, ఇక ముందు చేయవలసిన పని, అనువాదవిధానంలో అనుసరించిన సూత్రాలు, ఎదుర్కొన్న సమస్యలు, మొదలైన విషయాలు చర్చించే ఒక అధికారిక నివేదిక ఈమధ్య ప్రభుత్వం విడుదల చేసింది. దీన్నే ‘శ్వేతపత్రం’ (ఇంగ్లీషులో Whitepaper) అన్నారు. ఈపుస్తకంలో (92 పేజీలు) 6 అధ్యాయాలు, 5 అనుబంధాలు ఉన్నాయి. దీన్ని ఇంగ్లీషులోను, తెలుగులోను అచ్చువేశారు. ఇంగ్లీషుప్రతికి అనువాదమైన తెలుగుప్రతి చక్కటి శిష్టవ్యావహారిక శైలిలో ఉన్నది. దీన్నిబట్టి ప్రభుత్వంవారు అధికారికపాఠాల రచనకు ఆధునిక ప్రమాణభాషను ఆమోదించినట్లు తెలుస్తున్నది. ప్రభుత్వంవారి ఇతర రచనా

వ్యవహారాల్లో గూడా ఇదే శైలి అనుసరిస్తారని భావించవచ్చు. ఆంధ్రభాషాభివృద్ధికి ఇదొక శుభసూచన. విషయం దృష్ట్యా కూడా ఈ 'శ్వేతపత్రం' లో చేసిన చర్చ శాస్త్రీయంగా, భావోత్తేజకంగా ఉంది. కాని ఇందులో అనువాద సంఘంవారు చేస్తున్న తర్జుమాలను సుదీర్ఘంగా సమర్థించటానికి ప్రయత్నించవలసిరావటం గమనించదగ్గది. ఒక దృష్టితో చూస్తే తెలుగుకు అధికారికస్థానం ఇవ్వటానికి ప్రభుత్వం చేస్తున్న కృషి ప్రశంసాపాత్రమనే చెప్పాలి. ఇక ప్రస్తుతాంశం.

వింతవింత హిందీ పదాలు

మొదటి అధ్యాయం పీఠిక; దీంట్లో తెలుగును అధికారభాషగా ప్రవేశ పెట్టాల్సిన అవసరం, ఈవిషయంలో ఇంతవరకు ప్రభుత్వం తీసుకొన్న చర్యలూ, మొదలైనవాటి వివరణ ఉంది. ''చట్టాలు అనువాదం చెయ్యటానికి నియమించిన అనువాదకసంఘం కేంద్రన్యాయయంత్రాంగశాఖ క్రింద పనిచేస్తున్నది. ఈ యంత్రాంగశాఖ కింద రూపొందిన కొత్తపద్ధతి ప్రకారం కేంద్రచట్టాలను తెలుగులోకి అనువదించే కార్యక్రమం శీఘ్రతరం చెయ్యబడింది'' (పేజీలు 6-7). దీన్నిబట్టి అనువాద విధానంలో కేంద్ర సాంకేతికపారిభాషిక సంఘంవారు సృష్టించిన హిందీ అనువాదాలను కొద్ది భేదంతో తెలుగులో సరిపెట్టాలని గట్టి ప్రయత్నం చేస్తున్నట్టు కనిపిస్తున్నది. కేంద్రప్రభుత్వం వారు అచ్చువేసిన 'సమేకిత్ ప్రశాసన్ శబ్దావలీ'లో మన చట్టాల్లో అనువాదకులు వాడుతున్న వింత పదాలు చాలాభాగం కనిపిస్తాయి.

శ్వేతపత్రం రెండో అధ్యాయం మన 'సంవిధానం' ('కాన్స్టిట్యూషన్') లోని 345, 348 'అనుచ్ఛేదాల' అనువాదంతో ఈ కింది విధంగా మొదలవుతుంది. (పూర్వకాలపు తెలుగు చట్టాల్లో 'ఆర్టికల్' కు 'ప్రకరణం' అని వాడుకొన్నారు.)

> ''345. రాజ్యాధికారభాష లేక భాషలు:- 346, 347 అనుచ్ఛేదాల యొక్క ఉపబంధములకు లోబడి, రాజ్యవిధానమండలి ఆ రాజ్యంలో వాడుకలో వున్న ఏదైన ఒకభాషను లేదా అంతకెక్కువ భాషలను లేదా హిందీని ఆ రాజ్యంలోని అన్ని లేదా ఏవైన అధికార కార్యాల నిమిత్తము ఉపయోగించ వలసిన భాషగా లేదా భాషలుగా స్వీకరించవచ్చును. అయితే విధానమండలి చట్టం ద్వారా ఇతరవిధంగా (ఉపబంధించువరకు) ఈ సంవిధానం ఆరంభమగుటకు అవ్యవహిత పూర్వము ఏ రాజ్యాధికార కార్యాల

నిమిత్తము ఇంగ్లీషుభాష ఉపయోగింపబడుచుండెనో ఆకార్యాల నిమిత్తము ఇంగ్లీషుభాష యొక్క ఉపయోగము కొనసాగుచుండవలెను.'' (పేజీ 9)

ఇది చదివితే అర్థం కావటంలేదు. కారణాలు మూడు: ఇంగ్లీషులో ఉన్న మాటలకు సమానంగా ఉండాలని అనువదించిన పారిభాషికపదాలు కొత్తవి కావటం. తెలుగు వాక్యనిర్మాణం దెబ్బతినటం ('అన్నీ లేదా ఏవైనా', మొ.), వ్యావహారికభాషాశైలిని, గ్రాంథికభాషాశైలిని కలగాపులగం చెయ్యటం; పై విషయాన్ని ఈకింది విధంగా అనువదిస్తే ఎలా ఉంటుందో చూడండి:

345. రాష్ట్రంలో అధికారభాష(లు): 346, 347 ప్రకరణాల్లో చెప్పినదానికి లోబడి, రాష్ట్ర శాసనసభలు ఆ రాష్ట్రంలో వాడుకలో ఉన్న ఒకే భాషనుగాని, అనేకభాషలనుగాని, హిందీనిగాని, ఆరాష్ట్రప్రభుత్వ వ్యవహారాల్లో కొన్నింటికిగాని, అన్నిటికిగాని వాడదగిన భాషలుగా ఏర్పరుచుకోవచ్చు.

రాష్ట్రశాసనసభలు పైవిధంగా ఒకచట్టం ఏర్పరుచుకొనేదాకా, 'కాన్‌స్టిట్యూషన్' అమలులోకి రావటానికి సరిగ్గా ముందు ఆరాష్ట్రంలో ఇంగ్లీషుభాష వాడుకలో ఉన్న ప్రభుత్వ వ్యవహారా లన్నిటిలోనూ అదే భాష వాడుకలో ఉండాలి.'

## మక్కికి మక్కి అనువాదం

పై అనువాదాల్లో మొదటిదానికన్నా రెండోది తెలుగు వాడుకకు దగ్గరగా ఉండటం గమనించవచ్చు. 'అనుచ్ఛేదం', 'ఉపబంధము' 'రాజ్యం,' 'విధాన మండలి', 'సంవిధానము', 'అవ్యవహితపూర్వము' వంటి పారిభాషికపదాలను తెలుగులో మరో రకంగా చెప్పటానికి వీలున్నా ఆపద్ధతిని తప్పించి– 'ప్రశాసన్ శబ్దావలీ' నుంచి తీసుకొన్నవి. తెలుగుపత్రికల్లో 'రాష్ట్రం', 'రాజ్యం' State, Federal State అనే అర్థాల్లో దృఢంగా ఉంటే, వీటికి సరిగా వ్యతిరేకార్థాల్లో ఈ మాటల్ని హిందీలో వాడతారు. 'ఇమీడియెట్'కు హిందీవాళ్ళ అనువాదం 'అవ్యవహిత్'. 'అవ్యవహితపూర్వం' అనేదాన్ని అంతకంటే సులువుగా తెలుగులో చెప్పుకోవచ్చు గదా! ఇంగ్లీషులో ఉన్న దాన్ని మక్కికిమక్కి అనువాదం చేస్తేనే తప్ప న్యాయశాస్త్ర ప్రయోజనాలకు అనుగుణంగా ఉండదనే అపోహవల్ల ఈఅవస్థ ఏర్పడ్డది. ఇంగ్లీషులో ఉన్న శబ్దాలు, అర్థచ్ఛాయలు అదే సంఖ్యలో తెలుగు

మాటల్లో చొప్పించాలనుకోటం వ్యర్థప్రయత్నం అవుతుంది. వాడుకలో మాటలు పుట్టాలి గాని మాటల కోసం వాడుక పుట్టదు. న్యాయశాస్త్రవిషయాలను తెలుగువారు ప్రసంగాల్లోను వాదోపవాదాల్లోను ఆంగ్లభాషాశబ్దాలను ధారాళంగా కలిపి అయినా తెలుగుద్వారా మాట్లాడే వాడుక ముందు ఏర్పడాలి. అధికారభాషగా తెలుగును ప్రవేశపెట్టీపెట్టక ముందే బిల్లులూ, చట్టాలూ ఇంగ్లీషులో ఉన్న న్యాయశాస్త్రపద్ధతి ప్రకారం ప్రమాణీకరించి ప్రయోగించాలన్న ప్రయత్నం భాష పెరుగుదల పరిమితికి అసహజమైనదేమో అనిపిస్తుంది. ఒక కొత్త విజ్ఞానాన్ని తెలుగు వాక్యాల్లో ప్రసంగించటానికి, ఆవిజ్ఞానసంబంధమైన అన్యదేశ్యాలను అనువదించటానికి కార్యకారణసంబంధమేమీ లేదు.

## రూఢి ఏర్పడాలి

మొట్టమొదట న్యాయశాస్త్రసూక్ష్మత అవసరం లేని ప్రభుత్వకార్యకలాపా లన్నిట్లోనూ తెలుగును ప్రవేశపెట్టి విస్తృతంగా వాడుకోవచ్చు. న్యాయవిచారణ విషయంలో వాగ్రూపంగా తెలుగును, లిఖితరూపంగా ఇంగ్లీషును అయిదారేళ్ళ పాటైనా వాడాలి. భాష వ్యవహర్తల సామూహికప్రయత్నంవల్ల వృద్ధిపొందు తుంది గాని, మాటలు సృష్టించే కమిటీలవల్ల గాదు. అవిధంగా ఆధునికన్యాయ విజ్ఞానం వాడుకలో నలిగిన తరవాత న్యాయశాస్త్రగ్రంథాలు, చట్టాలు తెలుగులో స్వతంత్రంగా రాయించాలి. తాలూకా, జిల్లా కోర్టుల స్థాయిలో న్యాయ విచారణలో తెలుగును యథేచ్ఛగా వాడవచ్చునని నియమించవచ్చు. ఉన్నత న్యాయస్థానంలోనూ – న్యాయమూర్తుల తీర్పుల్లో తప్ప – ఇతర వ్యవహారాలకు రాష్ట్రంలోని అధికారభాష వాడటానికి 'కాన్స్టిట్యూషన్' లో ఏర్పాటున్నది (పేజీ 10). వాడుకలో నలిగితేగాని మాటలకు రూఢి ఏర్పడదు. రూఢి సిద్ధిస్తేనేగాని ప్రమాణీకరించటం సాధ్యం కాదు. కొన్ని శతాబ్దులపాటు ప్రయోగవశాత్తు ఆంగ్లంలో ఏర్పడ్డ సాంకేతిక పదాలన్నిటినీ పెద్దపెట్టున వేలకువేలు 'అనువాదాలు' చేసి తెలుగు నెత్తిన రుద్దబట్టే– ఇటు తెలుగు పండితులకూ, అటు ఇంగ్లీషులో ఆ శాస్త్రం చదువుకున్నవాళ్ళకూ గూడా దురవగాహమైన ముసాయిదాలు తయా రవుతున్నాయి. 1964 గ్రామ పంచాయతీల చట్టం, రెవిన్యూ రికవరీ చట్టాల భాష ఈఅవ్యవస్థకు ప్రత్యక్ష నిదర్శనాలు. వీటిని మళ్ళీ ఇంగ్లీషు మాటల్లోకి తర్జుమా చేసుకొని అర్థంచేసుకోవాల్సి వస్తే తెలుగును అధికారభాషగా వాడుకోటంలో ఉన్న లక్ష్యం ఎలా సిద్ధించినట్టు?

పూర్వపు ముసాయిదాలు

వాడుకకు భిన్నంగాకుండా తెలుగు వాక్యనిర్మాణం, నుడికారం చెడిపోకుండా చట్టాలు తెలుగులో రాసే ప్రయత్నం 19వ శతాబ్దిలోనే జరిగింది. బొడ్డువల్లి సుబ్బారావు, రావినూతల రామయ్యగార్లు రాసిన తెలుగు చట్టముల యొక్క కోశము 'చెన్నపట్నం వర్తమాన తరంగిణి అచ్చుశాల'లో 1846 సంవత్సరంలో ''రెండవసారి అచ్చు వేయించబడి ప్రమరం చేయబడ్డది''. అందులో ఒక చిన్న భాగం ఉదహరిస్తున్నాను.

''క్రీస్తు పుట్టిన 1816 సంవత్సరవు నాలుగో చట్టము:

గ్రామములలో పెద్దకాపులుగా వుండేవారు వారి వారి గ్రామములలో మునిసీవులుగా వుండి నిష్కర్ష చేయబడివుండే వద్దు కలిగిన రూకలను గురించి గాని, యితరమయినటువంటి జంగమరూపమయిన ఆస్తిని గురించి గాని, వేయబడే సివిలు వ్యాజ్యములను విని తీర్చేటట్టు నిర్ణయించ గలందులకున్ను, వారికి కలిగిన అధికారానికి హద్దులు ఏర్పరచ గలందులకున్ను 1816 సంవత్సరవు మే నెల 17 తేదిని చెన్నపట్నపు కోటలో ఆలోచనలో నుండే రయిటు ఆనరేబిలు గవర్నరువారు నిర్ణయించిన చట్టము''....

''రెండోది: ఈ ప్రకరణము యొక్క మొదటి సంగతిలో వివరించబడి వుండేటటువంటి వ్యాజ్యములలోనూ వ్యాజ్యము వేసేటందుకు మునుపు పన్నెండు సంవత్సరములకులోగా వ్యాజ్యము పుట్టి వున్న పక్షమందు నున్ను, వ్యాజ్యము వేసివున్న రూకలను అయినా, ద్రవ్యాన్ని అయినా తాను తగాదా వేసి వుండి అది న్యాయమేనని ప్రతివాది ఒప్పుకొన్నట్టు... వాది అగుపరిచిన పక్షమందు నున్ను... ఇటువంటి పక్షములలోనేగాని మునిసీవులు వ్యాజ్యములను పట్టగూడదు....''

''గ్రామ మునిసీవులు, దేహోపద్రవము చేసినందుచేతగాని, మానహాని చేసినందుచేతగాని, సంభవించిన యేవిధమయిన నష్టమును గురించి అయినా గాని వ్యాజ్యములను పట్టి విచారించగూడదు....''

''36 మొదలు 38 వరకు 1821 సంవత్సరం 9వ చట్టము 2 ప్రకరణం వల్ల రద్దు అయినవి...'' (పుటలు 13-15).

పైముసాయిదా 120 ఏళ్ళకు ముందు రాసింది. అప్పుడు న్యాయవ్యవహారంలో

మాటల్లో చొప్పించాలనుకోటం వ్యర్థప్రయత్నం అవుతుంది. వాడుకలో మాటలు పుట్టాలి గాని మాటల కోసం వాడుక పుట్టదు. న్యాయశాస్త్రవిషయాలను తెలుగువారు ప్రసంగాల్లోను వాదోపవాదాల్లోను ఆంగ్లభాషాశబ్దాలను ధారాళంగా కలిపి అయినా తెలుగుద్వారా మాట్లాడే వాడుక ముందు ఏర్పడాలి. అధికారభాషగా తెలుగును ప్రవేశపెట్టీపెట్టక ముందే బిల్లులూ, చట్టాలూ ఇంగ్లీషులో ఉన్న న్యాయశాస్త్రపద్ధతి ప్రకారం ప్రమాణీకరించి ప్రయోగించాలన్న ప్రయత్నం భాష పెరుగుదల పరిమితికి అసహజమైనదేమో అనిపిస్తుంది. ఒక కొత్త విజ్ఞానాన్ని తెలుగు వాక్యాల్లో ప్రసంగించటానికి, అవిజ్ఞానసంబంధమైన అన్యదేశ్యాలను అనువదించటానికి కార్యకారణసంబంధమేమీ లేదు.

## రూఢి ఏర్పడాలి

మొట్టమొదట న్యాయశాస్త్రకుశలత అవసరం లేని ప్రభుత్వకార్యకలాపా లన్నిట్లోనూ తెలుగును ప్రవేశపెట్టి విస్తృతంగా వాడుకోవచ్చు. న్యాయవిచారణ విషయంలో వాగ్రూపంగా తెలుగును, లిఖితరూపంగా ఇంగ్లీషును అయిదారేళ్ళు పాటైనా వాడాలి. భాష వ్యవహర్తల సామూహికప్రయత్నంవల్ల వృద్ధిపొందు తుంది గాని, మాటలు సృష్టించే కమిటీలవల్ల గాదు. అవిధంగా ఆధునికన్యాయ విజ్ఞానం వాడుకలో నలిగిన తరవాత న్యాయశాస్త్రగ్రంథాలు, చట్టాలు తెలుగులో స్వతంత్రంగా రాయించాలి. తాలూకా, జిల్లా కోర్టుల స్థాయిలో న్యాయ విచారణలో తెలుగును యథేచ్ఛగా వాడవచ్చునని నియమించవచ్చు. ఉన్నత న్యాయస్థానంలోనూ – న్యాయమూర్తుల తీర్పుల్లో తప్ప – ఇతర వ్యవహారాలకు రాష్ట్రంలోని అధికారభాష వాడటానికి 'కాన్స్టిట్యూషన్' లో ఏర్పాటున్నది (పేజీ 10). వాడుకలో నలిగితేగాని మాటలకు రూఢి ఏర్పడదు. రూఢి సిద్ధిస్తేనేగాని ప్రమాణీకరించటం సాధ్యం కాదు. కొన్ని శతాబ్దులపాటు ప్రయోగవశాత్తు ఆంగ్లంలో ఏర్పడ్డ సాంకేతిక పదాలన్నిటినీ పెద్దపెట్టున వేలకువేలు 'అనువాదాలు' చేసి తెలుగు నెత్తిన రుద్దబట్టే– ఇటు తెలుగు పండితులకూ, అటు ఇంగ్లీషులో ఆ శాస్త్రం చదువుకున్నవాళ్ళకూ గూడా దురవగాహమైన ముసాయిదాలు తయా రవుతున్నాయి. 1964 గ్రామ పంచాయతీల చట్టం, రెవిన్యూ రికవరీ చట్టాల భాష ఈఅవ్యవస్థకు ప్రత్యక్ష నిదర్శనాలు. వీటిని మళ్ళీ ఇంగ్లీషు మాటల్లోకి తర్జుమా చేసుకొని అర్థంచేసుకోవాల్సి వస్తే తెలుగును అధికారభాషగా వాడుకోటంలో ఉన్న లక్ష్యం ఎలా సిద్ధించినట్టు?

## పూర్వపు ముసాయిదాలు

వాడుకకు భిన్నంగాకుండా తెలుగు వాక్యనిర్మాణం, నుడికారం చెడిపోకుండా చట్టాలు తెలుగులో రాసే ప్రయత్నం 19వ శతాబ్దిలోనే జరిగింది. బొడ్డుపల్లి సుబ్బారావు, రావినూతల రామయ్యగార్లు రాసిన తెలుగు చట్టముల యొక్క కోశము 'చెన్నపట్నం వర్తమాన తరంగిణి అచ్చుశాల'లో 1846 సంవత్సరంలో ''రెండవసారి అచ్చు వేయించబడి ప్రచురం చేయబడ్డది''. అందులో ఒక చిన్న భాగం ఉదహరిస్తున్నాను.

''క్రీస్తు పుట్టిన 1816 సంవత్సరపు నాలుగో చట్టము:

గ్రామములలో పెద్దకాపులుగా వుండేవారు వారి వారి గ్రామములలో మునిసీపులుగా వుండి నిష్కర్ష చేయబడివుండే వద్దు కలిగిన రూకలను గురించి గాని, యితరమయినటువంటి జంగమరూపమయిన ఆస్తిని గురించి గాని, వేయబడే సివిలు వ్యాజ్యములను విని తీర్చేటట్టు నిర్ణయించ గలందులకున్ను, వారికి కలిగిన అధికారానికి హద్దులు ఏర్పరచ గలందులకున్ను 1816 సంవత్సరపు మే నెల 17 తేదిని చెన్నపట్నపు కోటలో ఆలోచనలో నుండే రయిటు ఆనరేబిలు గవర్నరువారు నిర్ణయించిన చట్టము''....

''రెండోది: ఈ ప్రకరణము యొక్క మొదటి సంగతిలో వివరించబడి వుండేటటువంటి వ్యాజ్యములలోనూ వ్యాజ్యము వేసేటందుకు మునువు పన్నెండు సంవత్సరములకులోగా వ్యాజ్యము పుట్టి వున్న పక్షమందు నున్ను, వ్యాజ్యము వేసివున్న రూకలను అయినా, ద్రవ్యాన్ని అయినా తాను తగాదా వేసి వుండి అది న్యాయమేనని ప్రతివాది ఒప్పుకొన్నట్టు... వాది అగుపరిచిన పక్షమందు నున్ను... ఇటువంటి పక్షములలోనేగాని మునిసీపులు వ్యాజ్యములను పట్టగూడదు....''

''గ్రామ మునిసీపులు, దేహోపద్రవము చేసినందుచేతగాని, మానహాని చేసినందుచేతగాని, సంభవించిన యేవిధమయిన నష్టమును గురించి అయినా గాని వ్యాజ్యములను పట్టి విచారించగూడదు....''

''36 మొదలు 38 వరకు 1821 సంవత్సరం 9వ చట్టము 2 ప్రకరణం వల్ల రద్దు అయినవి...'' (పుటలు 13-15).

పైముసాయిదా 120 ఏళ్ళకు ముందు రాసింది. అప్పుడు న్యాయవ్యవహారంలో

ఉన్న వాడుకకు దీన్ని ప్రతిబింబంగా తీసుకోవచ్చు. నూతనానువాదాలు కల్పించకుండా ఆంగ్లపదాలను మిగిలిన అన్యదేశ్యాలను యథాతథంగా ఉంచటం వల్ల రచన స్వాభావికంగా సుగమంగా ఉంది. వ్యావహారికభాషారచన సుప్రతిష్ఠితమైన ఈరోజుల్లో దీన్ని మరింత సుకరంగా, స్పష్టంగా రాయవచ్చు. తెలుగు వాడుకతో సమన్వయించకుండా అనువదించిన అధికారపాఠాలు ఒకవైపు ఇంగ్లీషులో ఉన్న మూలపాఠాలకూ, రెండోవైపు హిందీలో రాబోయే అనువాద పాఠాలకూ సమన్వయించాలన్న ప్రయత్నంవల్ల ప్రభుత్వంవారి ఉద్దేశాలలో లక్ష్యశుద్ధి ఉన్నా, లక్ష్యసిద్ధి ఉండదేమో అనిపిస్తుంది.

### తెలుగులో పరిభాష

ఇక శ్వేతపత్రం మూడో అధ్యాయంలో భాషకూ, పరిభాషకూ ఉన్న పరస్పరసంబంధాన్ని గురించిన విస్తృతమైన శాస్త్రచర్చ జరిగింది (పుటలు 18-29). ఆంగ్లంలో పారిభాషికపదాలేర్పడ్డ తీరును భాషాశాస్త్ర గ్రంథాల నుంచి ఆధారాలతో ప్రదర్శించారు. కాని ఒక్క విషయం చెప్పలేదు: ఈ ప్రక్రియలు కొన్ని శతాబ్దులుగా ప్రవర్తించటం వల్ల ఆంగ్లంలో పరిభాష ఏర్పడ్డదనీ, ఇంకొకటి- ఆప్రక్రియలన్నీ తెలుగు నైజానికి సరిపడతాయా? అనీ. అవి తెలుగులో ప్రవర్తింపచేసి కొన్ని మాటలు లక్ష్యాలుగా ఇస్తే బాగుండేది.

ఇదివరకే వాడుకలో ఉన్న పదాలకు సందర్భాన్ని బట్టి కొత్త అర్థాలను నిరూపించుకోటం, అవసరమైన చోట ఇంగ్లీషు నుంచి గాని ఉర్దూ సంస్కృతాల నుంచి గాని తెలుగు వాడుకకు భిన్నం గాని విధంగా అన్యదేశ్యాలను ఎరువు తెచ్చుకోటం, ఉన్న తెలుగు మాటల పొందికతో కొత్త పదబంధాలు సృష్టించుకోటం మనం తెలుగులో పరిభాష కల్పించుకోటానికి కొన్ని ముఖ్యమైన మార్గాలు. తెలుగులో రూఢంగా ఉన్న పదాలను—దేశ్యాలయినా అన్యదేశ్యాలయినా—తోసివేసి 'ప్రశాసన్ శబ్దావలీ' నించి వింత పదాలను తెచ్చి పెట్టుకోటం తెలుగు భాష పెరుగుదలకు దోహదంకాదు. ఈ సంగతి శ్వేతపత్రం 49వ పుటలో స్పష్టంగా ఉన్నది. అనువాదసంఘం, అధికారభాషా (వైధానిక) సంఘం ఈ రెండింటి సమన్వయకృషి ఫలితంగా కేంద్ర, రాజ్య చట్టాలు రెంటిలోనూ అవే సూత్రాలు ఒకే రీతిగా అనుసరించబడుతున్నాయి.

నాలుగో అధ్యాయంలో అధికారభాషగా తెలుగు పూర్వచరిత్రను గురించిన వివరాలు ఇచ్చారు. ఆధునిక ప్రయోజనాలకు, చట్టాల ముసాయిదా రచనకు

తగినంత రచనాసామాగ్రి ఇదివరకెప్పుడూ వెలువడలేదని పేర్కొన్నారు. కాని ఇంతవరకు గ్రామం, తాలూకా, జిల్లాల స్థాయిలో తెలుగులో జరుగుతున్న పరిపాలనా వ్యవహారాన్ని పరిశీలించి వాడుకలో పాతుకొన్న పారిభాషిక పదాలను సేకరించి కోశస్థం చెయ్యటం అవసరం. ఇలాంటి వెన్నో మెకంజీ సేకరించిన కైఫీయత్తుల్లోను, బ్రౌణ్యమిశ్రనిఘంటువులోను గూడా ఉన్నాయి. వాటిని అధికారిక పారాల్లో ఎందుకు వాడగూడదు?

అనువాద సూత్రాలు

అయిదో అధ్యాయంలో అనువాదసూత్రాలనుగురించిన శాస్త్రచర్చ, తదనుగుణంగా చేసిన కొన్ని మాటల అనువాదాలు ఉన్నాయి (పేజీలు 44-58). ఈసూత్రాలు సుప్రసిద్ధగ్రంథాలనుంచి ఉదాహరించినవి. వాటి విషయంలో విప్రతిపత్తి లేదు. కాని ఒక ప్రధానమైన అనువాదసూత్రం వీటిల్లో లేదు. ఆసూత్రం ఇది: 'ఏ' (ఇంగ్లీషు) అనే భాషలోనుంచి 'బి' (తెలుగు)' అనే భాషలోకి ఒక విషయం అనువాదం చేసేటప్పుడు 'బి' (తెలుగు)లో అప్పటికి ప్రసిద్ధంగా ఉన్న సమానార్థక పదాలను, పదబంధాలను వాడాలేగాని, ఎ. బి లకు భిన్నమైన 'సి' (హిందీ, సంస్కృతం)లో ఉన్న (లేక సృష్టించిన) సమానార్థక రూపాలను తీసుకోగూడదు. బి (తెలుగు)లో సమానార్థక రూపాలు లేనప్పుడు, ఏభాషనుంచి అనువదిస్తున్నామో (ఏ), దాన్నుంచే పారిభాషిక పదాలు స్వీకరించవచ్చు. ఈ సూత్రం ప్రపంచంలో అనువాదాలు సక్రమంగా జరిగిన ప్రతిభాషకు ప్రవర్తిస్తుంది. సంస్కృత కావ్యాలు తెలుగులోకి అనువదించిన తెలుగు కవులు సంస్కృతాంధ్రశబ్దాలను తప్పించి కన్నడం తమిళం నుంచి తెచ్చిన మాటలు వాడలేదు. ఫ్రెంచివాళ్ళు ఇంగ్లీషు పుస్తకం అనువాదం చేసేటప్పుడు ఈరెండు భాషలకు భిన్నమైన రష్యన్ శబ్దాలు వాడరు. తెలుగులోకి ఇంగ్లీషునుంచి ఒక శాస్త్రం అనువాదం చేసే టప్పుడు, తెలుగులో ప్రసిద్ధంగా ఉన్న పదాలు, పదబంధాలు (అవి ఏభాషనుంచి వచ్చినవైనా) వాటిని అవసరమైతే ఎరువుగా తెచ్చుకొన్న ఇంగ్లీషు మాటలు (అక్కణ్ణుంచి అనువాదం చేస్తున్నాం కాబట్టి) ధారాళంగా వాడినప్పుడు ఆఅనువాదంవల్ల మన భాషాసౌష్ఠవం పెరుగుతుంది కాని తగ్గదు. సంస్కృతంనుంచి దీర్ఘసంస్కృతసమాసాలు మన కవులు వాడినా తెలుగు నిర్మాణం ఏం చెడిపోయింది? కాలాంతరంలో వాడుక పెరిగినకొద్దీ

ఎరువు తెచ్చుకొన్న ఆంగ్లపదాల స్థానే తెలుగు మాటలు ఏర్పడవచ్చు. ఈ స్వాభావిక భాషాపరిణామం, పెద్ద పెట్టున పారిభాషిక పదాల అనువాదంవల్ల కొంతవరకు దెబ్బతింటుంది.

కృత్రిమ అర్థాలు

శ్వేతపత్రం అయిదో అధ్యాయంలో ఇచ్చిన కొన్ని పదాల అనువాదాలు చూడండి: vehicle = వాహనము, carriage = బండి, car = శకటము, cab = వాహిక, carrier = వాహకం, trailer = వాహనం (పేజీ 52). కారు, అద్దెకారు అని రూఢంగా ఉన్న మాటలకు బదులు 'శకటం, వాహిక' అని ఎందుకు వాడుకోవాలి? అలానే ప్రఖ్యానం, ప్రఖ్యాపనం, అధిప్రఖ్యానం, కథనం– అనే మాటలు సృష్టించి, కృత్రిమఅర్థాలు కల్పించి ఇంగ్లీషు మాటలకు సమానార్థకాలు కావాలని, వాటిని అనువాదగ్రంథాల్లో ప్రయోగిస్తే మళ్ళీ ఇంగ్లీషు చదివితే గాని అవి అర్థంకావు గదా! ఇక్కడ అనువాదవిధానానికి చెందిన మరో సూత్రం చెప్పాలి.

భాషాభేదాలు

ఒక భాషలో ఉన్న పదాలను, వాటి అర్థభేదాలను మరో భాషలోకి యథాతథంగా తీసుకురావటం అసాధ్యం. తెలుగులో ఉన్న వాడు – వీడు, అతను – ఇతను, ఆయన – ఈయన, వారు – వీరు అనే ఎనిమిది మాటలను సమానార్థకంగా ఇంగ్లీషులో చెప్పాలంటే ఒక్క 'హి' అనే మాటతోనే చెప్పుకోవాలి. మన సర్వనామాల్లో వక్తృశ్రోతల మధ్య ఉన్న పరస్పర సాంఘిక సంబంధం కూడా గతార్థమై ఉంది. మరి ఈవిధానం ఆంగ్లంలోని సర్వనామపద నిర్మాణంలో లేదు. ఈభేదం తెచ్చి ఇంగ్లీషులో పెడదామని కృతకంగా మాటలు సృష్టిస్తే విడ్డూరంగా ఉండటమే గాక, అవి వ్యవహారంలో ఇమడవు కూడా. కాని తెలుగును గురించి ఇంగ్లీషులో మాట్లాడేటప్పుడు ఈ తేడాలను వివరణాత్మకంగా చెప్పుకోవచ్చు. అలానే, తెలుగులో నేలమీద నడిచేవి 'బండ్లు', నీళ్లమీద నడిచేవి 'ఓడలు'. కాలక్రమాన 'బండి' అనే మాట అర్థం విస్తృతమై 'రైలుబండి, ట్రాం బండి, ఎద్దుబండి, గుర్రబ్బండి'– అనే కొత్తమాటలు వాడుకలో ఏర్పడ్డాయి. కారు, సైకిలు, మొదలైన వాటిని గురించి మాట్లాడేటప్పుడు గూడా 'బండి' అని వాడటం కద్దు. ఈవిధంగా విస్తృతార్థంలో రూఢమైన 'బండి' అర్థాన్ని carriage

పదానికి పరిమితం చేసి 'శకటం, వాహనం, వాహిక, అనువాహనం', మొదలైన వింతమాటలను 'ప్రశాసన్ శబ్దావలీ' నుంచి ఎందుకు దిగుమతి చేసుకోవాలి? Trailerను 'ట్రెయిలర్' అంటే వచ్చిన చిక్కేమిటో! ఈసూత్రాన్ని అనువాద సంఘంవారు గుర్తుంచుకోవాలి.

'శ్వేతపత్రం' ఆరో అధ్యాయంలో కొన్ని విమర్శల పరిశీలన జరిగింది. ఈ విమర్శలు 1967 ఆంధ్రప్రదేశ్ లాండ్ రెవిన్యూ (హెచ్చింపు) చట్టం 7(2) సెక్షను బట్టి జారీ చేసిన 'తెలుగు' నోటీసులో వాడిన భాషను గురించి వచ్చాయి. దాని ఇంగ్లీషు నమూనానే 'శ్వేతపత్రం'లో ఇచ్చారు. పూర్తి తెలుగు అనువాదం ఎలా ఉందో కూడా ఇస్తే బాగుండేది. ఇందులో వాడిన కొన్ని పారిభాషిక పదాలను సమర్థించటానికి సుదీర్ఘమైన మీమాంస చేశారు. Revenue, act, section, individual notice, jointly, held by (you), provisions, determined, schedule, specified, person interested, become final, competent authority అనే పదమూడు మాటలకు వరసగా అధికారిక అనువాదాలు: రాజస్వము, అధినియమము, పరిచ్ఛేదము, వైయక్తిక నోటీసు, సంయుక్తంగా, నీచే ధృతమైన, ఉపబంధములు, అవధారితము, అనుసూచి, నిర్దిష్ట, హితము కలిగియున్న వ్యక్తి, అంతిమము, ప్రాధికారము – అని చేశారు. తెలుగులో రూఢంగా అనువైన మాటలు దొరక్కపోవటం వల్లనే దీర్ఘాలోచన చేసిన మీదట పై మాటల ఎంపిక న్యాయశాస్త్రదృష్ట్యా గూడా ప్రమాణమైనదని ఊహించి తీసుకొన్నామని చెప్పారు. కాని రాజస్వం, అధినియమం, ఉపబంధము, అవధారితం, అనుసూచి, ప్రాధికారం 'ప్రశాసన్ శబ్దావలీ'లో ఉన్న మాటలకు చివర తెలుగు ప్రత్యయాలు చేర్చి తెచ్చుకొన్నవి. వీటికి ప్రయోగదృష్ట్యా ఔచిత్యం ఉన్నదని చేసినవాదన అట్టే పుష్టిగా, సమంజసంగా లేదు. మాటల అర్థాలకు స్పష్టత, రూఢి నూటికి 99 పాళ్ళు సందర్భాన్ని బట్టి వస్తుంది; సందర్భవిరహితంగా ఆమాట కంటే ఈమాట న్యాయశాస్త్రంలో మంచిదని చేసే వాదాన్ని భాషాశాస్త్రం ఒప్పుకోదు. శబ్దార్థాల మధ్య సాంకేతిక సంబంధమే గాని స్వాభావికసంబంధమేమీ లేదు. అదేదో ఉన్నట్టు శ్వేతపత్రం చెబుతున్నది. 'రాజస్వం' బదులు 'ప్రభుత్వపు రాబడి' అంటే ఏం చిక్కు? అసలు 'రెవిన్యూ' పదం జానపదులకు గూడా అర్థమవుతున్నది గదా! దాన్నే ఎందుకు ఉండనివ్వగూడదు? 'లా', అక్టు' అనే మాటలకు తెలంగాణాలో

'కానూన్' అనీ, మిగిలిన ప్రాంతంలో 'చట్టం' అనీ వాడుకలో ప్రాంతీయభేదం ఉంది. కాబట్టి రెండు ప్రాంతాలలోనూ వాడుకలోలేని 'అధినియమము' అనే కొత్త మాటను తెచ్చిపెట్టటంలో ఏశాస్త్రీయసూత్రం ఇమిడిఉందో తెలియదు. 'చట్టం' ప్రమాణీకరిస్తే ఈఅర్థవిశేషం ఒక్క తెలంగాణా వ్యవహర్తలే కొత్తగా తెలుసుకోవలసి వస్తుంది. ఇప్పుడు వాళ్ళూ వీళ్ళూ గూడా ఒక కొత్తమాట నేర్చుకొని దానికి వాడుక కల్పించటం సులభమార్గమా? ఇదివరకు ఇలాటి వాదమే ఎవరో చేస్తే కీ.శే. గిడుగు రామ్మూర్తి పంతులుగారిలా అన్నారు: 'ఒకప్రాంతంలో 'సొరకాయ' అంటారు. మరొక ప్రాంతంలో 'ఆనపకాయ' అంటారు. ఈ రెండూ కాదని 'అలాబూ' (ఇది సంస్కృత పదం) అంటే ఆ పదం ప్రామాణికమవుతుందా?' అని. Provisionsకు 'ఏర్పాట్లు' అనవచ్చు, కాని 'ఉపబంధం' కంటే ఇది తొందరగా తెలుగువాళ్ళకు అర్థంకావటమే దాని లోపం. Jointlyకి 'ఉమ్మడిగా', 'పొత్తుగా' అని రూఢాలు. 'నీచే ధృతమైన' బదులు ' నీ అధీనంలో ఉన్న', 'నీ సొత్తైన' అంటే ఏం? Landholderకు 'భూధారి' అనే పదం రూఢమైన తెలుగు వాడుకకు దూరంగా ఉన్నది. గదాధారి, చక్రధారి అని పురాణ కథల్లో వినిపించే సమాసాల్లో రూఢమైన 'ధారి' అనే కృద్రూపాన్ని అప్రసిద్ధసమాసంలో వాడటం అనువాద సంఘం ఏర్పరుచుకొన్న సూత్రాలకే విరుద్ధం కదా! 'Determined'కు ఇంగ్లీషు అర్థచ్ఛాయ ఎలా ఉన్నా 'నిర్ణయించిన' కంటే 'అవధారితం' అనటంలో ఉన్న నైశిత్యం ఏమిటో తెలియటం లేదు. 'అధికారం' చలాయిస్తున్నాడనే వాడుకలో authorityకి సమానార్థంగా అది ఉంది. రెండు మూడర్థాల్లో 'అధికారి, అధికారం' అని మనం వాడుతున్నాం. సందర్భాన్ని బట్టి ఏఅర్థం ఎక్కడ వర్తిస్తుందో తెలుగు వాళ్ళకు తెలుసు. దీన్ని తోసిపుచ్చి 'ప్రశాసన శబ్దావళీ' వారి 'ప్రాధికారం' దిగుమతి చేసుకోవలసిన అవసరమేమిటి? 'శ్వేతపత్రం' లో చేసిన శబ్దార్థసంబంధ వాదాన్ని భాషాస్వభావం తెలిసిన శాస్త్రజ్ఞులెవ్వరూ ఆమోదించరు. Authority అనే పదానికి author అనేదానికి వ్యుత్పత్తిలో సంబంధం ఉంది కాబట్టి authorను 'ప్రాధికారి' అనాలి అంటే ఎంత సమంజసంగా ఉంటుందో ఆలోచించండి.

### ఎవరికోసం అనువాదాలు?

ఈఅనువాదాలు ఎవరికోసం చేస్తున్నారో అవి కాలక్రమాన ఎలా పదిమంది నోళ్ళల్లో నలిగి మామూలు తెలుగులో కలిసిపోతాయో – ఆవిషయాలనుగూర్చి

ఆరో అధ్యాయం చివరిభాగంలో ఆవేశపూరితమైన వాదన ఉంది. దాని పర్యవసానం ఏమిటంటే న్యాయశాస్త్రపరిజ్ఞానం ఏమాత్రమూ లేని 'సామాన్యమానవుడికి' ఇవి అర్థం కావు; న్యాయశాస్త్రపండితుడైనవాడికి గూడా వెంటనే అర్థంకావు. ఎందుకంటే అలాటి వ్యక్తి న్యాయశాస్త్రాన్ని ఇంగ్లీషులో చదివాడు కాబట్టి. ఇక భాష వీటివల్ల హఠాత్తుగా వృద్ధిపొందుతుందా? అంటే–అదీ జరగదు. భాష నియతపద్ధతుల్లో సాంఘికవ్యవస్థలో వచ్చిన మార్పులను వ్యవహారసాంద్రతనుబట్టి నియతవేగంతోనే వృద్ధిపొందుతుంది గాని, ఈరకమైన అనువాదప్రక్రియలవల్ల గాదు. అసలు మంచి అనువాదానికి పరీక్ష ఏమిటంటే–ఎవరు ఆఅనువాదాలను తమ వృత్తిలోగాని వ్యవహారాల్లో గాని వాడుకోవాలో, వాళ్ళకు కోశాలు, ఇతరభాషాగ్రంథాలు పరిశీలించే అవసరం లేకుండా అవి అర్థంకావాలి. ఈపరీక్షకు నెగ్గని అనువాదం ఏ సూత్రాలనుబట్టి చేసినదయినా ప్రయోజనరహితం అవుతుంది. ఇంగ్లీషునుంచి తెలుగులోకి చేసిన అనువాదం ఈరెండు భాషలు తెలిసినవాళ్ళకు కొస్త ఎక్కువగాను, ఒక్క తెలుగు మాత్రమే తెలిసినవాళ్ళకు కొస్త తక్కువగాను మూలంలో కంటే బాగా అర్థంఅయితేనే దాని ప్రయోజనం సిద్ధిస్తుంది గాని, ఈరెండూ తెలిసినవాళ్ళకు గూడా దుర్గ్రాహమైతే ఆఅనువాదం సాధించిం దేమిటి? న్యాయశాస్త్రగ్రంథాలు సామాన్యప్రజలకు అర్థంకాకపోతే పోవచ్చు గాని, పన్ను కట్టమని ఇచ్చిన నోటీసు కూడా అర్థంకాకపోతే తెలుగు అధికారిక భాషగా ఏలక్ష్యం సాధించినట్టు?

## సంస్కృత సమాసాలు

సంస్కృతభాషాపదాలు ప్రతిభారతదేశభాషలోనూ ఉన్నాయి. ఇవి సంస్కృతపాండిత్యం సంపాదించిన ఆయా భాషాపండితుల వ్యవహారం వల్లా, రచనల వల్లా, దేశభాషల్లో చేరాయి. కొన్ని శతాబ్దాలుగా జరిగిన ఈసాహిత్య సాంస్కృతికవినిమయం వల్ల దేశభాషల్లో సాహిత్యసౌష్ఠవమే గాక, తన్మూలంగా భాషాసౌష్ఠవం కూడా సిద్ధించింది. అప్పటికీ తెలుగు వాడుకలో నిల్చిన సంస్కృత పదాల్లో కావ్యాల్లో వినిపించే దీర్ఘసమాసాలుండవు; రెండుమాటలతో చేసిన సిద్ధసమాసాలే జనవ్యవహారంలో నిలిచాయి. 'దేవాలయం, రామాయణం' లాంటివి. అందులోను మహాప్రాణాక్షరాలున్న (అంటే ఖ, ఛ, ఠ, థ, ఫ, ఘ, మొదలైనవి) మాటలు విద్యావంతులు ఉపన్యాసవేదికల మీద చేసే భాష

తీసుకొన్నా పది ఇరవైకన్నా లేవు (సందేహించేవాళ్ళు లెక్కపెట్టుకు చూడండి!). విద్యావంతులు కాని జానపదుల వ్యవహారంలో ఈమాటల ఉచ్చారణలో ఒత్తులుండవు. హిందీ, మరాఠీ, మొదలైన ఆర్యభాషల్లో ఈచిక్కు లేదు. మరి అనువాదసంఘంవారు కల్పించిన నూతనసంస్కృతపదజాలంలో అంతా ఉపబంధం, అవధారిత, ప్రాధికారి, మొదలైనవి కొన్ని వందలూ వేలూ ఇటువంటివే ఉన్నాయి. అవి వాడుకలో మన భాషలో ఎలా ఇముడుతాయి అన్నది ఆలోచించదగ్గ విషయం. మన భాషోచ్చారణవ్యవస్థలో ఇవి ఉత్తరార్య భాషావ్యవహర్తల ఉచ్చారణలో సరిపడ్డంత తేలిగ్గా సరిపడవు. ఈసంగతి 'శ్వేతపత్రం' నిరూపించిన సూత్రాల్లో ఎక్కడా కనిపించదు.

ఎందుకు 'ఏకరూపత'?

న్యాయశాస్త్ర పరిభాషలో దేశభాషలన్నిటిలోనూ ఏకరూపత సాధించాలనే సదుద్దేశంతో కేంద్రపారిభాషికసంఘంవారు సృష్టించిన పదాలను చాలావరకు తీసుకొన్నట్టు ఈఅధ్యాయం చివరిభాగంలో ఉన్నది. ఇది రాజకీయవేత్తల దృష్ట్యా ఉదాత్తమైన లక్ష్యమైనా, అనువాదప్రయోజనం దృష్ట్యా ఆచరణసాధ్యమైనది కాదు. అనువాదప్రయోజనం సిద్ధించిన తరువాత కాకతాళీయంగాకొన్ని సమాసశబ్దాలు భిన్నభాషల్లో సమానార్థంలో నిలిచినవి కనిపించవచ్చుగాని— 'ఏకరూపత' ప్రధానమై, అనువాదప్రణాళిక అంతా అలక్ష్యసాధనకోసం ఉద్దేశించింది కావటం వల్లనే ప్రభుత్వానువాదాలను గురించి ఇన్ని విమర్శలు వచ్చాయి. అనువాదాలకు వాడుకలో ప్రాచుర్యం రాకపోతే పరిభాషలో 'ఏకరూపత' ఎందుకు సాధించినట్టు? అసలు కిటుకంతా ఇక్కడే ఉంది. నిజంగా 'ఏకరూపత' సాధించాలంటే మిగిలిన రంగాల్లో మనం ఎందుకు సాధించలేకపోయాం? దేశంలో ఇన్ని భాషలున్నాయి! ఇన్ని ఆచార వ్యవహారాలున్నాయి! ఒక రాష్ట్రంలోవారు తినే తిండి, కట్టే కట్టు మరో రాష్ట్రంలో లేదు గదా! మరి న్యాయశాస్త్రపరిభాషలోనే 'ఏకరూపత' ఎందుకుండాలి? న్యాయనిర్ణయ విధానం దేశమంతటికి ఒకటి అయినా, దాని ఆచరణ, పరిభాషలోని ఏకరూపత వల్లనే సాధ్యమవుతుందనుకోటం భ్రాంతి. ద్విభాషాకోశాలు, బహుభాషాకోశాలు తెలుగులో వాడే పారిభాషిక పదాలకు సమానంగా హిందీలోనూ ఇతర భాషల్లోనూ వాళ్ళు ఏశబ్దాలు వాడుకుంటారో నిరూపిస్తాయి. ఈపద్ధతి వల్ల న్యాయనిర్ణయ విధానంలో సమైక్యం కొంత కాలానికన్నా సాధ్యమవుతుంది.

## అనువాద సూత్రాలు

భాషానిర్మాణానికి అనువాదప్రక్రియకు మధ్య ఉన్న సంబంధాన్ని ప్రదర్శించే ఒకటి రెండు కొత్త సూత్రాలు ఇక్కడ చెప్పటం అవసరం. ఒక భాష ఇంకో భాష నుంచి ఎన్ని మాటలైనా ఎరువు తెచ్చుకోవచ్చు, సంఖ్య అంత ప్రధానమైంది కాదు. దానివల్ల ఎరువు తెచ్చుకొన్న భాష నైజం గాని, స్వరూపం గాని మారదు, సరిగదా సౌష్ఠవం చేకూర్చుకొంటుంది. కొత్త భావాలకు ఒక భాషలో పదాలు లేకపోతే ఆభావాలతోపాటు పదాలు కూడా అదే భాష నుంచి ఎరువు తెచ్చుకోటం అన్ని భాషల్లోనూ ఉన్న పద్ధతే. కాని ఏరకమైన మాటలు ఎంతవరకు భాషలో ఇముడుతాయో నిర్ణయించే మెలకువలు కొన్ని ప్రతిభాషకు విలక్షణంగా ఉంటాయి.

ప్రతి భాషానిర్మాణంలోనూ మూడు ప్రధానాంగాలుంటాయి: ఉచ్చారణ, వ్యాకరణం (పదవాక్యసంయోజనపద్ధతి), పదజాలం. పదాల్లో నామాలు, విశేషణాలు, క్రియలు, అవ్యయాలు మొదలైన భాషాభాగాలు ఉంటాయి. ఇది పదవాక్యసంయోజనలో భిన్న పదాలకున్న ప్రవృత్తిభేదాన్ని బట్టి చేసిన విభాగం. అన్యభాషా సంపర్కం కలిగినప్పుడు ఎరువు తెచ్చుకొనే మాటలు ఎక్కువగా కొన్ని భాషాభాగాలకు చెందినవిగా ఉంటాయి గాని, అన్నిటికి చెందినవిగా ఉండవు. తెలుగు విషయంలో సంస్కృతం, ఇంగ్లీషు, ఉర్దూ భాషల నుంచి అసంఖ్యాకంగా వచ్చి కలిసిన శబ్దాలు, నామవాచకం అనే భాషాభాగంలో చేరినవే. సంస్కృతం, హిందూస్తానీల నుంచి –ఇంచు చేరిన క్రియలు తక్కువభాగం–సంతోషించు, కేటాయించు లాటివి–తెలుగులో చేరాయి. ఇంగ్లీషు నుంచి తెలుగులో చేరి ప్రసిద్ధంగా నిలిచిపోయిన క్రియలు మరీ తక్కువ–ఫైలుచేయటం, ఫైలుకావటం–లాటివి. అంటే విశేషణాలు, క్రియలు అవ్యయాలు అనే భాషా భాగాలకు తెలుగులో అన్యదేశ్యాలను ఇముడ్చుకొనే శక్తి నామవాచకాల కంటే తక్కువ ఉన్నది అని గ్రహించాలి. ఈ భాషాభాగాల్లో బలవంతంగా అన్య దేశ్యాలు దిగుమతి చేస్తే భాషాస్వభావం సహించదు. అలా తెచ్చినవి భాషలో అతకవు. నిలవవు కూడా. ఇక్కడ మరో రహస్యం కూడా ఉంది. అన్యదేశ్యాలను సహించని భాషాభాగాల్లో ఉన్న దేశ్యశబ్దాల అర్థాలకు అవసరాన్ని బట్టి సంకోచవ్యాకోచాలు పొందే శక్తి ఎక్కువగా ఉంటుంది. అంటే తెలుగులో క్రియలు, విశేషణాలు, అవ్యయాలు ఇటువంటివి. వాడుకలో అవసరమైతే ఒక

క్రియాపదానికే అనేకార్థాలు ఏర్పడతాయి. అన్యదేశ్యాలను సహించే భాషా భాగంలో – అంటే తెలుగులో నామవాచకాల్లో స్వతంత్రపదనిర్మాణం, అర్థ విపరిణామశక్తి తక్కువగా ఉంటుంది. అందుకనే తెలుగులో నామపదాలుగా అన్యదేశ్యాలు తొందరగా కలిసిపోతాయి. ప్రయత్నపూర్వంగా కొత్త నామాలను మనం సృష్టించలేం. క్రియలు అన్యదేశ్యాల కలయికను అంతగా సహించవు- కాబట్టి అర్థవిపరిణామశక్తి వాటికి ఎక్కువగా ఉంటుంది. ఉదాహరణకు కారు, ట్రాక్టరు, మొదలైన నామవాచకాలు తెలుగులో సులభంగా కలిసిపోయినాయి. కాని drive, conduct, lead అనే క్రియాపదాల అర్థాలన్నిటినీ తెలుగులో 'నడుపు' అనే దేశ్యక్రియ తన ప్రాథమికార్థాన్ని కొత్త భావాలకనుగుణంగా మార్చుకోటం వల్ల 'కారు నడపటం, ట్రాక్టరు నడపటం, పార్టీ నడపటం', మొదలైన రూపాలు సిద్ధిస్తున్నాయి.

ఈసూత్రం అనువాదకులు గుర్తుంచుకోవాలి. 'ఉపబంధించు, అవధారితము చేయు', లాంటివి తెలుగులో ఇమడకపోవటానికి కారణం వాటి అవశ్యకత లేకపోవటమే. అలాగే విశేషణాలు, అవ్యయాలు గూడా దిగుమతి చేసుకోటంలో ముందు వెనుకలు ఆలోచించుకోవాలి. తెలుగు 'జీనియస్' అనే మాటకు అర్థం ఇదే.

ఇక రెండో సూత్రం ఏభాషనుంచి విషయాన్ని అనుసరిస్తున్నామో ఆ భాషనుంచే అవసరమైన చోట్ల మాటలు ఎరువు తెచ్చుకోవాలి గాని మూడో భాషనుంచి తెచ్చుకోగూడదు. దీనివల్ల అనువాదప్రయోజనమే దెబ్బ తింటుంది. ఇంగ్లీషులో ఉన్న catకు అర్థం (అనువాదం) తెలుగు పిల్లవాడు అడిగితే 'పిల్లి' అనాలి. లేదా 'కేట్' అనే అనాలి (అంటే ఆమాటన్నా వాడికి వచ్చింది కాబట్టే అర్థం అడుగుతాడు); కాని, 'మార్జాలం' అని చెప్పటం అనువాదం కాదు. ఆంగ్లంనుంచి 'పార్లమెంటరీవిధానం', 'న్యాయవిజ్ఞానం' మనం దిగుమతి చేసుకొన్నప్పుడు ఆభాషనుంచి అవసరమైన చోట్ల మాటలు యథాతథంగా ఎరువు తెచ్చుకోటానికి విజ్ఞులు కూడా ఎందుకు బాధపడతారో తెలియదు.

సంస్కృతం మనకు ఆదరణీయమైన భాష అయినా దాన్ని వేరేవిధంగా మన విద్యావిధానంలో పోషించాలిగాని ఆంగ్లపదాల బహిష్కరణకు ఉపకరణంగా కాదు. ఆ పని దీపాన్ని వెల్తురు ఇస్తున్నది గదా అని ముద్దు పెట్టుకున్నట్టుంటుంది. తెలుగులో సుప్రసిద్ధంగా నిలిచిపోయిన మాటలు ఏమూల నుంచి వచ్చినవైనా

దేశ్యం, ప్రాకృతం, సంస్కృతం, అరబ్బీ, పర్షియన్, మొదలైనవి ధారాళంగా అనువాదంలో వాడుకోవచ్చు. ఈప్రయోజనానికి ఇప్పుడు కొత్తగా సంస్కృతం నుంచి సృష్టించటం, లేకపోతే మరొకరు సృష్టించిపెట్టినవి తీసుకోటం అనువాద ధర్మానికే విరుద్ధం.

ఈ సందర్భంలో మరో మాట చెప్పాలి. కృత్రిమానువాదాలవల్ల భాషకేదో హాని జరుగుతుందని కొందరు భయపడుతున్నారు. కాని వాటిలో ఉన్న కృత్రిమత్వమే భాషను రక్షిస్తుంది. అలాటివి వాడుకలోకి వస్తే కదా భాషకు హాని. నిజంగానే వస్తే అవి కృత్రిమాలు కావన్నమాట. ఈసందర్భంలో తగిన జాగ్రత్త నాలుగు కోట్ల ప్రజల ఉమ్మడి సొత్తైన భాషే తీసుకుంటుంది. సాంఘికవ్యవహారం నిర్వహించటమే భాషాప్రయోజనం కాబట్టి, ఈప్రయోజనానికి భంగం కలిగించే ఏసంస్కరణా భాషనేమీ చెయ్యలేదు.

తెలుగును అధికారభాషచెయ్యటంలో ప్రభుత్వంవారి పూనిక ప్రశంసనీయం. కాని ఈసంస్కరణను నిర్వహించటంలో జాగ్రత్త, ముందు చూపు ఎంతైనా అవసరం.

(ఆంధ్రప్రభ [దినపత్రిక] 1967 జులై 18, 25 సంచికలలో ప్రచురితం.)

# 16

# ఆధునికభాషగా తెలుగు

**ఉపోద్ఘాతం**

సమాజంలో వచ్చే మార్పులు భాషలో ప్రతిబింబిస్తాయి. ఆర్థికంగా, రాజకీయంగా సాంస్కృతికంగా తెలుగు సమాజంలో వచ్చిన పరిణామాలను, వ్యవహార అవసరాలను బట్టి మనం తెలుగును ఎలా పెంచుకున్నామో తెలుగు ఎలా పెరిగిందో సమీక్షించటమే ఈ వ్యాసవిషయం.

లిఖితసాహిత్యం, కొన్ని శతాబ్దుల చరిత్ర ఉన్న ఏ భాషావికాసాన్ని అయినా స్వరూపదృష్టి (formal view) తోనూ, ప్రయోగదృష్టి (functional view) తోనూ పరిశీలించవచ్చు. ధ్వనుల్లో, పదాల్లో, వాక్యాల్లో వచ్చిన క్రమ పరిణామాలను నిరూపించటం స్వరూపదృష్టి: భాషను మొదట ఏయే రంగాల్లో ఉపయోగించేవాళ్లు; క్రమంగా ఇతరరంగాలకు ఎలా వ్యాపించింది? ఇప్పుడు ఏయే రంగాల్లో వ్యవహారసాధనంగా ప్రవర్తిస్తున్నది, వ్యవహారవిస్తృతి ఏవిధంగా సాధ్యమైంది నిరూపించటం ప్రయోగదృష్టి. ఈ ప్రయోగదృష్టితో ప్రధానంగా తెలుగు పెరుగుదలను స్థూలంగా సమీక్షించి ఈనాటి పత్రికాభాష ఆధునిక భావాలను, విజ్ఞానాన్ని తెలుగువారికి అందించటంలో ఏరకంగా తోడ్పడుతున్నదీ, ఆ కృషి తెలుగు పెరుగుదలకు ఎలా ఆస్కారమైంది పరిశీలిస్తాను.

## అన్యభాషా సంపర్కం

వ్యవహర్తలు మినహా భాషకు అస్తిత్వం లేదు. భాష నిత్యం వ్యవహర్తల సామూహిక జీవితంలో ప్రధానమైన ఒక వ్యవస్థగా గుర్తించాలి. భాషలో మార్పు రావటం అంటే ఈ వ్యవస్థలో మార్పు రావటమే. మాట్లాడే వాళ్ళ అవసరాలను బట్టి భాష పెరుగుతుంది. ఏభాష అయినా ఆ వ్యవహర్తల అనుభవాలను, భావాలను చెప్పుకోటానికి ఏకాలంలోనూ అసమర్థమైనట్టు మనకు ఆధారాలు లేవు. ఒక నూతనశాస్త్రం గాని ఒక కొత్త రకం విజ్ఞానం కాని ఒక సమాజంలో ఏర్పడితే దానికి అనువైన పదజాలం కూడా ఆ భాషలో ఏర్పడుతుంది. ఒక భాషలో అన్యభాషాసంపర్కంవల్ల వచ్చే మార్పులు సామాజికంగా వచ్చిన మార్పులకు ప్రతిబింబాలు. భాషా సంపర్కంలో వచ్చే మార్పులు ప్రధానంగా ఆలోచనా విధానంలోనూ, పదజాలంలోనూ కనిపిస్తాయి. దండయాత్రల వల్ల, వలసలవల్ల, వర్తకవ్యాపారాలవల్ల భిన్నభాషాసమాజాలకు సంపర్కం ఏర్పడుతుంది. ఈ సంపర్కం కొన్ని శతాబ్దులపాటు జరిగితే ఆ సమాజాలు మాట్లాడే భాషల్లో ఎన్నో రకాల మార్పులు వస్తాయి. బలవంతుల భాష బలహీనుల భాషను, గెల్చినవారి భాష ఓడిన వాళ్ల భాషను, ఉదాత్త సంస్కృతి గలవాళ్ళ భాష అంతకన్నా సంస్కృతిలో తక్కువైనవాళ్ళ భాషను ప్రభావితం చేస్తాయి. ఒక భాషది పై చెయ్యి మరొక భాషది కింది చెయ్యి అయినా సంపర్కంలో మామూలుగా భాషలు పెరుగుతాయి గాని తరగవు. చరిత్రలో తెలుగుది ఎప్పుడూ కింది చెయ్యే అని చెప్పాలి. మొదట 400 ఏళ్ళ పాటు తెలుగుదేశంలో ప్రాకృతం రాజభాష. అదే సమయంలో విజ్ఞాన సాహిత్య భాషగా భారతదేశ భాషలన్నిటిమీద సంస్కృతభాషాప్రభావం ఏర్పడ్డది. 14-19 శతాబ్దుల కాలంలో పర్షియన్, అరబిక్, దక్కినీ భాషలతో సంబంధం, 16వ శతాబ్ది నుంచి, పోర్చుగీస్ ప్రభావం, ముఖ్యంగా 19వ శతాబ్దినుంచి ఆంగ్లభాషాప్రభావం- ఈచరిత్ర అందరికీ తెలిసిందే. కావ్యసాహిత్యం, శాసనరచన, జానపద సాహిత్యం, సామాన్యజనవ్యవహారం - ఈ నాలుగు రంగాల్లోనే తెలుగుకు 19వ శతాబ్ది దాకా వాడుక ఉండేది. సామాన్య జనవ్యవహారమే శాసనభాషకు, జానపదసాహిత్యానికి ఆధారం. కావ్య సాహిత్యానికి కవిత్రయం వారి భాష ఒరవడై అది ప్రజావ్యవహారభాషకు దూరమైంది. శతకాలు, కీర్తనలు, యక్షగానాలు, మొదలైనవాటిల్లో కావ్యభాషతో బాటు వ్యవహారభాష కూడా

చోటుచేసుకొన్నది. శాసనభాషలో కావ్యభాష, కావ్యభాషలో వాడుకభాష అడపా తడపా కనిపిస్తూనే ఉన్నాయి. తెలుగులో శాస్త్ర గ్రంథరచన 19వ శతాబ్ది దాకా చాలా తక్కువ. తర్క వ్యాకరణ వైద్య గణితశాస్త్ర రచనలు కొద్దిపాటి ఉన్నా అవి సంస్కృతశ్లోకాల్లోనో తెలుగుపద్యాల్లోనో ఉండేవి. ఆంగ్లభాషతో సంబంధం ఏర్పడ్డ తరువాతనే తెలుగుభాషను అంతకు ముందు వాడని రంగాల్లో ఉపయోగించటం జరిగింది. అచ్చుయంత్రం, ఆంగ్లవిద్యావిధానం, కొత్త రాజకీయన్యాయవ్యవస్థలు, సాంస్కృతికంగా వచ్చిన మార్పులు. ఇవన్నీ తెలుగు వాడుకలో ఒక విప్లవాన్ని తెచ్చాయి. వచనరచనకు ప్రాధాన్యం వచ్చింది. నవల, కథానిక, వ్యాసం, సాంఘికనాటకం, రేడియో, సినిమాలు, వార్తా పత్రికలు – పెద్దపెట్టున రావటంతో కొద్ది కాలంలో భాషలో సర్వతోముఖ వికాసం ఏర్పడ్డది. ఈవికాసం నిజంగా గత 40 ఏండ్లుగానే జరిగిందని చెప్పాలి. అంటే ఈకాలంలో తెలుగు భాషాభివృద్ధికి ఒక నూతనశకం మొదలైనట్లు చెప్పవచ్చు. ఈ వికాసానికి గ్రాంథికభాషను, సరళగ్రాంథిక భాషను వదిలివేసి శిష్టవ్యవహారానికి సన్నిహితంగా ఉన్న ఆధునికశైలిని రచయితలందరూ నిరాఘాటంగా వాడటం ఒక కారణం. రెండోది తెలుగు పదజాలంలో వచ్చిన విస్తృతి.

## నూతనపద సృష్టి

కొత్త భావాలకు కొత్త మాటలు ఏర్పడే మార్గాలు ఎన్నో పరిస్థితులను ఆశ్రయించి ఉంటాయి. దేశీయంగా సంస్కృతిలో వచ్చిన మార్పులకు మాటలు దేశభాషలోనే ఏర్పడతాయి. ముఖ్యంగా దేశీయవృత్తుల్లో–విస్తృతంగా వ్యవసాయంలో–జానపదులు కొన్ని వేల తెలుగు మాటలు సృష్టించుకొన్నారు. అలాగే తెలుగుదేశంలో పుట్టి పెరిగిన వృత్తుల్లో దేశ్యశబ్దాల భాగమే ఎక్కువ. అన్యభాషాసంస్కృతుల సంపర్కం వల్ల మన భాషలోకి వచ్చిన కొత్త భావాలకు, అనుభవాలకు, వస్తువులకు, పనులకు, పేర్లు సృష్టించుకొనే విధానం – అన్యభాషా సంస్కృతుల ప్రభావానికి లోనైన వ్యక్తుల స్థాయినిబట్టి, వారి వ్యవహార సందర్భాలను, అవసరాలనుబట్టి ఉంటుంది. తెలుగు తప్ప మరో భాష రానివాళ్ళు గూడా ఈసంగతులను గురించి మాట్లాడుకోవలసివస్తే వీలైనంత వరకు తెలుగు మాటలకే ఈకొత్త అర్థాలు వచ్చేట్టు మలుచుకుంటారు; injectionకు సూది అని, vasectomyకి పేగుమెలిక అని జానపల్లో వ్యాపించిన మాటలు దీనికి

తాత్పర్యం. కాని ఏభాషనుంచి కొత్త భావాలు, ఆలోచనావిధానం మనకు వచ్చాయో ఆభాష గూడా బాగా తెలిసినవాళ్ళు ఆసంగతులను తెలుగువాళ్ళకు చెప్పవలసి వస్తే కొత్త మాటలు ఎలా సృష్టిస్తారో పత్రికాభాష చూస్తే మనకు తెలుస్తుంది.

## తెలుగు వార్తాపత్రికల భాష

ప్రపంచంలో నాలుగు మూలలనుంచీ వచ్చిన సమకాలీనవిజ్ఞానాన్ని వ్యాపింప జెయ్యటానికి వార్తాపత్రికలను మించిన సాధనం లేదు. తెలుగు దినపత్రికల్లోను, రేడియో వార్తాప్రసారాల్లోను వచ్చిన కొత్త మాటలను, వాక్యనిర్మాణాలను పరిశీలిస్తే నూతనపదకల్పనలో ఈకింది విధానాలు పాటిస్తున్నట్టు తెలుస్తుంది. వార్తలు ఇంగ్లీషులో వస్తాయి. స్వల్పవ్యవధానంలో ఆవిషయాన్ని తెలుగులోకి అనువాదం చేసి అచ్చుకు పంపాలి. ఇంత వత్తిడిలో ఉన్న పత్రికారచయితల భాషలో నూతనపదకల్పనలో కొన్ని నిర్దిష్టపద్ధతులేర్పడ్డాయి.

1. ఇంగ్లీషు పదానికి ఉన్న అనేక అర్థాల్లో కొన్ని అర్థాలకు మాత్రమే సరిపడుతున్నా తెలుగు మాటకు ఇంగ్లీషు పదానికి ఉన్న మిగిలిన అర్థాలు కూడా ఆరోపించటం. అంటే ఇంగ్లీషులో ఒక మాట వాడే సందర్భాలన్నింట్లోను తెలుగు మాటలను వాడటం: ఉదా. *విడుదలచేయు* (release): ఖైదీలను–, ప్రకటన–, పుస్తకం–, నీళ్ళు–, సరుకు–; నిల్వలు (reserves, savings)–; ముడి సరుకు (raw material)–; *కోర్కెలు* (demands): కోర్కెలు సమర్పించటం, అంగీకరించటం; *అదుపు* (custody, control): ధరలను అదుపులో ఉంచటం; *చీలిక* (split): రాజకీయపక్షంలో–; *కోత*: విద్యుచ్ఛక్తి కోత; పిలుపు ఇవ్వటం (to give a call); మొదలైనవి.

2. సంస్కృతం నుంచి వచ్చిన శబ్దానికి సాంప్రదాయికార్థం ఇప్పుడు అట్టే అవసరం లేకపోతే దానికి ఆధునికార్థాన్ని ఆరోపించటం. ఆకాశవాణి (radio), *ఆశ్రితపక్షపాతం* (favouritism), *క్షమాభిక్ష* (pardon), *ఇంధనం* (fuel), *అజ్ఞాతవాసం* (underground), *విద్యుత్* (electricity), *సచివాలయం* (secretariat), *రాక్షసచర్యలు* (atrocities), *ఆకాశకన్య* (air-hostess), *భగీరథ ప్రయత్నం* (herculean task).

3. కొత్తభావాన్ని తెలుగువారి ఆలోచనావిధానానికి సరిపడే తీరున ఉన్న మాటలతో ఆఅర్థస్ఫూర్తి వచ్చేట్టు చేసుకోటం : దీన్ని idiomatic translation

అనవచ్చు: ఉదా. దొంగసరుకు (smuggled goods), దొంగవ్యాపారం (smuggling, black marketing)), దొంగసారాయి, దొంగసొమ్ము, దొంగ లైసెన్సు (ఇక్కడ 'దొంగ' అంటే న్యాయబద్ధం కాని అనే కొత్త అర్థం వచ్చింది); గిట్టుబాటు ధర (fair price); భూతద్దం; నష్టపరిహారం (compensation); విశాఖపట్నంలో థర్మామీటర్‌-కు జానపదులు 'ఊష్ణం పుల్ల' అంటారు. కరువు బత్తెం; ఎగవేత; పొదుపు మొత్తాలు (savings).

4. నిత్య వ్యవహారంలో లేని సంస్కృత పదాలను, సమాసాలను, ఇంగ్లీషు అర్థానికి చాలావరకు దగ్గరగా ఉన్నాయని తోచినవాటిని కొత్తగా వాడుకలో ప్రవేశపెట్టడం: ఈప్రయత్నం పత్రికల్లో 30, 40 ఏండ్లుగా జరుగుతున్నది. ఇవి కొన్ని వందలుంటాయి; ఉదా. స్థానం (Seat in Legislature), వాతావరణం, ఆందోళన, సంక్షోభం, పురోగతి, వాణిజ్య మండలి, నిర్బంధ- (compulsory), సమర్థనీయం (justifiable), ప్రదర్శనలు (demonstrations), ప్రతిపాదన, ప్రచారసాధనం, చట్టబద్ధం, వినతిపత్రం, పరిశ్రమ, అత్యాచారాలు, అత్యవసర పరిస్థితి / అత్యయిక పరిస్థితి, నియోజకవర్గం, ప్రజాస్వామ్యం, పార్టీ ఫిరాయింపు, వ్యూహం, ఉపాధి, ద్రవ్యోల్బణం, ప్రతిష్టంభన, అంశ, ఆరోపణ, అధిష్ఠానవర్గం, అక్షరజ్ఞానం, నిరాహారదీక్ష, ఉగ్రవాదులు, ఆర్థికమాంద్యం, ఏకగ్రీవం, అలీన (దేశాలు). మిశ్రసమాసాల్లో కొన్ని: చిన్నతరహా పరిశ్రమలు; మధ్యతరహా కోళ్ళపరిశ్రమ (poultry); పాడిపరిశ్రమ; మద్దతుదార్లు; గుత్తాధిపత్యం, ధాన్యసేకరణ, దొంగచాటు రవాణాదార్లు (smugglers).

5. అన్నిటికంటే పెద్దఎత్తున జరుగుతున్నది- ఇంగ్లీషు మాటలను పై రకంగా సృష్టించుకొన్న మాటల పొందికతో యథానువాదాలు చెయ్యటం: ఇలాటిది చైనీస్, జర్మన్‌భాషలలో చాలా సాధారణంగా జరుగుతుంది. ఇంగ్లీషులో చాలా అరుదు (Latin omnipotens = Almighty). ఇక్కడ భావం ఆంగ్ల భాషకు సహజం, ఇంగ్లీషు పదం తెలిసినవాళ్ళకే ఈమాటలు అర్థమవుతాయా అని కూడా అనిపిస్తుంది. ఉదా. ప్రాంతీయవార్తలు, రాష్ట్రసమాచారలేఖ, కుటుంబనియంత్రణకార్యక్రమం, అలీనదేశాలు, నిర్బంధ డిపాజిట్ల పథకం, స్వయంసమృద్ధి, ఆహారమండలం, అభ్యంతరవిషయాల ప్రచురణచట్టం, అంతర్జాతీయశాంతిభద్రతలు, వికేంద్రీకరణ, రాజ్యాంగసవరణబిల్లు, అసంఘటిత

(unorganized), నిర్వృద్ధసంధి, రిలేనిరాహారదీక్ష, చీకటి అధ్యాయం, జీవనప్రమాణం, అస్థిరవాతావరణం, కనీసబోనస్ - ఇవి కొన్ని వందల్లో ఉంటాయి.

6. అప్పుడప్పుడు మాటలను విరిచి వివరణాత్మకంగా రాయటం కద్దు. ఉదా. అభివృద్ధి చెందుతున్న (దేశాలు), ఏరాజ్యకూటానికీ చెందని (దేశాలు) మారిన పరిస్థితుల్లో, కాలదోషం పట్టిన, చుక్కలంటుతున్న (ధరలు), సంబంధించిన వ్యాధుల (ఆస్పత్రి), ఉద్యోగకాలం ముగియకుండా ముందుగానే రిటైర్ కావలసివచ్చిన, గడువు ముగిసిన అసెంబ్లీలు.

7. ఇంగ్లీషు మాటలనే తెలుగులిపిలో రాయటం (actual loan-words): అపీలు, కర్ఫ్యూ, ప్రొరోగ్ చేయు, మొదలైనవి; ఇలాటివి చదువుకొన్నవాళ్ళ భాషలో ఎక్కువగా ఉన్నా పత్రికాభాషలో తక్కువగా కనిపిస్తాయి.

8. క్రియలో మరో విధానం కనిపిస్తుంది. వీలైనంత వరకు తెలుగు క్రియలను వాడటం; తరచు సంస్కృతం, హిందుస్తానీ, ఇంగ్లీషు నామ పదాలకు తెలుగు సహాయక్రియలు తగిలించి ఇంగ్లీషు క్రియలకు అనువాదాలుగా వాడటం ఎక్కువ. ఉదా. కేసు నమోదుచేయు, రాజీనామా-, జాతీయం-, హామీ ఇచ్చు, మద్దతు-, సమాధానం-, అదుపులో ఉంచు. క్రియాపదాల్లో కావ్యభాషలో ఉన్నవాటిని ఉద్ధరించి రాస్తున్నారు; ఉదా. కార్యక్రమం చేపట్టి, ద్రవ్యోల్బణం అరికట్టడం, సత్సంబంధాలు నెలకొల్పు. ఆంగ్లక్రియలను వాడటం చాలా తక్కువ. తెలుగుక్రియల అర్థం సాగినట్టు నామపదాల అర్థం సాగదు. అందువల్ల ఎరువు మాటలు నామాల్లో కనిపించినంత ఎక్కువగా క్రియల్లో కనిపించవు.

అన్నిటికన్నా ముఖ్యమైన ప్రశ్న - పై విధానాలను బట్టి ఏర్పడ్డ మాటలతో కూర్చిన వాక్యాల అర్థం ఇంగ్లీషు అర్థాన్ని తెలుగులోకి ఎలా తేగలుగుతున్నది అని. అంటే మామూలుగా తెలుగులో లేని ఆలోచనా విధానం - ఒక కొత్త conceptual framework - పత్రికాభాష ద్వారా తెలుగులో ప్రవేశిస్తున్నది. తెలుగువాళ్ళు మామూలుగా ఇలా అనుకొంటారా, ఆలోచిస్తారా, వారికి వెంటనే ఈవాక్యార్థాలు స్ఫురిస్తాయా, అనిపించేవి ఎన్నో ఈనాటి పత్రికాభాషలో వస్తుంటాయి. ఇవి చాలావరకు ఆంగ్ల వాక్యరచనావిధానానికి సరిపడ్డట్టు వెంటనే తెలుస్తుంది. ఉదా.:

'ఎన్నికల్లో విజయం పట్ల హర్షం ప్రకటించారు'

'అని ఒక తీర్మానంలో కోరింది'.

'జనతా ప్రభుత్వం పార్టీ ఫిరాయింపులను ప్రోత్సహిస్తున్నది'.

'సత్సంబంధాలు నెలకొల్పాలి.'

'ఈ విషయంలో ఒక అంగీకారానికి వచ్చారు.'

'రాజ్యసభలో జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ'

'ప్రజాస్వామ్య విలువలను పునరుద్ధరించాలి.'

'రాష్ట్రపతి ఎన్నికలో అన్ని పార్టీలు ఒక అవగాహనకు రాగలవన్న ఆశాభావాన్ని లోకసభ స్పీకరు శ్రీ నీలం సంజీవ రెడ్డి గారు వెలిబుచ్చారు.'

'సూచనలతో ఏకీభవించు'

'ధరలను అదుపులో పెట్టటంలో మనం ఘనవిజయం సాధించామనే చెప్పాలి.'

'ఉపాధ్యాయుల కోర్కెలను అంగీకరించారు.'

'ఆయన ఉద్రేకాన్ని ప్రదర్శించలేదు.'

'ఎన్నుకొన్న ప్రతినిధులను తిరిగి వెనక్కు పిలిచే హక్కు'

'ఈ విషయం పునఃపరిశీలించాలి.'

'సంఘర్షణలు కారణంగా పరిస్థితి క్షీణించటంతో'

'కాంగ్రెస్ వైఫల్యానికి కారణాలు'

'పెరుగుతున్న ఆర్థికవ్యవస్థలో ద్రవ్యోల్బణాన్ని కొంతవరకు తప్పించుకోలేమని అది అభివృద్ధికి ఇచ్చుకోవలసిన ధర అని మొరార్జీ దేశాయ్ చెప్పారు.'

'ఇది నైతికంగా సమర్థనీయం కావచ్చు.'

'రాజ్యాంగ రీత్యా సమర్థనీయం కాకపోవచ్చు'

ఇలాటి ఉదాహరణలు కుప్పతిప్పలుగా దొరుకుతాయి.

పత్రికాభాషగా తెలుగులో వస్తున్న మార్పు

ఈరకమైన అనువాదవ్యాసంగం పత్రికాభాషలో మూడు శతాబ్దులుగా సాగుతున్నది. పైన ఉదహరించిన పదవాక్యకల్పనలు తెలుగులో అసలు

సరిపడలేదని గాని, బాగా సరిపడ్డాయని గాని గట్టిగా అనలేము, ఎక్కడో తప్ప అంత వికృతంగా కనిపించటంలేదు. ఈరకమైన శైలికి, రచనకు నిలకడ ఏర్పడు తున్నది. క్లుప్తంగా చెప్పాలంటే– ఆంగ్ల భాషలో సహజంగా నివేదించటానికి వీలైన అభిప్రాయాలను తెలుగులోకి అనువదించవలసివస్తే కొద్దిపాటిగా తెలుగుమాటల పొందికతోను– ఇంకా ఎక్కువగా సంస్కృతసమాసాలతోను చెప్పే అలవాటు తెలుగు పత్రికలభాషలో విరివిగా కనిపిస్తుంది. ఏడెనిమిది తరగతుల దాకా చదివినవాళ్లకు గాని, మెట్రిక్యులేషన్ దాకా చదివినవాళ్ళకు గాని ఈభాషద్వారా అందించే భావాలు ఎంతవరకు సమగ్రంగా అర్థమవుతున్నాయో చెప్పటానికి పరిశోధన జరగాలి. చదువుకొన్నవాళ్ళు (అంటే ఇంగ్లీషు, తెలుగు వగైరా) ఇష్టా గోష్ఠిలో ఎక్కువగా ఇంగ్లీషు మాటల్ని తెలుగు వాక్యాల్లో పొదిగి మాట్లాడుతారు. కాని రాయవలసివచ్చినప్పుడు మాత్రం సంస్కృతంనుంచి వెదికి తెచ్చిన మాటలు, సమాసాలు రాస్తున్నారు. ఈతేడా ఎందుకు వచ్చింది? ఇంగ్లీషు మాటలకు బదులు సంస్కృతశబ్దాలు వాడితే సామాన్యుడికి బాగా అర్థ మవుతుందని చెప్పలేం. అసెంబ్లీ, ఎమర్జెన్సీ, కేసు, జడ్జీ, అన్నమాటల కన్నా శాసనసభ, అత్యవసరపరిస్థితి, ఆరోపణ, న్యాయమూర్తి తొందరగా అర్థమవుతా యని ఎవ్వరూ అనలేరు. చదువుకొన్నవాళ్ళు ఇతరులతో మాట్లాడేటప్పుడు ఇంగ్లీషు మాటలే వాడుతారు కాబట్టి అవే వ్యవహారంలో నలిగి జానపదులకు గూడా తొందరగా అర్థమవుతాయి. అయితే ఈ 'అనామలీ' కి కారణం ఏమిటి? బహుశా సాంఘికవ్యవస్థను బట్టి రచయితల ఆలోచనలో వచ్చిన మార్పు కావచ్చు. Prof. M.N.Srinivas అనే ప్రఖ్యాత సాంఘికశాస్త్రవేత్త సంస్కృతాంగ్ల సంస్కృతుల సంబంధం వల్ల రెండు రకాల ప్రక్రియలు భారతీయసంస్కృతిలో కనిపిస్తున్నాయన్నారు. అవి 1. Sanskritization (సంస్కృతీకరణం), 2. Westernization (పాశ్చాత్యీకరణం). సంస్కృతభాష అగ్రకులాలద్వారా వ్యాపించింది. అగ్రకులాలు పాటించిన ఆచారవ్యవహారాలను ఇతరకులాలవారు ఆదర్శంగా అనుకరించి అవలంబించారు. ఉదాహరణకు జంధ్యాలు వేసుకోటం, శాకాహారం అగ్రేతరకులాలవారు కూడా అనుసరించారు. తర్వాత వచ్చిన ఆంగ్లసంస్కృతి, ఆంగ్లభాష ఆధునికతకు మార్గదర్శకమైనాయి. సంస్కృత భాషాప్రభావం మన భాష మీద సుమారు 15, 16 శతాబ్దులు సాగింది. అరబ్బీ పారశీకాల ప్రభావం 3, 4 శతాబ్దులన్నా ఉన్నది. కాని ఆంగ్లభాషాప్రభావం

గట్టిగా పడటం నూరేళ్ళ లోపే. ఎక్కువ కాలం పాతుకుపోయిన సంస్కృత భాషాప్రభావం మాటల్లోను, ఇటీవలి ఆంగ్లభాషాప్రభావం ఆలోచనా విధానంలోను వచ్చేట్టు రచయితలు సమన్వయించుకొన్నారా అనిపిస్తుంది. భావాల్లో పాశ్చాత్యవిధానం అభావాలను గురించి రాయవలసి వచ్చినప్పుడు. సంస్కృతీకరణం కనిపిస్తున్నాయని చెప్పవచ్చు. అంటే conceptualizationలో Westernization, expressionలో Sanskritization కనిపిస్తాయి. ఇంగ్లీషు భాషాప్రభావమే మరో 5, 6 శతాబ్దులుంటే– సంస్కృతపదాలను ఆనాడు మనం ఎరువు తెచ్చుకొన్నట్టు ఇంగ్లీషు మాటలను నిరాఘాటంగా లిఖిత వాఙ్మయంలో కలుపుకోటమే ఎక్కువ సహజంగా ఉండేదేమో. అచ్చు తెలుగు మాటలు దొరుకుతున్నా వాటికి సరైన సంస్కృతపదాలకు సాంఘికంగా విలువ పెరిగింది. తిక్కన భారతంలో అమూర్తభావాలకు (abstract notions) చక్కటి తెలుగు మాటలు కనిపిస్తాయి: ఉదా. అనువు (సౌలభ్యం), వీలు, అలమట (దుఃఖం), అర (సంకోచం), ఉక్కు (బలం), తగవు (ధర్మం), పెంపు (అధిక్యం), వగవు (శోకం), వెరగు (ఆశ్చర్యం), మొదలైనవి. ఈమాటలు నేడు జారిపోయినాయి. దేశ్యశబ్దాలతో చక్కటి సమాసాలు కూర్చుకొని ఎన్నో నూతనాభిప్రాయాలు మనం చెప్పుకోవచ్చు. కాని చాలా మందికి అలాటివి ఇష్టం ఉండదు. Chief Justiceను 'మేటితగవరి' అన్నదానికంటే 'ప్రధానన్యాయమూర్తి' అంటే మనకు బాగుంటుంది. నూతనపదాలకు ముడిసరుకు మనం ఎలా కూర్చుకొంటామన్నది చాలా వరకు సామాజికప్రమాణాలమీద ఆధారపడ్డది కాని భాషాప్రమాణాలమీద గాదు.

ప్రపంచభాషలను ఆదానాత్మకభాషలు (borrowing languages) అనీ, నిర్మాణాత్మకభాషలు (building languages) అనీ కొందరు శాస్త్రవేత్తలు విభజించారు. ఇంగ్లీషు, జాపనీసు భాషలు యథాతథంగా ఇతర భాషలనుండి కొత్తమాటలను ఎరువుతీసుకొంటాయి. వాటికి సమానార్థకాలను సృష్టించుకోటం చాలా అరుదు. చైనీస్, జర్మన్, గ్రీక్, లాటిన్, సంస్కృతం మొదలైనవి 'building languages'. అరవంలో దేశ్యభాగంతోనే కొత్త మాటలు కల్పించే ప్రయత్నం బహుళంగా జరుగుతున్నది. తెలుగులో ఈరెండు ప్రక్రియలూ కనిపిస్తాయి. లిఖితరూపంలోకి వచ్చినప్పుడు మనది నిర్మాణాత్మకభాష;

సామాన్యవ్యవహారంలో ఆదానాత్మకభాష. ఒక కాలంలో తెలుగు సంస్కృతం నుంచి తత్సమాలను విరివిగా తీసుకొన్నది. పర్షియన్, అరబిక్ పదాలు గూడా తత్సమాలుగా ఎన్నో వచ్చి చేరాయి. ఇప్పుడు పత్రికాభాషలో వచ్చే సంస్కృత తత్సమాలు కొత్తవి. ఇవి ఇదివరకు మన భాషలో వాడని కొత్త సందర్భాలకోసం కల్పించుకొన్నవి. ఈరకంగా మనం కల్పించుకొన్న మాటల్లో ఎన్ని భాషలో అతుకుతాయి, ఎన్ని అతకవు అనేది ముఖ్యమైన ప్రశ్న. అసలు అతకటం అంటే ఏమిటో వివరిస్తేనే కాని ఈప్రశ్నకు జవాబు లేదు. ఆయా సందర్భాలను అనుసరించి సభల్లో సమావేశాల్లో మాట్లాడవలసివచ్చినప్పుడు గూడా రాజకీయ వేత్తలు, విద్యావంతులైనప్పుడు వాళ్ళు ఈరకంగానే మాట్లాడుతారా, కొంత వరకు ఈరచనాధోరణి మరింత సులభమై దేశి తెలుగుకు దగ్గర అవుతుందా అనేది మరో ప్రశ్న. నార్వీజియన్ భాషలో ఈరకమైన సమన్వయం కుదిరింది. అక్కడ రచనాభాషకు, ప్రజాభాషకు ఉన్న తేడాల్ని కొన్ని సంస్థలు, కొందరు వ్యక్తులు ప్రయత్నపూర్వకంగా వీలైనంతవరకు తక్కువయ్యేటట్లు చేశారు.

మన సమాజంలో సాంప్రదాయికంగా ఎప్పుడూ చర్చించని కొత్త విషయాలు, సందర్భాలు, అనుభవాలు, ఆలోచనలూ వచ్చి చేరినప్పుడు కొత్త రచనావిధానంతో పాటు ఆలోచనావిధానంలోనూ మార్పులు వస్తాయి; రావాలి. ఈమార్పు సర్వత్రా అచ్చతెలుగు మాటలతో గాని, తద్భవాలతో గాని సాధ్యం కాదు. అనువాదవిధానాన్ని సులభం చేసి కొద్దిపాటి చదువుకొన్నవాళ్ళు గూడా తెలుగుపత్రికల భాషను అర్థం చేసుకోవాలంటే రెండు రకాలైన మార్పులు రావాలి. 1. వీలైనంతవరకు పైన నిరూపించిన తొమ్మిది పద్ధతుల్లో మొదటి మూడు రకాలు తెలుగు నుడికారానికి దగ్గర ఉండేటట్లు అనువదించటం, 2. మాతృభాషాబోధనను ఆధునికవ్యవహారప్రయోజనాల దృష్టితో మార్చటం.

## రావలసిన మార్పులు

1. అనువాదవిధానం శాస్త్రవిషయంగా విశ్వవిద్యాలయాల్లో శిక్షణ ఇవ్వాలి. దీనికి జరగవలసిన పరిశోధన కూడా ఎంతో ఉంది. 2. అర్థవ్యక్తీకరణ అర్థస్ఫూర్తి, స్పష్టత చెడిపోకుండా రచనావిధానంలో ఎటువంటి మార్పులు చేస్తే ఎక్కువమందికి భాష, శైలి అర్థమౌతాయో పరిశోధించాలి. 3. పత్రికాభాషలో స్థిరపడ్డ పదాలకు, పదబంధాలకు వివరణాత్మకనిర్వచనాలతో కోశాలు

వెలువడాలి. 4. మాతృభాష బోధనలో 5, 6 తరగతులనుంచి పత్రికాభాష పఠనీయాంశం కావాలి. ఇప్పుడు మాతృభాష పేరిట పఠనపాఠనాల్లో ఉన్న ప్రణాళికావిధానం – తెలుగు పిల్లలు ఆధునికభాషలో ధారాళంగా రాయటానికి గాని, మాట్లాట్టానికి గాని ఉపయోగించేట్టు లేదు. ప్రకృతి–వికృతులు, సంధులు, అలంకారాలూ, ఛందస్సు మొదలైనవాటికి ప్రాధాన్యం ఇస్తున్నారు. కావ్యాల్లో ఉన్న కథలను వచనంలో రాసి క్లిష్టపదాలకు అర్థాలు నేర్పుతున్నారు. ఈరకంగా చదువుకొన్నవాళ్ళకు అలీనదేశాలు, శాసనసభ, పార్టీ మార్పిడి మొదలైన మాటలు అర్థం కావు. ప్రాచీనసాహిత్యం చదివించవచ్చు. మన ఆచారాలు, వ్యవహారాలు, సంప్రదాయం తెలుసుకోటంవరకు దాని ప్రయోజనం. 5. ఆధునిక విజ్ఞానవిషయాలనుగురించి మాట్లాడాలన్నా, రాయాలన్నా ఆశిక్షణ ఉపయోగించదు. ఈరెంటినీ మాతృభాషాబోధనలో సమన్వయించాలి. ఆధునిక ప్రయోజనాలకు అనువుగా తెలుగు వాడుకను ఎలా మలుచుకోవాలో భాషాధ్యాపకులు విద్యార్థులకు నేర్పాలి.

# 17

# విద్యావిధానంలో త్రిభాషాసూత్రం

## – శాస్త్రీయచర్చ

ప్రభుత్వం నడిపే తెలుగుమీడియం పాఠశాలల్లో 5వ తరగతిదాకా తెలుగు తప్ప ఇతర భాషలు ప్రవేశపెట్టరాదనీ, ఇంగ్లీషును 6వ తరగతినుంచీ, హిందీని 8వ తరగతినుంచీ పాఠ్యాంశాలుగా బోధించాలనీ ఇటీవల రాష్ట్రప్రభుత్వం చేసిన నిర్ణయం అందరూ హర్షించతగ్గది. ఈనిర్ణయంవల్ల ప్రయోజనం దృష్ట్యా ఆయా భాషల స్థానాన్ని విద్యావిధానంలో సక్రమంగా నిర్దేశించినట్లయింది. ఈ నిర్ణయంలో ఉన్న సామంజస్యాన్ని శాస్త్రీయంగా నిరూపించటమే ఈవ్యాసం ఉద్దేశం. గత మే నెల 27-30 తేదీల్లో జాతీయవిద్యాపరిశోధన-శిక్షణ సంస్థ (NCERT) పాఠశాలల విద్యాప్రణాళికను సమీక్షించటానికి ఒక జాతీయ సదస్సు నేర్పాటు చేసింది. ఆసదస్సుకు సమర్పించిన అధికారవ్యాసంలో- 'పాఠశాలల్లో వివిధభాషల బోధనపద్ధతి జాతీయస్థాయిలో సమ్మతించిన, ఎజుకేషన్ కమీషన్‌వారు సిఫార్సు చేసిన త్రిభాషాసూత్రాన్ని అనుసరించి జరగటంలేదనీ, వెంటనే ఈలోపాన్ని సవరించాలనీ,' సూచించింది. ఈ అవ్యవస్థకు దారితీసిన పరిస్థితులను ఇలా నిర్దేశించింది: 1. కొన్ని రాష్ట్రాల్లో ద్విభాషాసూత్రమే పాటిస్తున్నారు. (తమిళనాడు, పాండిచ్చేరి, మణిపూర్); 2. ఒక్కొక్క దశలో ఏదో ఒకే భాషను ప్రవేశపెట్టాలని చేసిన సిఫార్సును (అంటే

1 నుంచి 4 దాకా మాతృభాష, 5-10 ఇంగ్లీషు/హిందీ, 8-10 హిందీ/ఇంగ్లీషు) చాలా రాష్ట్రాలు పాటించక ప్రాథమిక స్థాయిలోనే మూడు భాషలనూ ప్రవేశపెడుతున్నాయి; 3. హిందీప్రాంతాల్లో మూడో భాషగా ఉర్దూ, సంస్కృతాలను తప్ప, ఇతర ఆధునిక భారతీయభాషలను నేర్పటంలేదు; 4. ఎక్కువ భాషల బరువువల్ల మాతృభాషలో రాదగినంత అధికారం పిల్లలకు ఏర్పడటంలేదు.

ఇదివరకున్న ప్రణాళిక ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో హిందీ, ఇంగ్లీషులను ఐదు నుంచి పది తరగతులదాకా బోధించేవారు. అంటే ప్రాథమిక విద్యాస్థాయిలోనే మూడు భాషలనూ ప్రవేశపెట్టటంతో ఏభాషా సక్రమంగా నేర్చుకోలేని స్థితి ఏర్పడ్డది. మాతృభాషలో ధారాళంగా చదవటం, రాయటం వచ్చిన తర్వాతనే ద్వితీయభాషను, మరో మూడేళ్ళ తరువాత తృతీయభాషను ప్రవేశ పెట్టాలని గదా 'ఎజుకేషన్ కమీషన్' చెప్పింది! ప్రాథమికస్థాయిలోనే మూడు భాషల బరువు పెట్టటం అశాస్త్రీయమని, అందువల్ల ముఖ్యమైన ఇతర పాఠ్యాంశాలకు తగినంత సమయం వెచ్చించటంలేదనీ ఎన్. సి. ఇ. ఆర్. టి. సమీక్షాపత్రం పేర్కొన్నది.

పాఠశాలల్లో ఏయే ప్రయోజనాలకు ఏభాష నేర్చుకోవాలో నిర్ణయిస్తే వాటిని ఏస్థాయిల్లో నేర్పాలో తేల్చుకోవచ్చు. వివిధభాషల బోధనప్రయోజనాలను ఈ కింది పట్టికలో నిర్దేశించివచ్చు: ('+' అంటే ఆప్రయోజనానికి అవసరం; '–' అంటే అనవసరం)

| ప్రయోజనం | భాష | | |
|---|---|---|---|
| | మాతృభాష | ఇంగ్లీషు | హిందీ |
| 1. అక్షరాస్యత, చదువుమీద అభిలాష కలగటానికి | + | – | – |
| 2. స్వీయ సంస్కృతి, చరిత్రలను అర్థం చేసుకోటానికి | + | – | – |
| 3. హైస్కూలు స్థాయి దాకా ఆధునికవిజ్ఞాన సముపార్జనకు | + | – | – |
| 4. ధారాళంగా సృజనాత్మకంగా భావాలను, భావనలను వ్యక్తీకరించుకోటానికి | + | – | – |
| 5 ఉన్నత స్థాయిలో ఆధునిక విజ్ఞానసముపార్జనకు | [+] | + | – |

| | మాతృభాష | ఇంగ్లీషు | హిందీ |
|---|---|---|---|
| 6. ఉన్నతస్థాయి పరిశోధనకు | [+] | + | – |
| 7. ఇతర రాష్ట్రాలవారితో వ్యవహారానికి, ఉత్తరప్రత్యుత్తరాలకు సాధనంగా | – | (+) | + |
| 8. దేశైక్యం దృష్ట్యా ఇతర ప్రాంతీయుల సంస్కృతిని, సాహిత్యాన్ని అర్థంచేసుకోటానికి | – | (+) | + |
| 9. మన రాష్ట్రంలో జరిగే పరిపాలనాయంత్రాంగంలో పాల్గొనటానికి | + | (+) | – |
| 10. జాతీయ అంతర్జాతీయ సదస్సుల్లో వ్యవహారసాధనంగా | – | + | – |

[+] ప్రాధాన్యం పెరుగుతున్న భాష; (–) ప్రాధాన్యం తగ్గుతున్న భాష

పైన నిర్దేశించిన 10 ప్రయోజాల్లోనూ ఏడింటికి మాతృభాషను, ఆరింటికి ఇంగ్లీషును రెండింటికే హిందీని మన రాష్ట్రంలో విద్యార్థులు నేర్చుకోవాలని, 7, 8 ప్రయోజనాలకు తెలుగువాళ్లు ప్రస్తుతం ఇంగ్లీషు ఎక్కువగా వాడుతున్నా, ఆరంగాల్లో హిందీభాష ప్రాధాన్యం ఎక్కువ అవుతుందని ఊహించవచ్చు; 5, 6 ప్రయోజనాలకు క్రమంగా మాతృభాష ప్రాధాన్యం పెరిగినా, ఇంగ్లీషుకున్న స్థానం తగ్గదు. 9వ ప్రయోజనంలో తెలుగు సమగ్రమైన అధికారభాషగా రూపొంది నప్పుడు, ఇంగ్లీషు ప్రాధాన్యం తగ్గుతుంది. ఈవిశ్లేషణనుబట్టి తెలుగుపిల్లలు మాతృభాషను పెంచుకోటానికి ఎక్కువ కాలం వినియోగించు కోవాలి. అందువల్లనే మాతృభాషాబోధన అన్ని స్థాయిల్లోను జరగాలని విద్యావేత్తలంతా అంటున్నారు. ఆతరవాత స్థానం ఇంగ్లీషుకు, మూడో స్థానం హిందీకి ఇవ్వాలి.

స్నాతకోత్తర స్థాయిలో విద్యాబోధన మీడియంగా ఇంగ్లీషే మన రాష్ట్రంలో కొనసాగుతున్నది. కాని క్రమంగా ఈస్థానం మాతృభాషకు రావాలి. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రవేశపరీక్షలకు కూర్చుంటున్న పట్టభద్రులు 80% తెలుగులోనే రాస్తున్నారు. దీన్నిబట్టి ఎడ్యుకేషన్ కమీషన్ సిఫార్స్ 9 మేరకు మాతృభాషనే బోధనమాధ్యమంగా ప్రవేశపెట్టవలసిన సమయం దగ్గరపడు తున్నదని గుర్తించవచ్చు. శాస్త్రగ్రంధాలను సంప్రతించి విజ్ఞానసేకరణ సులభం చేసుకోటానికి ఇంగ్లీషును నేర్చుకోక తప్పదు. ఈలక్ష్యసాధనకు

6వ తరగతినుంచే నిజంగా ఇంగ్లీషు నేర్చుకొనే అవసరం లేదు. ఇంగ్లీషు ప్రాధాన్యాన్ని క్రమంగా ఇంటర్మీడియట్‌నుంచి పెంచుకొంటూరావచ్చు.

సం. 1854, వుడ్స్ డిస్పేచ్‌లో దేశభాషల్లోనే పాశ్చాత్యవిజ్ఞానం భారతీయులకు నేర్పాలని చార్ల్స్ వుడ్‌అనేఆయనఏనాడో బలవత్తరమైనఉపపత్తులతో ప్రతిపాదించాడు. కాని 1920 దాకా హైస్కూలు తరగతుల్లో ఇంగ్లీషు మీడియమే ఉండేది. 1920–47 మధ్యకాలంలోనే పెద్ద ఎత్తున మాతృభాషలో విద్యాబోధన జరిగింది. అన్ని సబ్జెక్టులలోను ఎన్నో పాఠ్య పుస్తకాలు వచ్చాయి. ఈకారణంగా దేశభాషల వ్యాప్తి, విద్యావ్యాప్తి, ఒకే సారి జరిగాయి. ఇప్పుడు 45 ఏళ్ళకు పైబడ్డ వాళ్ళల్లో 99% మాతృభాషలో హైస్కూలు దాకా చదువుకొన్నవాళ్ళే. ఇంగ్లీషు మీడియమ్ మీద ఇటీవల ఏర్పడ్డ అర్థం లేని పిచ్చి ఆరోజుల్లో లేదు. ఏవో కొన్ని మిషనరీ స్కూళ్ళల్లో తప్ప ఇంగ్లీషు మీడియమ్ ఉండేది కాదు. ఆవిధానంలో చదువుకొన్నవాళ్ళే ఈనాడు ఎన్నో శాస్త్రరంగాల్లో అత్యున్నత పదవుల్లో ఉన్నారు.

మరి హిందీ మాటేమిటి? హిందీని సంయోజనభాష ( లింక్ లాంగ్వేజ్) గా నేర్పాలని త్రిభాషాసూత్రంలో నిర్దేశించిన ఉద్దేశం. ఒక రాష్ట్రంలో ఉన్నవారు మరో రాష్ట్రంవారితో మాట్లాడాలన్నా, ఉత్తర ప్రత్యుత్తరాలు నడపాలన్నా దేశం అంతటికీ ఒకే భాష ఉండాలనీ ఆస్థానానికి హిందీ యోగ్యమైనదనీ హిందీని జాతీయస్థాయిలో అధికారభాష చేశారు ఆప్రయోజనానికి తెలుగు పిల్లలకు హిందీ నేర్పాలి. సక్రమంగా రెండుమూడేళ్ళు నేర్చుకొంటే వ్యవహార సాధనంగా హిందీని ఉపయోగించగలిగినంత సామర్థ్యం ఏర్పడుతుంది. ఆధునికవిజ్ఞాన గ్రంథాలు చదవటానికి హిందీ నేర్చుకోనక్కరలేదు.

జాతీయసదస్సుల్లో వైజ్ఞానికచర్చలకు ఇంగ్లీషుకున్న స్థానం హిందీకి రాదు. హిందీలో మాట్లాడను, చదవను, రాయను కావలసిన జ్ఞానం సరిగా నేర్పితే రెండుమూడేళ్ళల్లో సాధ్యమవుతుంది. ఆరు నుంచి పది తరగతుల దాకా అయిదేళ్ళపాటు పరిమితప్రయోజనం ఉన్న భాషను పిల్లల నెత్తిన రుద్దటంలో అర్థం లేదు. ఉద్యోగాలు కల్పించటానికి అయిదో తరగతినించే హిందీ నేర్పాలనటం విద్యావిషయకమైన ఉపపత్తి కాదు.

మాతృభాషాబోధనలో ఉన్న లోపంవల్లనే ఇంగ్లీషు మీడియమ్ స్కూళ్ళకు ఈమధ్య విపరీతమైన వ్యాప్తి వచ్చింది.

## హిందీ రాష్ట్రాలలో త్రిభాషాసూత్రం

మంచి అధ్యాపకులతో అన్ని రకాల వసతులతో ఉన్న తెలుగు మీడియం స్కూళ్ళు అరుదైపోయాయి. ప్రభుత్వమూ, మున్సిపాలిటీలు, పంచాయితీ సంస్థలూ నడిపే స్కూళ్ళల్లోనే తెలుగు మీడియమ్ ఉండటం వల్లా, తగినన్ని వసతులు, క్రమశిక్షణవిధానం లేకుండా ఇవి విస్తరించటం వల్లా, వెనుకబడ్డ వర్గాల చదువుకోసమే ఏర్పడ్డ సంస్థలుగా ఇవి పరిణమించాయి. మధ్యతరగతి వాళ్ళూ, నాలుగంకెల జీతాలవాళ్ళూ తమ పిల్లల్ని ఇంగ్లీషు మీడియమ్ స్కూళ్ళకు పంపితే చదువు బాగా వస్తుందనే వ్యామోహంలో పడ్డారు. ఇంగ్లీషు భాషకున్న ప్రాధాన్యాన్ని కొన్ని రంగాల్లో పరిమితం చేసేట్టు మన రాష్ట్రంలో అధికారభాషగా తెలుగు పెరగకపోవటం కూడా దీనికి ఒక సామాజిక కారణం. చదువు రాని తల్లిదండ్రులు కూడా అప్పో సప్పో చేసి తమ పిల్లల్ని ఇంగ్లీషు మీడియమ్ స్కూళ్ళకే పంపుతున్నారు. కాని 90% అలాటి స్కూళ్ళు వ్యాపారసంస్థలుగా మారిపోయాయి. ఇంగ్లీషు బాగా రాని అధ్యాపకుల్ని తక్కువ జీతం మీద అలాటి స్కూళ్ళల్లో నియమిస్తారు. ఈస్కూళ్ళల్లో చదివిన పిల్లలకు అటు మాతృభాష ఇటు ఇంగ్లీషు రెండూ రాని పరిస్థితి ఏర్పడుతున్నది.

ఈ మధ్య మేం చేసిన ఒక పరిశోధనలో ఇంగ్లీషు మీడియమ్ బళ్ళల్లో చదివే తెలుగు పిల్లలకు తెలుగు మాటల బహువచనరూపాలు సరిగా నేర్చుకోలేని స్థితి ఏర్పడ్డదని తేలింది. 'ఒక బొమ్మ : రెండు బొమ్మలు' మాదిరిగా 'ఒక చెయ్యి : రెండు –?', 'ఒక గుడి : రెండు–?' 'ఒక గది :రెండు–?' అని ఒక ప్రశ్నావళి ఆధారంగా అడిగితే 'చెయ్యిలు, గుడిలు, గదిలు' అని జవాబులు చెప్పారు. వీళ్ళంతా 4, 5 ఏళ్ళ పిల్లలు, అప్పర్ కేజి క్లాసులో ఉన్నవాళ్ళు. తెలుగు వాతావరణంలోనే పెరిగిన పిల్లలకు మూడున్నరేళ్లకే చాలా పదాల బహువచన రూపాలు వస్తాయి. కొందరు, 'కేట్సులు' ('పిల్లులు' బదులు), 'లెగ్స్–లు' ('కాళ్ళు' బదులు) అన్నారు గూడా. అలాటి పిల్లలు నేర్చుకొంటున్న ఇంగ్లీషు కూడా అధ్వాన్నంగానే ఉంది.

విద్యావిధానంలో జరుగుతున్న ఈఅన్యాయానికి పరిష్కార మార్గాలు మూడు: 1. మాతృభాష మీడియమ్‌గా అన్ని రకాల వసతులున్న మంచి బళ్ళను ప్రభుత్వమే కాక ప్రైవేటు సంస్థలు కూడా స్థాపించటం; అక్కడ భాషాబోధనలో

ప్రావీణ్యం ఉన్న అధ్యాపకులను నియమించటం. 2. అన్ని విద్యాసంస్థల్లోను (ఒక్క ప్రభుత్వ సంస్థలే కాక) ప్రాథమికస్థాయిలో మాతృభాష (ప్రాంతీయ భాష) లో విద్యాబోధన జరగాలని నిర్దేశించటం; 3. అధికారభాషగా తెలుగును పరిపాలనలోనే గాక వ్యాపార, పరిశ్రమల రంగాల్లో కూడా వ్యాపించే వాతావరణం కలిగించటం.

హిందీ రాష్ట్రాల్లో ఒకటి నించి అయిదో తరగతిదాకా హిందీయే పాఠ్యాంశం, బోధనభాష కూడా, ఇంగ్లీషును ఆరో తరగతి నుంచే ప్రవేశపెడతారు. ఆపద్ధతి హర్యానా, హిమాచల్ ప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాల్లో అమలులో ఉన్నది (1976లో ప్రచురించిన ఎన్. సి. ఇ. ఆర్. టి. సర్వే ప్రకారం). మరి మూడు భాషల స్థానంలో ఏహిందీరాష్ట్రంలోనూ ఇతర భారతభాషల- ముఖ్యంగా ద్రావిడభాషల బోధన జరగటంలేదు. వాటి స్థానంలో సంస్కృతం గాని, ఉర్దూను గాని బోధిస్తారు. హిందీ, ఉర్దూలు ఒకే భాషకు రెండు రూపాలు.

బీహార్‌లో 4వ తరగతినించి సంస్కృతం ద్వితీయభాష, 6వ తరగతినించి ఇంగ్లీషు తృతీయభాష; హర్యానాలో 6 నుంచి ఇంగ్లీషు రెండో భాష, 7 నుంచి ఉర్దూ మూడో భాష; హిమాచల్ ప్రదేశ్‌లో 6 నుంచి ఇంగ్లీషు రెండో భాష, ఉర్దూ సంస్కృతాలు మూడో భాషలు; మధ్యప్రదేశ్‌లో 6 నుంచి సంస్కృతం ద్వితీయ భాష, ఇంగ్లీషు తృతీయభాష; పంజాబ్‌లోనూ 6 నుంచే ఇంగ్లీషు తృతీయభాష; ఉత్తరప్రదేశ్‌లో 6 నుంచి ఇంగ్లీషు ద్వితీయభాష, సంస్కృతం తృతీయభాష. ఈవిధంగా 5వ తరగతి వరకు మాతృభాషనే బోధించటం ఎన్నో రాష్ట్రాల్లో ఉంది. కాని ఏరాష్ట్రంలోనూ 'ఎజుకేషన్ కమిషన్' చేసిన సిఫార్సు మేరకు ద్వితీయ భాషను 6వ తరగతిలోను, తృతీయ భాషను 8వ తరగతిలోను ప్రవేశపెట్టటం లేదు. అందువల్లనే భాషాబోధన లక్ష్యాలను సాధించలేకపోయిందని ఎన్. సి. ఇ. ఆర్. టి. వాళ్ళు పరిశీలించి పరిశోధించి చెప్పారు. ఈ కారణంవల్ల మన రాష్ట్ర ప్రభుత్వనిర్ణయం విద్యావంతులందరూ హర్షించాలి.

దేశైక్యం దృష్ట్యా హిందీతర ప్రాంతాల్లో హిందీ భాషను మూడు నుంచి ఐదేళ్ళవరకు నేర్పుతున్నారుగదా! హిందీ ప్రాంతాల్లో మరి భారతీయభాషను కంపల్సరీ భాషగా ఎందుకు నేర్పటంలేదు? బెంగాలీ, తమిళం, కన్నడం, తెలుగు,

మలయాళం ఉదాత్తసాహిత్యం ఉన్న భాషలు; ఈభాషలు మాట్లాడేవాళ్ళ సంస్కృతి, చరిత్రలు హిందీ ప్రాంతంవాళ్ళు ఎలా తెలుసుకొంటారు? త్రిభాషా సూత్రం దక్షిణాది రాష్ట్రాల్లో అమలు జరుగుతున్నది గాని హిందీప్రాంతాల్లో కాదు. ఉదాహరణకు, తెలుగు సంస్కృతి, చరిత్ర, సాహిత్యం అర్థం చేసుకోగల హిందీ ప్రాంతీయులు ఎంతమంది ఉన్నారు? తిరుక్కురళ్, వేమన, సుబ్రహ్మణ్య భారతి, గీతాంజలి మొదలైన రచనలను మాతృకలో చదివి అర్థంచేసుకొనే హిందీ మాతృభాషాపండితులు పట్టున పదిమందన్నా ఉన్నారా? తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, బెంగాలీ భాషల్లో ఉన్న సాహిత్యం అలా చదివి అర్థం చేసుకొని విమర్శించగలిగిన వాళ్ళు రష్యా, అమెరికా, జపాన్ దేశాల్లో ఉన్నారు గాని హిందీ ప్రాంతంలో నలుగురైదుగురన్నా లేకపోతే దేశసమైక్యం ఏమవుతుంది? హిందీ సాహిత్యాన్ని తెలుగులోకి, తెలుగు సాహిత్యాన్ని హిందీలోకి అనువదించేవాళ్ళు తెలుగు మాతృభాషగా ఉన్న హిందీ పండితులే గదా! హిందీ ప్రాంతీయుల్లో ఎవరన్నా ఒక తెలుగు కథానికనుగాని; శ్రీశ్రీ గేయాన్ని గాని హిందీలోకి అనువదించగలరా? సాహిత్యం సంస్కృతికి అద్దం. భారతీయసమగ్రసంస్కృతిలో భిన్నభాషావ్యవహారాలనుబట్టి ఉపసంస్కృతులు ఎన్నో ఉన్నాయి. వాటిని అర్థంచేసుకోవాలంటే వారివారి భాషలో వెలువడ్డ ఉత్తమ సాహిత్యాన్ని మాతృకలో (అనువాదంలో కాదు) చదవగలిగిన వాళ్ళు ప్రతిభాషా ప్రాంతంలోను కొందరన్నా ఉండటం దేశసమైక్యానికి సాధనమవుతుంది.

మరోమాట. భారత రాజ్యాంగంలో ఉన్న 351 అధికరణం ప్రకారం హిందీభాష ఇతరభాషల్లో ఉన్న పలుకుబళ్ళను కలుపుకొంటూ సమైక్య భారతీయసంస్కృతికి ప్రతీకగా రూపొందాలని నిర్దేశించింది. ఇది ఎలా సాధ్యమవుతుంది? హిందీ వ్యవహర్తలకు ఇతర భారతీయ భాషల్లో ధారాళంగా మాట్లాడటం రాయటం వచ్చినప్పుడే ఆభాషల ప్రభావం వారి మాతృభాషపై బడుతుంది. ద్విభాషికత (bilingualism) వల్ల అన్యభాష పలుకుబళ్ళు మాతృభాషలో చొరవ చేసుకొంటాయి. ఇంగ్లీషు పలుకుబళ్ళు, వాక్యనిర్మాణం భారతీయ భాషల్లోకి ఇంగ్లీషు మాట్లాడగలిగిన స్వభాషావ్యవహర్తలవల్ల వచ్చాయే గాని ఇంగ్లీషు వాళ్ళు మనభాషల్లో చొప్పించలేదు. అలాగే హిందీ మాతృభాషగా గలవారి ద్విభాషికత వల్ల ఇతర భాషాపదాలు, వాక్య నిర్మాణాలు హిందీలో కలిసి హిందీ విస్తృతమౌతుంది. కాని తెలుగు, కన్నడం, బెంగాలీ, మొదలైనవాటిని

మాతృభాషలుగా మాట్లాడేవాళ్ళు హిందీ రచనల్లో తమ భాషాపదాలు, పద బంధాలు చొప్పిస్తే- వాటిని దుష్టప్రయోగాలుగా హిందీ పండితులు పరిగణిస్తారు. అంటే ఒక భాషలోకి అన్యభాషలనుంచి ఎరువు తెచ్చుకొన్న పలుకుబళ్ళలో ఏవి ఇముడుతాయో ఏవి ఇమడవో నిర్ణయించేవాళ్ళు ఆ భాషను మాతృభాషగా మాట్లాడేవాళ్ళే గాని పరాయి భాషలవాళ్ళు గాదు. రాజ్యాంగ నిర్మాతలు లక్ష్యం చెప్పారే గాని దాని సాధనం గురించి చెప్పలేదు. ఈ దృష్టితో హిందీవాళ్ళచేత ఇతరభాషలు చదివిస్తే గాని రాజ్యాంగంలో హిందీభాషాభివృద్ధిని గూర్చి చేసిన ఆదేశానికి సార్థకత రాదు. అందువల్ల ఏనాడో ఇతర భారతీయభాషలను తప్పనిసరిగా విద్యావిధానంలో హిందీ ప్రాంతాల్లో ప్రవేశ పెట్టవలసింది. ఈనాటి తెలుగులో పత్రికాభాష చదువుతుంటే ఇంగ్లీషు భాషాప్రభావం ఎంతో కనిపిస్తుంది. ఈప్రభావం ఇంగ్లీషులో నిష్ణాతులైన తెలుగు రచయితల ద్వారా సాధ్యమయింది. దీన్ని బట్టి తృతీయభాషగా ఇతర భారతీయభాషలను హిందీ ప్రాంతీయుల విద్యావిధానంలో తప్పనిసరి చేస్తే తప్ప హిందీ జాతీయభాషగా ఎదిగే అవకాశంలేదు.

ఇతర భారతీయభాషలతోపాటే హిందీ కూడా పెరుగుతున్న భాష. విజ్ఞానసాధనాలుగా తెలుగు, తమిళం, బెంగాలీ మొదలైన భాషలు ఏస్థాయికి వచ్చాయో హిందీ అదే స్థాయికి చేరుకొంది. అలాంటప్పుడు ఇంగ్లీషు నేర్చుకొన్నన్ని ఏళ్ళు హిందీ నేర్చుకోవలసిన అవససరం ఏముంది?

పై చర్చను బట్టి మాతృభాషకు సముచితస్థానం రాష్ట్రప్రభుత్వాలు ఇచ్చినప్పుడే ఇంగ్లీషు చదువు తెచ్చిపెట్టిన సామాజిక అసమానతలు పోయి ఆధునికశాస్త్రవిజ్ఞానం అన్ని వర్గాలవారికి అందుబాటవుతుంది. దానివల్ల ఆర్థికాభివృద్ధి, ప్రజాస్వామ్యానికి సార్థకత ఏర్పడుతాయి.

ఇంగ్లీషు మీడియమ్ పేరుతో కుక్కగొడుగుల్లాగా వెలుస్తున్న విద్యావ్యాపార సంస్థల పెరుగుదలను అరికట్టటానికి శాసనం అవసరమనిపిస్తుంది. మన ప్రభుత్వం చేసిన నిర్ణయం ప్రభుత్వ పాఠశాలలకే గాక ఇతర పాఠశాలలకు కూడా వర్తించేట్టు చెయ్యటం వాంఛనీయం.

( ఉదయం దినపత్రిక; 1985 ఆగస్టు 21,22)

# 18

# మూడువేల ఏళ్ళకిందట తెలుగుసంస్కృతి ఎలా ఉండేది?

ద్రావిడభాషలు సుమారు ఇరవైనాలుగు. మాట్లాడేవాళ్ళ సంఖ్య ఇరవై రెండుకోట్లు. సాహిత్యం, లిపి ఉన్నభాషలు నాలుగు – తమిళం, మలయాళం, కన్నడం, తెలుగు. ద్రావిడభాషలన్నిటిలోనూ ఎక్కువమంది మాట్లాడేది తెలుగు (సుమారు ఏడు కోట్లమంది). ద్రావిడభాషలు సంస్కృతమాతృక నుంచి వచ్చినవి కాదు అనేది నిర్వివాదాంశం. మధ్యప్రదేశ్–కన్యాకుమారి మధ్య ప్రాంతంలోనే ఎక్కువ ద్రావిడభాషలు మాట్లాడుతున్నారు. బీహారు, బెంగాలు రాష్ట్రాలలో మాట్లాడే కురుఖ్, మాల్‌తోలు, పాకిస్తాన్ పశ్చిమ రాష్ట్రంలో మాట్లాడే బ్రాహూయీ కూడా ద్రావిడభాషలే.

వైదికసంస్కృతానికి సన్నిహితమైన ఒకానొక భాష మాట్లాడే ఆర్యులు వాయవ్యదిశ నుంచి సుమారు క్రీ.పూ. 1500 ఏళ్ళ క్రిందట భారతదేశంలో అడుగు పెట్టారు. ఆపై వెయ్యి సంవత్సరాలలో ఆర్యద్రావిడభాషావ్యవహర్తల మధ్య ఏర్పడ్డ సంబంధాలవల్ల ఉభయభాషాకుటుంబాలు, సంస్కృతులు పరస్పర ప్రభావితాలయినాయి. ఋగ్వేదసంస్కృతంలో ద్రావిడభాషాజన్యమైన పదాలు కొన్ని కన్పిస్తాయి; ఉదా. కేతకి (మొగలి), ఏలా (ఏలకి), మయూర,

పుత్తికా (చెద), నల, నీర, వలయ, ఖల (కళ్ళం), ఫల, మాలా శబ్దాలకు వ్యుత్పత్తులు ద్రావిడభాషల్లోనే కనిపిస్తాయి. మొహంజెదారో-హరప్పా నాగరికతలో వాడిన భాష పూర్వద్రావిడభాషాశాఖల్లో ఒకటై ఉంటుందని రష్యన్-ఫిన్నిష్ శాస్త్రజ్ఞులు ఊహించారు. ఆకాలపు ముద్రలు సుమారు మూడువేల దాకా దొరికాయి. ఈ లిపిని ఇంకా ఎవరూ ఖచ్చితంగా చదవలేదు. కాని, ప్రాచీనద్రావిడం కావటానికి అవకాశాలు ఎక్కువ ఉన్నాయని ఈశాస్త్రజ్ఞుల ఊహ.

తెలుగుకు తూర్పు-ఉత్తరాలనున్న భాషలతోనే సన్నిహిత సంబంధం అని తేలింది. దక్షిణద్రావిడభాషలు: తమిళం, మలయాళం, తొద, కోత, ఇరుళ, కుఱుంబ, తుళు, కొడగు, కన్నడం; దక్షిణమధ్యద్రావిడభాషలు: తెలుగు, గోండి, కొండ, కూయి, కువి, పెంగొ, మండ. ఇవి ఆంధ్ర, ఒరిస్సా, మధ్య ప్రదేశ్, మహారాష్ట్రలలో మాట్లాడేవి. సాహిత్యసంస్కృతుల్లో తెలుగు దక్షిణాది భాషలకు దగ్గరయినా పుట్టుకలో దక్షిణమధ్య భాషలకే సన్నిహితం.

ఈప్రతిపాదనకు కొన్ని ముఖ్య ఆధారాలు

1. జిహ్వాగ్రంతో ఉచ్చరించే ధ్వనులు—ర, ల, డ, మొదలైనవి— తెలుగులోను ఇతర దక్షిణమధ్యభాషల్లోను పదాదిన వస్తాయి. తమిళాది దక్షిణ భాషల్లో అలాఉండవు. బహుశా క్రీస్తుపూర్వంవెయ్యి ఏళ్ళకిందట వచ్చిన ఒక విలక్షణమైన ధ్వనులమార్పువల్ల జిహ్వాగ్రధ్వనులు, సంయుక్తవర్ణాలు పదాదిన వచ్చాయి. (తె.=తెలుగు, త.=తమిళం, క.=కన్నడం, మ.=మలయాళం, తు.=తుళు, కొ.=కొడగు, తొ.=తొద, కో.=కోత, గోం.=గోండీ, కొం.=కొండ.); ఉదా.:

తె. ఎల-, లే-, లేత; కూయి లావెను 'వయసునఉన్నవాడు', లా 'వయసున ఉన్న స్త్రీ'; కువి లాఅ 'యువతి'; గోం. లెయోర్, రెయోర్ 'యువతీ యువకులు'; త., మ. ఇళై; కో. ఎళ్; క. ఎళ 'చిన్న, వయసున ఉన్న'.

తె. రెండు, ఇరు-; గోం. రెణ్ట్; కొం. రుణ్డి; కూయి రీణ్డి; కువి రిణ్డి 'రొండు (అమహత్తు)'; త. ఇరణ్డు, ఈర్, ఇరు; క. ఎరడు, ఈర్, ఇరు.

తె. ప్రాఁత; నేటి తె. పాత; కూయి ప్లాడి; కువి, కొం. ప్లాఇ: త., మ. పఴ ప్రా.క. పఴ; నేటి క. హళ; తు. పర;

తె. మ్రాను; కూయి మ్రహ్ను; కువి మ్రాను; కొం. మరన్, మ్రాను; త., మ. మరమ్, మరన్; కో. మర్మ్-యి; క., కొ. మర.

2. ప్రాచీన తెలుగులో ఉన్న ళ, ణలు తర్వాత ల, నలుగా మారాయి. ఈ మార్పు తెలుగుకు ఉత్తరాన ఉన్న భాషల్లోనే జరిగింది గాని, తమిళాదిదక్షిణ భాషల్లో జరగలేదు. ఉదా.: తె. కను, కన్ను (కణ్ణి-), బహు. కణ్ణు; గోం. కన్; కూయి కను; కూవి కన్ను; త., మ., క. కణ్; తొ. కాణ్; కొ. కణు; తు. కణ్ణు.

తె. కల్లు; గోం. కల్; కొం., కూయి కలు; కూవి కల్లు; త., మ., కో. కళ్; కొ. కళు 'తాగేకల్లు'.

3. తెలుగులో బహువచన ప్రత్యయం –లు; మూలరూపం –ళు. తమిళాది దక్షిణభాషల్లో ఇది –కళ్, –గళు.

4. తెలుగు, గోండి మొదలైన భాషల్లో ఉత్తమ, మధ్యమపురుషల్లో విభక్తులు చేరే రూపాలు నా–, మా–, నీ–, మీ–, అని ఉంటాయి. తమిళాది భాషల్లో ఎన్–/నన్–, ఎమ్/నమ్–, నిమ్– అని హ్రస్వాచ్చుతో ఉంటాయి.

5. క్త్వార్థక క్రియలు ఏర్పడే పద్ధతిలోనూ ఈ రెండు శాఖల్లో విభేదాలు ఉన్నాయి. తమిళాదుల్లో –తు, –ఇ చేరటంవల్ల ఇవి ఏర్పడతాయి; తెలుగు గోండీ శాఖలో –చి/–సి చేరటంవల్ల ఇవి ఏర్పడతాయి. ఉదా. విచ్చి, తెచ్చి, నిలచి, చేసి లాటి రూపాలకు సమానంగా తమిళంలో వన్తు [వన్దు], తన్తు [తన్దు], నిన్తు, కెయ్తు [కెయ్దు] లాటివి ఉంటాయి.

పైన చూపించిన సాక్ష్యాధారాలను బట్టి, తెలుగు సాంస్కృతికంగా దక్షిణ భాషలకు దగ్గరిదైనా పుట్టుకలో మధ్యభాషలకు దగ్గరిదని తేలుతుంది. జన్య లక్షణాలు ఆధారంగా దక్షిణాది భాషలు, దక్షిణమధ్య భాషలు రెండు శాఖలుగా వేరుకావటం క్రీ.పూ. వెయ్యి సంవత్సరాల కిందటన్నా అయి ఉంటుంది. అంటే, తెలుగు–గోండీ–కూయి ఉపకుటుంబం తమిళ–కన్నడ ఉప కుటుంబం నుంచి వేరు కావటం కనీసం మూడువేల ఏళ్ళ కిందట అయిఉండాలి. క్రీస్తు పూర్వం మూడో శతాబ్దికే తమిళంలో సాహిత్యం ఉంది. ప్రాచీనశాసనాల్లో కనిపించే తెలుగు కన్నా తమిళం చాలా భిన్నంగా ఉండేది. తెలుగు–తమిళాలు క్రీ.పూ. పదకొండో శతాబ్దిలో వేరై ఉంటాయని నంబూద్రి (1976 : 52) తన సిద్ధాంత వ్యాసంలో అన్నాడు. తమిళ–కన్నడాలు క్రీ. పూ. రెండో శతాబ్దికి వేరై ఉండ వచ్చుట. తమిళమలయాళాలు క్రీ. శ. ఏడోశతాబ్దిలో వేరువేరు భాషలుగా మారాయి.

మూడువేల ఏళ్ళకిందటి తెలుగుసంస్కృతి

ఏకాలంలోనయినా ఒక భాష మాట్లాడేవాళ్ళ సంస్కృతి వాళ్ళ పదజాలంలో ఇమిడి ఉంటుంది. తెలుగు దేశ్యపదాల్లోనే తొలినాళ్ళ సంస్కృతి స్వరూపం తెలుస్తుంది. ఇతరసంస్కృతులతో ఏర్పడ్డ సంపర్కం అన్యదేశ్యాల్లో ప్రతిబింబిస్తుంది. మొదట ఆర్యభాషలైన సంస్కృత, ప్రాకృత పదాలు, తర్వాత పర్షియన్- అరబిక్ భాషాపదాలు, ఆపైన క్రమంగా పోర్చుగీసు, ఫ్రెంచి, డచ్చ్, ఇంగ్లీషు భాషాపదాలు వేరువేరుకాలాల్లో ఆయా సంస్కృతుల సాహచర్యంవల్ల తెలుగులో చేరాయి. ఒక్కొక్కప్పుడు దేశ్యపదానికి అన్యదేశ్యానికి మధ్య తేడా చెప్పటం కష్టం. అంటే భాషాచరిత్ర తెలిస్తేనే అది సాధ్యం అవుతుంది, ఇటికె, రోజా, కాయితం, బాతు, రొట్టె అనే మాటలు అచ్చతెలుగువని అనిపిస్తున్నా, దేశ్యాలు గాదు; క్రమంగా ప్రాకృతం, పర్షియన్, ఉర్దూ, పోర్చుగీస్, హిందీ భాషలనించి ఎరువు తెచ్చుకొన్నవి. కొన్ని వేలమాటలు ఈరకంగా దేశ్య భాగంలో కలిసిపోయాయి.

అన్యభాషావ్యవహారంతో ప్రభావితం కాని కాలంలో ఉన్న అచ్చతెలుగు మాటల్లో మూడువేలేళ్ళనాటి తెలుగుసంస్కృతి స్వరూపం మనకు గోచరిస్తుంది. అప్పటి మాటల అర్థాలు తులనాత్మకదృష్టితో నిరూపించుకోవాలి. బరో, ఎమెనో అనే ఇద్దరు పండితులు 1961లో ద్రావిడభాషల వ్యుత్పత్తి నిఘంటువును ప్రచురించారు. 1984లో దాని పరిష్కృతప్రతి అచ్చయింది. సోదరభాషా పదాలు ఆధారంగా తెలుగు మాటల ప్రాథమిక స్వరూపాలు, అర్థాలు తులనాత్మక దృష్టితో శాస్త్రీయంగా నిరూపించవచ్చు. అలనాటి మాటలు వాటి అర్థాలు ఆధారంగా తొలినాటి తెలుగుసంస్కృతిని రేఖామాత్రంగా దర్శించవచ్చు. ప్రాథమికఅర్థాలు ప్రధానం. సంస్కృతి మారినప్పుడు దేశ్యపదాల అర్థాలు గూడా మారతాయి. నెయ్యి అంటే అసలు అర్థం 'నూనె' అని; ఇప్పుడు తెలుగులో 'ఘృతం' అనే అర్థంలో రూఢమయింది. ప్రాథమికార్థం అన్ని భాషల్లోనూ కనిపిస్తుంది; తర్వాత వచ్చిన అర్థం కొన్నింటిలోనే ఉంది. మౌలిక భావాలు చిన్నచిన్న మాటల్లో నిలిచి ఉంటాయి. విశేషార్థాలకు సమాసా లేర్పడవచ్చు. సమస్తపదాలు అసమస్తపదాల కన్నా అర్వాచీనం. ఒక జాతి ప్రాక్తనసంస్కృతి ప్రాథమికపదాల్లోనే కనిపిస్తుంది. తెలుగు పూర్వసంస్కృతిని అలాటి శబ్దాలతో పునర్నిర్మించి ఇంకా ఈభావాలు మనలో అర్థవంతంగా ఉన్నాయో లేదో పరిశీలించుకోవచ్చు.

*1.* రాజకీయవ్యవస్థ: 'రాజు' (ఱేఁడు) ఉండేవాడు. ప్రజలు పన్నులు (అరి, కప్పం, తెర) కట్టేవారు. కోటలూ అగడ్తలూ ఉండేవి. ఊరు, అంతకన్నా పెద్ద నాడు ఉండేవి. తోటలతో ఉన్నది ప్రోలు. రాజులు ఏలేవాళ్ళు; యుద్ధాలు (పోరు, అని, మొన), సంధులూ (పొందు) ఉండేవి. గెలవటమో, ఓడటమో జరిగేవి. రాజుకు, దేవుడికి 'కో' అనే మాట వాడేవాళ్ళు. ఇద్దరినీ కొలవటం జరిగేది. తొత్తులు ఉండేవాళ్ళు. ప్రెగ్గడ (పెద్ద అధికారి, మంత్రి) సమస్తపదం కాబట్టి తరవాత వచ్చి ఉంటుంది.

*2.* సామాజికవ్యవస్థ: తెలుగులో చుట్టరికాలు దానికి చెందిన పదజాలం చాలా విస్తృతంగా ఉండేది. అమ్మ, అయ్య, అప్ప, అక్క, చెల్లెలు, అన్న, తమ్ముడు, అల్లుడు శబ్దాలు చాలా ప్రాచీనమయినవి. 'అత్తమామలు' పిల్ల నిచ్చినవాళ్ళకే గాక తండ్రిసోదరికి, తల్లిసోదరుడికి గూడా వాడేవాళ్ళు. తర్వాత స్పష్టత కోసం 'మేన' అనే విశేషణం చేర్చి రెండో అర్థాన్ని వేరుచేశారు. మరిది, మరదలు పదాలుగూడా ప్రాచీనాలే. మొత్తం మీద మన చుట్టరికపు మాటలు చాలాభాగం తొలితెలుగు నుంచి వస్తున్నవనే చెప్పాలి. మగండు (పురుషుడు), ఆలు (స్త్రీ) శబ్దాలకు తెలుగులో ప్రత్యేకార్థాలు ఏర్పడ్డాయి. పెండ్లి చాలా పాత వ్యవస్థలానే కనిపిస్తుంది. పెణ్ అంటే స్త్రీ అని అర్థం. కుటుంబం అనే మాట లేకపోయినా తల్లిదండ్రులూ పిల్లలూ అంతా కలిసి ఉండవచ్చు. కూడు (ప్రా. ద్రా. *కూటు) ధాతువునించే 'కుటుంబం' నిష్పన్నమయిందని బరో పండితుడు అన్నాడు. ప్రాచీన ద్రావిడంలో వితంతువుకు *కయ్ంతల్ అనే మాట ఉండేది. త. కైంతలి, కైని; పర్జీ కేతల్; ఒల్లారి కేటల్. పాతతెలుగులోనే ఈ మాట పోయి ఉంటుంది.

కులం, తరగతి అర్థాలకు మాటలు లేవు. అర్వాచీనకాలంలో వృత్తులను బట్టి కొన్ని పేర్లు వచ్చాయి. ఉదా. జాలరి, మేదఱి, కమ్మరి, కుమ్మరి ప్రాకృతాలతో సంబంధం ఏర్పడ్డ తర్వాత వచ్చి ఉండాలి. (ఆర్యులతో సంబంధం క్రీ. పూ. అయిదారు శతాబ్దుల్లో అయిఉండవచ్చు.) కోమటి, పాఱుఁడు (బ్రాహ్మణుడు, ద్రష్ట అనే అర్థంలో) ఆర్యుల కలయిక తరువాతే కావచ్చు. దేవుడు, దేవతలకు తుల్యార్థపదాలు లేవు. వేల్చు అనే ధాతువు ప్రాచీనమే కాని దాని అర్థం వేదకాలంలో మారిఉంటుంది. వేల్పు, వేల్పులు సోదరశబ్దాలు. *వేళ్

అంటే కోరటం కాని అగ్నిహోత్రంలో కాల్చటం కాదు. గుడికి మొదటి అర్థం ఇల్లు అనే (చూ. గుడిసె, గూడు). దేవుడి మందిరం అనే అర్థం అర్వాచీనం. పూర్వద్రావిడంలో రాజుకు దేవుడికి ఒకే మాట ఉండేది – * కో, * కోంతు అని. కోవెల (< కో+ఇల్) అంటే దేవుడి నివాసం (రాజుది గూడా కావచ్చు)). *పే, *పేన్, *పేయ్ అనే మరో మాటకు దయ్యం, దేవుడు అనే అర్థాలు ఉండేవిట. దీన్నించి ఏర్పడ్డ మాట తెలుగులో కనిపించదు. మోసం, అబద్ధాలాడటం, దొంగతనం జనం వాడుకలో ఉండి ఉండాలి (కల్ల, బొంకు, దొంగ).

**3.** *తినటం, తాగటం:* అంబలి, కూడు ముఖ్యమైన వండిన, ఉడికించిన ధాన్యాహారం అయి ఉండవచ్చు. గంజి, కాస్త పులిసిన కలి తాగేవాళ్ళు. పాలు, పెరుగు, చల్ల, వెన్న, కూరలు, కాయలు తెలుగువాళ్ళకు మొదటినుంచీ ఉన్నవే. కల్లు సామాన్యమైన పానీయం. అట్టే తియ్యటి పదార్థాలు ద్రావిడులలో వ్యాపించలేదు. అరిసె, బూరె (?) మాత్రమే తీపివి. అప్పం, దోసె, వడ, అప్పడం అప్పటికే వచ్చి ఉండవచ్చు. తేనె, బెల్లం ప్రాచీనమైన తీపి పదార్థాలు.

**4.** *వస్తుసంపద:* మూడురకాల ఇళ్ళు ఉండేవి– గుడిసె, పెంకు(ల ఇల్లు), మిద్దె/మేడ. ఇంట్లో వాడే పనిముట్లు–తిరగలి, రోకలి. ఇవికాక చేట, చీపురు, గొడుగు వాడుకలో ఉండేవి. వండటం, కాచటం, కాల్చటం– ఆహారం తయారుచేసుకొనే పద్ధతులు. కుండ, గిన్నె, చెంబు ముఖ్యంగా వాడే పాత్రలు. గరిటె, అగపలు కలియబెట్టటానికి పనికివచ్చేవి. నేయటం తెలుగువాళ్ళకు తెలుసు. కోకలు స్త్రీ పురుషులు సమానంగా వాడే పెద్దగుడ్డ. సముద్ర (కడలి) యానానికి ఓడ, కప్పలి ఉండేవి; పడవలు చిన్న ప్రయాణాలకు. సంగీతసాధనకు అట్టే మాటలు కనిపించవు. పిల్లనగ్రోవి చాలా పురాతనమైనది.

**5.** *ఆయుధాలు:* విల్లు, అంబులతో వేట ఆడటం బహుశా ఆటవిక వృత్తి. వేట వేండు 'కోరు, ఇష్టపడు' ధాతువు నుంచి వచ్చింది. కత్తి, ఈటె, గొడ్డలి, కోల, గుదియ ప్రధానమైన ఆయుధాలు.

**6.** *వ్యవసాయం:* పూర్వాంధ్రులు రైతు జీవితానికి అలవాటు పడ్డవారు. వాళ్ళ పెంపుడు జంతువులు: ఆవు, ఎద్దు, ఎనుము, ఏట, గొఱియ, కోడి. సేద్యానికి సంబంధించిన మాటలు చాలా ఉన్నాయి: నాగలి, కొడవలి, నేల, పొలం, చేను (మాగాణి) తెలిసిన మాటలు. నీరు నూతులనుంచి, చెఱువులు,

ఏఱులనుంచి వచ్చేది. 'కళ్ళం' అప్పుడు కలం/ కలను పేరుతో ఉండేది. 'కొలను' (సరస్సు) గూడా ప్రాచీనమైన జలాశయం. బహుశా తోటల్లో కొలనులుండేవి.

అల్లం ప్రా. ద్రా. లో *చిన్కి; ఉచ్చారణలో చింగి/సింగి. కాని తెలుగులో దీన్నించి ఏర్పడ్డమాట 'ఇంజి' అని ఉండాలి. అల్లం సంస్కృత ఆర్ద్రక నుంచి వచ్చింది. సంస్కృతంలో ఉన్న శృంగవేర ద్రావిడభాషాజన్యం అనటానికి ఆధారాలున్నాయి. ఉల్లి, పసుపు, చేమ, గెనుసు తెలుగువాళ్ళకు తెలుసు. అవాలు, సెనగలు మనవి గాదు. వరి. రాగి, కంది (తొగరు), పెసర, ఆరిక, మినుము/ఉద్దులు (ప్రా. ద్రా. *ఉఝు+న్తు) తెలుగు ధాన్యాలు. కాయల్లో టెంకాయ, అరటి, తాడి, ఉసిరిక (నెల్లి) దేశీయాలు.

7. *చెట్లు, జంతువులు:* చెట్లపేర్లు కొన్ని వందల్లో ఉంటాయి. అవన్నీ ఇవ్వటం సాధ్యం కాదు. నేరేడు, మారేడు, మామిడి, ఉసిరిక, నెల్లి, చింత, వేప, రాగి, మఱ్ఱిమొదలైనవి పెద్దచెట్లు. చతుష్పాత్తుల్లోను, పాకే జంతువుల్లోను చాలా ఇప్పుడు మనకు తెలిసినవి మొదటినుండి ఉన్నవే: బల్లి, తొండ, పాము, త్రాచు, మొసలి, కప్ప; ఇవి గాక పంది, నాయి (కుక్క), పిల్లి, గాడిద, ముంగిస, ఆవు, ఎనుము, ఎద్దు, గొఱియ, మేక – పెంపుడు జంతువులు. ఈగలు, డోమ (దోమ)లు ఉండేవి. రెక్కలున్నవి: కాకి, పిచ్చిక, చిలుక (< *కిళి), నెమలి, పావురం, డేగ, పందు (రాబందు), గ్రద్ద. ఇక అడవి జంతువులు: పులి, నక్క, జింక, లేడి, ఎలుగు. ద్రావిడులకు సింహం తెలియదు.

8. *శరీరభాగాలు:* కంటికి కనబడే భాగాలకు పేర్లుండేవి– కన్ను, ముక్కు, చెవి, నోరు, పల్లు, నాలుక, పెదవి, నెత్తి, తల, చెయ్యి, కాలు, తొడ, రొమ్ము, మొదలైనవే గాక, కనబడని వాటికి గూడా పేర్లు కొన్ని ఉన్నాయి– మెదడు, ఉల్లం (లోపలిది అనే అర్థంలో; మనస్సుకావచ్చు, హృదయంకావచ్చు), నరం, నెత్తురు, నెరిడె, కండ, మూలగ, ఎమ్ము, కాలేయానికి ప్రా. ద్రా. లో *తలంక్ అనే మాట ఉన్నట్లు ఇతర సోదరభాషలను బట్టి తెలుస్తుంది.

9. *రోగాలు, మందులు:* ముఖ్యంగా మందు (< *మరున్తు)లు చెట్ల (*మరమ్) నించి వచ్చేవి. రోగాల్లో తట్టు, అమ్మ 'smallpox' అప్పటివి. జ్వరానికి బహుశా కాంక (వేడి) అనేవాళ్ళు.

10. *ఇతరాలు:* అమూర్తభావాల్లో ఎఱుక, తెలివి అనే మాటలు ఖచ్చితంగా

ఉండేవి. తలచు, అనుకొను ఆలోచించటానికి; తలచినది తలపు. పదానికి, భాషకు మాట అనేవాళ్ళు. వ్రాయటం (గీకటం), చదవటం అప్పటి మాటలే. కలిమి (భాగ్యం), లేమి (దారిద్ర్యం), చెలిమి, పగ, వగచు, వగ అనేవి సాధారణం. జాతాశౌచానికి పురుడు; నురి మృతాశౌచానికి ఏమనే వాళ్ళో? నాలుగు రంగులపేర్లే ఉండేవి– తెల్ల, నల్ల, ఎఱ్ర, పచ్చ (ఆకుపచ్చ, పసుపుపచ్చ ఆ తర్వాత వచ్చిన భేదం). రుచుల్లో– తియ్య, పుల్ల, ఉప్ప ఉండేవి. *కడు అనే మాటమొదటి అర్థంపోయి దాని బదులు కారం (< సం. క్షార–, ప్రా. ఖార) అనే మాట వచ్చింది.

గ్రహాలపేర్లలో, సూర్యుడికి ప్రొద్దు (< పొఱు+తు) అనీ, చంద్రుడికి నెల అనీ అనేవాళ్ళు. కాలార్థక శబ్దాలు–ప్రొద్దు, నెల అనేవి–వీటివల్ల ఏర్పడ్డవే. మిన్ను, వాన (ఆకాశం), ఎండ, చుక్క (నక్షత్రం), కాలమానంలో పగలు, రేయి, నెల, ఏండు పరిచితపదాలు. గంటలు, నిమిషాలకు మాటలు మనవి కాదు. వాన అర్థం మారింది. నేండు, ఎల్లి, నిన్న, మొన్న, రేపు (ఉదయం), మాపు (సాయంత్రం) పాతమాటలే. కారు అంటే వానలకాలం. మంచు అని ఒకే మాట ఉండేది. దీని అర్థం చలికాలం ఉదయం ఆకులమీద కనిపించే నీరు అని. పొగమంచు, మంచుగడ్డ తరవాత మనం కొత్తభావాలకు సృష్టించుకొన్న మాటలు. మన పూర్వికులు హిమవత్పర్వత ప్రాంతంలోవాళ్ళు కాదని తెలుస్తుంది.

అతిప్రాచీనకాలంనుంచే కొనటం (విలుచు), అమ్మటం, వెల అనేవి మనవాళ్ళకు తెలిసిఉండాలి. సంఖ్యావాచకాల్లో 1 నుండి 10 దాకా ముఖ్య ద్రావిడభాషలన్నిటిలోనూ ఉన్నాయి. వీటిరూపాల్లో తెలుగులో కొన్ని మార్పులు వచ్చాయి. తజ్జన్యాలే ఒకటి, రెండు, మూండు, నాలుగు, ఐందు, ఆఱు, ఏడు, ఎనిమిది (*ఎణ్బది), తొమ్మిది (*తొణ్బది), పది అనేవి. నూఱు పాతమాటే. వేయి/వెయ్యి ఒక్కతెలుగులోనే కనిపిస్తుంది. ఇది దేశ్యశబ్దమేగాని వ్యుత్పత్తి తెలియదు. ఎన్ను అంటే లెక్కపెట్టు అనే అర్థం వచ్చింది.

ఇంతవరకు రేఖామాత్రంగా ప్రదర్శించింది సంస్కృతంతో సంబంధం ఏర్పడకముందు తెలుగు సంస్కృతి స్థూలస్వరూపం. క్రీ. పూ. 5వ శతాబ్ది నుంచి క్రీ. శ. 5వ శతాబ్దిదాకా సంస్కృతప్రాకృతభాషల ద్వారా ఆర్యసంస్కృతి తెలుగునేలను ముంచెత్తింది. శాసనాధారాలనుబట్టి కుందూరి ఈశ్వరదత్తు

ఆనాటి నుంచి తెలుగుదేశంలో సాంఘికరాజకీయ చరిత్రలో వచ్చిన మార్పులను విశ్లేషించి చూపారు (1967 : vii-cxxxvi). శాతవాహనులకాలంలో పరిపాలనా విభాగాలకున్న పేర్లు—హార, ఆహార, రట్ట, పథ, మణ్డల, రాష్ట్ర, విషయ, రాజ్య, సీమ, భోగ అనేవి—అన్నీ సంస్కృతప్రాకృత జన్యాలే. నాడు, వడి అనే దేశ్యశబ్దాలు తరువాతి శాసనాల్లో కనిపిస్తాయి (పై. xxxi-xxxiii). రాజ పురుషుల పేర్లు, గుళ్ళకు, వ్యక్తులకు చేసిన దానాల (ధర్మదాయ దేవదాయ) విధానాన్ని సూచించే మాటలన్నీ దేశ్యాలు కాదు. కొన్ని రకాల పన్నులకు దేశ్యశబ్దాలు తర్వాత కల్పించుకొన్నారు. ఉదా. పెండ్లితెఱ, అమ్మబడి సుంకము (11వ శ.). బహమనీ రాజులు, గోల్కొండ సుల్తానుల కాలంలో భూమిశిస్తుకు, పరిపాలనకు, మతానికి సంబంధించిన మాటలు ఎన్నో పర్షియన్, అరబిక్ భాషల నుంచి వచ్చి చేరాయి. ఆతర్వాత వచ్చిన పాశ్చాత్యభాషా ప్రభావం మనకు పరిచితమే. ఇతర భాషాసంస్కృతులవల్ల తెలుగు ఎంతో సంపన్నమైన భాష అయిందని గుర్తించాలి.

క్రీ.పూ. వెయ్యిసంవత్సరాల కిందటి తెలుగుసంస్కృతి ఆనాటి పాశ్చాత్య సంస్కృతులకంటే ఏమాత్రమూ తీసిపోయింది కాదని తెలుస్తుంది. బహుశా తమిళం, కన్నడం మాట్లాడేవాళ్ళ సంస్కృతి గూడా తెలుగు లాగానే ఉండి ఉండవచ్చు.

## References


Burrow, T. and Emeneau, M. B. 1961. *A Dravidian Etymological Dictionary*. Oxford: Clarendon Press.

____________. 1968. *A Dravidian Etymological Dictionary (Supplement)*. Oxford: Clarendon Press.

____________. 1984. *A Dravidian Etymological Dictionary (Revised)*. Oxford: Clarendon Press.

Emeneau, M.B. 1980 *Language and Linguistic Area*. Essays by Murray B. Emeneau. Selected and introduced by Anwar S. Dil. Stanford: Stanford University Press.

Iswara Dutt, Kunduri. 1967. *Inscriptional Glossary of Andhra Pradesh.* Hyderabad: A.P. Sahitya Akademi.

Krishnamurti, Bh. 1961. *Telugu Verbal Bases: A Comparative and Descriptive Study.* Los Angeles and Berkeley: University of California Press.

'Comparative Dravidian Studies'. In *Current Trends in Linguistics. ed.* By Sebeok, Thomas 5. 409-33. 1985.

'An Overview of Comparative Dravidian Studies Since Current Trends' (1969). In Veneeta Z. Acson and Richard L. Leed (eds.), For Gordon Fairbanks, 212-31. Honolulu: University of Hawaii Press.

Namboodiri, E.V.N. 1976. *Glottochronology (as applied to four Dravidian Languages).* Trivandrum: Sangama.

(ఆంగ్లమూలం: 'Telugu Language and Culture 3000 years ago'. In the Souvenir of XI All-India Conference of Dravidian Linguists, June 5-7, 1981, pp. 1-10. Hyderabad: Department of Linguistics, Osmania University.)

# 19
# తిక్కన పదప్రయోగకోశం

ప్రస్తావన

పదప్రయోగకోశాల వల్ల ప్రయోజనాలేమిటని చాలామంది ప్రశ్నిస్తారు. ఈ ప్రయోజనాలను నన్నయ పదప్రయోగకోశం 'తొలిపలుకు'లో శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు రేఖామాత్రంగా పేర్కొన్నారు. ఈ సంపుటం ఆధారంగా ఆప్రయోజనాలను మరింత వివరించి చూపటమే ఈ ఉపోద్ఘాతరచనలో ఉద్దేశం.

తెలుగు భాషాచరిత్ర రాయటానికి కావ్యభాషలోను, శాసనభాషలోను వచ్చిన పరిణామ క్రమాన్ని గుర్తించాలి. తెలుగుకు సమగ్రభాషాచరిత్ర లేకపోవటానికి పద ప్రయోగకోశాలు, శాసనపదకోశాలు మొన్నమొన్నటివరకు లేకపోవటమే కారణం.

ప్రతిమాటకూ విలక్షణమైన చరిత్ర ఉంటుంది. నామక్రియావిభక్తుల స్వరూపమూ, అర్థమూ కాలక్రమాన మారుతుంటాయి. ఉదా. నన్నయగారి వాడుకలో 'వలయు' ప్రధానక్రియగా గూడా కనిపిస్తుంది. కాని ఎక్కువ ప్రయోగాల్లో క్రియ నుబ్యంతరూపానికి పరంగా 'వలయు' వస్తుంది. 'సాధు రక్ష వలయుఁ జేయ' (అర. 1-30). అంతే గాక 'వలయు' చతుర్థీవిభక్తితో కూడిన నామాన్ని ఆకాంక్షిస్తుంది: 'నాకు సహింపవలయు' (ఆది. 5-21), 'సరిహరింప

వలయును మనకున్' (ఆది. 3-128). ఎక్కడన్నా ప్రథమలో కర్తృపదం రావటం కద్దు: 'నీవ దీనిం జేయవలయు' (ఆది. 6-140). ఇలాటి నన్నయ్య వాడుకలో రెండు మార్పులు వచ్చాయి:

(1) 'వలయు' ఎక్కువగా అన్నంతక్రియ తరవాతే రావటం వల్ల దాంతో కలిసిపోయి ప్రత్యయమాత్రమైంది:

వలయు(న్) → వలెన్ → వాలె/వాలి, ఆలె/ఆలి.

(2) చతుర్థ్యంతనామాకాంక్ష భాషలో పోయి ప్రథమావిభక్తి నామమే కర్తృపదంగా నిలవటం: 'నేను సహించాలి' కాని 'నాకు సహించాలి' కాదు.

ఈమార్పుల్లో రెండోది తిక్కనగారి వాడుకలో తరచుగా కనిపిస్తుంది. 'వలయు', 'వలె', 'వాలె' లుగా ఎప్పుడు మారింది ఇంకా మనకు తెలియదు. పదప్రయోగకోశాలు ఇలాటి పరిశోధనకు సామగ్రినిస్తాయి.

రూపాంతరాలు

కావ్యభాషలో ఇప్పటికన్నా చాలా పదాలకు రూప వైవిధ్యం కనిపిస్తుంది. ఒక పదానికి రూపాంతరాలు మూడు కారణాలవల్ల ఏర్పడ్డవై ఉంటాయి. 1. చారిత్రకంగా పూర్వరూపాలు కొన్ని, అర్వాచీనరూపాలు కొన్ని; ఉదా.: ఎవ్వాఁడు, ఎవ్వఁడు. 2. కవికి సమకాలంలో భిన్నప్రాంతాల ప్రజల వాడుకలో ఏర్పడ్డ ఉచ్చారణభేదాలు. 3. సంఘంలో ఉన్న ఎక్కువ తక్కువలను బట్టి ఏర్పడ్డ వర్గమాండలికాలు. అకసము, సంతసము, కత, మొదలైనవి పామరజనుల వాడుక నుంచి కావ్యభాషలోకి జొరబడి ఉంటాయి. ఇవన్నీ అనియతంగా కలగాపులగంగా కావ్యభాషలో కనిపిస్తాయి. అలాటివి మోతుబరి కవులు వాడితే సాధువులని వ్యాకర్తలన్నారు. కాస్త సన్నకారువాళ్ళు వాడితే అసాధువులన్నారు. 'లోకోక్తీనాం భవేద్యోగో, యదిస్యాచ్ఛ్రుతిరంజనమ్' (వికృతివివేకం, అజం. 82). 'చెవికింపు' గా ఉండటం శ్రోత్రాశ్రయధర్మం గాని భాషాశ్రయధర్మం గాదు. భాషలో సహజపరిణామంలో వచ్చిన రూపాంతరాల మొత్తాన్ని కవులు వాడుకొన్నా, తరుచుదనాన్ని బట్టి కవి సమకాలీనరూపం ఏదో, ఛందస్సుకు సరిపడటానికి వాడుకొన్నదేదో ఊహించవచ్చు. మరీ విరళంగా ఉండి అర్వాచీనకాలంలో ఏర్పడ్డది పూర్వకవుల వాడుకలో ఉంటే ప్రక్షిప్త రూపంగా గుర్తించవచ్చు.

తిక్కన భాషలో రూపాంతరాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. స్థూలంగా తనకు పూర్వమున్న సాహిత్యంలో స్థిరపడ్డ రూపాలను తీసుకొంటూ సమకాలీనమాండలిక రూపాలనుగూడా విస్తృతంగా వాడుకొన్నట్టు కనిపిస్తుంది. కొన్ని మచ్చుకు:

1. సంఖ్యకు పూరణార్థంలో వచ్చేది చారిత్రకంగా 'అగు'. ఇది కాల క్రమాన అవు → అవ → ఓ గా మారింది.

మూఁడగు → మూఁడవు → మూడవ → మూడో

నన్నయ్యగారి వాడుకలో 'అగు' తరచుగా వస్తుంది; '–అవ' ఉన్నా పట్టైన ప్రయోగాలు లేవు. ఇది 'అవు' కావచ్చు. తిక్కనలో '–అగు' చాలా విరళం; '–అవ' చాలా బహుళం. నిజంగా నన్నయ్య కాలానికే '–ఓ' గూడా వచ్చింది. 'మూండో నడవున' (క్రీ. శ. 1108; చూ. కుందూరి ఈశ్వరదత్తు, *శాసనశబ్ద కోశము*; ఓ అనే ఆరోపం కింద). బహుశా జనసామాన్యంలో ఉన్న ఓ ప్రత్యయం గ్రామ్యమని తత్పూర్వరూపాలన్నిటినీ కవులు వాడారు. చదువుకున్నవాళ్ళు బహుశా '–అవ', అని గూడా ఉచ్చరిస్తూ ఉండవచ్చు. నన్నయ తనకు ముందున్న సాహిత్యంలో '–అగు' ఉంటే దాన్ని వాడుతూ తన కాలంలో వచ్చిన 'అవు', 'అవ' రూపాలు గూడా అక్కడక్కడ వాడుకున్నాడు. తిక్కనలో 'అవు' కనిపించదు. అనాటి శిష్టభాషలో ఉన్న 'అవ' రూపమే ప్రచురంగా వాడినట్టు తోస్తుంది.

2. –వురు → –గురు, సంఖ్యావాచకాలకు మహదర్థంలో చేరే ప్రత్యయం. –వురు మూలరూపం, –గురు దాని పరిణామరూపం, (తమిళం. –వర్, కన్నడం. – వర్/–బర్). తిక్కనలో ఏడ్వురు 10ప్రయోగాలు, ఏవురు 80 కనిపిస్తాయి. ఏడ్గురు, ఏడుగురు అసలులేవు. ఏగురు– ఒక ప్రయోగం (ద్రో. 5–117) ప్రక్షిప్తం కావచ్చు. నన్నయ్యలో ఏవురు 63, ఏగురు 2, ఏడ్వురు 6 కనిపిస్తాయి. 'ఏడ్గురు' లేదు. ఇక్కడ గూడా ఏగురు ప్రక్షిప్తరూపమై ఉండాలి. ఈ విధంగా తరచుదనాన్ని బట్టి కవి ఉద్దేశించిన రూపమేదో, ప్రక్షిప్తరూపమేదో నిరూపించటానికి పదప్రయోగకోశాలు ఉపయోగపడతాయి.

3. అరయు, అరయు.

4. అప్పుడు, అపుడు, అప్డు (చివరి రెండు రూపాలూ ప్రాచీన మాండలికాలని తోస్తుంది. వీటికి విభక్తిప్రత్యయాలు చేరవు. '*అపుటికి, *అప్టికి' లాగా.)

5. ఆతఁడు, అతఁడు; ఈతఁడు, ఇతఁడు.

6. అక్కట, అకట.

7. ఆచోటు, అచ్చోటు, అచ్చొటు, అచ్చటు, అచటు. (సప్తమ్యంతరూపమే తరవాత ప్రాతిపదిక అయింది: అచ్చట. తిక్కనలో 'అచ్చటన్, అచటన్' రూపాలు ఎక్కువగా ఉన్నాయి).

8. అక్కటాదుల గణంలో 'అమ్మ, అక్క, అప్ప, అయ్య, అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని' చిన్నయసూరి చేర్చటం పొరపాటనిపిస్తుంది (ప్రకీర్ణ. 8) 'అమ, అక, అని, ఇని' లాటివి కవిత్రయప్రయోగాల్లో లేవు. ఆయమ, ఈయమ, ఆయన, ఈయన అనే చోట్ల వృత్తిలోనే జడ్డకు లోపం.

9. ఇంక, ఇఁక – ఇవి రూపాంతరాలయినా అర్థభేదం ఏర్పడ్డది. 'ఇంకను' అనవచ్చు గాని 'ఇఁకను' అని తిక్కనలో ప్రయోగాలులేవు. నేటి వాడుక లోనూ ఈఅర్థభేదం నిల్చిఉంది: ఇంకా రాలేదు, ఇక రాడు; ఇంకా చెప్పు, ఇక చెప్పు.

10. అట్టులు, అటులు, అట్లు; ఇట్టులు, ఇటులు, ఇట్లు; ఎట్టులు, ఎటులు, ఎట్లు (అట్లు, మొదలైనవి చాలా తరచుగా వస్తాయి).

11. ఈయకొను, ఇయ్యకొను

12. ఎడ్డ, ఎడ

13. ఏది, ఎద్ది, ఎది; ఏవి, ఎవ్వి, ఎవి.

14. ఏవాఁడు చాలాతరచుగా (ఎవ్వాఁడు యత్తదర్థక సంబంధంలోనూ, ఎవ్వఁడు ప్రశ్నార్థకంగాను ప్రచురంగా వస్తున్నట్లనిపిస్తుంది). ఎవ్వాఁడు, ఎవ్వఁడు, ఎవఁడు (చివరిరూపం తిక్కనలో విరళం).

15. ఎమ్ము, ఎముక

16. ఎమ్మెయి, ఎమ్మె; అలానే అమ్మెయి, మొదలైనవి. 'ఆమెయి' లాటి పూర్వరూపాలు చాలా కొద్ది.

17. ఎఱఁగి, ఎరఁగి (–ఱ– కార రూపం ప్రాచీనం. కాని తిక్కన కాలానికి సాధు శకట రేఫాల భేదం పోయిందనటానికి ఇవి తార్కాణం: ప్రాసస్థానాల్లోనూ ఈతేడా కనిపిస్తుంది).

18. ఎఱియు, ఎరియు (సాధురేఫ ప్రాచీనం)

19. ఎఱ్ఱ, ఎఱ (అద్విరుక్తరూపం ప్రాచీనం)

20. ఏమి, ఏమిటి.

21. ఒక్క, ఒక.

22. ఒరఁగు, ఒఱఁగు (శకట రేఫమే ప్రాచీనం).

23. ఒరుఁడు, ఒరువుఁడు. (తమిళం: ఒరువన్. ప్రాచీన ద్రావిడరూపం *ఒరువన్టు).

24. ఏను, ఐదు వీటి చరిత్ర మరీ విచిత్రమైనది.

ప్రాచీనదక్షిణద్రావిడ రూపం *అయ్న్తు;
మూలధాతువు *అయ్మ్;
అమహత్ప్రత్యయం 'దు' (< తు).

తమిళ మలయాళాల్లో అయ్న్దు → అయ్న్జు → అంజాగా మారింది. కన్నడంలో అనునాసికలోపం వచ్చి 'అయ్దు' అయింది. 'ఐదు' ప్రాచీన సాహిత్యంలో ఉంటే 'ఐఁదు, అయిఁదు'గా ఉండాలి. ఎక్కడా అనుస్వారం పొడకనిపించదు. ప్రాచీనద్రా. *అయ్- తెలుగులో ఏ/ఐలుగా కనిపిస్తుంది. చేయి/కై-, మేను/మై, ఏఁ(బది)/ఐదు, వేయు/నై-చు ఇలాటివి. *అయ్మ్ తెలుగులో 'ఏను'గా మారింది; *అయ్-వర్ (మహత్ప్రత్యయం: -వర్) → ఏవురు అవుతుంది.

నన్నయ్య వాడుకలో 'అయిదు' లేదు; 'ఐదు' 4 చోట్ల వచ్చింది; 'ఏను'కు 24 ప్రయోగాలు. తిక్కనలో ఏను (8), ఐదు (75), అయిదు (16). -దు స్థానంలో -వురు వస్తుంది, 'ఏవురు' అని. ఐదుగురు చాలా అర్వాచీనం. నన్నయ్య పద ప్రయోగకోశంలో ఉన్న ఐదుగురు (అర. 3-139) తప్పనిసరిగా ప్రక్షిప్తరూపం. అయితే అరసున్నా ఏమయింది? సామాన్యజనవ్యవహారంలో అనునాసిక్యం పోయింతరవాతే సాహిత్యకారులు 'ఐదు' శబ్దాన్ని కావ్యభాషలో ప్రవేశపెట్టి ఉండాలి. 'ఏను' వ్యస్తరూపం వాడుక క్రమంగాపోయి సమాసాల్లో నిల్చింది: ఏఁబది, ఏభై, మొదలైనవి.

ఈవిధంగా తులనాత్మకపరిశోధనకు, భాషాచరిత్రనిర్మాణానికి, సాధుపాఠనిర్ణయానికి, భాషాపరిణామశీలం అర్థంచేసుకోటానికి పదప్రయోగకోశాలు మౌలికసామాగ్రి.

సమాసాలు, పలుకుబళ్ళు

'పలుకుల పొందు', 'పాతపడ్డ మాటల'తోనైనా కొత్త పదబంధాలు సృష్టించటం, సంస్కృతంలోనే చెప్పటానికి సాధ్యమౌతాయనిపించే ఉదాత్త భావాలను గూడా 'అలంతి యలంతి మాటల'తో 'కాహలసంధించినట్లు' చెప్పటం తిక్కనగారి కవితాశిల్పం (conscious craftsmanship)లో ముఖ్య ప్రక్రియలు. తిక్కన పదాల కూర్పులో తెలుగువారు కొత్తమాటలు సృష్టించుకొనే తీరుతెన్నులు ప్రతిబింబిస్తాయి. అచ్చతెలుగు కావ్యాల రచయితలు కల్పించిన 'కడలిమొలనూలిచేడియ కనినపడుచు' లాంటి దీర్ఘసమాసాలు తెలుగులో అతకవు. తిక్కన పదబంధాలు మామూలుగా రెండుమూడు మాటలతో కూర్చినవి. పొడిమాటలు అంకెలలాంటివి; పదబంధాలు సంఖ్యల లాంటివి. అంకెలను, స్థానాన్ని బట్టి వాటి విలువలను, కలిపే తీరును మనం గుర్తు పెట్టుకోవాలి గాని సంఖ్యలను గుర్తుపెట్టుకోనక్కరలేదు. ఏకొత్త సంఖ్యనైనా మనం సృష్టించగలం. అలానే భాషలో పొడిమాటలు నేర్చుకొంటేనే గాని రావు. వాటి కలయికతో పదబంధాలు సృష్టించే తీర్లు మనకు భాషాజ్ఞానగతంగా అలవడుతాయి. ప్రతి కొత్తసమాసాన్నీ మనం గుర్తుపెట్టుకోము. 'మట్టిబొమ్మ' అంటే 'మట్టితో చేసిన బొమ్మ'. 'మట్టి', 'బొమ్మ' అనే మాటలు నేర్చుకోవాలి: అరెండూ ఆవరసలో కలిస్తే వాటిమధ్య 'తో చేసిన/చేసే' అనే సంబంధం గతార్థ మౌతుంది. ఈనియమం తెలుగు వచ్చినవాళ్ళందరికీ వారికి తెలియకుండా ప్రవర్తించే సమాససూత్రం. దాన్నిబట్టి 'గాజుసీసా, వెండికంచం, స్టీలుకుర్చీ' లాటి పదబంధాలు అంతకుముందు భాషలో విననివి కూడా సృష్టించు కొంటారు. ప్రతి భాషకూ విలక్షణంగా ఈసృజనాత్మకశక్తి ఉంటుంది. 'రాముడు కత్తితో కొట్టాడు' అనే వాక్యాన్ని నామపదబంధంగా మారిస్తే 'రాముడు కొట్టిన కత్తి' అనవచ్చు; కాని 'రాముడు సీతతో వెళ్ళాడు' అన్న వాక్యాన్ని '*రాముడు వెళ్ళిన సీత' అని సంక్షేపించటానికి వీల్లేదు. దీనికి మన భాషాజ్ఞానంలో ఒక నియమం ఉంది. ఉపకరణార్థంలో ధాతుజన్యవిశేషణం విశేష్యంతో సమసిస్తుంది గాని సహార్థంలో సమసించదు. ఇలాటి వ్యాకరణ రహస్యాలు మన సాంప్రదాయికవైయాకరణులు పట్టించుకోలేదు. పదాల రూప నిష్పత్తితోనే మన వ్యాకరణాలు ఆగిపోతాయి. తిక్కన పదబంధనిర్మాణంలో ఉన్న ఈసూత్రాలను గ్రహించి తెలుగు నుడికారానికి ముప్పు రాకుండా

'పాతవడ్డ మాటలతో' తన 'నేర్పుచూపి' కొత్తసమాసాలు కూర్చి తెలుగులో ఉన్న సృజనాత్మకశక్తిని ప్రదర్శించాడు. మాటలెప్పుడూ పాతవే. మాటలను ఏకవీ కొత్తగా సృష్టించలేడు. మాటల పొందికతో పదబంధాలు (భాషానియమాల నతిక్రమించనంతవరకు) ఎన్నైనా కొత్తవి సృష్టించవచ్చు. తిక్కన 'ఇంపారెడు వల్కులు'ను ఏరుకొంటాడు. 'అప్పులుకుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ జేరువనేరఁగా వలయు' నన్నాడు. ఈకింది మచ్చు పదబంధాల్లో ఈనేర్పు స్వరూపం గమనించవచ్చు.

అరదంబుల యిఱుకటంబు

అమ్ములవాన

అవ్వేడంద వాఁతియమ్మ

అత్తొలితాఁకు

తమ్ముఁగుబ్బిలు

అందని ప్రాఁకులవండ్లు

అంపపాన్పు

అంపమూడమంచు

అంపపెనుజీకఁటి

అరువుఁదెవులు = క్షయవ్యాధి

కన్నాకు = కంటిరెప్ప, రక్షణ (నుడికారం)

అలమందలు

అవులనేయి [అవుపాలు = అవునుంచి తీసిన పాలు; అవునేయి = అవునుంచి తీసిన నేయి కాదు. అవుపాలనుంచి తీసిన నేయి. దీన్ని వైయాకరణులు ఏసమాసం అంటారో?]

ఒకిక్కండ్లవారలు

ఇంతలింతలు [ఇది సమాసమే అనాలి: కాని సమాసవిభక్తికి లోపం రాలేదు: ఇంతలు + ఇంతలు.]

ఇంతలంతలు–పనులు

ఇనుపగుండియకు

ఈఁగకాలియంతయేనియి

ఈ పెంటితనము

ఉల్లికుట్టుమాటలు (మనసు నొప్పించే మాటలు; ఉల్లి = ఉల్లం)
ఎండకన్నువానకన్నెఱుగని (పురపురంధ్రులు) [ఎండన్, కన్నెఱంగని
అంటే చాలదు; ఎండకన్ను వానకన్ను ఏసమాసాలౌతాయో?
'కన్ను' అంటే చూడటం, చూపు అని అర్థం చెప్పుకోవాలి:
ఎండపొడా, వానపొడా ఎరుగని స్త్రీలు].
ఎడ్డకత్తెరయు, నాలుకబెల్లము
(గాలి) కెత్తిన చావవోలె
ఎత్తినడుగులన్ = ప్రయాణానికి సిద్ధంగా
ఎదురుచూచు (శబ్దపల్లవం)
ఎనమన్నూలు (యథాప్రయోగంగా గ్రాహ్యం)
ఎరగలిచిచ్చు
ఎఱకలగాలి
ఏలినవాఁడు
ఒప్పునివారు

అమూర్తమైన భావాలకు మనకు చప్పున తెలుగుమాటలు తట్టవు: సుఖం, దుఃఖం, రాగం, ద్వేషం, ఉపాయం, అపాయం, ఆశ్చర్యం, సంకోచం, గర్వం, శౌర్యం, ధైర్యం, మొదలైనవి. కాని తిక్కనకాలంలో జానపదుల వాడుకలో ఇలాటివాటన్నిటికి తెలుగుమాటలే ఉండేవి. తిక్కనగారి వాడుక చూస్తే దేశ్యశబ్దాలతో భావశబలతనెంతగా సాధించవచ్చో తెలుస్తుంది: అనువు, అలమట, అర, ఈసు, ఉక్కు, ఉత్తలము, ఉబ్బు, ఉమ్మలిక, ఏడ్తెఱ, ఏవు, తొందరపాటు, చలము, వెరవు, తగవు, పెంపు, వగవు, వెరవు, వెఱఁగు, వెఱవు, మొదలైనవి కువ్వతివ్వలు. ఇలాటివి ఇప్పటి వాడుకలో చ్యుతమైపోయినాయి. వీటి అర్థచ్ఛాయలు తెలుసుకోవాలంటే సోదరభాషల్లో సజాతీయశబ్దాల అర్థాలతో పోల్చి చూసుకొంటే గాని బాగా తెలియదు. తిక్కన పదసంఘటనలో ఒక్క పొల్లు మాట కూడా కనిపించదు. తిక్కన రచన 'శిల్పం' గాని, 'చిత్రలేఖనం' గాదు. ఎంత దగ్గరికిపోయి పరామర్శించి చూస్తే అన్ని నిర్మాణవిశేషాలు కనిపిస్తాయి.

అర్థనిర్ణయం

ఒక దేశ్యశబ్దానికి అర్థం నిర్ణయించాలంటే ఆమాట వాడిన సమకాలీన ప్రయోగాలన్నిటినీ పరిశీలించి, ఆసందర్భాలన్నిటికీ సరిపడే అర్థం చెప్పుకోటం

ఒక పద్ధతి. సోదరభాషల్లో ఆమాటకు తోబుట్టువులుంటే వాటిఅర్థంలో పోల్చి మన భాషలో ఉన్న అర్థంతో అది ఎంతవరకు సరిపడుతుందో చూడటం రెండో పద్ధతి. అర్థనిర్ణయంలోనూ అర్థవిపరిణామాన్ని గుర్తించటంలోనూ, ఈరెండు పద్ధతులూ వినియోగిస్తాయి. సోదరభాషలన్నిటికి సరిపడ్డ అర్థం ప్రాథమికమై ఉండాలి. ఒక్కో భాషకు విలక్షణమైన అర్థం దానినుంచి వాడుకలో మార్పులవల్ల వచ్చిందై ఉండాలి. ఈరకమైన కృషిలో ఒక కవి తన రచనలో వాడిన మాటకున్న ప్రయోగసర్వస్వాన్ని ఒకచోటికి తెచ్చి చూపటానికి పదప్రయోగకోశాలు చాలా అవసరం. ఉదాహరణకు చూడండి:

'అట్ట = వి. కబంధము, మొండెము (కర్ణ. 3-371)', అని శ్రీ సూర్య రాయాంధ్ర నిఘంటువు (సూ.ని) ఒకే ప్రయోగం ఇచ్చింది. కన్నడంలో 'అట్టె' దీనికి తోబుట్టువు. 'జీవశేషం ఉండి కదలికలేని మొండెం' అని అక్కడిచ్చిన అర్థం. తెలుగులో కూడా అర్థాన్ని ఇలా సవరించకపోతే అసమగ్రం అవుతుంది. తిక్కనలో 'అట్టలాడు' అని చాలా ప్రయోగాలున్నాయి. అలానే 'అడరెడు నట్టయు' అంటాడు (అడు, అడరు = కదలు). అట్టలాడు ('అల్లాడు' లాగా) వేరే ఆరోపంగా కూడా కోశాల్లో ఇవ్వాలి.

ఆడు అనే రూపం చారిత్రకంగా నాలుగు ధాతువుల కూడలి. ఆడు[1] = కదలు, చలించు, నర్తించు (అనుయోగక్రియగా కూడా వస్తుంది. ఉదా. 'అల్లాడు'); ఆడు[2] = అను, చెప్పు (కన్నడం: ఆడు); ఆడు[3] = స్నానంచేయు (తమి. కన్నడం ఆట్); ఆడు[4] = నాటుకొను (బాణం, మొదలైనవి). ఇది 'నాడు' అనే శబ్దం రూపాంతరం. ఈనాలుగూ ఒకే ధాతువు అర్థాలుగా శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఉన్నది. (తెలుగులో చాలా శబ్దాలకు పదాది నకారం లోపించిన రూపాంతరాలు కూడా ఉన్నాయి. అవుడు < నవుడు, ఈఁగు < నీఁగు, ఈలుగు < నీలుగు). ప్రయోగాలు తక్కువ ఉన్నప్పుడు అర్థనిర్ణయం కష్టమౌతుంది. అలాటి శబ్దాలను గుర్తించి పరిశోధించటానికి పదప్రయోగ కోశాలు పనికివస్తాయి. ఈసంపుటంలో నాకు కనబడ్డవి కొన్ని:

ఈరువు = మాంసం అని సూ.ని. 'పిల్లి పట్టిన యీరువు సేసియున్నన్' (ఉద్యో. 2-35)

ఉదరిండ్లు = ? సూ. ని., శ.ర., లలో లేదు. 'గొడుగులు నుదరిండ్లు ముడివడ' (అను. 4-333).

ఉల్లిమిఱుతన్, ఎనుకొలుచు/ఎనుకోలు, ఎరకళ్ళు, ఎరవళులు, మొదలైనవి ఇప్పటి కోశాల్లో కనిపించలేదు.

ఏదు (క్రి.) 'నశించు, ఉడుగు' అనే అర్థాలు కోశాల్లో ఇచ్చారు. కాని ప్రయోగాలు పరిశీలిస్తే ఈక్రియకు కర్తలుగా అమూర్తభావాలను తెలిపే శబ్దాలే (అమహన్నపుంసకాలు) వస్తాయి గాని, మహద్వాచక కర్తలుండవు; ఉదా.: వగపేదు, పెంపేదు, సొంపేదు, వెరవేదు, ఇత్యాది. కాని 'వారేదిరి' లాటి ప్రయోగాలు లేవు. ఈవిశేషం గూడా అర్థనిర్ణయంలో చేర్చాలి. లేకపోతే చచ్చిన మాటలను ఉజ్జీవింపజేసే ఆధునికకవులు తప్పు ప్రయోగాలు చేస్తారు.

అర్థపరిణామం

ప్రయోగాలు పరిశీలిస్తే తిక్కన వాడుకలో ఉన్న మాటల అర్థాలు అర్వాచీన కాలంలో మారిపోయినట్టు తెలుస్తుంది. ప్రయోగాన్నిబట్టి ఒక మాటకు రెండర్థాలు సరిపడుతుంటే – ఒకటి వక్త ఉద్దేశించింది, ఒకటి శ్రోతకు తెలిసింది– కాలక్రమాన ఒక అర్థం ఇంకో అర్థంగా మారుతుంది. సందర్భాలనుబట్టి వక్తృశ్రోతలమధ్య అర్థావగాహనలో ఏర్పడే అస్పష్టత అర్థవిపరిణామ హేతువు. ఇప్పుడు 'తగవులాడుట' అంటే పోట్లాట. అప్పుడు 'ధర్మం కోసం చేసే వాగ్వాదం'; అలానే 'పోట్లాట' ఆయుధపు పోట్లతో చేసేది. మాటలతోనైనా ఇప్పుడు పోట్లాడుకోవచ్చు. ఈసంపుటంలో వచ్చిన కొన్ని ఉదాహరణలు:

అరుదు, అరిది = వింత, అసాధ్యం (ఇప్పుడు అసామాన్యం)

అగపడు = ఎదురుపడి లోబడటం, వశపడటం. (ఇప్పుడు ఎదురుపడటం, కనబడటం అని. ఈసందిగ్ధార్థసందర్భాలు తిక్కనలో కనిపిస్తాయి.)

అలవడు = సరిపడు, ప్రయత్నంతో నేర్చుకొంటే సాధ్యపడు: అలవరించు = నేర్పు. (ఇప్పుడు ప్రయత్నం లేకుండా ఏర్పడే ప్రవర్తన.)

ఉమ్మడి = 'ఒక్కుమ్మడి' అనే చోటనే గాని వ్యస్తంగాలేదు. అనేకులు ఏకకాలంలో ఒక పని చేసినప్పుడు అవ్యయంగా కాలార్థంలో వస్తుంది. (ఇప్పుడు అనేక కర్తృ సాపేక్షంగా వ్యస్తంగా వస్తున్నది.)

భాషలో అర్థపరిణామశీలం తెలుసుకోటానికి పదప్రయోగకోశాలు అవసరం.

వ్యాకరణవిశేషాలు

సాంప్రదాయిక వైయాకరణులు ప్రకృతిప్రత్యయరూపనిష్పత్తితో తృప్తి పొందుతారు. వాళ్ళు సొంత కొలబద్దలను బట్టి సాధ్వసాధు రూపనిర్ణయం గూడా జేస్తారు. కాని భాషలో ఇంకా ఎన్నో వ్యాకరణవిశేషాలున్నాయి. కారక సంబంధాలు, ఏక్రియలకు ఏనామవిభక్తులతో ఏరకమైన సంబంధం ఉంది, పదబంధనిర్మాణ సూత్రాలేమిటి, చను, కూడు, వచ్చు, నేర్చు, చాలు, వలయు మొదలైన సహాయక్రియలవల్ల మన క్రియాస్వరూపం ఎలా మారిపోయింది, వాక్యానికి వాక్యావయవాలకు సంబంధం ఏమిటి- ఇలాటివన్నీ వ్యాకరణ విషయాలే. పదనిష్పత్తి ప్రక్రియలోనూ మన వ్యాకరణాలు ఇంకా అసమగ్రాలని అందరూ ఒప్పుకొన్నదే. తిక్కన భాషకు సమగ్రమైన వర్ణనాత్మకవ్యాకరణం రాయాలంటే పదిపదిహేను సిద్ధాంతవ్యాసాలకు సరిపడ్డ సామగ్రి ఈ పద ప్రయోగకోశంలో దొరుకుతుంది. కొన్ని స్థూలంగా యాదృచ్ఛికంగా నేను చూసిన విశేషాలు:

అ) అన్ని ధాతువులతోనూ అన్ని క్రియావిభక్తులు చేరిన సమాప కాసమాపక క్రియలు కనిపించవు.

ఆ) శత్రర్థకరూపాలు భూతతద్ధర్మాలతో పోలిస్తే చాలా విరళం.

ఇ) ఆనంతర్యంలో –డు కొన్ని ధాతువులకే వస్తుంది; ఉదా. *ఆడుగుడు లేదు.

ఈ) అన్వాదుల్లో 'ఇయుడాగమ' రూపాలే ఎక్కువ. 'అనె, అనెడు' లాటివి చాలా తక్కువ.

తిక్కనలో కృత్తద్ధితప్రత్యయాలనుగూర్చిన విశేషాలు కనిపిస్తాయి. పగతుఁడు, విల్తుఁడు శబ్దాల్లో ఉన్న –తుఁడు ప్రత్యయమూ, అతఁడు, ఈతఁడు, మొదలైన చోట్ల ఉన్న –తఁడు ప్రత్యయమూ ఒకేమూలం "*తన్ఞ' నుంచి ఏర్పడి ఉంటాయి: (తమిళం; ఒరుత్తన్ < *ఒరుత్తన్ఞ). ఇది మహదేక వచన ప్రత్యయం.

అకొండున్, అండేని, మొదలైన రూపాలనుబట్టి అన్వాదులకు పరమైన 'ద' 'డ' గా మారిన మాండలికం ఒకటి ప్రాచీనభాషలో ఉండి ఉండాలి. 'రు' వర్ణానికి ముందే 'ద' వికల్పంగా 'డ' అవుతుందని రాసిన లక్షణం అసమగ్రం.

వ్యాకర్తలు 'ఉండిన' నుంచి 'ఉన్న' నిష్పన్నం చేశారు. ఉన్నే, ఉన్న, ఉన్నన్, ఉందురు, ఉండునే, ఉండిన, ఉండినన్, ఉండుదురు, రూపాలను పోల్చి చూస్తే వర్ణనాత్మకంగా ఉండు, ఉన్- అని రెండు ధాతువులు తెలుగులో ఉన్నాయని చెప్పాలి.

'ఉన్' అన్వాదిగణానికి చెందినది. దీనికి ఇద్వ్యక్ర ముత్తు రూపాలు (ఉనిరి, ఉనియె, ఉనక మొదలైనవి) లేవు. అందువల్ల న్యూనక్రియ (defective verb). విను : వినికి, మను: మనికి లాగా 'ఉనికి' అనే కృద్రూపం ఉను + ఇకి వల్ల ఏర్పడ్డది. పాఁవరమ్ము (పాఁప + అమ్ము), ఇందాఁక, ఇన్నాళ్ళు, ఇన్నూరు, మొదలైన చోట్ల సంధివిశేషాలున్నాయి. కృత్తద్ధితాల్లో విడుదల, ఇల్లడము, అలసట, ఊరట, ఏఁకట, ఒడ్డనము, ఎనమండ్రు, మొదలైన లక్ష్యసామగ్రి సేకరించాలి. ఎదగాగమం ఎక్కువగా భవిష్యదర్థంలో కనిపిస్తుంది.

తిక్కన వాడిన విశేషణాలు, విశేష్యాలు, క్రియలు, అవ్యయాలు, కారకవిశేషాలు, తద్భవదేశ్యాలు, అన్యదేశ్యాలు (త్రాసు, మొదలైనవి), సంయుక్తక్రియలు, శబ్దపల్లవాలు, నుడికారాలు, సామెతలు, వాక్యాలు, ఉపవాక్యాలు, పదబంధాలూ, కృత్తద్ధితాలు- వీటిల్లో ఒక్కొక్క విషయాన్ని గురించి గాఢమైన పరిశీలన చేస్తే తెలుగు భాషాచరిత్రకు ఉపయోగించే విశేషాలెన్నో వెలువడుతాయి.

పదప్రయోగకోశాలు మౌలికగ్రంథాలు. వాటిని ఉపయోగించేవాళ్ళ సంఖ్య తక్కువైనా వాటి ప్రయోజనం ఎన్ని శతాబ్దాలకు గూడా తరగనిది.

(గ్రంథపరిచయం: తిక్కనపదప్రయోగకోశం II హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ. 1971.)

# 20

# తిక్కన పదసంపద

''శ్రీయన గౌరినాఁ బరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప, భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్''

అనే పద్యంతో భారత రచనకు ఉపక్రమించాడు తిక్కనమహాకవి. ఈపద్యంలో హరిహరాత్మకమైన మూర్తిని భక్తజనం ''విష్ణు రూపాయ'' ''నమః శివాయ'' అని ఆరాధిస్తారని ఒకే ''నమః'' శబ్దం రెండు పేర్లకు అన్వయించేట్టు ప్రయోగించాడు. 'విష్ణు రూపాయ నమః' అని కొందరు ఆరాధిస్తే, మరి కొందరు 'నమః శివాయ' అని అదే దైవాన్ని ఆరాధిస్తారుట. హరిహరాత్మకమైన మూర్తి ఒక్కటే కాబట్టి ఇవి రెండు నమస్కారాలు కాదు. ఇక్కడే తెలుగు క్రియాపదం వాడవలసివస్తే ఈసౌలభ్యం సాధ్యమయ్యేది కాదు. హరిహరాభేదం ఆపరతత్త్వం లోనే గాకుండా ఆరాధించేవాళ్ళ మనసుల్లో గూడా ఉన్నదని చెప్పటం తిక్కన ఉద్దేశం. తిక్కన శిల్పనైపుణ్యానికి మొదటిపద్యంలోనే దొరికే తార్కాణం ఇది.

వైదికమతానికీ సంస్కృతభాషకూ ముడిపెట్టి వీరశైవకవులు శైవమతంతో పాటు దేశిచ్ఛందస్సులను జానుతెనుగును ప్రోత్సహించాలనే ఉద్యమం లేవ దీశారు. కాని జానుతెనుగులో రాయాలన్న ప్రతిజ్ఞను నిర్వహించలేకపోయారు.

వైదికమతాన్ని హరిహరనాథతత్వంతో బలపరుస్తూ జానుతెనుగును మతోద్యమ భాగంగా గాక సంస్కృతానికి తీసిపోని రచనోపకరణంగా తిక్కన నిరూపించాడు. మతవిషయంలోనూ, భాషా విషయంలోనూ అతివాదులను తిక్కన ఓడించాడు.

తిక్కన కవితామహత్త్వాన్ని కేతన మొదలు శ్రీశ్రీదాకా అంతా మెచ్చుకొన్న వాళ్ళే. తిక్కనది 'అపూర్వార్థశబ్దచారుకవిత' అని కేతన. 'తనకావించిన సృష్టి తక్కొరుల చేతంగాదు' అని ఎర్రన, 'రసాభ్యుచిత బంధం' అని శ్రీనాథుడు, 'కవిబ్రహ్మ', 'ప్రణుత బహుదేశ కవిరాజి' అని పినవీరభద్రుడు ప్రశంసించారు.

భావానికి సరిపడ్డ మాటలు ఏరుకోటం, ఆమాటలు 'అపూర్వార్థం' ఇచ్చేట్టు 'సరిగ్రుచ్చ' గలగటం ఉత్తమకవిలక్షణం అంటాడు తిక్కన.

'పలుకుల పొందు' అనేది తిక్కన రచనాశిల్పాన్ని నిర్వహించే పారిభాషిక పదం. 'ప్రాంతవడ్డ మాటలఁ దమనేర్పు చూపి' పఠితలకు మనోవికాసం కలిగించ లేకపోవటం కుకవిలక్షణం అంటాడు. విమర్శకులు దీనికి విపరీతార్థం కల్పించి పాతమాటలను తిక్కన వర్జించమన్నాడని చెప్పారు. పాడిమాటలు ఎప్పుడూ పాతవే – కన్ను, కాలు, ఇల్లు, వాకిలి, మొదలైనవి. పాడిమాటలు అంకెల లాంటివి. ఒకటి, రెండు, మూడు, నుంచి సున్నా దాకా లెక్కపెట్టే అంకెలకు సూత్రాలుండవు. వీటిని కలపటానికి సూత్రాలుంటాయి. ఆసూత్రాలవల్ల ఏర్పడే సంఖ్యలు అనంతం. అలాంటి పదాల కలయిక వల్ల కొత్త పదబంధాలు, వాక్యాలు ఏర్పడతాయి. పదబంధాలు మూడురకాలు: సమాసాలు, నుడికారాలు, శబ్దిపల్లవాలు అని. 'అంపపాన్పు' అంటే అమ్ములతో చేసిన పాన్పు. 'మట్టిబొమ్మ' మట్టితో చేసిన బొమ్మ. ఈ సమాసగతమైన పదసంబంధం సూత్రబద్ధం కాబట్టి అదే నమూనాపై బంగారపుఉంగరం, వెండికంచం, గాజుతలుపు, స్టీలుకుర్చీ లాంటి సమాసాలు సామాన్యులు కూడా వాడుకలో సృష్టించుకొంటారు. రెండు మూడు మాటలు కలిసి ఆమాటల అర్థం కంటె విలక్షణమైన అర్థం ఆకలయికకు వస్తే, దాన్ని నుడికారం అంటారు. 'మెత్తనిపులి', 'కొంగజపం' ఇలాంటివి. అందువల్ల 'పెద్దచెరువు' సమాసం; 'పెద్దమనిషి' నుడికారం. శబ్దపల్లవాల్లో చివరి అవయవంగా ఏదన్నా క్రియాధాతువు ఉంటుంది. మాట్లాడు, పోట్లాడు, దిగజారు వంటివి. ఇక్కడ కూడా అవయవపదాలకంటే విలక్షణమైన అర్థం శబ్దపల్లవానికి వస్తుంది కాబట్టి అదీ నుడికారమే. ఈభాషాగతమైన సృజనాత్మక

...ఫి ప్రతిభావంతుడైన కవి తన రచనాశిల్పంలో ఎన్నోరకాల చమత్కార ...రంగా వాడుకొంటాడు.

కేతన చెప్పినట్లు తిక్కనది 'అపూర్వార్థశబ్దకవిత'. ఇక్కడ అర్థం అపూర్వం కాని శబ్దం అపూర్వం కాదు. అపూర్వార్థంవల్ల శబ్దాలకలయిక కూడా అపూర్వ ...వౌతుంది.

ఇతరకవులు సంస్కృతసమాసాలతో గాని సాధ్యం కాదనుకొనే భావాలను తిక్కన 'అలతిఅలతి ...' ...హల సంధించినట్లు కొత్త పలుకుబళ్ళను సృష్టించాడు. మచ్చుకు – యుద్ధరంగంలో రథాల గమనాగమన సమ్మర్దాన్ని (trafic jam) 'అరదంబుల యిఱుకటంబు' అంటాడు. శరవర్షానికి 'అమ్ములవాన' అనీ శర పరంపరలకు 'అంపపెనుజీకటి', 'అంపమూడ మంచు' అనీ అంటాడు. వాగాస్త్రానికి 'పాఁపతూపు', 'పాఁపరమ్ము', 'పాముటమ్ము' అనీ, ఉదయాద్రికి 'పొడువు గొండ' అనీ అంటాడు. 'ప్రేలరిమాటలు', 'ప్రేముడి పలుకులు', 'పలుగడలు', 'నెత్తురుమడువు', 'కయ్యపునేల' – ఇలాంటి తెలుగు సమాసాలు కొన్నివేలు జానుతెనుగులో తిక్కన సృష్టించాడు. ఇవి తెలుగులో ఆలోచించి కూర్చినవి కాని, సంస్కృతానువాదాలు కాదు.

ఇక తెలుగు నుడికారాలు అసంఖ్యాకం. ఇనుపగుండియ, మెత్తనిపులి, పెట్టనికోట, ఎండకన్ను వానకన్నెఱుఁగని (పురపురంధ్రులు), గుండెకాయ, ఉల్లి కుట్టుమాటలు (ఇక్కడ ఉల్లి అంటే ఉల్లం; మనస్సును నొప్పించే మాటలని), పీనుగుపెంటలు, కుప్పనకూరలు, మైమఱువు, రక్కసతాల్మి, కల్లజూదము, కన్నాకు, చలిపందిరి, చెలియలికట్ట, చిందఱవందఱ, మొదలైనవి సంస్కృతంలో చెప్పటానికి సాధ్యం కానివి ఎన్నో వ్యవహారంలో రూఢమైనవి ప్రయోగించాడు.

ఇక శబ్దపల్లవాల సంగతి. –ఆడు అనే క్రియాపదంతో ఏర్పడే పదబంధాల్లో ఈ క్రియకు మూడర్థాలున్నాయి – 'చెప్పు' అనీ, 'కదులు' అనీ, 'చేయు' అనీ. దీని కలయిక వల్ల కొన్ని వందల శబ్దపల్లవాలు ఏర్పడతాయి. ఎ) 'చెప్పు' అనే అర్థంలో: చెడనాడు, మాటలాడు, కొనియాడు, .తెగనాడు, బిరుదాడు, ఉల్లసమాడు, సరసమాడు, మొదలైనవి. మర్మచ్ఛేదంగా మాట్లాడటానికి 'ముట్టనాడు' అని కల్పించుకొన్నాడు తిక్కన. బి) కదులు, చేయు అనే అర్థాల్లో: చేతులాడు, కాళ్ళాడు, తూగాడు, అల్లాడు, జూదమాడు, వేటాడు, ముద్దాడు,

నీళ్ళాడు, తురుమాడు, కొట్లాడు. ఇవి ఈనాటికి గూడా చాలావరకు వాడుకలో ఉన్నాయి. –పడు అనే సహాయక్రియ అనుభవార్థంలో వస్తుంది: 'భయపడు', 'కష్టపడు' లాగా. దీని నుంచి ఏర్పడే కృద్రూపం –పాటు. –పడు, –పాటులతో ఏర్పడే తెలుగు పదబంధాలను మనం ఈనాటి భాషలో చాలావరకు పోగొట్టుకొన్నాం. తిక్కన వాడుక చూస్తే మనం ఎంత నష్టపడ్డదీ తెలుస్తుంది.

'వెక్కసపడు – వెక్కసపాటు, అచ్చెరుపడు – అచ్చెరుపాటు', అలానే చిడిముడిపాటు, తోడ్పాటు, కీడ్పాటు, కొందలపాటు, మ్రానుపాటు (అంటే చెట్టులాగా నిర్వీణ్ణుడు కావటం), జిచ్చపాటు, వెరగుపాటు, వెనుఁబాటు, మొదలైనవి. తిక్కనలో సంస్కృతవిశేష్యాలకు కూడా –పాటు చేరిన రూపాలున్నాయి: 'దుఃఖపాటు, దైన్యపాటు, కష్టపాటు, వేగపాటు' అని. అమూర్తాలైన మానసికావస్థలకు మనం సంస్కృత శబ్దాలనే వాడుతున్నాం – రాగం, ద్వేషం, సుఖం, ఉపాయం, అపాయం, ఆశ్చర్యం, సంకోచం, గర్వం, శౌర్యం, ధైర్యం – అని. వీటన్నిటికి తిక్కన తన కాలపు వాడుకలో ఉన్న తెలుగుమాటలనే ఎక్కువగా వాడేవాడు. ఈవాడుక చూస్తే దేశ్యశబ్దాలతో ఎంత భావశబలత సాధ్యమౌతుందో తెలుస్తుంది. సౌలభ్యానికి 'అనువు' అంటాడు. సంకోచం లేక అంటే 'అరలేక' అంటాడు. అలాగే 'ఈర్ష్యకు' 'ఈసు' అనీ, బలానికి 'ఉక్కు' అనీ, మనోవైకల్యానికి 'ఉత్తలము, ఉత్తలపడు, ఉత్తలపాటు' అనీ, శౌర్యానికి 'ఏడ్తెఱ' అనీ, సంభ్రమానికి 'కొందలపాటు' అనీ, 'భయానికి 'వెఱవు' అనీ... ఇలాగే ఏవు, చలము, చెలువు, తగవు, పెంపు, వెరవు, వెరగు లాటి జానుతెనుగు మాటలు కుప్పతిప్పలు. క్రియావిశేషణాలతో ఏర్పడ్డ విస్తృత పదబంధాలు అర్థవిశేషాలతో లెక్కలేనన్ని తిక్కన ప్రయోగించాడు. మచ్చుకు

*తేనె పూసిన కత్తివి*<br>
*చూడ్కి ననినయంత దప్పు*<br>
*తలిరెనఁగిన నడమామిడి చెలువున*<br>
(అంటే బాగా చిగుళ్ళు వేసి నడుస్తున్న మామిడిచెట్టులాగా అని)<br>
*తావి గ్రమ్ము నరవిరి గుత్తి*<br>
*నీరు మేపు గలుగు నెడకు*<br>
*పచ్చవిలుతు ననుఁగుటంవపాది లోని బరిగోల*

వింజంబాఁకిడిన కరణి

మొఱకు చేనున్న తియ్యమామిడి పండు

ఉపమానోత్ప్రేక్షలను జానుతెనుగులో ప్రదర్శించిన తెలుగుకవులు అరుదు. తిక్కన వారిలో అగ్రగణ్యుడు. మచ్చుకు:

కాఁగిన ఎసరుల కరణి...(శరనిధులుప్పొంగినాయిట!)

డేగఁగనిన పులుగు పిండు కరణి (సైన్యం చెదిరిపోయింది.)

కీలు కాలెడలింప కెడసిన బొమ్మలకైవడి... (గుర్రాలు యుద్ధంలో పడిపోయాయి).

అలాటివే మరికొన్ని:

అలలోని యాఁబోతుల బోలి (పొలిచిరి)

చెలియలి కట్టంబోలి (నిలువరించి)

కుమ్మరికోలను సారెంబోలితిని...

నీఱు గవిసియున్ననిప్పుబోలె (నీఱు అంటే బూడిద.)

కంటికి ఱెప్పయుంబోలె

పెన్నిధిఁ గన్న పేద వోలె

త్రాసులంబోని చిత్తంబుల తోడుత

ఇలాంటి దేశీయోపమలు లెక్కలేనన్ని.

తిక్కన రచనాశిల్పంలో కొన్ని విశేషాలు మాత్రం వివరిస్తాను.

సర్వనామాలకు సందర్భవిరహితంగా అర్థనిరూపణ సాధ్యంకాదు. నేను, నువ్వు, అది, ఇది, ఇట్లు, ఆ, ఈ, అంతలు, ఇంతలు – మొదలైన పదాల అర్థాలకు సంభాషణ శైలిలోనే అర్థపుష్టి చేకూరుతుంది. ఈ పదాలను విరివిగా సంభాషణల్లో వాడటంవల్లనే తిక్కన తన శైలిలో నాటకీయత అంటే dramatic effectను అనితరసాధ్యంగా సాధిస్తాడు. విరాటపర్వంలో ద్రౌపది వేషంలో ఉన్న భీముడు చీకట్లో కీచకుణ్ణి సంబోధిస్తూ అన్నమాటల్లో సర్వనామాలు సాభిప్రాయంగా ప్రయోగించాడు. చూడండి:

ఇట్టి వాడవు గావున నీవు నిన్ను
పొగడికొనఁదగు నకట నా పోల్కి యాఁడు
దానివెదకియు నెయ్యెడ నైన నీకుఁ
బడయవచ్చునె యెఱుఁగక పలికితిట్లు (విరా. 2-337)

నా యొడలు చేర్చినప్పుడ
నీ యొడ లెట్లగునొ దాని నీ వెఱిఁగెదు న
న్నేయబలల తోడిదిగాఁ
జేయఁ దలంచితివి తప్పు సేసితి గంటే (విరా. 2-338)

ఈ ప్రయోగాల్లో కీచకుడికి వచ్చే అర్థం వేరు; చదువుతున్న మనకు వచ్చే అర్థం వేరు. దీన్నే dramatic irony అంటారు. ఉద్యోగపర్వంలో సర్వనామ ప్రయోగంవల్ల ఎంతో వాడి, వేడి కలుగుతాయి.

'అసభకేక వస్త్రయుగునట్టిననుం గొనివచ్చి)...' అనే పద్యంలోను,
'నీవు సుభద్ర కంటె...' అనే పద్యంలో 'ఇట్టి నను... ఒకండు..
ఈ యేవురుఁ జూడగా సభకు నీడ్చె... కులాంగనను ఇట్లొనర్తురే'

అన్నప్పుడు –

'ఈ వెంద్రుకలు పట్టి యీడ్చిన యాచేయి
తొలుతగాఁ బోరిలో దుస్ససేను తను వింతలింతలు దునియలై'

మొదలైన చోట్ల భావస్ఫూర్తికి నాటకీయతకు వాడిన పదాలకు ఉన్న సంబంధం తెలుస్తుంది.

సాభిప్రాయంగా సంబోధనలు ప్రయోగించటం తిక్కన శిల్పంలో మరో విశేషం. కర్ణపర్వంలో శల్యుడు కర్ణుణ్ణి 'సూతతనయ', 'రాధేయ' అని పిలుస్తాడు. కర్ణుడు కోపంతో శల్యుణ్ణి 'క్షత్రియాధమ', 'నీచ' అంటాడు.

భయానకదృశ్యాలను, అతిలోకగుణసంపదను వర్ణించేటప్పుడు దీర్ఘ సంస్కృత సమాసాలను తిక్కన వాడతాడు.

కౌరవ సేనను చూసిన ఉత్తరుడు

భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు, దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా

లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం, బుదగ్రధ్వజా
ర్చిష్మత్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే. (విరా. 4-52)

అంటాడు.

ద్రౌపది తన భర్తల శౌర్యాన్ని గురించి చెప్పి కీచకుణ్ణి బెదరగొట్టేటప్పుడు:

దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవురిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా!

అంటుంది.

పెద్ద చిన్నల తారతమ్యానికి సంస్కృతాంధ్రాలను ఉపయోగించటం, భావోద్వేగాన్ని అంచెలంచెలుగా పెంచేటప్పుడు వచనాలను 'కామా' లు పెట్టినట్టు వాడటం, తిక్కన రచనాశిల్పంలో మరి కొన్ని విశేషాలు. ఒక శిల్పఖండంలో ఉన్న సున్నితపు చెక్కడాలు దగ్గరికి వెళ్ళి చూస్తేగాని కనపడవు. కుడ్యచిత్రాన్ని దూరంనుంచి చూస్తేనే ద్రష్ట ఆనందించగలడు. తిక్కనది కవితాశిల్పం. ఎంత దగ్గరికి పోయి నిలకడతో చూస్తుంటే అన్నిసొగసులు, విశేషాలు కనిపిస్తాయి.

(ఆకాశవాణి సౌజన్యంతో)

# 21

# తెలుగు రచనాభాషాపరిణామం

తెలుగుభాషాచరిత్రను పరిశీలిస్తే మొదట్నించీ అది మూడు పాయలుగా విస్తరిస్తున్నట్లు కన్పిస్తుంది. 1. గద్యపద్యాల్లో కనిపించే కావ్యపద్ధతి. 2. దాని పక్కనే వచనశాసనాల్లో కనిపించే వ్యవహారభాషాపద్ధతి. 3. ఈ రెండింటిలోనూ కన్పించకుండా సాధారణజనంలో ఉండిఉంటుందని చెప్పడానికి వీలున్న పామరభాషాపద్ధతి. ఈ మూడు రకాల పాయలూ లిఖితరూపచరిత్ర కన్పిస్తున్న నాటినుంచి ఉండిఉండాలి. నన్నయభారతానికి 2, 3 వందల సంవత్సరాలకు ముందునుంచే నన్నయగద్యానికి తుల్యమైన గద్యం, ఆయనపద్యానికి తుల్యమైన పద్యం శాసనాల్లో కన్పిస్తున్నాయి.

కొన్నివందల సంవత్సరాలుగా తనకు ముందు పండితులు, కవులు రచనకుపయోగించిన శైలిని అనుసరించి నన్నయ భారతరచన చేశాడు. అంటే నన్నయకు చాలాకాలం ముందే లిఖితరూపంలో ఉన్న కావ్యభాషకూ, వ్యవహార భాషకూ చాలాదూరం ఏర్పడిందని చెప్పవలసి ఉంటుంది. మనం నన్నయనాటిది అనుకున్న భాష నన్నయనాటిది కాదు. ఈనాటి భాష అనుకుంటున్నది ఈనాటిది కాదు. ఈనాడు ఆధునికం అని మనం అనుకుంటున్న రూపాలు నన్నయనాటి నుంచే కొద్దిగానో, గొప్పగానో శాసనాల్లో కనిపిస్తాయి. నన్నయ సమకాలీన శాసనాల్లో 'ఏభయి, ఇస్తిమి' లాటి రూపాలున్నాయి.

ఒక భాషలో సాహిత్యం ప్రారంభమైన దశలో ఆ సాహిత్యభాషకూ, ఆనాడు జనం మాట్లాడుకుంటున్న భాషకూ దూరం ఉండే అవకాశం లేదు. అంటే ఏభాషలోనైనా మొదటిసారిగా వచ్చిన కావ్యభాష సమకాలీనవ్యవహారభాష కంటే భిన్నంగా ఉండటానికి వీల్లేదు. కావ్యభాష ఎవడో ఒకడు సృష్టించింది కాదు. రచయిత తన కాలంలో వ్యవహారంలో ఉండే భాషలోనే పెద్ద మనుషులు అనుకున్నవాళ్ళు ఉపయోగించే భాషారూపంలో రచన చేస్తాడు. ఈభేదం మొదట్లో చాలా తక్కువగానే ఉంటుంది. కాని, భాషకు రచనాసంప్రదాయం ఏర్పడ్డ .తర్వాతనే శిష్టులు వాడే రచనాభాషకు, సామాన్యులభాషకు భేదం ఏర్పడుతుంది. భాష కేవలవ్యవహారరూపంలో ఉన్నప్పుడు ఈభేదం ఏర్పడే వీలు తక్కువ. 11వ శతాబ్ది మొదటి భాగంలోనే కావ్యభాషకూ, వ్యవహార భాషకూ చాలా దూరం కన్పిస్తున్నదనీ, ఆనాటి వ్యవహారభాష ఈనాటి వ్యవహారభాషకు కొంచెం దగ్గరగా ఉందనీ మనం అంటున్నామంటే ఈరెండు శైలులకూ అంతకు చాలా కాలం ముందే దూరం ఏర్పడి ఉంటుందని గ్రహించాలి. అంటే తెలుగులో రచనాసంప్రదాయం నన్నయకంటే చాలాకాలం ముందే ఉందన్నమాట. భాషలో రచనాసంప్రదాయం ఏర్పడిననాడు ఆరచయితల పాండిత్యాన్నిబట్టి, వాళ్ళకు సంఘంలో ఉన్న స్థానాన్నిబట్టి ఒక రచనకూ, రచయితకూ ప్రాముఖ్యం ఏర్పడుతుంది. తరవాత రచన చేసినవాళ్ళు ఆయన లాగే రాయాలనీ, అతని భాష ఎంత గొప్పదో, అతని రచన ఎంత గొప్పదో అట్లాగే అనిపించుకోవాలనీ ప్రయత్నం చేస్తారు. ఆపద్ధతిలో అనేకరచనలు రావటాన్ని శైలీకరణం (stylization) అనవచ్చు. అంటే తెలుగులో నన్నయకు ముందే గద్యపద్యభాష శైలీకృతం అయిందని చెప్పవలసి ఉంటుంది. నన్నయ కాలంలో పండితులు, సంస్కృతాంధ్రాల్లో రచన చేయగలిగిన కవులు చాలామంది ఉన్నట్లు భారతం అవతారికవల్ల మనకు తెలుస్తుంది. వాళ్ళందరూ తెలుగులో అనేక రచనలు చేసి ఉండవచ్చు. వాళ్ళు అనుసరించిన భాష కూడా నన్నయ భారతంలోని భాషవంటిదే కావచ్చు. కాకపోతే మనకు భారతం మాత్రమే ఆనాటి రచనగా మిగిలింది. దీన్నిబట్టి నన్నయ తన కాలపు తెనుగును ప్రమాణీకరించటమో, సంస్కరించటమో, ద్రవరూపంలో ఉన్నదాన్ని స్థిరీకరించటమో చేసి, భారతరచన చేశాడనే అభిప్రాయం సరైంది కాదని స్పష్టంగా చెప్పవచ్చు.

నన్నయ తరువాతి కవులందరూ తమకావ్యాల్లో కుడిఎడమగా నన్నయ భాషనే అనుసరించారు. కాని దీనికి సమాంతరంగా వ్యావహారికభాష శాసనాల్లో కనిపిస్తుంది. కావ్యరచనకు తప్ప చదువుకున్నవాళ్ళ తక్కిన వ్యాసంగం ఈ భాషలోనే జరిగేది. పాఠప్రవచనాల్లోను, వ్యాకరణానికో, అలంకారశాస్త్రానికో వివరాలు చెప్పే సందర్భంలోను, ఇంట్లో మాట్లాడుకోటంలోను, లౌకిక వ్యవహారాల్లోను ఈభాషనే వాడి ఉంటారు. ఈపాయ అనేకరకాలైన పరిణామాలను పొందినట్లు శాసనాలు పరిశీలిస్తే తెలుస్తుంది. కొంతకాలానికి ఈభాష కూడా కావ్యభాషలాగా శైలీకృతం అయింది. కావ్యరచనలో కాకుండా ఇతరరచనల్లో ఇది కనిపిస్తుంది. అన్నమాచార్యుల కీర్తనల్లో సమకాలీనవ్యవహారభాషను చూడవచ్చు. 16వ శతాబ్దానికి చెందిన రాయవాచకంలో, తరవాత వచ్చిన కైఫీయతుల్లో, యక్షగానాల్లో, తాతాచార్యుల కథలు మొదలైన సామాన్య జనానికి ఉద్దేశించిన సాహిత్యంలో వ్యావహారికభాష కన్పిస్తుంది. అంటే వ్యావహారికభాష కూడా శైలీకృతమైన రచనావ్యాసంగానికి ఉపయోగించా రన్నమాట. నిజానికి కావ్యభాషలో కూడా అనేకమైన వ్యావహారికరూపాలు 15, 16 శతాబ్దాలనుంచే ప్రవేశించటం చూడవచ్చు. సముచ్చయార్థకంగా దీర్ఘాన్ని ''రోసీరోయరు'' మొదలైనవి ధూర్జటి రచనల్లో చూడవచ్చు.

సముచ్చయార్థకంగా నువర్ణం లోపించి పూర్వాచ్చు దీర్ఘంకావటం ఉన్నట్లు కేతన ఆంధ్రభాషాభూషణంవల్ల మనకు తెలుస్తుంది. ఉదా.: ''వీటీ దెచ్చుతారు, మమ్మూ దలంచి.'' ఈకావ్యభాష, వ్యావహారికభాష అన్న రెండు పాయల్తో పాటు ఏవిధమైన రచనలకూ ఉపయోగించని (బహుశా జానపదసాహిత్యం మాత్రమే చోటుచేసుకున్న) చదువుకోనివాళ్ళు మాట్లాడేభాష ఒకటి ఎప్పుడూ కొనసాగుతూనే ఉంటుంది. దాన్ని మనం పామరభాష అందాం. అయితే లక్షణ కర్తలు వ్యావహారికభాషను, పామరభాషను కలిపివేసి కావ్యప్రయోగయోగ్యం కాని భాషనంతటినీ 'గ్రామ్యం' అన్నారు.

'గ్రామ్యం' అంటే వీరి ఉద్దేశంలో నియమం లేనిది. అంటే కావ్యరచనకు ఉపయోగించనిది. అయితే వ్యావహారికభాష శైలీకృతమయిన అర్వాచీనకాలంలో వ్యావహారికభాషకూ, పామరభాషకూ మధ్య ఉన్న భేదం మనకు స్పష్టంగా తెలుస్తుంది. అయినా లాక్షణికులు అర్వాచీనకాలంలో కూడా ఈరెండు శైలులనూ రచనలో నిషేధించారు. దీన్నిబట్టి చూస్తే కావ్యాల్లో ప్రయోగించిందీ

లాక్షణికులు ఒప్పుకున్నదీ నన్నయకంటే ముందున్న ప్రాచీనభాషాస్వరూపమనీ, ఎప్పటికప్పుడు మార్పులకు లోనౌతున్న చదువుకున్నవాళ్ళ భాష వ్యావహారిక భాష అనీ చెప్పవచ్చు. తమిళం, గ్రీకు మొదలైన భాషల్లో తప్ప తదితర భాషల్లో శిష్టుల వ్యవహారభాషనుంచే రచనాయోగ్యమైన ప్రమాణభాష ఏర్పడుతుంది. కావ్యరచనలో మాత్రం ప్రాచీనమైన భాష, ఇతరవ్యాసంగాల్లో వ్యావహారికభాష కొనసాగుతున్న దశలో 19 శతాబ్ది మధ్యభాగంలో చిన్నయసూరి 'బాలవ్యాకరణం' వచ్చింది. ఈవ్యాకరణం శైలీకృతమైన కావ్యభాషకు వ్యాకరణం. ఈవ్యాకరణాన్ని చాలావరకు అనుసరించే లక్ష్యగ్రంథంగా నీతిచంద్రిక రాశాడు. అప్పుడే ముద్రణ సౌకర్యాలు రావటం, పాశ్చాత్య విద్యావిధానం అమలుచేసి, తెలుగును మరింత విస్తృతంగా ఉపయోగించవలసిరావటం కారణంగా ఎలాంటి భాషలో పాఠ్య గ్రంథాలు ఉండాలి, ఎలాంటి భాషలో పరీక్షలు రాయాలి అన్న విషయంలో వాదోపవాదాలేర్పడ్డాయి. ప్రాచీనత మీద ఉన్న గౌరవం, ప్రాచీనవ్యవస్థంతా నాశనమైపోతుందన్న భయం మొదలైన భాషేతరకారణాల వల్ల లాక్షణికమైన భాషలోనే అధ్యయనం ఉండాలనే వాదం బలీయమయింది. ఈదశలో గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు మొదలైనవాళ్ళు వ్యావహారికభాషనే రచనా యోగ్యమైన భాషగా అంగీకరించాలన్నారు. 1897లో అప్పారావుగారి కన్యాశుల్కం వచ్చింది. అయితే దీని మొదటి ఎడిషన్‌లో గ్రాంథిక, వ్యావహారికాలు కలగావులగమైన భాష కన్పిస్తుంది. రెండో ఎడిషన్‌లో కళింగ మాండలికంలో శిష్టభాష ఉత్తమసాహిత్యప్రక్రియను సృష్టించటానికి ఉపకరణమైంది. తరవాత ఆయన రాసిన కథలూ, పాటలూ కూడా వ్యావహారిక భాషకు దగ్గరగా ఉన్నాయి.

కావ్య, వ్యావహారిక భాషలమధ్య రాజీగా మరో భాషారూపాన్ని కొంత మంది సృష్టించారు. అదే సరళగ్రాంథికం. ఇది వీరేశలింగంగారినుంచి కన్పిస్తుంది. ఆధునికభాషలో ఆలోచించి గ్రాంథికభాషలోకి తర్జుమాచేస్తే ఏర్పడేది సరళగ్రాంథికం. 'ఏం కొంపలు కాలిపోతున్నాయా?' అనే వాక్యాన్ని 'ఏమి? కొంపలు కాలిపోవుచున్నవా?' అని, 'ఎగాదిగా చూశారు' అన్నదాన్ని 'ఎగం దిగన్ జూచిరి' అనీ, అధునికభాషనుంచి స్ఫూర్తిని తీసుకొని ప్రాచీనకావ్యభాషా ప్రత్యయాలను తగిలించటం సరళగ్రాంథికం ఉపయోగించినవాళ్ళు చేసిన పని. అది అటు ప్రాచీనకాలంలోగానీ, ఇటు ఆధునికకాలంలోగానీ వ్యవహారంలోలేని భాషాప్రయోగం. ఐతే ఈమార్గంలో రచనలు చేసినవాళ్ళు చాలామంది 19వ

చిన్నయసూరిగారి నీతిచంద్రిక పాతపద్ధతిలో ఉంది. వీరేశలింగం రచన సరళ గ్రాంథికం – ఈ విధంగా. కాని మళ్ళీ వీరేశలింగంగారి రచన చిన్నయసూరిగారి గద్యపద్యాత్మకమైన రచనాపద్ధతికి చెందిందా? ఈనాటి వ్యావహారానికి చెందిందా? మధ్యకాలపు శైలీకృతమైన వ్యావహారానికి చెందిందా? అని పరిశీలించాలంటే విషయాన్ని విడిచిపెట్టి కేవలం భాష ఆధారంగానే చెప్పవలసిఉంటుంది. దీనికి కొన్ని ప్రమాణాలను సిద్ధం చేశాను. ప్రాచీనత–అధునికతల మధ్య ఉన్న అంతరాలను రచనాధర్మాలుగా నిష్కర్షగా చెప్పటానికి ఒక ప్రక్రియను ఊహించాను.

స్ఫూర్తి అన్నది ఒక ప్రమాణం. ఒక రచన చదివినప్పుడు దాని నుడికారం మనం మాట్లాడుకొనేట్లుగానే ఉందా? లేకపోతే ఏదో విలక్షణంగా అనిపిస్తున్నదా? అని ఆలోచిస్తే నూరుపాళ్ళు ఆధునికం అనిపిస్తే 100 పాయింట్లు. ఏమాత్రమూ ఆధునికం అనిపించకపోతే '0' పాయింట్లని లెక్కకట్టుకోవచ్చు.

ప్రకృతి–ప్రత్యయ స్వరూప నిర్మాణాలు మరొక ప్రమాణం. ప్రకృతులు పాతవా కొత్తవా అని చూడటం ఒక ఎత్తు. వాటి సంబంధం, వ్యాకరణప్రక్రియ, ఆధునికమా కాదా అనేది మరొక ఎత్తు. ఉదాహరణకు : 'తేరంబూని' అనే ప్రయోగంలో 'తేరు' 'పూను' అనే ప్రకృతులు ప్రాచీనం. 'పూని' లో క్త్వార్థకం ప్రాచీనమూ, ఆధునికమూ కూడా. 'అనువాడు' లో ప్రకృతులు ఆధునికం గాని వాటి వ్యాకరణసంబంధం ప్రాచీనం. కాని 'అనేవాడు' లో ఆసంబంధం ఆధునికం. ఈవిధంగా ఎన్ని ప్రకృతులు ప్రాచీనం, ఎన్ని ఆధునికం, ఎన్ని వ్యాకరణకార్యాలు ప్రాచీనం, ఎన్ని ఆధునికం అనే లెక్కతో ప్రాచీనాధునికతల భేదాలు తెలుసుకోవచ్చు.

వాడిన పదాల్లో దేశ్య అన్య దేశ్యాల నిష్పత్తి, వీటిలో ఎన్ని వ్యవహారసిద్ధమైన పదాలు అన్నవి ఇతరప్రమాణాలు. ఇవన్నీ ఆధారంగా ఒక రచన ఎన్ని పాళ్ళు ప్రాచీనమో, ఎన్ని పాళ్ళు ఆధునికమో చెప్పవచ్చు.

ఈ పరిశీలనకు వచనరచననుమాత్రమే ఎన్నుకున్నాను. నన్నయ, తిక్కన, చిన్నయసూరి, ఏనుగుల వీరాస్వామయ్య, వీరేశలింగం, పానుగంటి లక్ష్మీ నరసింహారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, విశ్వనాథ సత్యనారాయణ, గురజాడ అప్పారావు, ఉన్నవ లక్ష్మీనారాయణ, చలం గార్ల రచనలనుంచి కొద్ది

భాగాలను పరిశీలనకు ఎన్నుకున్నాను. ఈనాటి అధునికభాష నన్నయ, తిక్కనల కాలంలో వ్యవహారంలో ఉన్న భాషకు సన్నిహితమైందే. కాబట్టి తమ కాలంలోని వ్యావహారికభాషను వాళ్ళు ఎంతవరకు తమ రచనల్లో ఉపయోగించారో పరిశీలించవచ్చు. పైన చెప్పిన రచయితల రచనలనుంచి యాభయ్యేసి పదాల మేరకు తీసుకొన్న భాగాలనూ, వాటిలోని ప్రాచీనత ఆధునికతల పాళ్ళను తెలిపే పట్టికనూ అనుబంధంగా ఇస్తున్నాను. (ఆధునికతను + గుర్తుతోను, తద్భిన్నాన్ని – గుర్తుతోనూ సూచించాను.) పట్టికను బట్టి నన్నయభాష 82 శాతం ఆధునికతకు దూరం అనీ, తిక్కనభాష 75 శాతం దూరమనీ చూడవచ్చు. చిన్నయసూరి మిత్రభేదం మిత్రలాభం కంటే కావ్యభాషకు సన్నిహితం. సరళగ్రాంథికరచనలు–కందుకూరి, పానుగంటి, చిలకమర్తి మొదలైనవాళ్ళవి–ఆధునికభాషకే దగ్గరగా ఉన్నాయని గుర్తించవచ్చు. అంటే స్ఫూర్తిలోను (నుడికారంలోను), ప్రకృతుల ఎంపికలోనూ ఇవి ఆధునికం. అంటే ఆధునికభాషలో ఆలోచించి, గ్రాంథిక ప్రత్యయాలను తగిలించటంవల్ల ఏర్పడ్డవి కాబట్టి కృతకంగా అమర్చిన అధునిక భాషే 'సరళ గ్రాంథికం' అని నిరూపించవచ్చు.

కేవల ఆధునికరచనల భాషలో ఉన్న సూక్ష్మభేదాలు గురజాడ, ఉన్నవ, చలం రచనలకు కట్టిన లెక్కల పోలికలో తెలుస్తుంది. ఈ విధానం సూచనా మాత్రంగా చేసినదే. దీన్ని మరింత పరిశోధనలో ఇతోధికంగా శాస్త్రీయం చేయవచ్చు.

## అనుబంధం

నన్నయ : భారతము ఆదిపర్వము

అయ్యుదంకుండు *గురుహితకార్యధురంధరుండయి గురుపత్నీనియోగంబునం* బౌష్యుం డను రాజు దేవికుండలంబులం బ్రతిగ్రహించి తేరంబూని వనంబులో నొక్కరుండ చనువాఁడెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్క దివ్యపురుషుం గని వానివన్నిన వృషభగోమయ భక్షణంబు సేసి యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి యతి త్వరితగతిం జని పౌష్యమహా రాజుం గాంచి దీవించి గృహీత సత్కారుండై యిట్లనియె... అనినం బౌష్యుం డిట్టి మహాత్మునకీఁ గాంచితిఁ గృతార్థుండ నైతి నని మనంబున సంతసిల్లి...

తిక్కన : భారతము ఉద్యోగపర్వము

కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుం బ్రాపై పొదలిన నెదిరికి "నజయ్యుల" గుదురు వరుల యొత్తులేని రాజ్యంబు పూజ్య మహిమం బరఁగు వనవాసంబునం గుందిన కౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం బిచ్చి నిలుపుట నీ కొడుకులకు నిలువు గావించుట యగునని చెప్పి మఱియు నిట్లనుఁ బ్రియవాదు లెందునుం గల రప్రియం బగుం గాకేమి యని పథ్యంబు పలుకువారు లేరు. జూదంబు నప్పుడే నడ్డపడి...

చిన్నయసూరి : మిత్రలాభము

*ఓరీ పాంథ!* విను. మునుపు యౌవనమందు మిక్కిలి దుష్టుఁడనయి యుంటిని. అనేకములగు గోవులను, మనుష్యులను వధించి మితిలేని పాపము సంపాదించి భార్యాపుత్రులను బోఁగొట్టుకొని యేకాకి నయి నిలిచితిని. అనంతరమొక పుణ్యాత్ముఁడు నాయందు దయచేసి "యిఁక మీఁదట గోవులను మనుష్యులను వధింపకు. సత్కార్యములు చేయు"మని చెప్పెను. అది మొదలుకొని పాపకృత్యములు విడిచి మంచి కార్యములు చేయుచున్నవాఁడను. వృద్ధుఁడను. బోసినోటివాఁడను. గోళ్ళు పోయినవి.

చిన్నయసూరి : మిత్రభేదము

బదరికావనమందు సారోదం బను కాసారంబు గలదు. అక్కడి కొక్క ముసలికొక్కెర వచ్చి నయనంబులు నిమీలించి, యాహారంబు మాని, దుష్కరం బయిన తపము చేయుదానివలె నొంటికాలితో నిలువంబడి యుండెను. ఒక యెండ్రి యా తెఱఁగు జూచి కరము వెరఁగుపడి డాయం బోయి యిట్లనియె. "ఓయి బకోత్తమా! నీ వనయంబు క్రశిమంబు వహించుచున్నవాఁడవు. చేరువఁ బాఱాడు మీనంబులఁ జూడ నయిన నొల్లవు. ఈ యునికి యేదియో నొక్క మహార్థం బర్థించి పూనిక యనశనవ్రతానుష్ఠానంబు...

కందుకూరి వీరేశలింగం : స్వీయచరిత్రము

మా శాస్త్రపాఠశాలలోని విద్యార్థులు ఇన్నీసుపేటలో నొక బాలికా పాఠశాలను సహితము స్థాపింప నుద్దేశించిరి. అట్లుద్దేశించిన వారిలో పెద్దిభట్ల వేంకటప్పయ్య గారు మొదలయినవారు ముఖ్యులు. విద్యార్థులు పగలు బాలికా

పాఠశాలలో పనిచేయుటకు వలనుపడనందునను, ధనవ్యయము చేయుటకు శక్తులు కానందునను, వారివిషమున నే నా పనికిఁ బూని మిత్రులచేత చందాలు వేయించి యిన్నీసుపేటలో 1881వ సంవత్సరమున నొక బాలికాపాఠశాలను స్థాపించితిని. మా శాస్త్రపాఠశాలాధ్యక్షులయిన మెట్కాపు దొరగారు వ్రాయుటచేతఁ గొంతకాలము శ్రీ పీఠాపురపు రాజాగారు...

పానుగంటి లక్ష్మీనరసింహారావు : సాక్షి

వారి యిష్ట మేమిటి? ఇంటర్మీడియేటు క్లాసులోనికి వచ్చు బుద్ధిమంతుఁడైన బాలునకుఁ బదునాఱు సంవత్సరము లుండవచ్చునుగదా? తిన్నఁగ నాలుగు మాటలు భాషలు మాటాలాడుటకైన, శక్తి కలిగియుండఁడు కదా? అట్టి బాలునకు దేశభాషను మానుటకుఁగాని, చదువుటకుఁగాని స్వేచ్ఛయా? వానికిఁ దోచినయెడల మానవలసినదా? వాఁడంతటి దీర్ఘాలోచనపూర్వక మగు కార్య మావయసులోఁ జేయఁగలఁ డనియే మీరనుకొందురా? మీ రట్టి వయసులో నట్టియాలోచనఁ జేసికొనఁగలరా? బలత్కారము చేసినందువలన భాషాభిరుచి గలుగదు. కాన...

చిలకమర్తి లక్ష్మీనరసింహం : విజయలక్ష్మి

రామేశముగారి సంసారస్థితి కొంత చెప్పవలయును. కుమారుడు ప్లీడరు వృత్తికి రాకమునుపే నాలుగైదేళ్ళక్రిందట నాగభూషణముగారు కుమారునకు వివాహప్రయత్నము చేయజొచ్చిరి. నాగభూషణముగారు మంచి సంప్రదాయము లోనివారు గనుకను, రమారమి పదియెకరముల భూమి గలవారు గనుకను చాలామంది తమతమ కన్యల నిచ్చెదమని వచ్చిరి. పిల్ల చక్కగా లేదని కొన్ని సంబంధములును, సాంప్రదాయము మంచిది కాదని కొన్ని సంబంధములును, వరదక్షిణ తగినంత లేదని కొన్ని...

విశ్వనాథ సత్యనారాయణ : వేయి పడగలు

ఈ వార్త పరగణా యంతయు వ్యాపించెను. 'క్రొత్తదివానుగారు రాజాగారి కన్నఁ బండప్రచండుఁడు. ఒడళ్ళు దగ్గరపెట్టుక మనవలె' నని సర్వజనులకుం దెలిసిపోయెను. దివానుగారు కోటలోని యుద్యోగుల నందఱిని బరిశీలించెను. అనవసరమైనవారి నందఱను దొలఁగించెను. కోటలో నలువది మంది గుమాస్తా లుండిరి. వారిలోఁ బాతికమంది నుంచి మిగిలినవారిని విడుదల చేసెను.

ఇంచుమించుగా నిరువదిమంది కాసావాం(డను గూడఁ దొలఁగించెడి వాఁడే కాని రాణివాసమునుండి యభ్యంతరములు వచ్చెను. అడవి జంతువులు చాల చచ్చి పోయినవి గనుక నచట (నున్న)...

గురజాడ అప్పారావు : అణిముత్యాలు

ఆదివారం మధ్యాన్నం నాలుగుగంటలప్పుడు పువ్వులతోటలో ఒక ఎరుపు మావిడి చెట్టు(క్రింద యిసకలో మేవఁంతా పాతికమంది కూర్చున్నాం. గావంచా పరచుకొని మాకు అభిముఖంగా శాస్త్రుల్లుగారు కూచున్నారు. నేను బల్లచెక్క తెచ్చి వెయ్యబోతే, "వొద్దురా, మీరంతా కింద కూచుంటే, నేను బల్లమీద కూచుంటా(నా?" అన్నారు. రెండు లేత కొబ్బరికాయలనీళ్ళు తాగి, తాంబూలం వేస్తూ, శాస్త్రుల్లుగారు బౌద్ధమతం విషయమై (ఉపన్యసించారు)

ఉన్నవ లక్ష్మీనారాయణ : మాలపల్లి

బండి దేవాలయానికి పోయే మెట్లదగ్గిర ఆగింది. కోడలూ, రామానాయుడూ దిగారు. లక్ష్మమ్మ మీరు నొగలు పట్టుకుంటే దిగుతానని మెల్లగా జారింది. పూజారి అప్పయ్య హాజరుగా వున్నాడు. చాలా పొడుగాటి వాడు. అరవయ్యోవడిలో వుంటాడు. కొంచెం ఆడంగిరేకలమనిషి. సంసారం లేదు. చిన్నప్పుడే భార్య వెళ్ళిపోయింది. పొట్ట లోపలికి బోయి యెప్పుడూ అక్కళించే వుంటుంది. జామారు పింజబోసి మోకాళ్ల మీదికి దోపుకొని తడి...

చలం : అరుణ

పదిహేనేళ్ళ(క్రిందట నన్ను (పేమించింది. ఆ పదిరోజులూ - కాదు ఆ మూడు రోజులే. కానీ అప్పుడైనా (పేమించిందా? ఏమోమరి. (పేమే ఐతే పది రోజుల్లో - నన్ను - చేతులు జాచి ఏడుస్తున్న నన్ను - పిల్లని మరిపించి చెరువుకి వెళ్ళే తల్లిలాగు నవ్విస్తో వెళ్ళిపోతుందా? కాని పదిరోజుల (పేమ అనేది వుండ కూడదా? ఆజన్మాంతమూ అనే పురాణ పవి(త్రపదం పనిచెయ్యటం మానదు కదా మనసుల్లో! నాకు...

ఏనుగుల వీరాస్వామయ్య : కాశీయా(త్ర చరి(త్ర

29 తేది ఉదయాన 4 ఘంటలకు (ప్రయాణమై 6 కోసుల దూరములో నున్న

షాపుర మనే యూరు 10 ఘంటలకు చేరినాను. దోవలో పాలమాకుల యనే జలసౌఖ్యము గల గ్రామమున్నది. ఆ పాలమాకుల వరకు బాట సరాళము. కొంతకొంత దూరము రాతిగొట్టుగా నున్నది. జలచర్ల వదిలిన వెనక పర్వత సమూహముల దర్శనము. దారిలో నిదివరకు లేదు. సాధారణమైన యడవి నడుమ బాట పోవుచున్నది. ఆ గ్రామంలో...

ఆధారగ్రంథం: గద్యచంద్రిక. సంపాదకుడు విశ్వనాథ సత్యనారాయణ. ఆం. ప్ర. సా. అకాడమీ ప్రచురణ.

(రంగనాథాచార్యులు, కె.కె (సం) తెలుగు సాహిత్యవికాసం. హైదరాబాదు: ఆంధ్రసారస్వత పరిషత్తు, 1978.)

| విషయం | స్ఫూర్తి<br>100 | ప్రకృతి ప్రత్యయం<br>50 | వాడుకతో తుల్యం<br>50 | వ్యాకరణ సంబంధం<br>50 | దేశ్యం అన్యం<br>50 | మొత్తం 300కు | సగటు శాతం<br>300/3 |
|---|---|---|---|---|---|---|---|
| నన్నయ<br>పే. 21 | -100 | -38<br>+12 | -50 | -36<br>+14 | -23<br>+27 | -2.47<br>+ .53 | 82 శాతం (-)<br>18 శాతం (+) |
| తిక్కన<br>పే. 96 | -100 | -37<br>+13 | -50 | -27<br>+23 | -13<br>+37 | -2.27<br>+ .73 | 75 శాతం (-)<br>25 శాతం (+) |
| చిన్నయసూరి<br>మిత్రలాభం పే. 398 | -50<br>+50 | -26<br>+24 | -35<br>+15 | -3<br>+47 | -22<br>+28 | -1.36<br>+1.64 | 46 శాతం (-)<br>54 శాతం (+) |
| మిత్రభేదం<br>పే. 399 | -100 | -30<br>+20 | -36<br>+14 | -22<br>+28 | -16<br>+34 | -2.04<br>+ .96 | 68 శాతం (-)<br>32 శాతం (+) |
| కందుకూరి వీరేశలింగం<br>స్వీయచరిత్ర పే. 168 | +100 | -11<br>+39 | -16<br>+34 | - 1<br>+49 | -20<br>+30 | - .48<br>+2.52 | 16 శాతం (-)<br>84 శాతం (+) |
| పానుగంటి లక్ష్మీనరసింహారావు<br>సాక్షి పే. 13 | +100 | -27<br>+29 | -21<br>+29 | +50 | -15<br>+35 | - .57<br>+2.43 | 19 శాతం (-)<br>81 శాతం (+) |

| విషయం | స్ఫూర్తి 100 | ప్రకృతి ప్రత్యయం 50 | వాడుకతో తుల్యం 50 | వ్యాకరణ సంబంధం 50 | దేశ్యం అన్యం 50 | మొత్తం 300కు | సగటు శాతం 300/3 |
|---|---|---|---|---|---|---|---|
| చిలకమర్తి లక్ష్మీనరసింహం విజయలక్ష్మి పే. 180 | +100 | -11 +39 | -14 +36 | -2 +48 | -14 +36 | - .41 +2.59 | 13.6 శాతం (-) 86.33 శాతం (+) |
| విశ్వనాథ సత్యనారాయణ వేయిపడగలు పే. 52 | +100 | -17 +33 | -26 +24 | -1 +49 | -12 +48 | - .56 +2.44 | 18.7 శాతం (-) 81.3 శాతం (+) |
| గురజాడ అప్పారావు ఆణిముత్యాలు పే. 1-2 | +100 | -1 +49 | -1 +49 | +50 | -9 +41 | - .11 +2.89 | 6.7 శాతం (-) 93.3 శాతం (+) |
| ఉన్నవ లక్ష్మీనారాయణ మాలపల్లి పే. 65-66 | +100 | +50 | +50 | -2 +48 | -4 +46 | -6 +2.94 | 2 శాతం (-) 98 శాతం (+) |
| చలం అరుణ పే. 24 | +100 | +50 | +50 | -1 +49 | -9 +41 | -10 +2.90 | 3.3 శాతం (-) 96.7 శాతం (+) |
| ఏనుగుల వీరాస్వామయ్య పే. 356 | +100 | -6 +44 | -8 +42 | +50 | -14 +36 | -28 +2.72 | 8.3 శాతం (-) 91.7 శాతం (+) |

22

# రాచకొండ రచనల్లో సిమిలీ

రావిశాస్త్రి గారికి 'సిమిలీ' లన్నా, 'సిమిలీ' అనే మాటన్నా చాలా ఇష్టం. 'సిమిలీ' అనే మాటను ఈ వ్యాసంలో విస్తృతార్థంలో వాడుతున్నాను. 'సిమిలీ' అంటే ఒక అనుభవాన్ని మరో అనుభవం ద్వారా దర్శించటం, అర్థం చేసుకోటం, ఊహించటం, చెప్పటం అనవచ్చు. అనుభవం అంటే మనసుతోను, పంచేంద్రియాలతోను, పొందగలిగిన జ్ఞానం. మనం విన్నది, కన్నది, తాకింది, చేసింది, మన మనస్సుకు తట్టింది – ఏదైనా అనుభవం కావచ్చు: ఒక వ్యక్తి, జంతువు, వస్తువు, చెట్టూ, చేమా, ఒక సన్నివేశం, ఒక సన్నివేశంలో కలిగిన ఒకానొక ఆలోచన, భావన, అంతఃకరణ ప్రవృత్తి – అంటే సుఖం, దుఃఖం, కోపం, జాలి మొదలైనవి అన్నీ అనుభవాల కిందకే వస్తాయి. ఏ అనుభవాన్ని మరి ఏ అనుభవంతో పోల్చవచ్చు అనటానికి శాస్త్రమేమీ లేదు. ఇది రచయిత భావనాశక్తిని, రచనాశిల్పాన్ని బట్టి ఉంటుంది. కాని –

కొన్ని 'సిమిలీ'లు సామాన్యభాషలో భాగాలైపోతాయి. తెలుగు వాళ్ళందరికీ తెలిసిన 'సిమిలీ'లు మనం రోజూ మాట్లాడుకొనే మాటల్లో ఎన్నో వినిపిస్తాయి. ఉదా.:

'చెంపకు చేరడేసి కళ్ళు'

'అపిల్ల పిండిబొమ్మలా ఉంటుంది'

'వెన్నెల పిండారబోసినట్టుంది'

'వాడు దున్నపోతు/పంది/కుక్క/నక్క....'

'వాడు గట్టెక్కాడు'

పై పోలికలు మన సంస్కృతిలో సామాన్యుల నోళ్ళలో పుట్టినవి. కొన్ని 'సిమిలీ'లు మామూలు మాటలుగా మారిపోతాయి. 'కుర్చీకాళ్ళు' 'గడియారం ముళ్ళు' అలాంటివి. మనం మన పరిసరాలు అర్థంచేసుకోటానికి 'పోలికలు' చాలా అవసరం అనీ, అవే రోజూ మాట్లాడుకొనే మాటల్లో ప్రతిబింబిస్తాయనీ కొందరు అర్థశాస్త్రజ్ఞులు (semanticists) ఇటీవల అంటున్నారు.

రావిశాస్త్రిగారు 'సిమిలీ'లను ఎక్కువ మోతాదులో వాడిన 'ఋక్కులు' (ఒకటి, రెండు భాగాలు) అనే తొమ్మిది కథలూ ఈవ్యాసానికి సామగ్రి. ఏదైనా కవితావస్తువౌతుందని శ్రీశ్రీ (1934) గేయంలో ఉదాహరించిన కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా.... లాటి తొమ్మిది పేర్లూ ఈతొమ్మిది కథలకు శీర్షికలు. కవితావస్తువైంది కథావస్తువు మాత్రం ఎందుకు కాదు అనే 'ఛాలెంజి'తో కవిత్వంలా నడిపించిన కథలు ఈతొమ్మిది. ఇందులోనూ 'గుర్రపు కళ్ళెం' (గోవులొస్తున్నాయ్ జాగ్రత్త) అనే నవల సైజు పెద్దకథలో మరే రచనలో లేనన్ని 'సిమిలీ'లు శాస్త్రిగారు గుప్పించారు. ఈపుస్తకంలోనే 'సిమిలీ' అనే మాట రెండు సార్లు వచ్చింది (పుటలు 234, 276). ఈసిమిలీలను విశ్లేషించి రావి శాస్త్రి గారి రచనాశిల్పంలో ఉన్న ఒక విశేషాన్ని మాత్రం పఠితలకు అంద జెయ్యటం ఈవ్యాసోద్దేశం.

'సిమిలీ'ల్లో కొన్ని సాధారణమైనవి, కొన్ని అసాధారణమైనవి. అసాధారణ మైనవి ఒక రచయిత వాడేదాకా ఇతరులకు తట్టవు. రచయిత వాడుకవల్లనే పఠితకు రెండు అనుభవాల మధ్య ఉన్న 'పోలిక' తెలిసినప్పుడు ఆ సిమిలీని అసాధారణం అని చెప్పవచ్చు. అనుభవభేదాలను మనం విశ్లేషించగలిగితే సాధారణంగా ఎక్కువమంది వాడే 'సిమిలీ'ల స్వరూపం అర్థమౌతుంది. వాటిని మినహాయిస్తే మిగిలినవి అసాధారణమైనవని చెప్పకోవచ్చు.

విశ్వప్రపంచాన్ని ప్రకృతి (nature) అనీ, సంస్కృతి (culture) అనీ విభజించవచ్చు. మానవుడు తన బుద్ధిబలంతో సృష్ట్యాదినుంచి, ప్రయోజన దృష్టితో నిర్మించుకొన్నది సంస్కృతి. కళలు, శాస్త్రాలు, అవి ఆధారంగా

ఏర్పరుచుకొన్న ఇళ్ళూ, వ్యవస్థలూ, కాలక్రమాన మారిన, మారుతున్న, మారని, జీవితవిధానమూ, సమస్యలూ, పరిష్కారాలు ఇలాంటివన్నీ సంస్కృతి. మానవబుద్ధిజన్యం కాకుండా, మానవునితో సహా స్థావరజంగమాత్మకమైనది ప్రకృతి. జంగమాలను మానవులు, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) అని, స్థావరాలను పంచభూతాలు (నేల, నీరు, వెలుతురు, గాలి, ఆకాశం) అని వేరు చేయవచ్చు. ఇవన్నీ దేశకాలపరిమితం కాబట్టి దేశ, కాలాలు గూడా ప్రకృతి భాగాలే. మానవుడు ఇతర మానవులతోను ప్రకృతిలో ఉన్న ఇతర వస్తువులతోను 'interact' కావటంవల్ల ఏర్పడ్డది సంస్కృతి. ఈసంస్కృతిలో కొంతభాగం విశ్వజనీనమైనా ఒక్కో సమాజం ఒక్కో రకంగా తన సంస్కృతిని మలచుకొంటుంది. మనం తినే తిండీ, కట్టే బట్ట, బతికే బతుకు, ఆలోచించే తీరు ఇవన్నీ మన సంస్కృతిని ప్రతిఫలిస్తాయి.

ఇంతకుముందు నిర్వచించిన అనుభవాలన్నీ పై చట్రంలో ఏదో ఒక రకంగా ఇముడుతాయి. 'సిమిలీ' అన్నది 'ప్రకృతి' కిందికి వచ్చే రెండు అనుభవాల మధ్య ఉన్న 'పోలిక' కావచ్చు. అంటే ఏదో ఒక సన్నివేశంలో ఒకానొక ఆకారమూ, మనస్తత్వమూ కల మనిషిని మరో మనిషితోనో, జంతువు (తిర్యక్కు) తోనో చెట్టుతోనో, పండుతోనో పోల్చవచ్చు. అలానే ఒక జంతువును మనిషితోనో, ఒక జడాన్ని ఒక జంగమంతోనో పోల్చవచ్చు. మానవుడి పరిసరాల్లో ఇవన్నీ ఉంటాయి కాబట్టి, వీటికి గల ధర్మాలు చాలామందికి తెలుసు కాబట్టి, ఇలాటి పోలికలు సాధారణంగా రచయితలకే కాకుండా మామూలు వ్యవహర్తలకు కూడా తడతాయి. ఉపమేయం అంటే ప్రధాన అనుభవం, ఉపమానం అంటే ప్రధాన అనుభవానికి పోలికగా తెచ్చిన మరో అనుభవం. ఈరెండూ పై నిరూపించిన 'ప్రకృతి'కి చెందినవే ఐనప్పుడు ఆసంబంధాన్ని ప్ర = ప్ర అనుకుందాం. ప్రకృతిసిద్ధమైన ఒక అనుభవాన్ని 'సంస్కృతి' (సం) కిందికి వచ్చే అనుభవంతో పోలిస్తే ప్ర = సం అవుతుంది. ఇదేవిధంగా సం = ప్ర, సం = సం అనే మరి రెండు భేదాలు వస్తాయి. ఈనాల్గింటిలోనూ ప్ర = ప్ర తరగతి 'సిమిలీ' సర్వసాధారణమైనది. ప్ర = ప్ర కంటే అసాధారణం సం = ప్ర; అంతకంటే అసాధారణమైనది సం = సం. ఈభేదాలతోపాటు మూర్తం (concrete), అమూర్తం (abstract) అనే భేదం కలిస్తే, మొత్తం 16 రకాల సిమిలీలు సాధ్యమౌతాయి. వీటిల్లోను మూర్తాన్ని (కంటికి కనిపించేదాన్ని) మరో మూర్తంతో

పోల్చటం కన్నా అమూర్తంతో (కంటికి కనబడని దానితో) పోల్చటం అసామాన్యం. పై భేదాలున్న సిమిలీలన్నిటికీ రాచకొండ రచనల్లో లక్ష్యాలు దొరుకుతాయి. ఈ లక్ష్యాలవల్ల పఠితలకు సిమిలీల్లో ఉన్న తరతమ భేదాలు తెలుస్తాయి.

(1a) ప్రకృతి = ప్రకృతి (ప్రకృతిగతమైన ఒక అనుభవాన్ని ప్రకృతిగతమైన మరో అనుభవంతో పోల్చటం) : ఇక్కడ రెండూ మూర్తాలే. మనుషులను ఇతర జంగమాలతోను, స్థావరాలతోను పోల్చిన సిమిలీలివి.

'బాగా బలిసిన ముదురు గెద్దలా ఉంటాడతను.'
'ఎర్రగా గరుగ్గా అనాస్‌కాయలా ఉన్నాడు యువకలీడరు.'
'తవతవలాడుతున్న పనసతొనలా ఉన్నాడు మూర్తికవి.'
'ఎర్రగా దుంపలా కాకుండా ఎర్రగా ఆపిల్ పండులా ఉండేవారాయన.'
'పరువు కొచ్చిన టొమాటో', 'దబ్బపండు వంటి చాయ'
'వేటకు దూకిన జూలు సింహం'
'పడగ విప్పిన పచ్చనాగు'
'మీద పడే మచ్చల పులి'
లాటి సిమిలీలు మొగవాళ్ళను గురించి రాసినపుడు కనిపిస్తాయి.

అలానే స్త్రీలను గురించి చెప్పేటప్పుడు–
'ఆ పిల్ల ....మల్లెమందారాల మిక్స్చర్.'
'ఆ పిల్ల.....గుర్రంలా ఎదిగింది.'
'వాళ్ళ చిన్నమ్మ కూతురు...ఉల్లి పిచికలా ఉంది.'
'పచ్చ గుర్రంలా పిటపిటలాడుతుంది.'
'నలుగురు ఆడపిల్లలు చచ్చిన బల్లుల్లా పడుకున్నారు.'
'ఆవిడ కొండ శిఖరంలా ఉంది.'
ఆవిడ మహా వటవృక్షంలా ఉంది...చిన్నప్పుడు లేత మామిడి చెట్టులా ఉండేదేమో!'

(1b) ప్ర = ప్ర : మనుష్యుల అవయవాలకు సిమిలీలు. ఇక్కడ కూడా రెండు అనుభవాలూ మూర్తాలే.

'ఆమె గుండెలు జోడుకొండల్లా లేచాయి.'
'పూల రెమ్మల్లా ఉండే తన చేతుల్తో'

'పండిన బాదం పళ్ళుల్లా ఎర్రటి కళ్ళున్నాయి.'

'పెదమెలు చాలా ఎర్రగా ఎర్రదానిమ్మ రంగులో ఉన్నాయి.'

'ఆవిడ నయనాలు వారికి మంచుతో తడిసిన కలువపువ్వుల్లా కనిపించాయట.'

'వారి గడ్డం.......వెండిలా మెరిసింది.'

(1c) ప్ర = ప్ర (తిర్యగ్జడాలకు వాడిన సిమిలీలు).

'కుక్క...మనుషుల్ని నమిలివేసే అడవిమనిషిలా ఉంది.'

('సీతాకోకచిలుక వెనకనించి వెళ్ళే బల్లి).....పచ్చికమీద పులిలా'; చుక్కల పులిలా కనిపించే కుక్కొకటి.'

'అకస్మాత్తుగా బిగిసిపోయిన గాలిలో ఆబూజాకొమ్మలూ, రెమ్మలూ, ఆకులూ, పువ్వులూ అన్నీకూడా శవాల్లా కొంతసేపు ఉండిపోయాయి.'

'అవి (గోవులు) మురికి చెరువు జొరబడ్డ కొమ్ములొచ్చిన మొసళ్ళ మందలా ఉన్నాయి.'

'మెరవు చుక్కలు దయ్యపు కళ్ళులా కనిపించాయతనికి.'

'తల్లుల్లా..... తోటలు ముద్దుగా ఉన్నాయి.'

'పచ్చని సరస్సులా ఆచేలు చల్లగా కనిపిస్తున్నాయి.'

'తాడిచెట్టు....పాతిక తలల కొండచిలువ..తోక మీద నిలబడి పడగలు విప్పుకొని....'

'పుచ్చపువ్వుల్లాంటి వెన్నెల్లో'

ప్రకృతిసిద్ధంగా ఉన్నవాటితో పోల్చినప్పుడు గూడా రచయిత రెండు మూడు అనుభవాలను సమీకరించి ప్రకృతిలో లేని కొత్త ఆకారాన్ని, అనుభవాన్ని కల్పించుకోవచ్చు. పై ఉదాహరణల్లో 'కొమ్ములొచ్చిన మొసళ్ళ మంద', 'పాతిక తలల కొండచిలువ', 'పచ్చని సరస్సు', 'చుక్కల పులి' అలాంటివి. 'మెత్తని పులి' (తిక్కన గారు వాడింది), 'చలిపిడుగు' లాటి సిమిలీల్లో కేవలం ప్రకృతి విరుద్ధ ధర్మాలను, జంతువులకు, వస్తువులకు ఆరోపించటం ఒక భావనా చమత్కారం.

పైవన్నీ మూర్తాలను మూర్తాలతో పోల్చటంవల్ల ఏర్పడ్డ సిమిలీలు.

మానవుల అంతఃకరణ ప్రవృత్తులు ఆకలిదప్పుల్లాగా సహజమైనవి. కాని అవి అమూర్తాలు. ఈప్రవృత్తులు—కోపం, ప్రేమ, జాలి, రోత మొదలైనవి—

మానవప్రవర్తనలో కనిపిస్తాయి. ఒక రకమైన చూపు, నవ్వు, ఏడుపు పైకి కనిపించేవయినా అవి అమూర్తమైన భావాలను పైకి చూపే చేష్టలు. ఇవన్నీ అమూర్తాలనుకొంటే వీటిని ప్రకృతిసిద్ధమైన మూర్తానుభవాలతో పోల్చిన 'సిమిలీ'లు చాలా రాచకొండలో కనిపిస్తాయి.

ఒక ఆకారాన్నో, శరీరభాగాన్నో మరోదానితో పోల్చటం కన్నా ఒక అవస్థను, సన్నివేశాన్ని మరో సన్నివేశంతో పోల్చటం అసాధారణం. నవ్వటం, ఏడవటం లాగా భయపడటం నిలబడటం, కూర్చోటం మొదలైన అవస్థలను ప్రకృతిసిద్ధమైన ఇతర అనుభవాలతో పోల్చటంలో రాచకొండ వాడిన సిమిలీలు పైన ఉదహరించిన వాటికన్నా పైమెట్టులోనివి.

(1d) ప్ర = ప్ర (అమూర్త అనుభవాలకు మూర్తఅనుభవాలతో పోలిక)

'ఆ కేక ......మెరుపులా మెరిసింది, పిడుగులా పడింది.'

'అతని (ఒక వ్యాపారి) చూపు, ప్రశాంతంగా కడుపు నిండా ఎలకల్ని తిని
తనివి తీరా పాలు తాగిన పిల్లి చూపులా ఉంది.'

'ఆ కేక ...... కొబ్బరిచెట్టు చివర నిల్చున్న చంద్రుణ్ణి చూసి భయపడి
హోరెత్తి ఏడ్చిన జబ్బు కుక్క ఏడ్పులా వినిపించింది.'

'ఆనవ్వు నాకు మనిషి నవ్వులా తోచలేదు. జామతోటలో వెయ్యి రామ
చిలుకలు మూకుమ్మడిగా నవ్వినట్టుందా నవ్వు.'

'సముద్రపు హోరులా ఆఏడుపు నన్నెంతకూ వదల్లేదు.'

'ఆఏడుపు... భయంకరంగా ఉంది. కొండలమీద వర్షం కురిసినట్టు గాను,
కొత్తనీటి జోరులో కొండవాగులు కొట్టుకుపోతున్నట్టుగా ఉందది.
రాత్రివేళ ఏటిగాలి తాకిడికి తోటలేడ్చినట్టుగానూ ఉందది...'

'కంపించేముందు భూమి అరిచినట్టుగా, అది మనల్ని ముంచే ఏడుపులా
ఉంది.'

'నేను వేసిన కేక, దాహానికి ఆకలికి అడవి జంతువు నోరు పిడచకట్టి పోగా
అరిచినట్టు, వికారంగా, నా మట్టుకు నాకే అసహ్యంగా వినబడింది.'

పై సిమిలీలలో కేక, నవ్వు, ఏడుపు, అరుపు అనేవి వ్యక్తావ్యక్త అనుభవాలు; ఇవి కనిపిస్తాయి, వినిపిస్తాయి కూడా. కాని ఈవ్యక్తరూపాల వెనక ఉన్న అమూర్త భావాలకు ఇవి ప్రతీకలుగా ఉంటాయి. పోలికకు తెచ్చిన ప్రకృతిరూపమైన

అనుభవాలల్లో గూడా ఈ ధర్మాలు ధ్వనించేటట్టు చేశారు రాచకొండ. 'మనల్ని ముంచే ఏడుపులా ఉంది' అనటంలో భావికథార్థ సూచన గూడా ఉంది.

(1e) ప్ర = ప్ర (కొన్ని సహజమైన అవస్థలను, చేతలను ఇతర సహజ సన్నివేశాలతో పోల్చటం)

'దట్టపు చీకట్లోంచి నిశ్శబ్దంగా కదుల్తూ ఏదో ఆకారం అతి నెమ్మదిగా నావైపు వస్తున్నట్లు కనిపించసాగింది, చీకటివుట్టలో నల్లత్రాచు కదిలినట్టు కదిలి'

'చెరువడుగు నుంచి నల్లటి నీటి చీకట్లోంచి నెమ్మదిగా పైకి పెనుమొసలి తేలినట్టు తేలి....'

'నెమలి పింఛపు పంచరంగుల తళతళల్ని....అమాయకపు పాంపిల్ల నడుం జారి పోగా చూసినట్టు ఆవిడ్ని చూస్తూ ఉండిపోయాను.'

'రెక్కలాడని ఈగలూ, దోమలూ, కార్చిచ్చును చూసి హడలిపోయినట్టు హడలిపోయినవాణ్ని చూసి నేను'

'ఆవిడ స్వరంలో ఆడదనం ఉందిగాని గంగిగోవు ఆడమాట ఆడినట్టుగా కొంత గంభీరంగా బొంగురుగా ఉంది.'

'కప్పని మింగిన పాంవుల్లా అలా సూస్తారేట్రా?'

'వర్షానికి కొండమీంచి కిందకి నీటి ధారలు దిగినట్టు తలమీంచి పాదాల దాకా ఆమె వళ్ళంట నెత్తురు కారిందట.'

'సముద్రపు గాలికి సరువుడుతోట ఏడ్చినట్టు ఏడ్చేదట.'

'సముద్రం ఏడ్చినట్టు ఏడ్చిందిట.'

'వారు (రాజయోగి పెదనాన్నగారు) అలా నవ్వినప్పుడు పులి నవ్వినట్టుగా అనిపించటమే గాక– ఆ మీసాలు గడ్డాలు కదలడం వల్ల ఆ పులి తన పొదతో సహా నవ్వినట్టనిపించింది.'

'వారి మాట ఈ సారి వెదురుబొంగు గాలి విడిచినట్టుంది.'

'నవనవలాడే వంకాయ ఎంతో బాగుందనుకొని తీస్తే లుకలుకలాడే పురుగులుంటే చూసి అసహ్యించుకున్నట్టు వాణ్ణి చూసి అసహ్యించుకున్నాను.'

'పొద్దు పొడవగానే చీకటి వచ్చేసినట్టు ఊళ్ళంతా సావాల్సిందేనంట'

'అప్పుడు కర్రి నౌఖర్‌గాడు వాడింట్లోంచి శవం పోయినట్టు ముఖం పెట్టి.'

'అందుకు వాణ్ణి చంపి, మళ్ళీ బతికించి మళ్ళా చంపుదాం అన్నంత కోపం వచ్చింది నాకు.'

'అందుకు ఆవులకిష్టయ్య గేదె నవ్వినట్టు నవ్వి'

పై సిమిలీల్లో చేతల వెనక ఉన్న భావాలు, మనస్తత్వాలు వెల్లడవుతాయి. పూర్తిగా కథాసందర్భం తెలిస్తేనే తప్ప ఇవి ఎంత చక్కగా సరిపడతాయో ఉదాహరణలు చదివినంత మాత్రాన తెలియదు.

మానవసహజమైన నవ్వటం, ఏడవటం, అరవటం వంటి చేతలను ఇతర జంతువులకు, జడాలకు, ఆరోపించి తను చెప్పదలుచుకొన్న భావానికి గాఢత్వాన్ని కల్పించటం రాచకొండ రచనాశిల్పంలో ఒక విశేషం. 'రామ చిలుకలు నవ్వినట్టు', గేదె నవ్వినట్టు', 'తోటలేడ్చినట్టు', భూమి అరిచినట్టు', 'గంగిగోవు మాట్లాడినట్టు', 'సరువుడు తోట ఏడ్చినట్టు', మొదలైనవి. ఇలాటి చోట్ల జోడు సిమిలీలున్నాయి– ఏనుగు, సముద్రం మొదలైనవి చేసే ఘోషను 'ఏడవటం'గా పోల్చటం; ఒక వ్యక్తిని సముద్రం, ఏనుగు మొదలైన వాటితో పోల్చటం. అమూర్తాలకు మూర్తలక్షణాలారోపించటం వల్లనే 'కేక మెరవటం', 'నవ్వు వెలగటం' వంటి సిమిలీలేర్పడ్డాయి. ఇవి కనబడ్డతీరు వినబడ్డతీరు కంటే impressiveగా ఉందనే రచయిత ఉద్దేశం.

2. సంస్కృతికి చెందిన అనుభవాలను ప్రకృతి అనుభవాలుగా చిత్రించటం అంత తరచుగా గాకపోయిన అడపా దడపా రాచకొండ సిమిలీల్లో కనిపిస్తుంది. ప్రకృత్యనుభవాలు సాధారణంగా మూర్తాలను ఆశ్రయించినవి కాబట్టి అమూర్తాలను, మూర్తాలను గూడా మూర్తాలతో పోల్చటం ఇక్కడ గమనించవచ్చు.

(2a) సం = ప్ర : మూర్తాలైన సాంస్కృతికానుభవాలు ఉపమేయాలుగా, ప్రకృతికే చెందిన అనుభవాలు ఉపమానాలుగా ఏర్పడ్డ సిమిలీలు

'రాజ భోగులు చింత కొమ్మల్లా చిరకాలం మిగిలిపోయినా....'

'ఈ కలెక్ట్రు పిల్ల సింవ్వపిల్ల కాని పిల్లికూన కాదు.'

'...పచ్చటి తోటలున్నాయి – పెద్ద ఉయ్యాల తొట్టిలో పిల్లలందర్నీ పడుకోబెట్టి చుట్టూ నిలబడి పరీక్షగా చూస్తున్న తల్లుల్లా – ఆతోటలు ముద్దుగా ఉన్నాయ్.'

'పైన వంకా అదేదో పెను పురుగులా తిరుగుతోంది.'

'జోడు విద్యుద్దీపాలు....విషనేత్రాల్లా మెరుస్తున్నాయి.'

'అతనికి ఆ కల్లురొట్టె....తనెప్పుడో తాగితాగి మర్చిపోయిన తల్లి రొమ్ములా....తనెప్పుడో ఎవరో ఒకసారి మాత్రం పెతకనిచ్చిన ఆవుపాదుగులా...'

'పైన పంకా, స్థూల కాయం వల్ల సరిగా తిరగలేని పెనుసాలీడులా నెమ్మదిగా తిరుగుతోంది..'

'నీటిమీద, దెబ్బతిన్న పిట్టలా అటూ ఇటూ కదుల్తోంది-పడవ.'

'అమంచం ప్రక్క ఓ పెద్ద నల్లటి పెట్టె ఒకటి ఉంది. నిద్రపోతున్న వెర్రి గేదెలా ఉంది అది.'

'నిండా నీరుంది కాబోలు. ఓ నల్లటికుండ ఓవార చల్లనితల్లిలా కూర్చుంది. దాని పిల్లలా దాని పక్కనే రెండు కంచుగిన్నెలు తళతళలాడుతూ... కూర్చొన్నాయి.'

'చూరు వైపు చూస్తే అక్కడ......దూలాలు. కారుమేఘాల మధ్య నిటారుగా పాకిపోయే చలిపిడుగుల్లా ఉన్నాయి.'

'నాలుగు వంకీల నాలుగుదీపాలు తుత్తొకటి (chandelier) నవ్వే నాగకన్యల విన్యాసాలతో, సొగసులతో పైనించి వెలుగుతోంది, మెరుస్తోంది.'

'వారి భవనం చంద్రబింబంలా మెరుస్తూండేది. భోజనాల బల్ల మీద వెండి సామాన్లు ఆ గదిలోని నీటిలాంటి నీడలో నిశ్శబ్దంగా నిల్చున్న రకరకాల మెరుపు చేపల్లా ఉన్నాయి.'

పై సిమిలీల్లో అనుభవాలు రెండూ మూర్తాలనే చెప్పాలి. వీటిల్లో ఒకటి అమూర్తమైనప్పుడు ఏర్పడే సిమిలీలు:

(2b) సం = ప్ర : ఇక్కడ ఒకటి అమూర్తం, రెండోది మూర్తం.

'రైతు కూలీల వంటపొయ్యిల్లోంచి లేచే పొగలు రూపులొచ్చిన ఏడుపుల్లా ఊరంతటా కమ్ముకున్నాయి.'

'తిరుగుబాటు అంటువ్యాధిలాంటిది...చలిచీమల పెనుకోపంలాంటిది.'

(2c) సం = ప్ర : కొన్ని చేతలకు, చేష్టలకు, అవస్థలకు ప్రకృతిసిద్ధమైన అనుభవాలతో పోలికతెచ్చి కల్పించిన సిమిలీలు

'పరువు కాయల కోసం చిలుకలు ప్రతిచెట్టూ వెతికినట్టు వెళ్ళిన ప్రతిచోటా ఆడపిల్లల కోసం వెదకడం నేర్చుకున్నాయతని కళ్ళు.'

'గూట్లో సాలీళ్ళా వెయిట్ చేస్తున్న శేషగిరి, కప్పని పాము పట్టినట్టు ఆమెను రెక్కపట్టుకొని లోనికి లాగి తలుపువారకి ఈడ్చుకుపోయేడు.'

'ఎవరూ లేదనుకున్న వంటగదిలోకి వచ్చేసరికి ఎదురుగా నిటారుగా నిలబడి... ఎత్తుగా సాగిన పాము పోలిక అతన్లో కనిపించిందామెకు.'

'శేషగిరి...పెద్దసైజు కోడిపెట్టను చూసి ఏంచేయాలో తెలియని పిల్లిలా అయిపోయేడు.'

'జడిసిపోని అవున్చూసి బెదిరిపోయిన పెంపుడు కుక్కలా (శేషగిరి ఓ అమ్మాయిని చూసి) నిలబడిపోయేడతను.'

'గభాల్న ఆమెను లోనికి లాగి తలుపు వేసేసి బండరాయివారకి నక్క మాంసంముక్కని లాక్కుపోయినట్టు వారనున్న మంచందగ్గరికి లాక్కుపోయేడామెను.'

'ఆ భోగుల అనుగ్రహం తప్పేక వారి పని మనుషులు మాత్రం చిలుకలు కొట్టిన పరువుకాయల్లా నేలకి రాలి చివికిపోయి, చినికిపోయి, చివరికి కుళ్ళిపోతారు.'

'పండులో పురుగు ప్రవేశించినట్లు కాంతయ్యలో ఓ రోజున మంచి ముహూర్తాన లాభం యెడల దాహం ప్రవేశించింది.'

'పద్దెనిమిదేళ్ళ కుర్రాడికి స్త్రీ వాంఛ పట్టుకున్నట్టు కాంతయ్యకి ధనవాంఛ పట్టుకుంది.'

(ఒకటి సహజం - రెండోది అసహజం అయినా అంత సహజంగా పట్టుకుంది.)

'నక్క వికవికా నవ్వినట్టు నవ్వేడు కాంతయ్య.'

'ఇంట్లో చిలక నవ్వినట్టు నవ్వేడు కాంతయ్య.'

'ఇంట్లో చిలక కనిపించకపోతే ఇంటి పిల్లిని అడిగినట్లు...'

'వాళ్ళకి పైడ్రాజు రాకతో రాజయోగం పట్టింది.... కాటకం తరవాత వర్షాలు కురిసినట్టయింది.'

'మూడు తుపాకులూ చావు పిలుపుల్లా పేలాయట.'

'ఒరదొస్తే పేడ కళ్ళుం కొట్టుకుపోయినట్టు ఈళ్ళు కొట్టుకుపోవాల్సిందేనట.'

'ఊదరగాలొచ్చి ఈగల్ని దోమల్నీ ఎత్తుకెళిపోయినట్టు అమ్మ యీళ్ళందర్నీ ఎత్తుకు పోద్దంట.'

పైన ఉదహరించిన సిమిలీలు ప్ర = ప్ర కంటె అసాధారణమైనవిగాని ప్ర = సం అంత అసాధారణమైనవి కాదు. అసంఖ్యాకమైన సాంస్కృతికానుభవాల్లో కొన్నింటిని అల్పసంఖ్యలో ఉండే ప్రకృతి అనుభవాలతో పోల్చటంలో కవి భావనా నైపుణ్యం ఇమిడి ఉంది.

3. ప్రకృతిసిద్ధమైన అనుభవాలను సంస్కృతీగతమైన అనుభవాలతో పోల్చిన పోలికలు చాలా ఉన్నాయి. వీటిలో మూర్త, అమూర్త భేదాలనుబట్టి తరతమవిభజన చేయవచ్చు. వీటిలో చాలా 'సిమిలీలు' పౌరాణికాలు, చారిత్రకాలు గూడా. రాచకొండ వెయ్యికళ్ళతో మన సంస్కృతిని, నాగరికతను పరిశీలించి నిశితమైన భావనాశక్తితో ఈపోలికలు పైకెత్తి చూపినట్టు కనిపిస్తుంది.

(3a) ప్ర = సం (మనుషులకు వాడిన సిమిలీలు, ఇక్కడ ఉపమాన, ఉపమేయాలు రెండూ మూర్తాలే)

'లిల్లీ ముగ్గురుపిల్లలతల్లయినా వాడిపోకుండా ప్లాస్టిక్‌పువ్వులా చూడ ముచ్చటగా చాలా సుఖంగా చాలా బావుంది.'

'మొత్తం మీద ఆమె కొంచెం నిమ్మరసం తగిలిన పంచదారపానకంలా వుంది.'

'లక్ష్మీవతి అతని భార్యా, ముగ్గురు పిల్లలూ సైజువారిగా అయిదు ఖరీదైన సబ్బుముక్కల్లా ఉంటారు.' (సబ్బుబిళ్ళ కథలో)

'సైజుకి వాడు దమ్మిడీఅంత మనిషి.'

'అద్భుతమైన ఆనందంలో అమెరికా వెళ్ళివచ్చిన ఆదిమవాసుల్లా...'

'ఆయన నిల్చుంటే రోమన్ స్టాచ్యూలా ఉండేవారు, ఆయన కూర్చుంటే రోమన్ స్టాచ్యూ కూర్చున్నట్టుండేవారు.'

'ఆ సమయంలో ఆతను చొక్కా తొడుక్కోకుండా ఉండటంతో కవచం విప్పిన కురుపీరుళ్ళా కనిపించగానే...'

'వారు (రాజయోగి పెదనాయనగారు) ఆ సమయంలో ఎలా ఉన్నారంటే అప్పుడే మేనకని తగిలేసి దీర్ఘాలోచనలో పడ్డ విశ్వామిత్రుళ్ళా ఉన్నారు.'

'ఆ పిల్లడు కంచుబొమ్మలా గట్టిగాను, పాలరాతిలా తెల్లగాను, పూల చెండులా మెత్తగానూ, లేడిపిల్లలా చలాకీగాను ఉండే వాడని...'

'తన పెంపుడుకుక్క తన ప్రయివేటు ఆంజనేయుడు, అవతలింట రహస్య విభీషణుడూ... అయిన ప్రభుదాసు.'

'వారు తళతళ తుడిచిన వెండి పళ్ళెంలా...'

'నేను చాచా నెహ్రూలాగా, పిల్లనెపోలియన్ లాగా, పుట్టబోయే జాన్ కెనడీ లాగా.....గర్వించి.'

'ఆమె కంచుతో చేసిన వీనస్విగ్రహంలా'

'నయాపైసల్లాటి ముగ్గురాడపిల్లలు...'

'పాతరలోంచి అప్పుడే తీసిన మనిషిలా అవిడ కొంత పాలిపోయిన తెలుపు చాయలో ఉంది.'

'ఆవిడ భూమికి ఆకాశానికి మధ్య నిలబడ్డ మహాలక్ష్మీదేవిలా నాకు కనిపించింది.'

'కొండ శిఖిరం కదిలి వచ్చినట్టు, ఆదిశక్తి అవతరించినట్టు మరిడీ మహాలక్ష్మి... లచ్చియ్యమ్మ'

'ఆ లచ్చియ్యమ్మ... బాంబుదెబ్బకి చెదరని కొండ బురుజులా నిల్చుంది.'

(3b) ప్ర = సం (జంతువులకు వాడిన సిమిలీలు)

'అది (జాకీ అనే కుక్క) భయంకరంగానే కాకుండా దొంగల నాయకుళ్ళా అతిదుర్మార్గంగాను, కుక్కల్లో హిట్లర్లా అతిక్రూరంగానూ...'

'మూడు కుక్కలు ఏకమైపోయి ఉగ్రజాగిలంగా మారినట్టుంది.'

'(కుక్క)....మా అందర్నీ కూడా తినేస్తుందేమోనని భయపడ్డాను...'

'శత్రురాజు సైన్యాన్ని ఓడించిన తరువాత తన రాజునీ తన ప్రజల్నీ కూడా భక్షించేసే సర్వసేనానిలా, అది మూర్ఖంగానూ ఎంతకీ రక్తదాహం తీరని దాన్లానూ ఉంది.'

'అంతలో... నెత్తుటి జాగిలాలు (బ్లడ్ హౌండ్స్) నాలుగున్నాయి-హిట్లరూ, హిమ్లరూ, గోరింగో, గోబెల్సూ లాగా రంగంలోకి దిగుతున్నాయవి.'

'అవి... ఇనప సైన్యంలా'

(3c) ప్ర = సం : శరీరభాగాలు - మనుష్యులవీ, జంతువులవీ ఉపమేయాలు.

'ఆమెకి గంపంత కొప్పు, కుండంత గుండె ఉన్నాయి. రంగు పాలకోవా రంగులో ఉంది.'

'గుండెలు బంగారబ్బుంగల్లా రాపాడుతున్నాయి.'

'పదిసార్లు కడిగి తుడిచిన స్టేన్‌లెస్ స్టీలుపళ్ళెంలా తళతళ్ళాడుతూ గుండ్రంగానూ... ఉంటుందాపిల్ల ముఖం.'

'ఇండియా, మంగోలియా, ఇంగ్లీషు కలయికలా ఉంటాడతను.'

'ప్రాణం నిలబెట్టుకుందికి చావుతో పోరాడే పేషంటుకి ఏమందివ్వాలో తెలియని కొత్త డాక్టరు ముఖంలా చాలా గాభరాగా ఉంటుందతని ముఖం.'

'దాచినా దాగని పాపంలా ఆ శవం.'

'వాడి (సత్యమూర్తి) ముక్కు సూటిగా రోమన్ ముక్కులా ఉండటం నాకిష్టం లేకపోయింది.'

'ఆవిడ (లచ్చియ్యమ్మ) కళ్ళల్లోని గుడ్లు ఫిరంగి గుళ్ళులా ఉన్నాయి.'

'ఆవిడ కనుబొమ్మలు నల్లటి విల్లుల్లా ఉంటే...'

'ఆవిడముక్కు పగబట్టిన బాకులా, ఆవిడనోరు నెత్తుటికైజారులా ఉంది.'

'అదేదో తెల్లటి లోహంతో చేసినట్టు ఆవిడ మోకాళ్ళు బలంగా దుక్కల్లా ఉండి పాలిష్ చేస్తే మెరిసినట్టు మెరుస్తున్నాయి.'

'నా జుట్టు మొండి సూదుల్లా నిలబడింది.'

'నిశ్చలంగా ఆ సమయంలో గడ్డం గజిబిజితో వారి ముఖం మూత వేసిన పాములా బుట్టలా కనిపించింది నాకు.'

'....పండు గడ్డం విద్యుద్దీపాల వెలుగులో వెండి పాదల్లా బంగారప్పొట్టు లాగా కనిపించింది.'

'నా గుండెలు మెయిల్ యింజనుగా మారిపోయాయి.'

'కన్నీళ్ళని కంచు బాంబుల్లా కురిపించగలదనీ...'

'వారి వెండిగడ్డం వజ్రాల పాదిని మెరుపు దూదిగా మార్చినట్టు మిలమిల మెరుస్తోంది.'

'భారంగా ఉన్న ఇంజన్‌లా ఆమె గుండెలు ధనధన కొట్టుకోవడం అతని చేతికి తెలుస్తోంది.'

'ఉన్న ఆ ఒక్క కొమ్మ నిటారుగా ఎత్తుగా సూటిగా పిడిలోంచి పైకి లేచిన

పారకత్తిలా ఉంది.'

(భావి కథార్థ సూచన ఈ సిమిలీలో ఉంది)

(3d) ప్ర = ప్ర (జడాలకు సిమిలీలు)

'అవేళ్టి గాలి చల్లగా, మెత్తగా ఉంది – దండు ముండలు ఇంగ్లీషులో మాట్లాడుకొన్నట్టు కాకుండా లైబ్రరీలో బీర్వాల వార ట్యూటర్ కుర్రాడితో ఆ నర్సమ్మాయి మాటాడినట్టు...' (అమూర్తం = అమూర్తం)

'క్రోటన్సు మొక్కలు రంగులువేసుకొన్న ఆటకత్తెలు రంగస్థలంమీద డాన్సు చేస్తూ ఊగినట్టు కిటికీలోంచి చిత్రంగా ఊగుతూ కనిపిస్తున్నాయి.'

'దూరంలో వనసచెట్టొకటి–పిల్లల స్నానాలయేక తను స్నానంచేసి ఎండలో తలారబోయించుకుంటున్న తల్లిలా నిల్చొని పిల్లమొక్కల్ని చూస్తూ జాలి జాలిగా నవ్వుతోంది.'

'ఆకాశం నీలంగా నిర్మలంగా మడికట్టుకొన్నట్టు దూరంగా నిల్చొంది.' (మూర్తం = అమూర్తం)

'మెత్తగా మరాడించిన వెండి పాట్టులా ఎండ మెరుస్తూంది.' (మూ = మూ)

'పెళ్ళివందిట్లో ఆడపిల్లకళ్ళల్లా మెరుపుచుక్కలు హుషారెక్కి పోయి తళతళ మెరుస్తున్నాయి.'

'గదిలోని వెలుగు ఆ తలుపు సందులోంచి సన్నగా నిప్పుల కొరడాలా వజ్రపు కత్తిలా కనిపించి....'

'మెరుపు చుక్కలు దెయ్యపు కళ్లల్లా కనిపించాయతనికి.'

'తాటిచెట్లు... ఆకుపచ్చటోపీలు పెట్టుకొన్న నల్లసిపాయిల్లా నిశ్చలంగానూ, నిటారుగానూ నిల్చున్నాయవి.'

'సూర్యుడి కిరణాలు... బంగారుపాముల్లా మా రా.యో.పె.నా.గారి మేడ చివర చుట్టుకుంటున్నాయి.' (భావికథా సూచన)

'ఆ వెలుగు... ఆరితేరిన నెరజాణలా కాకుండా సిగ్గుపడుతున్న కన్నెలా వస్తోంది.'

'ఆ కిటికీలోంచి చూస్తే పైనున్న పూల తోట కెంపుల పంటలా కనిపిస్తోంది.'

'ఆమెకి గంపంత కొప్పు, కుండంత గుండె ఉన్నాయి. రంగు పాలకోవా రంగులో ఉంది.'

'గుండెలు బంగారబ్బుంగల్లా రాపాడుతున్నాయి.'

'పదిసార్లు కడిగి తుడిచిన స్టేన్‌లెస్ స్టీలుపళ్ళెంలా తళతళ్ళాడుతూ గుండ్రంగానూ... ఉంటుందాపిల్ల ముఖం.'

'ఇండియా, మంగోలియా, ఇంగ్లీషు కలయికలా ఉంటాడతను.'

'ప్రాణం నిలబెట్టుకుందికి చావుతో పోరాడే పేషంటుకి ఏమందివ్వాలో తెలియని కొత్త డాక్టరు ముఖంలా చాలా గాభరాగా ఉంటుందతని ముఖం.'

'దాచినా దాగని పాపంలా ఆ శవం.'

'వాడి (సత్యమూర్తి) ముక్కు సూటిగా రోమన్ ముక్కులా ఉండటం నాకిష్టం లేకపోయింది.'

'ఆవిడ (లచ్చయ్యమ్మ) కళ్ళల్లోని గుడ్లు ఫిరంగి గుళ్ళలా ఉన్నాయి.'

'ఆవిడ కనుబొమ్మలు నల్లటి విల్లుల్లా ఉంటే...'

'ఆవిడముక్కు పగబట్టిన బాకులా, ఆవిడనోరు నెత్తుటి కైజారులా ఉంది.'

'అదేదో తెల్లటి లోహంతో చేసినట్టు ఆవిడ మోకాళ్ళు బలంగా దుక్కల్లా ఉండి పాలిష్ చేస్తే మెరిసినట్టు మెరుస్తున్నాయి.'

'నా జుట్టు మొండి సూదుల్లా నిలబడింది.'

'నిశ్చలంగా ఆ సమయంలో గడ్డం గజిబిజితో వారి ముఖం మూత వేసిన పాములా బుట్టలా కనిపించింది నాకు.'

'....పండు గడ్డం విద్యుద్దీపాల వెలుగులో వెండి పాదల్లా బంగారప్పొట్టు లాగా కనిపించింది.'

'నా గుండెలు మెయిల్ యింజనుగా మారిపోయాయి.'

'కన్నీళ్ళని కంచు బాంబుల్లా కురిపించగలదనీ...'

'వారి వెండిగడ్డం వజ్రాల పొదిని మెరుపు దూదిగా మార్చినట్టు మిలమిల మెరుస్తోంది.'

'భారంగా ఉన్న ఇంజన్‌లా ఆమె గుండెలు ధనధన కొట్టుకోవడం అతని చేతికి తెలుస్తోంది.'

'ఉన్న ఆ ఒక్క కొమ్మ నిటారుగా ఎత్తుగా సూటిగా పిడిలోంచి పైకి లేచిన

పారకత్తిలా ఉంది.'

(భావి కథార్థ సూచన ఈ సిమిలీలో ఉంది)

(3d) ప్ర = ప్ర (జడాలకు సిమిలీలు)

'ఆవేళ్టి గాలి చల్లగా, మెత్తగా ఉంది - దండు ముండలు ఇంగ్లీషులో మాట్లాడుకొన్నట్టు కాకుండా లైబ్రరీలో బీర్వాల వార ట్యూటర్ కుర్రాడితో ఆ నర్సమ్మాయి మాటాడినట్టు...' (అమూర్తం = అమూర్తం)

'క్రోటన్సు మొక్కలు రంగులువేసుకొన్న ఆటకత్తెలు రంగస్థలంమీద డాన్సు చేస్తూ ఊగినట్టు కిటికీలోంచి చిత్రంగా ఊగుతూ కనిపిస్తున్నాయి.'

'దూరంలో పనసచెట్టొకటి- పిల్లల స్నానాలయేక తను స్నానంచేసి ఎండలో తలారబోయించుకుంటున్న తల్లిలా నిల్చొని పిల్లమొక్కల్ని చూస్తూ జాలి జాలిగా నవ్వుతోంది.'

'ఆకాశం నీలంగా నిర్మలంగా మడికట్టుకొన్నట్టు దూరంగా నిల్చొంది.' (మూర్తం = అమూర్తం)

'మెత్తగా మరాడించిన వెండి పొట్టులా ఎండ మెరుస్తూంది.' (మూ = మూ)

'పెళ్ళిపందిట్లో ఆడపిల్లకళ్ళల్లా మెరుపుచుక్కలు హుషారెక్కి పోయి తళతళ మెరుస్తున్నాయి.'

'గదిలోని వెలుగు ఆ తలుపు సందులోంచి సన్నగా నిప్పుల కొరడాలా వజ్రపు కత్తిలా కనిపించి....'

'మెరుపు చుక్కలు దెయ్యపు కళ్ళల్లా కనిపించాయతనికి.'

'తాటిచెట్లు... ఆకువచ్చటోపీలు పెట్టుకొన్న నల్లసిపాయిల్లా నిశ్చలంగానూ, నిటారుగానూ నిల్చున్నాయవి.'

'సూర్యుడి కిరణాలు... బంగారుపాముల్లా మా రా.యో.పె.నా.గారి మేడ చివర చుట్టుకుంటున్నాయి.' (భావికథా సూచన)

'ఆ వెలుగు... ఆరితేరిన వెరజాణలా కాకుండా సిగ్గుపడుతున్న కన్నెలా వస్తోంది.'

'ఆ కిటికీలోంచి చూస్తే పైనున్న పూల తోట కెంపుల పంటలా కనిపిస్తోంది.'

ప్రాకృతానుభవాలు చాలావరకు స్వరూపం ఉన్నవాటిని (మూర్తాలు) ఆశ్రయించినవి; కొద్దిసంఖ్యలో ఉంటాయి; మన పరిసరాల్లో కనిపిస్తుంటాయి. వాటి ధర్మాలు మనకు తెలుసు; కాలంతో ప్రకృతిలో వచ్చే మార్పులు కూడా మనకు తెలిసినవి. కాని, మానవకృతమైన సంస్కృతిలో వస్తువులు, సన్నివేశాలు అసంఖ్యాకంగా ఉంటాయి; వీటికి దేశకాలాలలో భేదాలుంటాయి; చారిత్రక పరిణామాలుంటాయి. కవి వ్యుత్పత్తినాశ్రయించి వాటి అవగాహన ఉంటుంది. అందువల్ల ఒక ప్రాకృతిక అనుభవానికి సరియైన సాంస్కృతిక అనుభవం ఏరుకోటం ఎంతో నిశితమైన భావనాశక్తి ఉన్న రచయితకు గాని సాధ్యంకాదు. అందులోను మూర్తాన్ని అమూర్తంతోను, అమూర్తాన్ని అమూర్తంతోను పోల్చగలగటం ఉదాత్తశిల్పలక్షణం. మూర్తాన్ని మూర్తంతో పోల్చినా ఒక సన్నివేశంలో మనం ఊహించగల అమూర్తమైన మనస్తత్వం అస్వరూపం వెనుక ఉంటుంది. (3b)లో 'కుక్క'తో సర్వసేనాని పోలిక అలాంటిది. ఒక సన్నివేశంలో ఏది ఎవరికి ఎలా కనిపించేది ఆపాత్ర అప్పటి మనఃప్రవృతిని ప్రతిఫలిస్తుంది. పాత్రమనస్తత్వచిత్రణలో సిమిలీలను ముఖ్య ఉపకరణంగా రావిశాస్త్రిగారుపయోగించారు. (3d)లో చల్లగాలిని... ట్యూటరు అమ్మాయిల సంభాషణతో పోల్చటం చాలా అపూర్వం.

ఇక నవ్వు, ఏడుపుల్లాంటి వ్యక్తావ్యక్తభావాలకు, అవస్థలకు, చేతలకు ఎలాటి సిమిలీలు వాడారో చూద్దాం.

(3e) ప్ర = సం (కొన్ని అమూర్తభావాలకు సిమిలీలు)

'చల్లగాలిలో నిర్మలాకాశంలో అందని ఎత్తులో సాఫుగా మెత్తగా హాయిగా ఎగురుతూ వెళ్ళే విమానంలా హాపీగా వెళ్తోంది లక్ష్మిపతి జీవితం.' (అమూర్తం = మూర్తం)

'ఆ నవ్వు అస్త్రాలొదిలేసి రథం దిగిన కర్ణుణ్ణి చూసి నవ్విన కృష్ణుడి నవ్వు లాగా అతి చిన్న క్యూబాని చూసి ఉదజని బాంబు నవ్విన వేళాకోళం నవ్వులాగా ఉంది.' (అమూర్తం = మూర్తం; సిమిలీలో పౌరాణిక చారిత్రక అనుభవాల పోలిక)

'ఆకాశదీపాల్లా ఉంది ఆ నవ్వు.'

'జగన్నాథం ఏడుపు అతనికి....ఎక్కడో భూస్థాపితమైపోయిన మనిషెవరో

బాధతో బలంగా వేసిన కేకలు కష్టంమీద భూమి పెళ్ళగించుకొని హీనంగా వినిపిస్తున్నట్టు అనిపించింది.' (అమూర్తం = అమూర్తం)

'దొంగల నాయకుడి కొడుకుని చూసి దొంగ మెచ్చుకొన్నట్టుగా ఉంది వాడి (గుర్రబ్బగ్గీలో వెళ్ళేవాడి) నవ్వు.'

'... ఆయన మందహాసం చేశారు. నాకంటే వారు ఎత్తుగా ఉండటంవల్ల వారి నవ్వు నాకు లైటుహవుసు వెలిగినట్టు అనిపించింది.'

'ఆ చూపులలో ఆకలి చాకులున్నాయి. ఆ చాకులకి పాముల మెరువులు మెరుస్తున్నాయి; ఆ మెరువులకి వెనుక నిప్పుల నాలికలు ఉన్నాయి.'

'వాటి చూపులు – టక్కరిశవాల పాముచూపుల్లా ఉన్నాయవి.' (అమూర్తం = అమూర్తం)

'....ఆ రాక్షసుడు (ముసలి ఎద్దు) ఆరు టన్నుల రంకె వేసి (వెర్రి గాలిలా), పీడలా (పిశాచంలా), (యమ వాహనం లా), కాళ్ళొచ్చిన పెనుబాంబుకి కళ్ళొచ్చినట్టుగా ...దాడి చేసారు.' (బ్రాకెట్లలో ఉన్న ఉపమానాలు ఆతరగతివి కాదు.)

'ఇనవరోట్లో ఇచ్చు రూపాయలు వేసి దంచినట్టు ఆ నవ్వు – ఖల్ ఖల్ గల్ ఘల్మని–'

(3f) ప్ర = సం (పనులకు అవస్థలకు సిమిలీలు) : ఇక్కడ ఉపమానం ఉపమేయాలు రెండూ చాలా వరకు అమూర్తాలు.

'అడ్డం వచ్చిన చింతమానుతో నిప్పుల పొయ్యి మాట్లాడినట్టు మాట్లాడు తున్నాడు.'

'ఖద్దరు బురదలోకి రా.యో.పె.నా. గారు దిగారని తెలిసిన నాడు మావాళ్ళుంతా విస్తుపోయి, షాక్ అయిపోయి ఇంటి పెద్దకి లెప్రసీ వస్తే భయపడిపోయినట్టు భయపడిపోవడం....'

'శ్రీకృష్ణుడు అకస్మాత్తుగా రాత్రి వెళ్ళి దుర్యోధనుడితో చేరితే ధర్మరాజు బాధపడ్డట్టుగా మా వాళ్ళుంతా బాధపడ్డారు.'

'ఆమె వెళ్ళాక ఆ రాత్రి అవతలివాడి ఖర్చుమీద సుష్టుగా భోంచేసినవాళ్ళా సుఖంగా నిద్రపోయాడు శేషగిరి.' (శేషగిరి ఒక పాలమ్మాయిని బలాత్కరించి అనుభవించి నిద్రపోతాడు)

'అతని రోజులు చాలా తొందరగా వుడ్ హవుస్ నవలల్లో పేజీలు తిరిగి పోయినట్టు తిరిగిపోయేయి.'

'మండుటెండ... అడ్డులేని ఫాసిస్టు డిక్టేటర్షిప్‌లా ప్రతి వస్తువునీ కాల్చుకు తినేస్తోంది.'

'లీవు బెల్లు కొట్టేస్తే స్కూలు పిల్లలు ఆడుకొన్నట్టు – తోట్లో ఎండా, గాలీ, క్రోటన్లూ, పూలమొక్కలూ, పువ్వులూ, సీతాకోక చిలకలూ కలకలా ఆడుకుంటున్నాయి.'

'అద్దెకు తెచ్చుకొన్న ఆడదాన్దగ్గర దుస్తులువిప్పే పెద్దమనిషిలా వెకిలిగా నవ్వేడు మూర్తి కవి.'

'తన చేతుల్లోంచి ఎలాగూ తప్పించుకోలేని చందనదాసుని చాణక్యుడు చూసినట్టుగా... చూసి'

'ప్లీడరు పార్టీలను తినేసినట్టు, పోలీసులు ప్రజల్ని తినేసినట్టు, జడ్జీలు న్యాయాన్ని తినేసినట్టు... సూర్యుడు ఆరోజు ప్రపంచాన్ని తినేస్తున్నాడు.'

'ఖద్దరువాలాను చూసి– బీటురూటు కొనదల్చుకొన్నవాడు బెండకాయల నుంచి ముఖం తిప్పుకొన్నట్టు ముఖం తిప్పేసుకొన్నాడు.'

'సముద్రం మధ్య చెడిపోయిన తెరచాప తెప్పలో ఉండిపోయిన నీటి దొంగలు ఉప్పెన కెరటాన్ని చూసి నీరుకారిపోయినట్టు – ఆవిడ్ని చూసి నీరుకారిపోయేను.'

'ఆ చప్పుడు నాకు అమృతం పారినట్టు వినిపించింది. రణరంగంలో శత్రువులతో పోరాడలేక మిగిలిపోయినవాళ్ళకి సాయంగా రిలీఫ్ ఫోర్స్ వచ్చినట్టుగా – ఆ చప్పుడు విని.'

'ప్రపంచయుద్ధంలో అమెరికావారు సాయానికి దిగగానే ఇంగ్లీషువారు హమ్మయ్య అనుకొన్నట్టు–మా వాళ్ళు రాగానే నేను హమ్మయ్య అనుకొన్నాను.'

'నా గుండె పిండిమిల్లులా కొట్టుకోవడం ప్రారంభించింది.'

'ఇంపీరియల్ బ్యాంక్‌లోకి ఎంతడబ్బైనా వెళ్ళిపోయినట్టు, అంత సీతాకోక చిలుక కూడా ఆ బల్లి కడుపులోకి దిగబడిపోయింది.'

'నేనప్పుడు పోలీసు తుపాకుల రక్షణలో ఉన్న బంగారపు కాసుల బస్తాలా సుఖంగా ఫీలయేను.'

'ఆమె సముద్రంలోకి చింకివడవ వెళ్ళినట్టు ఊగుతూ ఊగుతూ వెళ్ళిందట.'

'కర్ణుడు సహజకవచకుండలాలతో పుట్టినట్లు లచ్చయ్యమ్మ సహజ బలంతో పుట్టింది.'

'కీచకుణ్ని ఆడభీముడు తినేసినట్టు వార్ని తినేటోయిందట'

'అప్పుడు లచ్చయ్యమ్మ వెయ్యి టన్నుల పంచదార మిల్లులా అరచి....'

'వాడు... కోరమీసంతో మంగలికత్తి మాట్లాడినట్టు–మాట్లాడిచెప్పేట్ట.' (కటీపిటీగా, నిక్కచ్చిగా)

'వార్ని చూసి భయపడ్డందుకు–ఆడపిల్లవేషంలో దొరికిపోయిన మగపిల్ల వాళ్ళా–కొంచెం సిగ్గుపడ్డాను.'

'గాంధీ మెప్పుకు నెహ్రూ పొంగినట్టు నేను వారి మెప్పుకు చాలా పొంగిపోయాను.'

'పెండ్లినాటి పీడకలల్లాగా...'

'వాడి ముఖం పొయ్యిమీద డేయిసాలా మాడిపోయింది.'

'పంతులి పొంకోడు గేదెపేడని చూసినట్టు అసహ్యించుకొని చూసి...'

'మోటారుకారుని చూసి బెదిరిన నాటు పశువులా బెదిరాను.'

'నా డప్పులగుండె వంద గుండెలైపోయి వంద డప్పుల్లా కొట్టుకొంటుం దనిపించింది నాకు.'

'ఆ ముసలి ఎద్దును చూసి చావునే భూతద్దంలోంచి చూసినట్టనిపించింది.'

ఒక వ్యక్తిని ఒక జంతువుతో పోల్చినప్పుడు ఆజంతువుకున్న సహజ ధర్మాలను రచయిత ఆవ్యక్తికి ఆరోపిస్తాడు; పులి, సింహం, నక్క మొదలైన వాటి ధర్మాలు సామాన్యులందరికీ తెలిసినట్టే కవికి గూడా తెలుసు. అంటే ప్రకృతిసిద్ధమైన ఉపమానాలు తెచ్చినప్పుడు రచయిత భావనా స్వాతంత్ర్యం కొంత కుంటుబడుతుంది. కాని పోలిక 'సంస్కృతి' నుంచి తెచ్చినప్పుడు ఉపమానానికి ఉపమేయంతో ఉన్న సమానధర్మం రచయితకు గోచరించే దాకా మరెవరికీ గోచరించదు; కవి భావనాశక్తి, శిల్పకౌశలం ఇలాటి ఉపమానాల్లో కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. అందులోను సాంస్కృతిక అనుభవాల్లో అమూర్తాలను ఉపమానాలుగా ఏరుకోటంలో కవి కల్పనాశక్తి మరింతగా ప్రకాశిస్తుంది. 'గుండె పిండిమిల్లులా, మెయిల్ ఇంజన్‌లా కొట్టుకోటం.'

'లిల్లీ... వాడని ప్లాస్టిక్-పువ్వు' అన్నవి మామూలు సిమిలీల కన్నా మంచివైనా, 'abstract' గా ఉన్నవి 3d, 3e, 3f ల్లో ఉన్నాయి. 'చల్లగాలి... ఆ నర్సమ్మాయి ట్యూటర్ కుర్రాడితో మాట్లాడినట్టుంది', 'అవతలివాడి ఖర్చు మీద సుష్టుగా భోంచేసిన వాడిలా', 'రోజులు... వుడ్‌హవుస్ నవల్లో పేజీల్లా', 'ప్లీడరు పార్టీలను తినేసినట్టు... సూర్యుడు ప్రపంచాన్ని తినేస్తున్నాడు' లాటి శాస్త్రిగారి సిమిలీలు 'ఒరిజినాలిటీ' కి మచ్చుతునకలు.

4. ఇక మిగిలిపోయినవి ఉపమాన ఉపమేయాలు రెండూ సంస్కృతికి చెందిన రకం; వీటిని ఇంతకు ముందు చెప్పినవాటికంటే పై స్థాయిలో పెట్టవచ్చు.

(4a) సం = సం (ఇక్కడ ఉపమేయమూ, ఉపమానమూ గూడా మూర్తాలు)

'బాదంహల్వాలాటి భార్య'

'అంబారీ వేసిన ఏనుగు రూపంలో నగిషీలు చెక్కిన ఓ చక్కని పందిరి మంచం ఉంది.'

'ఆ గది నాకొక మంచి నుయ్యిలా కనిపించింది.' (ఈ సిమిలీతో కిరీటిరావు తాత్కాలిక మనస్తత్వం తెలుస్తుంది)

'కాల్చిన రాగి రేకుతో చేసినట్టు ఆవిడ కట్టుకొన్న చీర ఎర్రగా మెరుస్తోంది.'

'ఆవిడ ఆ ఎండలో నిల్చుంటే బంగారం భగ్గున మండుతున్నట్టు అనిపించిందట.'

'పైన పంకా ఒకటి నిశ్శబ్దంగా ముగ్గురు సిపాయీలు పహరా తిరుగు తున్నట్టు తిరుగుతోంది.'

'ఆవిడ శ్రావణమాసపు వరదగోదావరే కాని కార్తీకమాసపు సరసకిన్నెర సాని కాదు.'

'అతను యూదులమధ్య నాజీలా కనిపించినప్పటికీ',

'సందులో మున్సిపల్ దీపాలు ముష్టివాళ్ళ కళ్ళల్లా ఉన్నాయి.'

(4b) సం = సం (రెంటిలోను ఒక అనుభవం మూర్తం, రెండోది అమూర్తం)

'చెడిపోయిన ముసలమ్మల వంటి నోట్లని అంతకు ముందెప్పుడు చూడలేదు.'

(చేతులు మారినది, ఏచెయ్యి తగలనిదీ అనే ధర్మాలు రెంటినీ కలుపుతాయి)

'ప్రతీ ఇల్లూ కూడా, రోజూ చన్నీళ్ళతో తడిపి రోజూ నీడనే ఆరవేసే కట్టు బట్టలా ముతక వాసన వేస్తుంది.'

'అడి జాతెక్కడ? నా జాతెక్కడ? మంది కల్తీ లేని ఆవు నెయ్యి, ఆడిది క్రొవ్వు కలసిన కంపు నెయ్యి'

'తిరుగుబాటు పెట్రోలు మంటలాంటిది.'

'తిరుగుబాటు నిక్కితే మరి ఆక్కుండా పేలే మందుగుండు లాంటిది.'

'అతనికి ఆ కల్లు రొట్టె... తను అంతదాకా ఎన్నడూ చూడని తన ఆరోప్రాణంలా అతి హాయిగా ఉంది.'

(4c) సం = సం (ఇక్కడ రెండూ అమూర్తాలు) : ఈతరగతి సిమిలీల్లో చాలా భాగం సన్నివేశాలను, పాత్రల మనస్తత్వాలని చిత్రించేవి. ప్ర = సం. లో చూపించిన మానవ స్వభావం కంటె భిన్నమైన భావాలు ఇక్కడ ఉపమేయాలు.

'ఊరి చుట్టూ ఉన్న మరుగు భూముల నుంచీ పైనుంచీ వచ్చే కల్లువాసన పేదవాడి పగలాగా ఊరంతా చుట్టుకుంటోంది.'

'పరాయి సొమ్మును గ్రీడీగా చకచకా పిసినారివాడు లాగినట్టు ఆమెని గబగబా ముద్దులాడబోయేడు శేషగిరి.'

'ఆమెదగ్గరికి చేరగానే సుఖంగా చలిమంటదగ్గర కూర్చున్నట్టు అనిపించిందతనికి.'

'ఒరే కవీ ఎలా వెళ్తోందిరా లైపూ?... అని స్నేహితుడొకరు ప్రశ్నించగా... నీమీద వేసిన విట్టులా ఫస్టుగా వెళ్తోంది... అన్నాడు మూర్తి కవి.'

'డబ్బులు ఎదురు తీసుకొని సినిమా చూసినంతగా ఎంతో సంతోషించింది.'

'కాలేజీ నాటకంలో అనుకోకుండా బాగా నటించిన బంట్రోతు పాత్ర ధారిని అధ్యాపకులంతా అభినందించినట్టు స్టూడెంటు కుర్రాళ్ళు జగన్నాథాన్ని అభినందిస్తున్నారు.'

'సాఫవుతున్న బల్లచెక్కవైపు బంగారంగా మారుతున్న ఇనుముని చూసినట్టు చూస్తున్నారు.'

'ఆయన మరణం.... మా కుటుంబానికే పెద్ద కెలామిటీ.... సింహాసనం మీద కూర్చోబోతుంటే అడుగునించి ఆసనం ఎవరో లాగేస్తే దబ్బున

చదికిలబడినట్టు మేమంతా డేజ్ అయిపోయి అలా ఉండిపోయేం'

'ICS బ్రిటిష్‌జడ్జిని సర్ రామశేషన్ సాంబారు ఇడ్లీ నంచుకుతిన్నట్టు ఆర్గ్యుమెంట్సుతో నంచీసుకొన్నాడు.'

'నౌఖర్ వాడు... వాణ్ణి చూసి నేను సూర్యవంశరసపుత్రుల్ని కమాండ్ చేసే బ్రిటిష్ రాజులాగా ఎంతో గర్వించేను.'

'అతను 'గ్రామ్యం' 'శిష్టవ్యావహారికం' రెండూ జోడించి మాంసానికి మసాలా కలిపి వేసినట్టు మాటాడుతూ ఉంటాడు.'

'ప్రకృతి అంతా నన్నారోజున ఆహ్వానించిందనుకుంటాను. పక్క రాజ్యానికి వచ్చిన మిత్రరాజ్యపు యువరాజును ఆహ్వానించినట్టు...'

'ఆ అద్దాలు గంగా జలంతో చేసినట్టు స్వచ్ఛంగా మెరుస్తున్నాయి.'

'బాదంహల్వాని, బంగినపల్లి మామిడిపండునీ వాటి ఇష్టాయిష్టాలు అడక్కుండా మనం తినేసినట్టే ఆడదాన్ని కూడా అలానే అనుభవించాలన్నారట ఆయన.'

* * *

రావిశాస్త్రిగారు సిమిలీలకు ఎందుకింత ప్రాముఖ్యం ఇస్తారనే ప్రశ్న కలుగుతుంది. ఆయన సన్నివేశాల మీద, పాత్రల మనశ్చిత్రణ మీద ఉన్న చూపు భౌతిక పరిసరాలమీద కనిపించదు. తన సజీవ పాత్రలు తిరిగే ఊళ్ళూ, వీధులూ, నివసించే ఇళ్ళూ మనకు పూర్తిగా కనిపించవు. అసలు చాలా ఊళ్లకు పేర్లు కూడా ఉండవు. రత్తాలు–రాంబాబు కథ విశాఖపట్నం పరిసరాల్లో జరిగినట్టు (జరుగుతున్నట్టు) ఊహించటానికి ఆధారాలు – ఎస్కోట బస్సు, సముద్రం, కెరటాలు, మొదలైనవి. ఒక్కో సన్నివేశంలో వచ్చే పాత్రలు, వాళ్ళకు అప్పటికి కావలసిన భౌతికవాతావరణమూ – తెరతీస్తే రంగస్థలంమీద ప్రేక్షకులకు చూపించినంత దగ్గరగా చూపిస్తారు. కిరీటిరావు బస చేసిన గది, ఆగదికి వచ్చే కారిడారు, ఆగది కిటికీ పక్కఉన్న తోట, లచ్చయ్యమ్మను మేడమీద ఉంచిన చోటు, రాజయోగి గారి పడకగది, దేనికది ప్రత్యక్షంగా స్పష్టంగా కనిపిస్తుంది గాని ఇవ్వన్నీ ఉన్న ఇల్లు ఎలా ఉండేదో ఆయన వర్ణించడు. రాచకొండ పాత్రలు దూరప్రయాణాల్లో కాలయాపన చెయ్యరు. వాళ్ళంతా దగ్గరదగ్గర ఊరి వాళ్ళుగానే ఉంటారు. మన దేశంలో ఉన్న పెద్ద నగరాలేవీ ఆయన తన కథనంలోకి తెచ్చినట్టు లేదు. ఇది ఆయన తెలిసి పాటిస్తున్న రచనావిశేషం

అనిపిస్తుంది. సీన్లు మారుతుంటాయి; నేపథ్యంలోంచి రంగస్థలంమీదకి పాత్రలు చకచకా వచ్చి పోతుంటారు. ఆయన రచనల్లో డ్రామా ఎక్కువగా కనిపిస్తుంది. పొడి మాటలతో కథనం కన్నా-చలాకీ సంభాషణలతో పాత్రల మనస్తత్వాల్ని అపూర్వంగా చిత్రించాలనేది ఆయన రచనాశిల్పంలో ఒక విశేషం. ఇది 'సిమిలీల' వల్ల సాధ్యమైనట్టు సుదీర్ఘవర్ణనలతో సాధ్యం కాదు. అందుకనే ఆయన సిమిలీలు కొన్ని తెలుగులో చెప్పటానికి సాధ్యంకాని భావాలకు మాటలు చేకూరుస్తాయి. దుష్యంతుడు శకుంతలని విడిచి వెళ్ళేటప్పుడు అతని మనస్సు వెనక్కు ఉరుకుతున్నది. శరీరం మాత్రం ముందుకు పోతున్నది- అతని రథానికి పైన కొయ్యకు కట్టిన సిల్కు జెండా గుడ్డలాగా అంటాడు కాళిదాసు. అమూర్తమైన మానసిక స్థితిని ఇంతకంటె బాగా ఎవరు చెప్పగలరు? ఇలాంటి సిమిలీలు వాల్మీకి రామాయణంలో అనేకం కనిపిస్తాయి. హనుమంతుడు సీతను చూసినపుడు ఆమెను వర్ణించటానికి ఇరవై ముప్పై సిమిలీలు వాడుతాడు వాల్మీకి. 'అభ్యాసం లేకపోవటం వల్ల జారిపోయిన చదువులా ఉందట సీత.' రాచకొండ వారి 'సిమిలీ'లు ఈఉదాత్తమైన కోవకు చెందినవనటంలో సందేహం లేదు. ఆయన సిమిలీల్లో మరికొన్ని విశేషాలు:

రెండు అనుభవాలను పోల్చినపుడు – రెండోది 'అలాలేదు–ఇలా ఉంది' అనే రకంగా చెప్పటం కొన్ని చోట్ల రావిశాస్త్రిగారు పాటించారు. ఉదా.:

> 'ఆ (లచ్చియ్యమ్మ) ఏడుపు సన్నగా శ్రావ్యంగా పరీక్ష తప్పిన కాన్వెంట్ గరల్ దుఃఖంలాగా, అయ్యేయెస్ బావని పెళ్ళాడలేకపోయిన ఎమ్మే మరదలి ఏడుపులాగా లేదు; తొడలు విరిగిన ఆడయేనుగు అడవిలో అలమటించినట్టుగా ఉందది.'

లచ్చియ్యమ్మ స్త్రీ; ఆమె ఏడుపు తన నవల చదివే నడిమి తరగతివాళ్ళకు ఎలాటిదిగా స్ఫురిస్తుందో ఊహించి చెప్పి అలా లేదని, సామాన్యుల ఊహకు అతీతమైన 'ఆడఏనుగు ఏడుపు'కు రూపకల్పన చేశారు. మరో ఉదాహరణ:

> 'వారి మాటలు ఈసారి అవి మాటల్లా అనిపించలేదు. మాటల నీడల్లా ఉన్నాయవి.'

'మాటలనీడలు' అనే expression వల్ల తెలుగులో మరోరకంగా చెప్పవీలు గాని భావానికి మాటలు కల్పించారు. మాటలకు ప్రాణం అర్థం; అర్థం

వెనుక మనస్సు, నమ్మకం మొదలైనవి ఉండాలి. ఇవేవి లేని మాటలు 'మాటల నీడలు'.

'ఆవిడ దేముడు పుట్టించిన మనిషిలా లేదు; దేముళ్ళని పుట్టించే మనిషిలా ఉంది.'

'దాని (జాకీ అనే కుక్క) మెడకి ఓ పెద్ద గొలుసుంది. ఆ గొలుసుకి అవతలి కొనని ఓ నౌఖరున్నాడు. ఆకుక్కని ఆ నౌకరు తెచ్చినట్టుగా లేదు. ఆ నౌకర్నే ఆ కుక్క గొలుసుకి కట్టి తెచ్చినట్టు ఉగ్రంగా గదిలోకి వచ్చిందది.'

పై రెండూ 'దేవుడు–మనిషి' 'మనిషి–కుక్క' – వీళ్ళ roles reverse చెయ్యటంవల్ల ఏర్పడ్డ విచిత్రమైన సిమిలీలు. ఇలాంటిదే మరొకటి:

'ఈ నాటికి (ఒక పేదతల్లి) ఇంకా యిలా మిగిలుందంటే అందుకు పన్నెండేళ్ళ కారణం ఆవిడ పెద్దకొడుకు; ఏడేళ్ళ కారణం చిన్న కొడుకు.'

కొడుకుల్ని చూసుకోటానికి ఆమె బతికి ఉంది. బతికి ఉండటానికి 12 ఏళ్ళకొడుకు, 7ఏళ్ళ కొడుకూ కారణాలు. కారణాలకు వయస్సును ఆరోపించి కొడుకుల్ని పెద్ద చిన్న మాటలతో సూచించి, 'roles reverse' చేసి చెప్పటం, ఇతరరచయితల్లో అట్టే కనిపించని రచనాశిల్పం. ఉపమానోపమేయాలను కేవలం తారుమారు చేయటమే కాదు ఈ రచనా చమత్కృతి– 'నీ ముఖమే ఆచంద్రుడు' లాటిది కాదిది.

ఒక వ్యక్తికి మరో వ్యక్తిని చిత్రవధ చేద్దామన్నంత కోపాన్ని గురించి రావిశాస్త్రిగారెలా చెప్పారో చూడండి:

'అందుకు వాణ్ని చంపి మళ్ళీ బతికించి మళ్ళా చంపుదాం అన్నంత కోపం వచ్చింది నాకు.'

ఇది చాలా అసాధారణమైన 'సిమిలీ'.

ముగింపు

ఈ వ్యాసంలో ప్రతిపాదించిన ప్రకృతి, సంస్కృతి, మూర్తం, అమూర్తం – అనే నాలుగు ప్రమాణాలతో సిమిలీల్లో 16 తరగతులేర్పరచవచ్చు.

I. ప్ర = ప్ర (1.మూర్తం = మూర్తం, 2. మూర్తం = అమూర్తం, 3. అమూర్తం = మూర్తం, 4. అమూర్తం = అమూర్తం)

II. సం = ప్ర. (Iలో లాగా)

III. ప్ర = సం (Iలో లాగా)

IV. సం = సం (Iలో లాగా)

ఈపదహారు భేదాల్లోను, Iలో 1. ప్ర= ప్ర; మూ = మూ సర్వ సాధారణం; IVలో 4. సం = సం; అమూ = అమూ చాలా అసాధారణం. ప్రజల భాషలో Iకి చెందిన నాలుగు రకాల సిమిలీలు సామెతలుగామారి వాడుకలోకి వస్తాయి. ఈవ్యాసంలో చర్చించదలచుకోలేదు గాని, పై విశ్లేషణ ఆధారంగా వివిధ రచయితలు వాడిన సిమిలీలను వివేచించి వారి కాల్పనికశక్తిని స్థూలంగా కొలిచి చూపించవచ్చు. కాని ప్రకృతిసంస్కృతి వివేచనలోను, మూర్తామూర్తవివేచనలోనూ ఇంకా సమస్య లున్నాయి. రాచకొండ ఎక్కువగా III, IV తరగతుల సిమిలీలను వాడతాడు. అందువల్ల భావనాశక్తిలోను, రచనాశిల్పంలోనూ ఆయనతో సరి తూగే రచయితలు అరుదు.

* * *

రావిశాస్త్రిగారికీ నాకూ 25ఏళ్ళు నుంచి పరిచయం అనటంకన్నా 25 ఏళ్ళ కిందటి పరిచయం ఎక్కువ అనటం న్యాయం. అబ్బూరివారి ప్రోత్సాహంతో 'విశాఖ సాహితి' స్థాపించినవాళ్ళల్లో ఇద్దరమూ ఉన్నాం. తరచు గోష్ఠుల్లో కలుసుకొనేవాళ్ళం. 'శిష్టవ్యావహారికం' ఎలా ఉండాలో చెప్పమని నన్ను అంగర, బలివాడ, రాచకొండ నిలదీసి అడిగేవాళ్ళు.

రచయితలు మాట్లాడినట్టు రాస్తే అది శిష్టవ్యవహారానికి లక్ష్యం అని చెప్పేవాడిని. ఆ విషయంలో నూటికి 99 పాళ్ళు తాను మాట్లాడినట్టు రాయగలిగిన వ్యక్తి ఒక్క రావిశాస్త్రిగారేనేమోననిపిస్తుంది.

సంధి విషయంలో 'అది తెలుసుకో'ని 'అత్తెలుసుకో' అని ఉచ్చరిస్తాం. రావిశాస్త్రిగారి రచనల్లో హల్సంధుల్ని మన ఉచ్చారణలోలానే రాస్తారు. (గురజాడ అప్పారావుగారు కొన్ని చోట్ల అలా రాస్తుండేవారు గాని అంతటా గాదు; ఉదా. రామ్మూర్తి) నేను అలానే ఉండాలనేవాణ్ణి ఆరోజుల్లో. కాని-

ఇప్పుడు రాతకూ మాట్లాడే తీరుకూ - ముఖ్యంగా సంధులవిషయంలో తేడాలుంటే బాగుంటుందనిపిస్తుంది. మాట్లాడినప్పుడు ఉచ్చారణ, ఊనిక, విరుపు, విరామం– వీటివల్ల శబ్దస్వరూపం మరుగుపడదు. కాని రాసింది చూసి చదివేటప్పుడు సంధిలో కలిసిపోయిన శబ్దాన్ని చప్పున తెంచి గుర్తించటం కష్టం. 'పాద్దారం', 'అత్తెలుసు'లాటివి 'పాతదారం', 'అదితెలుసు' అని రాస్తే బాగుంటుందేమో. 'రాతలో పదమధ్యంలో వచ్చే సంధులు పాటించాలి, పదాల మధ్య వచ్చే సంధులు పాటించవద్దు' అనేది ఇప్పటి మా స్లోగన్. అలవాటయిన వాళ్ళు రావిశాస్త్రిగారి రచనలు చదివేటప్పుడు ఇది సమస్య అనిపించదు.

* * *

రాచకొండ ఏ యూరోపియన్ భాషలోనో ఇలాటి రచనలు చేస్తే 'నోబెల్ ప్రైజ్' వచ్చి ఉండేదేమోననిపిస్తుంది.

(నరసింహారావు, అత్తలూరి (సం.), జూలై 30 : రాచకొండ విశ్వనాథశాస్త్రి షష్టిపూర్తి సంచిక, 1982)



# ముఖ్యపదసూచి

